# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున; మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

✶ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రను మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

------------------------ కూపన్ ------------------------

జనవరి చతుర నవల 'సంకెళ్లు'

సమీక్షకుని పేరు : ..............................................................

చిరునామా : ..............................................................

..............................................................

..............................................................

..............................................................

# చతుర ప్రపంచం

## ఒంటిచేతి పోరాటం

'కష్టాలొచ్చినప్పుడే గుండెదిటవుతో వ్యవహరించాలి', 'పట్టుదలతో విజయం సాధించాలి' అన్న సూత్రాల్ని తు.చ. తప్పక పాటించిందో సామాన్య గ్రామీణ యువతి. అందుకే మనం ఇప్పుడామెను గురించి ముచ్చటించుకుంటున్నాం. కర్నాటకలోని త్యాగటూర్ గ్రామానికి చెందిన కుమారి దాక్షాయణిపై పదకొండవ ఏటనుంచే కుటుంబభారం పడింది. తల్లి దండ్రులు వృద్ధులు కావడం, అన్నలు వికలాంగులు కావడం, తమ్ముడు, చెల్లెలు పసివారు కావడంతో ఆమే కుటుంబ పోషణకి నడుంబిగించింది. అందుకోసం ఆమె రోజుకు ఐదురూపాయల కూలి యిచ్చే ఫ్యాక్టరీలో చేరింది. మిషన్‌పై కొబ్బరిపీచుతో తాళ్ళు పేనడం ఆమె డ్యూటీ. అయితే దురదృష్టవశాత్తూ ఓరోజున మిషన్‌లో చెయ్యి ఇరుక్కున్న కారణంగా ఆమె తన కుడిచేతిని కోల్పోయింది. ఫ్యాక్టరీవాళ్ళేమీ ఆమెకు నష్టపరిహారం ఇవ్వలేదు. అసలు అది అడగాలన్న విషయమే తెలియని అమాయకురాలామె. తిరిగి అదే ఫ్యాక్టరీలో చేరి ఒంటిచేత్తోనే పనిచేయసాగిందామె. మరికొన్నాళ్ళు గడిచేసరికి నష్టాల కారణంగా ఆ ఫ్యాక్టరీ మూతపడింది. ఉన్న ఆధారం కాస్తా పోవడంతో దాక్షాయణి కుటుంబం బజార్నపడాల్సి వచ్చింది.



ఆ పరిస్థితులలో కూడా ఆమె ధైర్యాన్ని కోల్పోలేదు. ఓ మహానుభావుడి సహకారంతో తన దుస్థితిని జిల్లా పారిశ్రామిక కేంద్రంవారి దృష్టికి తేగల్గింది. వారు గ్రామీణ బాంకు ద్వారా 12,000/- రుణం మంజూరుచేయడంతో దాక్షాయణి తాళ్ళునేసే యంత్రాన్నొకదాన్ని కొని చిన్నగా పని ప్రారంభించింది. క్రమంగా స్థాయిని పెంచుకొని మరికొన్ని యంత్రాలను కొనుగోలు చేసి ప్రస్తుతం తనలాటి మరో నలుగురు అమ్మాయిలకు ఉపాధి కల్పించగలుగుతోంది ఆమె. మొక్కవోని పట్టుదల, అవిరళకృషే ఆమెను ఉన్నతస్థాయికి తీసుకెళ్ళగలుగుతున్నాయని నిస్సందేహంగా చెప్పవచ్చు.

## పక్షుల దొంగలు

కర్నాటకలోని శ్రీరంగపట్టణానికి సమీపంలోనున్న 'రంగానతిట్టు' దేశవిదేశ యాత్రికులనెందరినో ఆకట్టుకుంటోంది. కారణం అది కొన్నివేల పక్షులకు నివాసస్థలం కావడమే! మే నుంచి నవంబర్ మధ్యకాలంలోనైతే సుదూరతీరాల నుంచి సైతం అక్కడికెన్నో పక్షులు వలసవస్తాయి. పక్షుల కిలకిలారావాలతో, రెక్కల సవ్వడితో నిత్యం రమణీయంగా కన్పించే ఆ ప్రదేశం ప్రకృతి ఆరాధకుల్ని ఎంతగానో ఆకర్షిస్తోంది.

శ్రీరంగపట్టణానికి కేవలం 3 కిలోమీటర్ల దూరంలో కావేరినదీ తీరంలో ఓ డజనుపైగా

కవర్‌పేజీ ఫొటోగ్రాఫర్: జగ్‌మోహన్



వృక్షాలున్నాయి. వాటి కొమ్మలు నదిపైకి వాలి ఉంటాయి. ఆ చుట్టుపక్కల మరికొన్ని చిన్న చిన్న దీవులు కూడా ఉన్నాయి. అలాగే నదిమధ్య అక్కడక్కడా కొన్ని గండశిలలున్నాయి. ఆ శిలలమీద, దీవులమీద వేలసంఖ్యలో పక్షులు నివసిస్తుంటాయి. దగ్గరగా వెళ్ళి వాటిని చూడాలనుకునేవారు అటవీశాఖవాళ్ళు ఏర్పాటుచేసిన పడవలమీద అక్కడికి వెళ్ళాల్సిందే. అక్కడ 80-100 అడుగుల లోతువరకూ నదీప్రవాహం ఉంటుంది. ఏమాత్రం అజాగ్రత్తగా ఉన్నా ప్రాణాలు పోవడం ఖాయం. అయినా అపురూపమైన ఆ పక్షుల్ని సందర్శించడానికి అక్కడికి ఎందరో వస్తూనేఉంటారు.

దురదృష్టవశాత్తూ ఇటీవల అక్కడ పక్షుల దొంగతనాలెక్కువగా జరుగుతున్నాయి. ప్రాణాలకు తెగించి మరీ నదిని ఈది వాటిని దొంగిలించుకుపోతున్నారు కొందరు చోరులు. ప్రభుత్వం ఎన్ని చర్యలు తీసుకొన్నా ఈ విషయంలో ఫలితం కన్పించడంలేదు. ముఖ్యంగా వేసవికాలంలో నదీప్రవాహవేగమూ, లోతూ తక్కువగానున్న సమయంలో ఈ దొంగతనాలెక్కువ జరుగుతున్నాయి. ఇది ఇలాగే కొనసాగితే ముందుముందు అక్కడ పక్షుల ఉనికికే పూర్తిప్రమాదం వాటిల్లగలదు. కాబట్టి ప్రభుత్వం అక్కడ కావలి ఏర్పాట్లను ఇంకా ముమ్మరంచేసి ఈ దొంగతనాల్ని అరికట్టాలని ప్రజలు కోరుతున్నారు.

---

## పెంపుడు కుక్క నిర్వాకం

ఆస్ట్రేలియాలో జరిగిందీ సంఘటన.

ఓ రైతుబిడ్డ పొలంలో ఒంటరిగా పనిచేసుకుంటుండగా ప్రమాదవశాత్తూ పార తగిలి ఎడమచేతి మూడువేళ్ళు తెగిపోయాయి. పళ్ళ బిగువున బాధ భరిస్తూనే తెగిపడ్డ వేళ్ళను ఏరి జేబురుమాలలో భద్రపరచుకుని, మరో గుడ్డతో రక్తం కారిపోకుండా కట్టుకట్టుకున్నాడతను. అనంతరం అతి ప్రయాసమీద కారు నడుపుకుంటూ ఇంటికి చేరుకుని డాక్టర్‌కి ఫోన్‌చేశాడు.



డాక్టర్ విషయమంతా తెల్సుకొని, "మరేం ఫర్వాలేదు. బాధపడకండి! తెగిపోయిన ఆ వేళ్ళని మళ్ళీ అరచేతికి జాయింట్ చేయవచ్చు. ఇదుగో నేనిప్పుడే వచ్చేస్తున్నాను" అంటూ ఫోన్ పెట్టేశాడు.

కొంచెం రిలాక్సింగ్‌గా ఫీలవుతూ అంతకుముందే టేబుల్ మీద పెట్టిన వేళ్ళవంక చూశాడు అతను. అంతే! గుండె గుభేల్మంది... వాటిని చుట్టిన జేబురుమాల మాత్రం క్రిందపడి ఉంది. ఆ పక్కనే నోరు చప్పరిస్తూ తన్మయంగా అతనివంకే చూస్తూ కూర్చుని ఉంది అతని పెంపుడుకుక్క. వేళ్ళుమాత్రం ఎక్కడా కన్పించలేదు. అవి కుక్క కడుపులోకి వెళ్ళిపోయిన నిజం అతనికి పది నిముషాల తర్వాత అర్థమై భోరుమన్నాడు.

# చతుర కతలు

## కోకలివ్వు క్రిష్ణయ్యా!

**టెం**టుహాలు కిటకిటలాడుతూ ఉంది. యాక్టర్సు అందరూ తమతమ వేషాలతో రెడీగా ఉన్నారు. విదురుని వేషం వేసుకున్న నటుడు, "దుర్యోధనుడు అలా వాచీ పెట్టుకోడురా! అది తీసెయ్యి!" అని అరుస్తున్నాడు.

దుర్యోధనుడు ధుమధుమలాడుతూ, "ఇదివరకు ఇలాగే వాచీని తీసిపెట్టి మూడుసార్లు నా రిస్టువాచీల్ని పోగొట్టుకున్నాను" అన్నాడు వ్యావహారిక భాషలో!

దుశ్శాసన పాత్రధారి అప్పల నర్సిమ్ములు చాలా కోపంగా ఉన్నాడు. అతను పాత్రలో లీనమై పద్యాన్ని ఎత్తుకున్నాడంటే ఆరున్నొక్క శృతికి తగ్గడు. స్టేజీమీదికి వచ్చేముందు కొంచెం చుక్క వేసుకుంటాడు. లేకపోతే 'మూడ్' రావడం కష్టం. కాని ఈరోజు ఎక్కడా రూపాయన్నా దొరకలేదు.

ఒక గ్రాము నాటు సరుకుతో గుక్క తడుపుకుంటేగానీ. నటనౌత్సుక్యాభిలాషానంద తన్మయత్వాలలో మునగలేడు. నింగిని చుక్కలు పొడిచాయిగాని, నిషాకోసం కావాల్సిన చుక్క వేస్కోడానికి ఒక్క రూపాయైనా దొరికితే ఒట్టు!

నాటకం వేళైంది. తెర ఎత్తేశారు. నటులందరూ హడావుడిగా స్టేజీమీదకు పరిగెత్తారు. ఉన్నది ఒక్కటే మైకు! అందువలన తన వంతు వచ్చిన ప్రతి నటుడూ, మణిరత్న ఖచిత కాంచన సింహాసనం ఉరఫ్ చెక్క కుర్చీమీదనుండి లేచివచ్చి, ఓ మూలగా ఉన్న మైకును పడకుండా జాగ్రత్తగా పట్టుకుని, పద్యాలు ఆలాపించి, డైలాగులు చెప్పేసి, తిరిగి వెనక్కి వెళ్ళి, తమ కుర్చీల్లో కూర్చుంటున్నారు.

ధృతరాష్ట్రుడు అతిజాగ్రత్తగా లేచి నిలబడ్డాడు. అతని కుర్చీకి ఒక కాలు సగం విరిగి ఉంది. మూడు ఇటుకరాళ్ళను పేర్చి, కుర్చీని బ్యాలెన్స్‌గా ఉంచారు. అందుకని పాపం



చాలా జాగ్రత్తగా లేచి, నిలబడ్డాడు. అసలే అంధుడు. మైకు ఎక్కడుందో తెలీలేదు.

గత్యంతరంలేక ఓరగా కళ్ళు సగం తెరిచి, మైకుని వెతికి, వెళ్ళి పట్టుకుని, తన డైలాగులు చెప్పేశాడు.

శ్రీకృష్ణుని వంతు వచ్చింది. కిరీటంలోని నెమలిపింఛం మాయమైపోయింది. "నా నెమలి కళ్ళు ఎక్కడున్నాయో వెతికిపెట్టండయ్యా" అంటూ బతిమాలుకున్నాడు. అందరూ వెతికారుగానీ దొరకలేదు. ఇంతలో శ్రీకృష్ణుని పాత్రధారిగారి అసలు సిసలైన భార్యామణి అప్పుడే వచ్చింది! "మన బొట్టెలు ఆడుకోడానికి పొద్దున తీసేసుక్కున్నారు, నెమలీకల్ని!" అని ఆమె చల్లగా బయటపెట్టింది.

నెమలి ఈకారహితమైన కిరీటంతో స్టేజీ ఎక్కాడు శ్రీకృష్ణుడు. ద్రౌపదీ వస్త్రాపహరణ సన్నివేశం జరుగుతున్నది. దుశ్శాసనుడు చీరలను ఊడదీస్తున్నాడు. కృష్ణపరమాత్మ చీరలను అనుగ్రహిస్తున్నాడు. స్టేజీ వెనుకనుండి అసిస్టెంట్లు రెడీగా పెట్టుకున్న అరడజను చీరల్ని కృష్ణుని చేతులకిందనుండి సరఫరా చేస్తున్నారు. చీరలన్నీ అయిపోయాయి.

ఇక దుశ్శాసనుడు అలసిపోయి, సొమ్మసిల్లి పడిపోవాలి. కానీ దుశ్శాసనుని 'నటనామూడ్' అంతంత మాత్రంగానే ఉంది.

"ఇంకా చీరలివ్వు, కృష్ణా!" అంటూ రంకె వేశాడు. శ్రీకృష్ణపరమాత్మ అదిరిపోయాడు. "అది నీ డైలాగ్ కాదురా! ష్! ష్!" చిన్నగా గుసగుసతో సైగచేశాడు.

ఊహూఁ! సైగల్ని అర్థంచేసుకునే స్టేజీని దాటిపోయాడు దుశ్శాసనుడు.

"అప్పల నర్సిమ్మా! తగ్గరా! తగ్గు!" తెర వెనకనుండి ప్రాంప్టర్ అవస్థపడుతున్నాడు. ఎవరి హైరానా వారిది. ఆయ్! ఆ మాటకొస్తే అప్పల నర్సిమ్ములు చుక్క బాధ ఎవరికైనా పట్టిందా!?

"ఒరేయ్ కృష్ణుడూ! ఇంకో పాతిక చీరలు దానం చేసెయ్‌రా! ఈ స్టేజీ గీజీ జాన్తా నై! ఈ యాక్షన్లకూ, పద్యాలకూ గుడ్ బై కొట్టేస్తాను. గుడ్డలకొట్టు పెట్టేసుకుంటాను" అన్నాడు దుశ్శాసనుడు మందుపడని మంటలో.

-పి. కుసుమకుమారి

## నేనేమవుతానో తెలుసా?

కిట్టూ స్కూలునుంచి రావడం ఆలస్యం, పాలయినా తాగకుండా ఆటలకి పరుగెడతాడు. చుట్టుపక్కల ఇళ్ళలోని కుర్రాళ్ళని చేరదీసి 'దొంగ-పోలీసు' ఆట ఆడందే వూరుకోడు. అదంటే వాడికంత ఇష్టం. ప్రతిసారీ పోలీసుగా మాత్రం తనే వుంటానంటాడు కిట్టూ. మిగతా వాళ్ళకన్నా వయసులో కాస్త పెద్దవాడు కావడం, పెర్సనాలిటీ కూడా వయసుకుమించి కనిపించడంతో మిగతా పిల్లలు పోలీసుగా వీడు కొట్టే దెబ్బలు కిమ్మనకుండా భరించి ఆడేస్తూ వుంటారు. అప్పుడప్పుడు వాళ్ళు ఎదురుతిరిగి దొంగస్థానంలో కిట్టూని పెడదామనుకున్నా ఎప్పుడో ఓసారి తప్ప అలా పడనివ్వడు.

దొంగలుగా మిగతావాళ్ళని పట్టుకుని లాకప్‌లో పెట్టినట్టుగా బాత్‌రూమ్‌లో పెట్టి తలుపేసి, బొమ్మతుపాకీతో వాళ్ళని బెదిరిస్తూ పెద్ద వీరుడిలా ఫోజుపెట్టే కిట్టూని చూసి 'భవిష్యత్తులో వీడు తప్పకుండా పోలీసే అయ్యేలా వున్నాడు' అని మురిసిపోతూ వుంటుంది వాళ్ళమ్మ.

అసలు కిట్టూకి ఈ ప్రేరణంతా వాళ్ళ పోలీసు మామయ్యవల్ల వచ్చింది. నాలుగయిదు నెలలకోసారి స్పెషల్ డ్యూటీ పేరుతో ఆ వూరొచ్చే మామయ్య కిట్టూని, వాళ్ళమ్మ, నాన్నల్ని చూసిపోతూ వుంటాడు. చిక్కని గంజిపెట్టిన ఖాకీ నిక్కరు, ఖాకీ చొక్కా, డేంజర్ సిగ్నల్లా నెత్తిమీద ఎర్రటి టోపీ... ఇవన్నీ కిట్టూ చిన్న మనసులో ఓ అందమైన భవిష్యత్తు, అనే ఆలోచనకి శ్రీకారం చుట్టాయి. అందుకే ఎప్పుడూ వాళ్ళమ్మతో అంటూంటాడు

"అమ్మా! నేను ఏమైనా సరే పోలీసునవుతా చూస్కో" అని.

ఒక్కడే కొడుకు కావడంతో వాడిని అతిగారాబంగా పెంచుతున్న వాళ్ళమ్మ వాడి ముద్దు మాటలకు మురిసిపోయేది.

ఓ రోజు... సరిగ్గా అర్థరాత్రి పన్నెండు గంట






లకి అందరూ గాఢ నిద్రలోవున్న సమయంలో కిట్టూ వాళ్ళ వీధిలో కేకలు, పోలీసు విజిల్స్ వినిపించాయి. ఎంత నిద్దట్లోవున్నా కిట్టూని టక్కుమని లేపుతుంది పోలీసు విజిల్. వెంటనే లేచాడు కిట్టూ. భయంతో వాళ్లమ్మని లేపాడు.

''అమ్మా! బయట ఏదో గొడవవుతోందమ్మా! కిటికీలోంచి చూద్దామా?'' అంటూ అడిగాడు.

ఏడేళ్ళయినా నిండనివాడి ధైర్యానికి అంత నిద్దట్లోను ఆశ్చర్యపోయింది వాళ్ళమ్మ.

''నోర్మూసుకుని పడుకో. అసలే రోజులు బావుండలేదు. రాత్రివేళ తలుపులు తియ్యకూడదు'' అంటూ మళ్ళీ నిద్రలోకి జారుకుంది.

కానీ కిట్టూ మాత్రం పట్టువదలగా... వాళ్ళమ్మకి మెలుకువరాకుండా నెమ్మదిగా అడుగులో అడుగేసుకుంటూ వెళ్ళి కిటికీ తలుపు తీసి వీధిలోకి చూశాడు.

సరిగ్గా అప్పుడే ఓ దొంగను వెంటాడుతున్నాడు విజిలేస్తూన్న పోలీసు. ఆ పోలీసు ధైర్యసాహసాలను అంత చీకట్లోనూ ఉత్సాహంగా కళ్ళు చికిలించి మరీ చూస్తున్నాడు కిట్టూ.

చూస్తుండగానే దొంగకి బాగా దగ్గరగా వచ్చేశాడు పోలీసు. ఇక పట్టుకోవడమే తరవాయి.

'అయిపోయింది దొంగవని' అనుకున్నాడు కిట్టూ. కానీ ఊహించని రీతిలో ఆ దొంగ వెనక్కు తిరిగి పోలీసును ఒక్క దెబ్బతో రోడ్డు మీద వెల్లకిలా పడగొట్టి, క్షణాల్లో మాయమయ్యాడు. లాఠీ ఓ మూల, టోపీ ఓ మూల పడినెమ్మదిగా ముక్కుతూ మూలుగుతూ లేస్తున్న పోలీసును చూడలేక వెంటనే తలుపు మూసేశాడు కిట్టూ.

ఏదో చేదు మాత్ర మింగినట్టనిపించింది కిట్టూకి. ఏవేవో ఆలోచనలు చెలరేగాయి. మరుక్షణం వాళ్లమ్మని లేపాడు కిట్టూ.

మగతనిద్రలోనే... ''ఏమిట్రా కిట్టూ! ఇంత రాత్రివేళ పడుకోక ఏం చేస్తున్నావురా?...'' అంది వాళ్ళమ్మ.

''నేను చచ్చినా పోలీసవనమ్మా'' అన్నాడు కిట్టూ.

నిద్ర మత్తులో ఏమడగాలో తెలియని వాళ్ళమ్మ

''ఘరేమవుతావురా?'' అని అడిగింది.

''దొంగనే అవుతానమ్మా'' అంటూ ముసుగు తన్నాడు కిట్టూ.

-రాధాశివమోహన్



# చతుర

సంపుటి : 15 సంచిక : 12 జనవరి 1993


**పోలీసుల దృష్టిలో ఆమె దోషి. అభిమానుల దృష్టిలో నిర్దోషి.**
అక్కడ చేరిన ప్రజలందరూ ఆమె నిర్దోషి అని మౌనంగా ఆక్రోశిస్తున్నారు.

కానీ... సాక్ష్యాధారాలన్నీ ఆమె నేరాన్ని ఎలుగెత్తి చాటుతున్నాయి.

**అందరిచేతా అంతగా అభిమానించబడి, 'దేవత' అనిపించుకున్న ఆమెపై హంతకి అన్న ముద్ర ఎలా పడింది?**

మందులిచ్చి ప్రాణాలు కాపాడవలసిన నర్సు వృత్తిని, తన సహజ ప్రవృత్తిగా కూడా మార్చుకున్న ఆమె...
ఒక నిండుప్రాణాన్ని ఎలా తీయగలిగింది?

**గ్రామీణ ప్రాంతాల్లో ఎగ్జిలరీ నర్సు మిడ్‌వైఫ్‌లుగా పనిచేసే స్త్రీల సాధకబాధకాలను మనసుకు హత్తుకునేలా చిత్రించిన పి.వి.బి. శ్రీరామమూర్తి రచన 'సంకెళ్ళు' ఈ నెల చతుర సమర్పణ.**



# సంకెళ్ళు

— పి.వి.బి. శ్రీరామమూర్తి

దట్టమైన మేఘాల పరదాలు ఆకాశాన్ని అల్లుకుపోయి ఉన్నాయి. సూర్యుడు తన ప్రతాపాన్ని ఎప్పటిలాగా చూపలేకపోతున్నాడు. గాలి పూర్తిగా స్తంభించిపోయింది. చెట్ల ఆకులు కదలక నిల్చున్నాయి. గంభీరత వాతావరణంనిండా ఆవరించివుంది. కాకులు ఊరికే గోల చేసేస్తున్నాయి.

అమ్మలు గబగబా లేచింది.

టైం చూసుకుంది. అప్పుడే ఆరయిపోయింది.

వడివడిగా బాత్రూంకెళ్లి బ్రష్ చేసుకుంది. నూతిలోంచి బకెట్‌నిండా నీరు తోడుకుని స్నానం తెములుచ్చుకుంది. రాత్రి తీసిన ఫిల్టర్ డికాషన్ గ్లాసులోకి వంపుకుని గిన్నెలో మీగడను పాలనుండి వేరుచేసి పాలు కాచుకుంది. రెండు కప్పులు కాఫీ కలిపింది. తనో కప్పు తాగింది. మరో కప్పు కాఫీ తీసికెళ్లి భర్తని లేపింది.

"ఏమండీ! ఇదిగో కాఫీ. అప్పుడే ఏడయిపోతోంది. నేనివాళ రావివలస వెళ్ళిరావాలి. బస్సు టైమయింది. ఇదిగో మిమ్మల్నే కాఫీ తాగేసి త్వరగా తెమలండి. ఇవాళ పనిమనిషి కూడా రాదు. గోలెంనిండా నీళ్లు తోడేశాను. రాత్రే అంట్లు తోమేశాను. పిల్లాడు లేస్తే గిన్నెలో పాలు ఇవ్వండి. మిమ్మల్నే! ఏమిటా మొద్దు నిద్ర. అబ్బ... లేవండీ. ప్లీజ్..."

అమ్మలు ఎంత తొందరపడుతున్నా ఇసుమంతయినా పట్టించుకోని సుదర్శనం పక్కకు తిరిగి ఒత్తిగిలి పడుకున్నాడు.

ఇక లాభంలేదనుకొని కాఫీగ్లాసు పక్కనపెట్టి మెడ కిందనించి చెయ్యివేసి లేపి కూర్చోపెట్టి- "అబ్బ, లేవండి సార్! ఇంత బద్ధకం అయితే ఎలాగా? నేను ఎనిమిదోగంటకల్లా వస్తానని వాళ్ళకి చెప్పాను. అక్కడ వాళ్లు నాకోసం ఎదురుచూస్తుంటారు. నేనే మాత్రం ఆలస్యం చేసినా వాళ్లు పనుల్లోకి వెళ్లిపోతారు. ఇప్పటికే ఈనెల్లో రెండు కేసులు కూడా సేకరించలేకపోయాను" అంది.

సుదర్శనం మత్తుగా లేచాడు. రెండు చేతులు అమ్మలు చుట్టూవేసి దగ్గరకి లాక్కోబోయాడు.





"ప్చ్... అత్తగారు లేచారు. ఏమిటీ చిలిపితనం? నాకవతల బోల్డుపనుంది" అని భర్తని విదిలించుకుని లేచి నిలబడింది.

ఈలోగా అత్తగారు అక్కడకు వచ్చింది, "వాణ్ణి పడుకోనీయరాదుటే ఓ గంట. నన్ను లేపకపోయావా? పోనీ, వసంతనయినా లేపొచ్చుకదా!"

"అది కాదత్తయ్యా! రాత్రనలే మీరు ఒంట్లో బాగులేదని టిఫిన్ కూడా చెయ్యలేదు. వసంత ఒంటిగంటవరకూ చదువుకుని పడుకుంది. శివకి చెప్పినా అర్థంకాదు. అందుకే ఈయన్నే లేపుతున్నాను. సరే... ఎలాగూ మీరే లేచారు. పాలు గూట్లో పెట్టాను. వేడిగా ఉన్నాయి. మూతపెట్టలేదు. పిల్లి ఒకటి తిరుగుతోంది. మరి జాగ్రత్త" అంటూ తనకు కావలసినవన్నీ సంచీలో సర్దుకుంది. మరోచేత్తో మెడికల్ కేరియర్ పట్టుకుని బస్సుకు బయలుదేరింది.

మనసులో భర్తని తిట్టుకుంది. 'మొద్దునిద్ర. ఒక్కోసారి మరీ ఎక్కువయిపోతోంది. ఈయనకేం పోయింది?

సాయంకాలం ఇంటికి రాగానే ఆవిడ సణుగుడు. సరిగా నిద్రలేక కాళ్లూ చేతులూ లాగేస్తున్నాయని! నిజమే! ఆవిణ్ణీ అనలేం? వయసులో ఉన్నవాళ్లకే ఆరోగ్యాలు సరిగాలేక అవస్థలు పడుతున్న ఈ రోజుల్లో అరవయ్యోపడిలో ఉన్నవాళ్లు అనారోగ్యంతో బాధపడటంలో ఆశ్చర్యం ఏముంది?

పోనీ! ఇంటి పనులన్నీ తెములుచ్చుకుని వెళ్లటానికన్నా కుదరని ఉద్యోగం! దీనికో టైమూ పాడూ లేదాయె అనుకుంటూ బస్సు స్టాప్‌వేపు నడిచింది.

టైం చూసుకుంది.

పావు తక్కువ ఏడు అవుతోంది.

'కొంపతీసి బస్సు వచ్చి వెళ్లిపోలేదుకదా?' అనుకుంది.

అప్పుడే టీకొట్టు అప్పలస్వామి లేచి దీపంబుడ్డీ వెలిగించాడు. "ఒసే... నచ్చమీలూ లెగే, ఎటెండక్కనేదని తొంగున్నావేటింకా? సూడప్పుడే అమ్మగోరు నెగిసి డ్యూటికి రెడీ అయిపోను" అనగానే అప్పలస్వామి పెళ్లాం గబగబా లేచింది. వాకిలి తుడిచి కళ్లాపి చల్లింది. ముగ్గుపెట్టింది. నోట్లో పలుకర్ర పెట్టుకునొచ్చి

"టైమెంతయిందేటమ్మగోరూ?" అనడిగింది.

"ఏడు కావస్తోంది" చెప్పింది అమ్మలు.

"ఒలమ్మ ఏడయిపోతన్నాదీ? ఏటింకా సీకటిగా ఉన్నట్టుగున్నాది. రెండ్రోజులుగా ఏటమ్మా ఎండె ఎక్కనేదు. గొప్ప సికాగ్గా ఉంది. గాలొకటినేదు. కంటికి కునుకునేదు" అంది.

"అప్పల్సామీ! పంతులు బండి రాత్రి టౌన్నుంచి వచ్చిందా?" అడిగింది.

"లేదమ్మా! అది మూడ్రోజుల్నుండి నేదు. రిపేరుకెళ్లింది" అన్నాడు.

"కొంపమునిగిందే?"

"ఎక్కడ కెళ్లాలమ్మా?"

"రావివలస"

"ఆర్టీసీ తిరుగుతాందిలెండి. కాపోతే ఓగంట అటో ఇటో ఔద్దంతే" అని లోపల్నుంచి చేరబడ్డానికి లేని కుర్చీ ఒకటి తెచ్చి కూకోండమ్మా! ఎంతని నిల్చుంతారు?" అన్నాడు. చేతిలో కిట్‌ని కిందపెట్టి ఇష్టంలేకపోయినా కుర్చీలో కూలబడింది. అంతలో ఒకరూ ఒకరూ చేరుకున్నారు అక్కడికి.

"అప్పల్సామీ! పంతులుబండి ఎల్లిపోనాదేటి?"

అందరూ అదే ప్రశ్న.

"పంతులు బండినేదు. బాక్కెల్లింది" అదే జవాబు.

"టీ చెయ్యి..." ఒకరు ఆర్డరిచ్చారు.

ఆరోజు గురువారం. పట్నంలో సంత. ఇక్కడ్నుంచి కూరగాయలూ, అరటిగెలలూ, ఎర్రటి పళ్ళూ, పట్నం వెళ్తుంటాయి. మరో పది నిమిషాలకి చాలా జనం చేరుకున్నారు. అందరూ అప్పలస్వామికి 'టీ'లకి ఆర్డరిచ్చారు. అప్పలస్వామి హుషారుగా చక్రం తిప్పుతున్నాడు. చక్రం హెూరెత్తిపోతోంది. ముఖం మీదకు ధూళివచ్చేస్తోంది. నిప్పుకణాలు కూడా తుళ్ళుతున్నాయి. అమ్మలు కుర్చీలోంచి లేచి నిలబడింది.

"ఉ ఊఁ! అమ్మగోరిమీదకు దూళెగురుతున్నాది కావాల. ఓయ్ నిన్నే... ఆ కుర్చీ ఇటుకాడికి మార్సీ" అన్నది అప్పలస్వామి భార్య.

"అక్కర్లేదులే. బస్సొచ్చేటైమయింది. నేనక్కడకెళ్తాను" అని లేచింది అమ్మలు.

"అప్పుడే ఎక్కడొత్తాదమ్మా? ఆర్టీసివోళ్లకేటి టైముకు రాపోతే జీతాలు రావా? బస్సు తిరగపోతే బత్తేలుండవా?" అన్నాడొకడు.

అతనన్న మాటలకి అందరికీ నవ్వొచ్చింది. అప్పలస్వామి తన దగ్గరున్న అన్ని గ్లాసుల్లోనూ పాలూ, పంచదార వేశాడు. డికాషన్ వేయడానికి కెటిల్ దించాడు. దూరంనుంచిఆర్టీసీహారన్ వినిపించింది. అంతే! అందరూ గొల్లున లేవారు.

"ఒసేటి? బస్సెలిపోతాదనే? నేనాపుతాను. టీ తాగండెసే" అన్నాడు. అని అందరికి నోటిముందుకు టీ గ్లాసులనందించాడు చాకచక్యంగా. వాళ్లందరూ వెళ్లిపోతే తను నష్టపోతానన్న విషయాన్ని బయట పడనివ్వకుండా. వాళ్ళు కూడా టీని మూడేమూడు గుక్కల్లో మింగేసి కొందరు అరువూ, కొందరు నగదు పెట్టేసి బస్సు దగ్గరకెళ్లారు. ప్రయివేటు బస్సు లేకపోవటంచేత ఇంకా రేపో, నేడో ఈనవలసి ఉన్న పందిలాగా వచ్చింది ఆ బస్సు కిక్కిరిసిన జనంతో. కొంతమందే దిగుతున్నారు. అయినా దిగేవాళ్ళని దిగనివ్వకుండా కాళ్ళమధ్యనుండీ, చంకలమధ్యనుండీ సీట్లకోసం దూరిపోతున్నారు జనం.

"ఆగండి ఆగండి.. దిగనివ్వండి. సీట్లు లేవు. అందరూ నిలబడాల్సిందే" అంటూ అరుస్తున్నాడు కండక్టరు. అయినా 'కండక్టరు మాట ఖాతరులేదన్నట్లు' వెనక చక్రాలమీద నుండి కిటికీల ద్వారా వెనుక సీట్లోకి దూకడానికి కొందరూ, తువ్వాళ్లు, నంచులూ విసిరి సీట్లుంచమని కొందరూ వాళ్ళ ప్రయత్నాలు వాళ్లు చేస్తూనే వున్నారు.

"అమ్మలూ! అమ్మలూ! నీ బాగ్ ఇలా ఇవ్వు" అని బస్సులోపల్నుండి పరిచితకంఠం వినిపిస్తే అటు చూసింది, అమ్మలు కళ్లు పెద్దవి చేస్తూ.

"ఓ! రమీజా! నువ్వా!" అని బేగ్ అందించింది. కూరగాయలూ, బుట్టలూ టాప్ మీదకు వెళ్ళాకా బస్సు భారంగా కదిలింది.

అమ్మలు, రమీజా పక్కన కూర్చుంటూ "అఁ! ఎక్కడికీ? ఏంటికథ? ఇక్కడ దిగొచ్చు కదా!" అంది.

"దిగితే మాత్రం నువ్వుండట్లేదుకదా!"



"ముందు చెప్తే ఉండనేంటి?"

"పోనీ! ఇప్పుడు దిగిపోదామా?" అంది రమీజా!

"దిగిపోండి. మాకు సీటయినా దొరుకుతుంది" టౌన్ వెళ్తోన్న కాలేజీ కుర్రకారొకడన్నాడు. వాళ్ళ మాటలకు అమ్మలు కానీ, రమీజా కానీ పట్టించుకోలేదు. కండక్టరు టిక్కెట్లు కొడుతున్నాడు. ప్రయివేటు బస్సొకటి లేకపోవటంచేత రెండు బస్సుల్లో ఎక్కాల్సిన జనం ఒక్క బస్సులో ఎక్కారు. కండక్టరు మాత్రం విసుగులేకుండా నవ్వుతూనే టిక్కెట్లు కొడ్తున్నాడు.

"గురూగారూ! మీలాటి కండక్టర్లే అందరూ అయితే ఆర్టీసి లక్షల్లో నష్టాలు రాకుండా, కోట్లలో ఆదాయం వచ్చుండేదండీ" అన్నాడొకడు.

"అవునండీ! నాకు తెలీకడుగుతాను. ప్రయివేటు బస్సు ఉంటే మాత్రం, మీరెందుకండి బస్సు ఆపకుండా వెళ్ళిపోతారు?" అన్నాడొక కుర్రాడు.

"తప్పురా. ట్రేడ్ సీక్రెట్లు అడక్కూడదు. మనం ఒకరి డబ్బు తిన్నామూ అంటే వాళ్ళకి న్యాయం చెయ్యాలా? వద్దా?" అన్నాడో కుర్రాడు.

"చెయ్యాలి. అందుకేగా బస్సులెందుకాపరూ? అని అడిగేది?"

"అందుకే ఆపరంటున్నా. ప్రయివేటు బస్సోళ్ళు బాబూ! మీరు మనుమలు కనిపిస్తే పారిపోండీ' అని ఈళ్లకి దక్షిణలిస్తారు. అందుకే ఆళ్లకి న్యాయం చేస్తారు"

"మరి జీతం ఇస్తున్న ఆర్టీసికి వీళ్లు అన్యాయం చేస్తున్నట్లుగాదా?" అని బస్సులో ఒక విద్యావంతుడడిగాడు.

"బాబూ! ఆ జీతం బస్సులో పనిచేస్తున్నందుకు. ఇది ధర్మం. లంచం... అదే దక్షిణలు పొందటం లోకనీతి" అని ఆ కుర్రాడు వివరించేసరికి అందరూ పకాలున నవ్వారు.

టికెట్ బుకింగయింది.

బస్సు కదిలింది.

"ఉరే! ఏ.ఎన్.ఎమ్. అంటే ఏంట్రా?" ఓ కుర్రాడడిగాడు.

ఒకడు తెలీదన్నాడు.

వెంటనే మరో కుర్రాడు ఏక్జిలరీ నర్సు మిడ్‌వైఫ్" అన్నాడు.

మొదట ప్రశ్నించిన కుర్రాడు "జడ్డి పీనుగా! ఆ మాత్రం తెలియక నేనడగలేదు. మీరెవరయినా చెప్పండి. చెప్పినోళ్ళకి ఫుల్ టిఫినూ, మేట్నీ సినిమా... చూస్కోండి" అన్నాడు.

"నేం చెప్పేసేదా!" అని ప్రశ్నించిన కుర్రాడే ఆలస్యం చేస్తే ఛాన్సు పోతుందేమోనని" అందరూ నాకు మొగుళ్ళే అని అర్థంరా" అన్నాడు అంతే! బస్సులో ఉన్న కుర్రాళ్లందరూ చప్పట్లూ, ఈలలూ, కేకలూ... ఒకటే నవ్వులూ... గోలానూ!

"షటప్!" రమీజా గట్టిగా అరిచింది.

"ఏం? ఎందుకని?" కుర్రాళ్లు ఆమెమీదకొచ్చారు.

"వాట్ నాన్సెన్స్ యూ ఆర్ టాకింగ్. మళ్ళీ ఆ మాటనండి. చెప్పుతీసి పళ్లు రాలగొడ్తాను" అంటూ తోక తొక్కిన త్రాచులా లేచింది.

వెంటనే పక్కనే ఉన్న అమ్మలు 'రమీజా'ని కూర్చోపెట్టింది. కుర్రాళ్లు మాత్రం కూర్చోలేదు.

"ఏదీ చెప్పుతియ్యండి చూద్దాం. చెప్పులు నీకేకాదు. మాకూ ఉన్నాయ్" అన్నాడు.

"నీకు చెప్పు ఉంది. సంస్కారం లేదు. ఇచ్చిపుచ్చుకోవడం నేర్చుకో" అంది.

"నువ్విస్తేనేకదా పుచ్చుకోడానికి. పోనీ ఇక్కడొద్దులే. ఇంటికొస్తాను" అన్నాడు.

"ఏం కూశావ్‌రా. మళ్ళీ అను..." అంతవరకూ ఎస్.ఆర్. రాసుకోవటంలో లీనమైన కండక్టరు ఎస్సార్ కిందపడేసి ఆ కుర్రాడి కాలరు అందుకున్నాడు. కుర్రాళ్లందరూ ఒకటయ్యారు.

"ఆగండి. మీరాగండి" రమీజా అతన్ని వారించింది.

"నువ్వుండు. వీళ్ళంతు తేలుస్తా. డ్రైవరు గారూ, బస్సు వెనక్కితిప్పండి. పోలీస్‌స్టేషన్‌కు పోనివ్వండి. ఇందాకట్నుండీ చూస్తున్నాను. పోనీకదాని ఊరుకుంటే పేట్రేగిపోతున్నారు" అన్నాడు ఆవేశంగా.

"ఇంతకీ ఆవిడనంటే నీకెందుకట అంత కోపం" ఆ కుర్రాడడిగాడు.

 

''నేర్మయ్'' అన్నాడు కండక్టరు.

''అయ్యా! మేం అర్జంటుగా టౌనెళ్లాలి. ఎందుకొచ్చిన గొడవ. బస్సును పోనివ్వండి'' అన్నాడో పెద్దమనిషి. మొత్తం మీద పెద్దలందరూ కుర్రకార్ని చీవాట్లు పెట్టి నోరుమూయించారు. బస్సు ముందుకుపోతోంది. కండక్టరు విజయగర్వంతో రమీజానే చూస్తున్నాడు మధ్య మధ్యలో. రమీజా కూడా క్రీగంట అతన్నే చూడటం అమ్మలు గమనించింది.

''ఉఫ్! అసలేంటి కథ? అతన్నీకు తెలుసా?'' అంది అమ్మలు.

''అదో పెద్దకథ. తాపీగా చెప్తాలే'' అంది రమీజా.

''నాకు తెలీకుండా ఇన్ని కథలెప్పుడు తయారుచేశావ్?''

ముసిముసిగా నవ్వేసింది రమీజా. రమీజా కళ్లు నవ్వుతాయి. రమీజా నవ్విందంటే గులాబీ విచ్చుకున్నట్లుంటుంది. ఆ నవ్వు ఎలాంటి వాళ్ళనైనా పిచ్చెక్కిస్తుంది. ఇవ్వాళ రమీజా కళ్ళేకాదు. అధరాలేకాదు. ముఖమంతా నవ్వుతో మెరిసిపోతోంది. ఒక కొత్త కాంతితో ప్రకాశిస్తోంది. ఆ కాంతి శరత్కాలవు జ్యోత్స్నలాగుంది. సూర్యకాంతి పడి మెరిసే తుషారబిందువులా ఉషస్సులా ఉంది. స్నిగ్ధంగా, ముగ్ధమనోహరంగా ఉంది.

అందుకే రమీజా చేతిని గట్టిగా నొక్కివదిలింది అమ్మలు.

''నాకు చెప్పకుండా కథను మాత్రం పెంచకు'' అంది.

ఇంతలో అమ్మలు దిగాల్సిన స్టేజి వచ్చి దిగిపోయింది.

రావివలస వెళ్లాలంటే ఇంకా మూడుమైళ్లు నడవాలి. వెళ్ళేందుకు బస్సుకానీ, రిక్షాకానీ ఏదీ దొరకదు. కాలికి బుద్ధి చెప్పాల్సిందే! ఉసూరుమంటూ కిట్‌ని చేతికి తగిలించుకొని ముందుకు నడిచింది.

ఆమె మనసునిండా రమీజానే!

రమీజాకి అతనేం అవుతాడసలు? ఇన్నాళ్లుగా ఎంతో చనువుగా ఉండి తనను సంప్రదించకుండా ఏ నిర్ణయమూ తీసుకోని రమీజా అతన్ని ప్రేమించిందా? పెళ్లి చేసుకోబోతోందా? వాళ్ళ పెద్దవాళ్లు కుదిర్చారా?' ఏం అర్థం కాలేదసలు అమ్మలుకి.

రమీజా ఎంత చిలిపిగా ఉంటుందో ఆమె మనసు అంతలోతైంది. ఏ విషయంలోనూ తొందరపడి నిర్ణయాలు తీసుకునే రకంకాదు. అయితే యవ్వనం ప్రమాదకరమైంది. బుసలుకొట్టే కోడెనాగులాటిది. మనసులో ఎప్పుడు ఎలాటి కోరికలను పుట్టిస్తుందో చెప్పలేం! ప్రేమ ఉన్మాదంలోపడిన వ్యక్తులకు తాము తీసుకున్న నిర్ణయాలూ నిర్మించుకున్న మేడలూ అల్లుకున్న ఊహలు చాలా ఉన్నతంగా కనిపిస్తాయి. అలాటి ప్రేమసముద్రంలోపడిన ఎందరు సరియైన గమ్యం చేరుకోగలిగారు?

అమ్మలు మనసునిండా ఆందోళనా, ఆవేదనా ఒకదానిమీద ఒకటి సాలెగూడులా అల్లుకుపోతున్నాయి. రమీజా అంత తెలివితక్కువది కాదని మనసుపొరల్లో ఎక్కడో అనిపిస్తున్నా- భయం మాత్రం నీడలా వెన్నంటివస్తోంది.

తనకి తెలిసినంతవరకూ ఏ.ఎన్.ఎమ్.ల సంబంధాలు చాలామట్టుకు బస్సులోనే ముడిపడుతుంటాయి. కొన్నాళ్లుసాగి దారిమధ్యలో విడిపోయే బాటసారిలా విడిపోవటం జరిగిపోతుంది. అదే జరిగితే రమీజా తట్టుకోలేదు.

ఎప్పుడూ ఏ విషయాన్నీ ఎక్కువగా పట్టించుకోని అమ్మలు ఇవాళెందుకోగానీ చాలా మధన పడిపోతోంది. అందుక్కారణం నాలుగు సంవత్సరాలు ఒకేగదిలో ఉన్న అరమరికలులేని స్నేహం వల్లనా? రమీజా సుతిమెత్తని మనస్సు ఈ 'ప్రేమయాత్ర' బెడిసికొట్టి తట్టుకోలేకపోతే ఏమవుతుందోనన్న భయమా? ఏమో?

కాళ్లు లాగుతున్నాయి. నెత్తిమాడుతోంది. తలనెప్పి పుడుతోంది. అప్పుడు గుర్తుకొచ్చి బేగ్‌లోంచి గొడుగుతీసి వేసుకుంది. ముందుకు భారంగా నడుస్తోన్న అమ్మలుకు చాలారోజుల క్రితం తామిద్దరూ కలిసివున్నప్పటి సంగతులు స్మృతిపథంలోకి నడుచుకుంటూ వచ్చాయ్.

★ ★ ★

ఫస్టుకి జీతం అందుకోగానే ఇంటికెళ్లి రావటం రమీజాకు అలవాటు. ఎప్పటిలాగానే ఆ నెలలో కూడా జీతంరాగానే రమీజా ఇంటికె




ల్లివచ్చింది. ఇంటికెళ్తున్నప్పుడు కనిపించినంత హుషారు వచ్చినపుడు కనిపించదు రమీజాలో. కానీ ఆ నెలమాత్రం మరీ ముకుళించుకుపోయిన ముఖంతో తిరిగివచ్చింది. వచ్చీరాగానే అమ్మలు వెనుకనుంచి రెండు చేతులతో చుట్టేసి అల్లరిగా బుగ్గలు గిల్లేసేది. అలాటిది వస్తూనే హేండ్‌బాగ్ మంచంమీద గిరాటేసి బాత్రూంలోకి వెళ్లిపోయింది. ముఖం కడుక్కుని వచ్చి బట్టలు మార్చుకుంది.

"ఏం రమీజా! ఇంటి దగ్గర అంతా బావున్నారా?"

"వాళ్లకేం?" అని మంచంమీద బోర్లా పడుకొని దిండులో తలదూర్చింది.

"ఏయ్. చిలిపీ, ఏంటి నీ హుషారుని మీ ఊళ్ళో వదిలిపెట్టివచ్చావా?" అడిగింది అమ్మలు. స్వతహాగా అమ్మలుది గంభీర స్వభావం. ఎప్పుడోగాని అసలు నవ్వదు. తన పనిని తను సిన్సియర్‌గా చేసుకెళ్లిపోవటం, ఖాళీగా ఉంటే రికార్డు రాసుకోవటం. ఎవరైనా డెలివరీకో, లేక వంట్లో బాగోలేదోనని పిలిస్తే ఉన్నఫళంగా వెళ్లిపోవటం మాత్రమే అమ్మలుకు తెలుసు.

అందుకే మొదట మామూలుగానే ప్రశ్నలు వేసింది. రమీజా ముభావంగా ఉండటంతో ఇంట్లో ఏదో గొడవ జరిగి ఉంటుందేమోనని ఊహించింది. "ఏయ్... పిల్లా... ఇవాళ నా బహుమతి నాకివ్వకుండా ఇలా మూడీగా ఉన్నావేంటి. లే... లేచి కూర్చో" అంది. రమీజా లేవలేదు. తన స్వభావానికి విరుద్ధంగా అమ్మలు రమీజాకి కితకితలు పెట్టింది. లేడిపిల్లలా ఎగిరింది రమీజా. ఆమె కళ్లు చెమ్మగిల్లి ఉన్నాయి. ఆ విషయం కనిపించనివ్వకుండా మోకాళ్లలో తలదూర్చి కూర్చుంది. మోకాళ్లలో దూర్చుకున్న రమీజా తలను బలవంతంగా మీదికెత్తి, "ఏయ్! అసలేం జరిగింది? ఆ కన్నీరేమిటీ?" అని అడిగింది.

అంతే!

కురవబోతున్న మేఘం ఓ గంట ముందుగానే భీకరంగా కురిసినట్లు రమీజా బావురుమంది. అమ్మలు ఒళ్లో వాలిపోయింది.

"రమీజా! లే... ఏంటి చిన్నపిల్లలా. లే... చెప్తాను. ముందులే అనలు" అని ఎంతో ఆప్యాయంగా తన పైటచెరుగుతో రమీజా కళ్లు తుడిచింది. "ఉండు, టీ తెస్తాను" అని వెళ్లి రెండు కప్పులతో టీ తెచ్చి ఒకటి రమీజాకు ఇచ్చింది. రమీజా కొంత తేరుకొని టీ తాగింది. వెంటనే అడగటం ఎందుకని "ఇవాళ క్యాంపెళ్లాలా?" అని అడిగింది.

"వెళ్ళాలిగానీ, ఎక్కడకీ వెళ్లాలనిలేదు. దయచేసి నువ్వూ వెళ్ళకు" అంది.

"అలాగేలే" అనేసి వెళ్లి ఆ పూటకు వంట చెయ్యడానికి సమాయత్తం అవుతూ- "వంకాయలు ఉన్నాయి. కూరెలా వండమంటావ్?" అంది మెల్లగా. వాతావరణం మార్చాలని అలా అడిగింది.

"నీ ఇష్టం"

"అలాకాదు. నీ కిష్టమైన గుత్తివంకాయ చేస్తాను. సాంబారు పెడతాను" అంది.

"ఎందుకులే అక్కా! నాకేం తినాలనిలేదు"

"తినాలని నీకు లేకపోయినా, తినిపించాలని నాకుందిలే" అని వంకాయలు తరుగుతూ, "రమీజా! ఇంటిదగ్గరెవరికయినా చికాగ్గా ఉందా?" అనడిగింది.

"ఎవరికీ ఏమీలేదు. చికాకంతా నాకే వచ్చిపడింది" అనేసి "నెలకోసారెళ్తానా? అయ్యో! వచ్చిందిగదా. ఎలా ఉన్నావ్? అని ఒక్కరడగరు. అక్కడెలా ఉంటున్నావ్? తింటున్నావా? అక్కడి నీళ్లు నీకు పడుతున్నాయా? అసలే ఏజన్సీకదా? ఆ వాతావరణానికి ఎడ్జస్టవుతున్నావా? అని కనీసం నా తృప్తికోసమయినా అడగరు. ఎంత సేపూ "జీతాలందాయా? తెచ్చావా? నిన్ననే వస్తావనుకున్నాం" అని ఒకరంటే, "ఈ నెల మరో వంద నాకిస్తేగాని చాలదు" అని అమ్మా "అదేం కుదరదు మీ అమ్మ దుబారా చేస్తుందనవసరంగా. నాకే ఇంటి ఖర్చులకి చాలటంలేదు. ఇంకా అడగాలనుకుంటున్నానని' నాన్నా 'అక్కా! నాకసలు కాలేజికెళ్ళటానికి బట్టల్లేవు. రెండుజతలు బట్టలు తీసినాసరే, మూడొందలు ఇచ్చినా సరే' అని తమ్ముడూ, ఇలా వాళ్లగోలే వాళ్లది గాని, నా గురించి, నా ఆరోగ్యం గురించి, నా సరదాల గురించి పట్టించుకోవాలని వాళ్ళకసలుండదు. "వాళ్ళకెందుకుంటుందిలే. కన్నతల్లిదండ్రులా? తోడబుట్టిన అన్నదమ్ములా!"

అంది! ఆ మాటలంటున్నపుడు రమీజా నిరాశ గుప్పుమంది.

అమ్మలుకి ఆశ్చర్యం వేసింది. ఇంతవరకూ రమీజా తనతో ఎప్పుడూ ఆ విషయాన్నే ప్రస్తావించనందుకు.

"ఏంటి రమీ! నువ్వంటున్నది? వాళ్లు నీ సొంత తల్లిదండ్రులు కారా? నీకు అమ్మా నాన్నా లేరా?" అనడిగింది. మళ్లీ రమీజా బావురుమంది. వెక్కివెక్కి ఏడవటం మొదలు పెట్టింది.

"నాకెవ్వరూ లేరక్కా! ఎవ్వరూ లేరు. అందరూ నన్ను కొరుక్కుతినేవాళ్లే"

రమీజా మాటలు అమ్మలుకేం అర్థంకావటంలేదు. అర్థగంటపోయిందాకా అమ్మలు మళ్ళీ ఏం అడగలేదు. ఆ తరువాత సావధానంగా అన్నీ తెలుసుకుంది. రమీజాకి తండ్రి లేడు. అంటే ఎవరో తెలీదట. చాలారోజులు క్రితం విశాఖపట్నంలో ఓ రాజులకుటుంబం ఉండేదట. అందులో పెళ్లికాకుండానే ఓ అమ్మాయి కడుపున పడ్డ పిల్ల రమీజా. రమీజా పుట్టగానే పురిటిగుడ్డును పక్కనే ఉన్న ముస్లింల కప్పచెప్పేశారు. ఆ తరువాత బదిలీ మీద ఎక్కడికో వెళ్లిపోయారు. ఆ ముస్లింలు తమ ఇంట పెరుగుతున్న ఆ పిల్లకి రమీజా అని పేరు పెట్టుకున్నారట.

రమీజా పెంపుడుతండ్రి ఉస్మాన్‌బాషా. చర్మాల వ్యాపారం చేస్తుంటాడు. అతడి మనసులో ఏమాత్రం కోమలత్వం, సున్నితత్వం ఉండదట. కన్నతల్లినీ, పెళ్లాన్నీ పిల్లల్నీ అందర్నీ ఒకేరకమయిన బూతులతో తిడతాడట. అంతగా చదువూ సంస్కారంలేనివాడట. పగలంతా ఎక్కడెక్కడో తిరిగి సాయంకాలానికి ఇంటికి వస్తుంటాడట. వచ్చేసరికి అర మైలుదూరంవరకూ గుప్పున వాసనకొట్టేవిధంగా తాగివస్తాడట. అది చాలదన్నట్టు తనతో కూడా కొన్ని సీసాలు తెచ్చుకుంటాడట. పెళ్లాంతో ముందుగా సరదాగా మాటలు ప్రారంభిస్తాడట. ఎక్కడో ఇద్దరికీ ఏదో మాటమీద మాటొచ్చి 'నువ్వంటే నువ్వ'ని ఒకర్నొకరు తిట్టుకుంటారట. పూర్తిగా ఒంటిమీద తెలివిలేనప్పుడైతే అదే అదనుగా తీసుకొని అతని భార్య ఉస్మాన్‌ని చితకబాదేస్తుందట. లేనప్పుడు- ఉస్మానే అక్కడేదుంటే దాంతో భార్యని గొడ్డుని బాదినట్టు బాత్తాడట. ఒకసారి భార్య ఏదో అన్నదని కోపంతో చేతిలో సీసాతో నెత్తి మీద బాదాడట. ఆ తరువాత నెలరోజులు ఆమె నానాఅవస్థలు పడిందట. ఇలాంటి స్థితిలో ఉస్మాన్ భార్య భర్తమీద కోపంతో వేరొకరితో అక్రమ సంబంధం పెట్టుకుందట. ఉస్మాన్ ఎప్పుడయినా క్యాంపుకి వెళ్లి రోజులతరబడి ఇంటికిరానప్పుడు ఆ వ్యక్తి రోజులతరబడి ఇంట్లోనే ఉండేవాడట. అతనొచ్చినపుడు ఉస్మాన్ భార్య ముచ్చటగా తయారయ్యేదట. పిల్లల్ని సినిమాలకి, షికార్లకీ పంపించేసేదట.

రమీజా ఇంటర్మీడియట్ చదూతూన్నరోజుల్లో ఓసారి త్వరగా క్లాసవటంతో కాలేజీనుండి ఇంటికి వచ్చింది. గబగబా ఇంట్లోకెళ్లి ముఖం కడుక్కొని అద్దంముందు నిలబడి పౌడరు రాసుకొంటోంది. అప్పుడతను అంటున్న మాటలు రమీజా చెవిలోపడ్డాయి. "నీ పిల్లల్లో రమీజా గొప్ప కుదురుగుంటది. సిత్రం... దానికి అల్లయ్య పోలికా రాలేదు. నీ పోలికా రాలేదు. దీనికెవరిపోలిక వచ్చిందంటావ్?" అనడిగాడు.

"నీ ఎదవబుద్ధి పోనిచ్చుకున్నావ్‌గాదు"

"మాట మార్చకు. అసలిది బాషాకు పుట్టిందేనా?"

"కాదు. నీకు పుట్టింది"

"నేనెర్రోణ్ణిగాను. నాకూ నీకూ పరిచయమై పది సంవత్సరాలవుద్ది. రమీజాకిప్పుడు పదిహేడు దాటుంటాయ్"

"అయితే ఇప్పుడేటంటావ్?"

"ఏటంటాను. నికార్సుగా నాకు ముందు ఉస్మాన్‌బాషా కాక, నీకింకో మొగుడుండాలని, అదే నాలాంటోడుండాలని నా నమ్మకం"

"సీ... ఈ మగాళ్లంతా ఇంతే. ఏదో బాషా సేస్తున్న ఎదవపనులకి మనసు ఇరిగి నువ్విస్తున్న డబ్బుకోసం నా అవసరాలకోసం అదీ నువ్వు నచ్చావు కాబట్టి ఇలా జరిగిందిగానీ ప్రతీ మగాడి పక్కలో తొంగోడానికి నేనేం సొందాన్నా? ఇలాంటి మాటలాడావంటే ఇంక నీవీ ఇంటికి రావద్దు"

"అబ్బ... సరదాకనేసరికి ఎంత కోపం వచ్చేసింది నంజకి" అన్నాడు.





"సీ... ఏటా మోటుతనం, మాటలు తిన్నగ రానీ"

"పోనీగానీ, రమీజా సంగతేటో చెప్పినావు గాదు"

"చెప్పపోతే ఒగ్గవేటి?"

"ఒగ్గను" అని అతడు ఆమె బుగ్గను గిల్లటం అద్దంలో రమీజాకి స్పష్టంగా కనిపించినట్లు తల్లికి తెలీదు.

"రమీజా గురించి నీకనుమానం ఎందుకొచ్చిందనలు?"

"దాని బుద్దులూ, మీ బుద్దులూ ఒకనాగా కనిపించక. మీ పెద్దోడు, సిన్నది ఒకలాగా ఉంటారు. నేను రాగానే మీ పెద్దోడికి డబ్బులిత్తే నేనెల్లిందాకా మరిటుకేసిరాడు. మీ సిన్నదాయింకా పెద్దమనిషి కాకపోయినా దాన్నటన, దాని హెయలూ నిన్నుమించేలాగా ఉంటాయి. రమీజా తీరేవేరు. ఎప్పుడూ దాని సదువూ, దానిలోకమే. పదిహేడు సంవసరాలొచ్చినా దానికి ఎదవపోలికలు కనిపించవు. అందుకే అడుగుతున్నా" అన్నాడు.

రమీజా తల్లి జవాబు చెప్పలేదు. మౌనంగా ఊరుకుంది. ఆ తరువాత ఆమె ఏదో చెప్పింది. ఆ మాటలమీద అతనికి గురికుదర్లేదు.

"నిజం సెపుతే వందిస్తాను"అన్నాడు.

"ఉండు. ఒక్కనిమిసం ఆగు. రమీజా ఎలిపోనీ" అంది. అతడిలోనూ ఆసక్తి మరింత పెరిగింది. రమీజా కూడా తన గురించి తల్లి ఏం చెపుతుందో తెలుసుకోవాలన్న ఉత్కంఠ, ఆరాటం, అంతకంటే ఆందోళనా ఎక్కువయ్యాయి. అయితే తను ఇంట్లో ఉంటే తల్లి చెప్పదు. ఇక లాభంలేదని రమీజా పుస్తకాలు పట్టుకుని డాబా ఎక్కిపోయింది రమీజా డాబా ఎక్కగానే ఆమె అనుకున్నట్లే తల్లి బయటకు వచ్చింది. రమీజా డాబా గోడమీదనుంచి చూస్తున్నట్లు తల్లి గమనించలేదు. తల్లి గమనించకపోవటంచేత మెల్లగా పిల్లిలా అడుగులు వేసుకుంటూ దిగి అడుగు మెట్టు దగ్గర కాళ్లు కూడదీసుకుని కూర్చుంది.

"ఊఁ సెప్పు. అనలేటికత?"

"వందతే"

"ఇంద"

"రమీజా మా పిల్ల కాదు. మేం వొయజాగ్‌లో కొన్నాల్లుండేవోల్లం. అప్పట్లో 'బాసా' మంచి రూపులో ఉండేవాడు. మా ఇంటిపక్కనో రాజుల కుటుంబం ఉండేది. గొప్ప కుటుంబవే. ఆ పిల్ల కాలుజారింది. జారింది వెంటనే తెలుసుకోలేకపోయింది తన కడుపులో బిడ్డ పెరుగుతున్నట్లు. తెలుసుకొనేటప్పటికి సెయ్యిదాటిపోయింది. అందుక్కారణం ఎవులని ఆ పిల్లని ఎంతడిగినా సెప్పలేదు. అల్లు 'బాసా'కి గొప్ప నేస్తులు. అందునుంచి కలకత్తా బదిలీ చేయించుకుని ఆ పిల్లని మా ఇంట పెసవం అయినంతదాకా ఒగ్గీసారు. ఆ పిల్లకాడపిల్ల పుట్టింది. పుట్టాక ఆల్లొచ్చినారు. తమ పిల్లని తీసుకెల్లినారు. 'బాసా'తో ఏం మాట్లాడినారో ఆ పిల్లకి పుట్టిన పిల్లని ఇక్కడొగ్గీసినారు. ఎందుకో 'అందాల బొమ్మనాగా' ఉన్న ఆ పిల్లంటే నాకూ ఒగ్గబుద్ధి కానేదు. అంతేకాదు, నాకయిదేల్లప్పుడే తల్లి సనిపోయింది. తల్లి ప్రేమ తెలీదు. ఈ పిల్లకి ఆ లోటు లేకంట పెంచాలని నా బాద" అంది.

ఆ మాటలు విన్నప్పుడు రమీజాకి గుండె నిండా బాధ ఒకపక్క, పొంగివచ్చే ఆనందం మరోపక్క ఉక్కిరిబిక్కిరి చేశాయి. ఇంకా ఏం చెపుతుందో, వాళ్ళ సంభాషణ ఎంతవరకూ వెళ్తుందో, ఎన్ని నిజాలు తెలుస్తాయో అనిపించింది.

"ఇంతకీ ఈ పిల్ల తండ్రి ఎవురంట?"

"ఏమో తెలీదు. కాని నాకొక అనుమానం?"

"ఏటది?"

కొంతసేపు తటపటాయించి, "బాషాయే ఏమోనని!"

రమీజా గుండె గుహలోంచి సంతోషసమీరం వొళ్ళంతా వ్యాపించి శాంతించింది. "పోనీ తండ్రినయినా చూసుకోగలుగుతున్నందుకు"

"ఎందుకంటే - ఆ పిల్ల ఇక్కడున్నన్నాళ్ళు బాషా ఏదో రహస్యంగా మాట్లాడుతుండేవాడు. అయితే ఆ పిల్ల బిడ్డని పెసవించి వెళ్ళిపోయిన తర్వాత ఓరోజు మంచి సరదాలో ఉండగా 'నేనొకటి అడుగుతాను సెపుతావా?' అంటే 'సెపుతానని' అల్లామీద ఒట్టేశాడు.

అడిగాను.

తనెంతమాత్రం కాదన్నాడు. మరి నువ్వు రహస్యంగా ఏటి మాట్లాడేవోడివి? అనడిగితే ఆ పిల్లను నేను సెల్లెల్లాగా సూస్తాను. ఆ కుర్రాడి ఎడ్రస్ చెప్పింది. ఎక్కడుంటాడో వెతుకుదామని ఊరంతా గాలించాను. ఆ కుర్రాడి ఆసూకీ దొరికితే అతన్ని పెల్లిసేసుకొని తీరాలనుకునేది. అలాగైతే తన బిడ్డని తనకాడే ఉంచుకోవాలనుకునేది. కానీ ఆ అడ్రస్ దొరకనేదు. ఆ ఎదవ ఎటో పరారీ అయిపోనాడు అని సెప్పాడు. ఏ మగాడూ తన పెల్లాంకాడ తన రహస్యం సెప్పి కొరివితో తల గోక్కోడుకదా? నువ్వే ఉన్నావ్, నాకాడికి నువ్వొస్తన్నావని నాకింతలేసి డబ్బులు పోస్తన్నావని, నువ్వెంత దవిర్జంగల మొగోడివైనా, నీ పెల్లాం ఎంత జడ్డిమాలోకమయినా సెప్పనేవుగద! అలాగే నా భర్తా నాకు సెప్పే తెగింపు, సాహసం నేక మానేసి ఉండొచ్చు. అయితే ఒకయి నయం, నానెరిగి ఉన్నంతవరకూ బాసాకి తాగుడూ, పేకాట తప్ప ఆడ అలవాటు లేదు. అందునుంచి రమీజాకి తండ్రెవరోమాత్రం నేను సెప్పలేను. తల్లినిమాత్రం నేను కాను. నాకు ఎవులివల్లనో కలిగిన బిడ్డనిమాత్రం నువ్వు ఎదవాలోసెనలు పెట్టుకోకు'' అంది.

ఆ వ్యక్తి ఒక్కసారి చప్పట్లు కొట్టి - ''పోనీలే... మంచి సంగతి సెప్పావ్'' అన్నాడు.

''ఏం? ఇది నీకు అంత మంచి సంగతి ఎందుకయినాది?'' అడిగింది ఆమె.

''నరే... నల్లకొచ్చి ముంతదాపుడెందుకు? నువ్వెన్ని ఏలు కావాలో కోరుకో నీ ఇష్టం. నేపోతే నా టింబరు పేక్టరీలో ఒకటి రాస్సేమంటే రాసిచ్చేత్తాను. నాను చెప్పింది జాగర్తగ ఇనుకో నేను సెప్పినట్టుగింతానని మాటియ్యి'' చెయ్యి చాపుతూ అన్నాడు.

''సెప్పు ముందు''

''సేతిలో సెయ్యేయ్యవా''

''నా మాటమీద నమ్మకం నేదా?''

''తరువాత కాదంతే?''

''నూడు... ముందిసియం సెప్పు. నీ సేతి ల్సెయ్యేసి పీకమీదికి తెచ్చుకోవటం నాకిట్టంనేదు. నువ్వు ముందు సెప్పు. నాకిట్టవడితే నువ్వు సెప్పినట్టే సేత్తాను. నీ టింబరు డిపోకి నానోనరునైతాను'' అంది.

కొంతసేపు మవునం రాజ్యంచేసింది.

''రేపు రాతిరికొస్తాను. రమీజాని నాకాడికి పంపు. ఇదిగో ఈ గొలుసుంచుకో'' అని మెడలో బంగారపు చెయిన్ తీసి బల్లమీద పెట్టాడు. రమీజా గుండె శరవేగంతో కొట్టుకొంటోంది. ఉచ్ఛ్వాసనిశ్వాసాలు బుసలు కొడుతున్నాయి. శరీరం చెమటతో ముద్దయిపోయింది. తల్లి నిర్ణయం తనని ఏ పాతాళ కుహరానికి తోసేస్తుందోనని రమీజా పెనుగాలికి లతలా అదిరిపోతోంది.

''లే... ముందిక్కణ్ణుంచి లేచిపో. ఇదిగో నీ డబ్బు, ఇవాల్టినుంచీ నా గుమ్మం తొక్కకు... వెళ్ళు'' గట్టిగా అరిచింది తల్లి. భూనభోంతరాళాలు దద్దరిల్లాయేమోననిపించింది అరుపుకు.

రమీజా ఆ కేకకి తుళ్ళిపడింది. ఆనందసాగరంలో మునిగితేలింది. కన్నతల్లి విడిచి వెళ్ళిందన్న బాధని పూర్తిగా మరిచిపోయింది. 'అమ్మా! నువ్వే నా తల్లివమ్మా! అప్పుడు - నా గురించి నాకు తెలియని వయసులో నన్ను కాపాడావ్. ఇప్పుడు నేనంటే ఏమిటో తెలిసి - నామీద నాకు రోత కలుగుతోన్న సమయంలో, నీ నిర్ణయం కఠోరమైనదైతే నా అంతట నేనుగా మేడ దూకయినా చావటానికి సిద్ధమౌతోన్న తరుణంలో నా మానాన్ని రక్షించావ్. ఇన్నాళ్ళూ నువ్వింతగా దిగజారిపోయినందుకు ద్వేషించాను. అసహ్యించాను. సమయం చూసి నీకు తగిన బుద్ధి చెప్పాలనుకున్నాను. కానీ అమ్మా! నువ్వు మామూలు తల్లివి కావు. తల్లి కాని తల్లివి. దేవతవి. అమృత హృదయివి. కరుణామయివి. మహోన్నత హిమశృంగానివి' అని తల్లిని వేనోళ్ళ కొనియాడింది. సహస్రవిధాలుగా అర్చించింది మనసులోనే.

''ఒసేటి కోపమే!''

''కోపంగాకపోతే?''

''డబ్బుకు నువ్వెంత దిగజారుతావోనని విన్నోసారి పరీక్ష చేశానంతే! నీ కూతురు నా కూతురుగాదా! నాకలాటి ఎదవ ఆలోసెన్లుంటాయని ఎలా అనుకున్నావనలు. ఒట్టు. నీమీదొట్టు. నీ తత్వం తెలుసుకుందామని నేనాడిన నాటకం ఇది. నువ్వు గమనిస్తావనుకు




న్నాను. ఏటి? ఇప్పటికయినా నమ్ముతన్నావా? లేదా? సరదాకైనా నీకు బాధపెట్టినందుకు నన్ను సెమించు. నీపాదాలొట్టుకుంటాను'' అన్నాడు.

''అందితే పిలకా, అందప్పోతే కాలూనా?''

''సీ! నన్నపార్థం చేసుకోకు''

ఆ తరువాత అక్కడుండలేకపోయిన రమీజా డాబా ఎక్కిపోయింది. ఆమె మనసుమాత్రం కల్లోల సముద్రంలాగా ఉంది''

-ఇది రమీజా ఆరోజు చెప్పిన తన జీవిత కథ.

ఆ తరువాత ఆ వ్యక్తి ఇంటికొచ్చినా రమీజా వేపు అదోలా చూసేవాడట.

తల్లి మాత్రం ఇంటర్ పూర్తికాగానే అక్కడుంచడానికి ఇష్టపడక ఏ.ఎన్.ఎం. ట్రైనింగ్‌కి పంపింది. ట్రైనింగ్ పూర్తవగానే రమీజాకి ఉద్యోగం వచ్చేసింది. ఉద్యోగంలో చేరి మొదటి జీతం అందుకోగానే ఇంట్లో అందరికీ బట్టలు తీసింది రమీజా. ప్రతి నెలా ఫస్టుకి ఇంటికి వెళ్ళి తండ్రికి ఇంటి ఖర్చులకీ, తల్లికి ఆమె స్వంత ఖర్చులకీ కొంత డబ్బు ఇచ్చేది. తమ్ముళ్ళకీ, చెల్లెళ్ళకీ ఏవో కొని పట్టుకెళ్తూనే ఉండేది. అయితే ఆరోజు అంతగా రమీజా బాధపడటానికి ప్రత్యేక కారణం ఉంది.

రమీజా ఇంటికెళ్ళేసరికి తల్లీ, ఆమె ప్రియుడూ ఇంట్లో ఉన్నారు. తల్లి మామూలుగా పలకరించేసి ''అర్జంటుగా ముందో వందరూపాయలిస్తావా?'' అని అడిగింది. రమీజా వంద తీసి ఇచ్చింది. వీధిలోకి తమ్ముళ్ళని పంపి ఆ పూటకి కోడిమాంసం, ఇంకా ఏవేవో తెప్పించింది. గొప్ప హడావుడి పడిపోతోంది.

రమీజా చెల్లెల్ని పిలిచి కారణం అడిగింది. తనకి తెలీదంది. ''ఇతనింకా వస్తున్నాడా?'' అని అడిగింది.

''ఈమధ్య రావటంలేదు. అమ్మ నాలుగురోజులుగా నన్ను పంపితే, తీరుబాటు లేదని, ఇవాళ వస్తానని కబురు చేశాడు. అమ్మ పొద్దున్ననించీ తయారయి కూర్చుంది. అతను రాలేదని మామీద తెగ చిరాకుపడిపోతోంది. ఇప్పుడే వచ్చాడు. అందుకే అమ్మ నీ రాకని కూడా గుర్తించలేదు'' అంది చెల్లెలు.

''నాన్నెటెళ్ళాడు?''

''నాన్న బరంపురం వెళ్ళాడు. పది, పదిహేనురోజులు వరకూ రానని చెప్పాడు''

భారంగా నిట్టూర్చింది రమీజా. 'ఈ రోజు నేను రాకుండా ఉండాల్సింది' అనుకుంది. వచ్చినందుకు చాలా బాధపడిపోయింది. ఆరాత్రి ఎలాగయినా ఇంట్లోంచి బయటపడాలనుకుంది. ఓ గంట ఎలాగో గడిచింది. స్నానం చేసి, బట్టలు మార్చుకుంది. ఇంతలో ఇంటర్మీడియట్‌లో తన క్లాస్మేట్ రోజారాణి వచ్చింది. వస్తూనే - ''హాయ్! రమీజా! నువ్వు వస్తావో రావో అనుకున్నాను. నేను రెండుసార్లొచ్చానీమధ్య. నువ్వు ఫస్టు దాటాక వస్తావని తెలిసింది. రేపే నేను వెళ్ళిపోతున్నాను'' అంది. ఆ ఊర్లో బిఏస్సీ లేకపోవటంచేత విజయనగరంలో బిఏస్సీ చదూతోంది రోజారాణి.

''చాలా సంతోషంగా ఉందే. ఇవాళ రాత్రి సినిమాకెళ్దాం - కాదనకు''

''రియల్లీ... నువ్వే కాదంటావేమోననుకున్నాను. సరే, మా ఇంట్లోనే భోజనం. సినిమా అయిపోయాక మా ఇంటే పడక. రాత్రల్లా కబుర్లు చెప్పుకుందాం'' అంది.

రమీజా తేలికపడింది. సముద్రంలో పడి ఈతరాక గిలగిలా కొట్టుకుంటున్నవానికి జాలరి ఆదుకుని బయటకు తీసినట్లు, ఊపిరందక కొట్టుమిట్టాడుతున్న ప్రాణికి ఆక్సిజన్ ఎక్కించినట్లు ఫీలయింది రమీజా. వెంటనే తల్లికి చెప్పకుండానే రోజారాణితో వీధిలోకి దూసుకుపోయింది రాకెట్‌లా.

ఆ తరువాత రోజే తండ్రి వచ్చాడు.

వస్తూనే ''వచ్చావా అమ్మా! నువ్వొస్తావనే వచ్చాను. లేకపోతే మరో వారంరోజులు రాకపోదును'' అన్నాడు. తండ్రి తనొస్తానని తెలిసి వచ్చినందుకు రమీజా చాలా సంతోషించింది. అయితే పొంగే పాలమీద నీళ్ళు జల్లినట్లు ఆమె ఆనందం ఎంతోసేపు నిలవలేదు. ''నేను రాలేదనుకో, మీ అమ్మ నీ దగ్గర డబ్బులు తీసుకుని అనవసరంగా ఖర్చులు పెట్టేస్తుంది. అందుకే ఆ డబ్బులందుకుని మళ్ళీ వెళ్దామని వచ్చాను'' అన్నాడు.

'ఆమాటలనకుండా ఉంటే ఎంత బాగుండేది?' అనుకుంది. అప్పుడు రమీజా

కళ్ళనుండి పెల్లుబికిన కన్నీటి సెలయేటిని కూడా తండ్రి గమనించలేదు. అప్పుడనుకుంది - 'ఇతడు నా తండ్రి ఎంతమాత్రం కాడని!' తండ్రి వచ్చినట్లు అమ్మ ఎవరిచేత కబురంపిందోకానీ అమ్మ ప్రియుడు ఆరోజు రాలేదు.

ఆ రాత్రి-

తల్లీ, తండ్రీ రమీజాముందు కూర్చున్నారు. రమీజా డబ్బులు తీసి తండ్రికివ్వాల్సినవి తండ్రికీ, తల్లికివ్వాల్సినవి తల్లికీ ఇచ్చింది. "అమ్మా! నువ్వేమీ అనుకోపోతే ఒకమాట - మీ అమ్మకి తగ్గించే ఇస్తావో, మరోలా ఇస్తావో తెలీదుకానీ మళ్ళీ నెలనుండీ మరో వందరూపాయలు ఎక్కువ కావాలమ్మా!" అన్నాడు అతను.

"నేనొప్పుకోను. మీ నాన్నకి తగ్గించి ఓ యాభయి రూపాయలు నాకే ఎక్కువిమ్మనాలనుకుంతన్నా. మీ నాన్నకెంతిచ్చిన తాగుడుకే సాలదు" అంది తల్లి.

"అవును. నాకు తాగుడుకి సాలదు. నీకు సరదాలకి సాలదు" అన్నాడు.

"ఎందుక్కాదుమరి? నువ్విచ్చేసిన డబ్బుతోనే సరదాలన్నీ తీరిపోతన్నాయి!"

"నానివ్వప్పోతే నీకే రంకుమొగుడిస్తన్నాడే?"

అలా సాగుతోన్న ఆ సంభాషణ ఎంతవరకూ వెళ్ళిపోతుందో చిలికిచిలికి గాలివానగా మారుతుందేమోనని భయంవేసింది రమీజాకు.

"ఆపండి నాన్నా. అమ్మా నువ్వు కూడా తగ్గమ్మా. ఎందుకనవసరంగా గొడవలు? నీకు నూరెక్స్ట్రా కావాలి. నీకు ఏభయి కావాలి. సరే... అలాగే పంపుతాను" అంది రమీజా.

"అక్కా! నాకు బొత్తిగా బట్టల్లేవు. కాలేజికి వెళ్ళటానికి సిగ్గేస్తోంది" అని తమ్ముడంటే, "అక్కా! నాకొక్క జతే మంచిదుంది" అని చెల్లెలంది. అన్నీ విన్న రమీజాకు చిరాకేసింది. వీళ్ళందరూ ఎవరిక్కావాల్సినవి వాళ్ళు కోరుకుంటున్నారేతప్ప, తనకేం కావాలో తెలుసుకోవటంలేదు. తన జీతం ఎంతో, ఎంత మిగుల్తుందో కూడా కనీసం అడిగి తెలుసుకోవటంలేదు. కనీసం ఇంటికి రాగానే కాళ్ళకు నీళ్ళివ్వటంగానీ, కప్పు టీ ఇవ్వటంకానీ చెయ్యలేదు. పిల్లలక్కూడా తమ స్వంత అక్కయ్య తను కాదని తెలిసిపోయిందా? తనకేమీ అర్ధంకావటంలేదు.

అలాటి పరిస్థితుల్లో పెనుతుఫాను చెలరేగుతోన్న మనసుతో బస్సెక్కి వచ్చేసింది రమీజా.

రమీజా అంతరంగంలోంచి ఉవ్వెత్తున ఎగసిపడిన తరంగం చెప్పిన జీవిత కథ అది. ఈ సంఘటన జరిగిన తరువాత రమీజా అమ్మలుకి మరింత చేరువయింది. కన్నూ రెప్పలాగా, పాలూ నీళ్ళులాగా వాళ్ళిద్దరి అనుబంధం మరింత సన్నిహితమైంది. ఆ తరువాత అమ్మలు గొప్ప ప్రమాదంలో చిక్కుకుంది. అంతవరకూ గొప్ప చిలిపితనం, అల్లరితనమాత్రం కలిగిన వ్యక్తిగానే అనుకున్న రమీజా ఎంత తెలివైనదో, ఎంత సూక్ష్మగ్రాహో తను ఆ ప్రమాదంనుండి బయటపడిన తరువాతగానీ తెలీలేదు.

అమ్మలు మొట్టమొదట పనిచేసింది ఏజన్సీ ప్రాంతంలో. ఏజన్సీ ప్రాంతంలో చలికాలం అయితే మంచుగడ్డలమీద పడుకున్నట్టే ఉంటుంది. వేసవికాలంలో అయితే మండుతున్న కొలిమి పక్కన ఉన్నట్లే ఉంటుంది. వర్షాకాలం వచ్చిందంటే వర్షం పడనిరోజెప్పుడుంటుందో చెప్పడం కష్టం. ఒక చిన్న మేఘశకలం సూర్యుణ్ణి అడ్డుకున్నా కుండపోత వర్షం కురిసేస్తుంది. అయితే ఉద్యోగంలో చేరిన తొలిరోజులు, పెళ్ళీ సంసారం లేకపోవటం, పనిలోనే నిమగ్నం అయిపోవటం అనే కారణాలవలన ఏజన్సీ ఆమెకు బాధలకంటే మధురభావనలనే కలిగించింది.

అమ్మలు పనిచేస్తోన్న సబ్ సెంటరుకి నాలుగు మైళ్ళ దూరంలో సిరిమానుగూడ అనే పల్లెటూరుంది. అక్కడ ఉండేవి ఓ పాతిక ఇళ్ళు. ఉండేవాళ్ళు వందమంది గిరిజనులు. సాధారణంగా అక్కడికి ఎవ్వరూ వెళ్ళరని అందరూ చెప్పారు. అయినా తన పరిధిలోగల గ్రామాన్ని సందర్శించాలనుకుంది అమ్మలు. డాక్టరు దగ్గర్నుంచీ అందరూ ఆ ఊరు వెళ్ళక్కర్లేదనీ, ఆ మారుమూల ప్రాంతంనుండి ఎవరూ రారనీ అన్నారు.

కానీ ఒకరోజు నడన్గా అమ్మలుకి ఆ ప్రాంతం వెళ్ళాలనిపించింది. రమీజాతో అదే




మాటంటే తిట్టిపోసింది. సరే, ఇక రమీజాతో కూడా చెప్పి లాభంలేదనుకుంది. రోజూలాగే తెల్లారేసరికి డ్యూటీమీద బయలుదేరింది. చేతిలో మెడికల్ కేరియరూ, రికార్డూ, గొడుగూ మొదలయిన తన సరంజామాని పట్టుకుని ఒక మైలుదూరం బస్సులో వెళ్ళి అక్కడ దిగింది.

చుట్టూ చూసింది.

నిర్మానుష్యంగా ఉంది. దట్టమైన అడవి దూరంగా కనిపించింది. ఎక్కడపడితే అక్కడ డొంకలు. పెద్ద భూకామందు కళ్ళంలో తూర్పారబట్టి కుప్పలుగా పోసిన ధాన్యపురాసుల్లాగా అతి పెద్ద కొండలు కొన్ని. పల్లెల్లో చిల్లర దుకాణదారులు పెసరపప్పు, కందిపప్పు మొదలైన పప్పుదినుసులు డొక్కుల్లో కుప్పలుగా పోసుకున్నట్లు చిన్న కొండలు కొన్నీ కనిపించాయి. ఎవ్వరూ పెంచకపోయినా, గాలికీ ధూళికీ పెరిగి శాఖోపశాఖలుగా విస్తరించిన పెద్దపెద్ద మామిడిచెట్లు, విప్పచెట్లు, సంస్కారంలేని జుట్టులా చిందరవందరగా పెరిగి తుప్పల్లా పెరిగిన వెదురు డొంకలూ, విశాలమైన మొదళ్ళు కలిగి చక్కగా సాయిబాబా గారి జుట్టులా కనిపిస్తోన్న చింతచెట్లూ, గుత్తులు గుత్తులుగా కాసిన కాయలతో దారిపొడవునా కనిపించే శీతాఫలాల చెట్లు చూడ్డానికెంతో అందంగా కనిపిస్తుంటే ముందుకు ధైర్యంచేసి నడిచింది. కొండమీదనుంచి పాపిడి చేరులాగా కిందికి దారి కనిపించింది. ఆ దారిలోంచి చీమల బారులాగా వరుసలో వస్తున్న మనుషుల సమూహం కనిపించింది. వాళ్ళు కిందకి దిగి తనవరకూ వచ్చేసరికి అర్థగంట పట్టింది.

వాళ్ళు తనని వింతగా చూశారు. భయంగా చూశారు. అందులో అందరికంటే చాలా వెనగ్గా వస్తోన్న ఓ కుర్రాడు ఎందుకో అమ్మలును చూడగానే పరుగుపరుగున వెనక్కి పారిపోయాడు. అలాగ అతను పారిపోవటానికి కారణం మరో గంటదాటాక కానీ తెలియలేదు.

తనని బాగా సమీపించాక "ఎవరు కావాలి?" అని వాళ్ళు ప్రశ్నించారు. వాళ్ళ భాష ఓ పట్టాన అర్థంకాలేదు అమ్మలుకి. వాళ్ళడుగుతోన్న ప్రశ్నలకిజవాబుచెప్పలేకపోయింది. దాంతో వాళ్ళకి తనమీద అనుమానం ఎక్కువయింది.

అంతలోనే నాగరికత తెలిసిన ఒకతను వచ్చి "ఏయ్! ఎవరు నువ్వు? ఎందుకొచ్చావిక్కడికి?" అని ప్రశ్నించాడు.

ఆ ప్రశ్న వినగానే అమ్మలుకి కోపం వచ్చేసింది. 'వీడికంటే సంస్కారం లేకపోయినా, నాగరికత తెలీకపోయినా శిల్పాల్లా కనిపించే ఆ కొండజాతివారే నయం' అనిపించింది.

అమ్మలు తడబాటుపడింది. "నేనీ గ్రామాన్ని చూసుకోవాల్సిన ఏ.ఎన్.ఎమ్.ని"

"నిజంగానా?"

"అబద్ధం చెప్పవలసిన ఖర్మ నాకేం వచ్చింది?"

"ఇన్నాళ్ళూ ఎందుకు రాలేదు?"

"నేనిక్కడకు వచ్చి జాయినయిందీమధ్యనే"

"ఇక్కడకు రాకూడదని... ఇది రాకూడని ప్రాంతమని నీకు తెలీదా?"

"తెలుసు"

"తెలిసే వచ్చేవన్నమాట. అయితే నువ్వు మామూలుగా రాలేదు. ఎవరో పంపగా వచ్చినట్లు తెలుస్తోంది. గొప్ప సాహసవంతురాల్లా ఉన్నావు. పద... మా గురువుదగ్గరకి. అతడే చెప్తాడు నిన్నేం చేయాలో. అక్కడే తేలుతుంది నీ సంగతి!" అన్నాడు. అతడడిగిన ప్రశ్నకి తను చెప్పిన సమాధానం అతనికెలాగ అర్థమయిందో తరువాత తెలిసింది అమ్మలుకి.

నెత్తిమీద, కావుళ్ళలోనూ శీతాఫల బుట్టలతో వరుసల్లో వస్తోన్న గిరిజనులందరూ ముందుకు నడవటం మానేశారు. అమ్మలు వెనకాతలే బాడీగార్డుల్లాగా, దొంగను ముందు నడిపించుకెళ్తోన్న పోలీసుల్లాగా వస్తోంటే అమ్మలుకి భయంవేసింది. అప్పుడు తనకి గుర్తొచ్చింది. ఈ ప్రాంతంలో 'నక్సలైట్లున్నా'రని తన సహచరులప్పుడప్పుడూ అనుకుంటూండగా విన్న సంగతి. కానీ ఇంత చేరువలో ఉండరనుకుంది.

అయితే అప్పటికే ఆ ప్రాంతంలో నక్సలైట్ల కార్యకలాపాలు ఎక్కువకావటం... అక్కడికి యాభై కిలోమీటర్ల దూరంలో ఉన్న భూస్వాములూ, బడా వ్యాపార్లు కొంతమంది హతులు

కావటం అమ్మలు పేపర్లోనూ, రేడియోల్లోనూ వింటూనే ఉంది. ఈ హత్యలు జరిగిన తరువాత పెద్దపెద్ద వ్యాపారస్తులూ, భూకామందులూ తమ భూముల్నీ, స్థిరాస్తులనీ వదిలీ డబ్బు, బంగారాలతో పట్నంలో స్థిరపడిపోవటం గురించి హాస్పిటల్లో కథలుగా చెప్పుకుంటున్నప్పుడు కర్ణాకర్ణిగా విందిగానీ... తనకి వాటిమీద ఆసక్తి లేకపోవటంచేత వాటినంతగా పట్టించుకోలేదు. ఇప్పుడిప్పుడే వీళ్ళమీద పోలీసు నిఘాలెక్కువ కావటం, తను పనిచేస్తోన్న పి.హెచ్.సి. ప్రాంతంలోనే కొత్తగా పోలీసుస్టేషన్ పెట్టడం కూడా జరిగింది. అంతకుముందు ఈ ప్రాంతపు సరకులే తప్ప ఊళ్ళతోనూ, మనుషులతోనూ సంబంధం లేని ప్రభుత్వం ఈ ప్రాంతాన్ని పరిగణనలోనికి తీసుకోవటం జరుగుతోంది. ఫలితంగా రోడ్లు పడ్డాయి. బస్సులు వేశారు. గిరిజనాభివృద్ధి సంస్థవాళ్ళు పాఠశాలలు నెలకొల్పారు. ఆస్పత్రులు పెట్టారు. బాంకులు పెడుతున్నారు. గిరిజనులకు లోన్లు, వగైరా సౌకర్యాలు కల్పిస్తున్నారు. అయితే పేపర్లోనూ, వార్తల్లోనూ కనిపిస్తోన్న ప్రగతిమాత్రం ఇంకా ఈ ప్రాంతంలో కనిపించకపోవటం ఆశ్చర్యం కలిగిస్తోంది అమ్మలుకు.

అమ్మలు ముందుకు నడుస్తోన్నా ఆమె మనస్సు భయంతో వెనక్కే లాగుతోంది. 'ఎందరు వద్దంటున్నా ఎందుకొచ్చానా' అని ఇప్పుడు బాధపడుతోంది. వెళ్ళిపోతే బాగుణ్ణనిపించింది. కానీ - ఇప్పుడు వెనక్కి తిరిగితే ప్రాణానికే హాని అని తనకి పూర్తిగా అర్థమయిపోయింది. గాలి చల్లగా ఎముకల్ని కొరుకుతున్నా భయం లోపల్నుండి మంటలు పుట్టిస్తోంది. కొండ ఎక్కటం చాలా కష్టంగా ఉంది. అలవాటులేకపోవటంచేతనో, భయంవల్ల ఉత్సాహం నీరుకారిపోవటంచేతనో పిక్కలు నలుపుతున్నాయి. జుట్టులోంచి చెమట ధారలుగా కారుతోంది. మనసుని కుదుటపర్చుకుని, గుండెని ఉగ్గబట్టుకొని ముందుకు నడుస్తోంది. ధైర్యాన్ని తెచ్చుకుంది. నాలుక పిడచకట్టుకుపోతుంటే పెద్ద ప్రయత్నంతో - "మీరేం చేస్తారు?" అనడిగింది ముందు నడుస్తోన్న ఆ యువకుడిని. అతనికి సుమారుగా పాతిక సంవత్సరాలుంటాయి. కళ్ళు పెద్దవిగా ఉన్నాయి. చూపు కరకుగా ఉంది. మాట పరుషంగా ఉంది. మనసు కఠినంగా ఉన్నట్లుంది. గడ్డం పెరిగి ఉంది. జుట్టు చెదిరి ఉంది. అమ్మలు అడిగిన ప్రశ్నకు తినేసినట్లు చూశాడు. "ఏం? నీకు చెప్పాలా? చెబితే పోలీసులకి చెప్పాలనా?" అనడిగాడు.

అతడలా అనేసరికి అమ్మలుకి జ్వరం వచ్చేసినట్లయింది. అతనికేం జవాబు చెప్పాలో బోధపడలేదు. "అదేమిటి?, నేను పోలీసులకి చెప్పవలసిన అవసరం ఏమిటి? నాపనిమీద నేనొచ్చాను. ఇంతకీ మీరెవరు?" అడిగింది చొరవతో.

"పద... అనవసరంగా మాటాడకు. నేనెవరో, నీవెందుకొచ్చావో అన్నీ తెలుస్తాయి" అన్నాడు. మూడు కిలోమీటర్లు పైకి నడిచిన తరువాత మళ్ళీ లోయలాటి ప్రాంతంలోకి చరచరా నడుస్తున్నాడతడు. అతణ్ణనుసరించక తప్పలేదు అమ్మలుకి. నడిచినంతదూరం ఇంకా కనిపిస్తోంది. కింద చాలా లోతులో పిల్లలు ఆడుకోడానికి కట్టుకునే ఇసుక గూళ్ళలాగా కొన్ని ఇళ్ళు అక్కడక్కడా కనిపిస్తున్నాయి. దూరంనుండి వస్తోన్న వీళ్లని కిందనుండి వాళ్ళు హడావుడిగా చూడటం కనిపించింది. ఆ అలజడిని చూసి 'తాను మళ్ళీ మామూలు మనుషుల మధ్యకి వెళ్ళటం కల్ల' అనుకుంది అమ్మలు. భుజానికి తగిలించుకున్న బరువుతో నడవటానికి కష్టంగా ఉంది. "కాసేపు పట్టుకోవా?" అంది వెనకాతల ఉన్న కొండవారిని చూసి. భాష అర్థంకావటంవల్ల వాళ్ళు అమ్మలుచేతిలో వస్తువులు అందుకున్నారు. కొంత తేలికపడింది. ఆంజనేయస్వామిని తల్చుకుంది. వెంకన్నస్వామికి మొక్కుకుంది. సంతోషీమాతను తల్చుకుంది. షిర్డీ సాయిబాబాను వేడుకుంది. రాయగడ గౌరమ్మని స్తుతించింది - మనసు పొరల్లో భయాన్ని తొలగించుకొనేందుకు.

దిగువనున్న గమ్యాన్ని వేగిరంగానే చేరుకున్నారు. అక్కడ జనసంచారం లేదు. శబ్దంలేదు. ఎక్కడో ఏదో పిట్ట అరుస్తోంది. చెట్ల సందుల్లోంచి వచ్చిన గాలి భయంకరమైన పాటలా ఉంది. ముందు నడుస్తోన్న యువకుడు ఒక ఇంట్లోకి తీసుకెళ్ళాడు. "ఇలారా!" అన్నాడు. "ఈమె కళ్ళకి గుడ్డలు కట్టండి!" అని ఎవరినో ఆజ్ఞాపించాడు. ఇద్దరాడవాళ్ళొ




చ్చారు. కళ్ళుమూసుకోమని దూది పెట్టారు. ఒక టర్కీటవలు కళ్ళచుట్టూ కట్టారు. అమ్మలు దుఃఖం ఆపుకోలేకపోయింది. తండ్రి చని పోయినపుడు కూడా బయటకు ఏడిస్తే నవ్వుతారని సిగ్గుపడిన అమ్మలు బావురుమంది.

"నన్నొదలండి, నన్నొదలండి. నన్నెందుకిలా చేస్తున్నారు?" అని పెద్ద కేకలేసింది.

"ష్... గోలచెయ్యకు. నిన్ను మా గురువు ముందుకు తీసికెళ్తాం. అక్కడ నీ సంగతి చెప్పుకుందుగాని" అన్నాడతడు. ఆ తరువాత వాళ్ళెక్కడకోగానీ సుమారుగా మరో ముప్పావు గంట నడిపించారు. అప్పుడు కళ్ళకు కట్టిన గుడ్డలు విప్పారు.

కొంతసేపు కళ్ళముందేం కనిపించలేదు. చిమ్మచీకటి. రెండు చేతులతో, వేళ్ళతో రెప్పల మీద వొత్తుకుంది. ఎదురుగా ఒక పెద్ద బండరాయి ఉంది. దానిచుట్టూ చిన్న చిన్న బండ రాళ్ళున్నాయి. అక్కడ రౌండుటేబులు సమావేశం జరిగే తీరులా ఉంది. పెద్ద బండరాయి మీద కూర్చున్న వ్యక్తి అందరికీ గురువని అమ్మలుకు అర్థమయింది. అతను విలనులా లేడు. లుంగీ కట్టుకున్నాడు. ఫిల్టరు సిగరెట్టు కాలుస్తున్నాడు. అమ్మలువేపు తీక్షణంగా చూస్తున్నాడు.

"నన్నొదిలేయండి. నేనింతవరకూ డ్యూటీకి ఎగనామం పెట్టటం ఎరగనిదాన్ని. అందుకే ఎందరు వద్దన్నా వినకుండా వచ్చాను. నా డ్యూటీ నేను చేసుకోవటం తప్పని మీరంటే చెప్పండి. ఇక్కడ్నుంచి బదిలీ చేయించుకుంటాను. నన్ను వదిలేయండి. ప్లీజ్... మీకు చేతులెత్తి మొక్కుతాను" అన్నది అమ్మలు.

"నువ్వు నిజంగా డ్యూటీమీద వచ్చావని మాకు నమ్మకమేంటి?"

"ఇదిగో నా డైరీ. దీంట్లో నా టూర్‌ప్రోగ్రాం ఉంటుంది. ఇదిగో నా మెడికల్ కిట్. ఇవి నా రికార్డులు. ఇంతకన్నా మీకేంకావాలి?" అంది ఆవేశంగా.

"చూడమ్మా... మేం నిజాయితీగా పనిచేస్తోన్న ఉద్యోగులకు వ్యతిరేకులం కాము. ప్రజావ్యతిరేకులం కూడా కాము. నువ్వింత శ్రమకోర్చి, ఆడదానివయినా ఈ కొండల్లోకి రావటం మాకు అనుమానం రేకెత్తించింది. అయితే నువ్వు మామూలు ఉద్యోగినివని తెలిసి అభినందిస్తున్నాం. అయితే నీలాగే మమ్మల్ని నమ్మించి మోసంచేసిన సి.ఐ.డి. వాళ్ళెందరో గడపదాటకుండానే మా పరీక్షల్లో ఓడిపోయి హతులయ్యారు. మేం నమ్మకద్రోహాన్ని సహించం. నువ్వు నిజంగా నిజాయితీపరురాలైన ఉద్యోగినివే అయితే నిన్ను సురక్షితంగా నీ ఇంటికి పంపుతాం. భయపడకు" అన్నాడు. అనేసి, "నువ్వు సర్వీసులో చేరి ఎన్నాళ్ళయింది?" అని ప్రశ్నించాడతడు. అమ్మలు జవాబు చెప్పింది. "మీ తలిదండ్రులెవరు? ఏం చదువుకున్నావ్?" లాంటి ప్రశ్నలన్నీ వేసిన తరువాత ఒక స్త్రీని తోడిచ్చి ఒక గదిలోకి పంపారు. అక్కడామె అమ్మలుని పూర్తిగా వివస్త్రని చేసింది. చీర, లంగా, జాకెట్టు, బ్రా అన్నీ దులిపారు. పరిశీలించారు. మెడికల్ కిట్టు, బేగ్ అన్నీ తనిఖీచేశారు. రికార్డుల్లో ప్రతీ అక్షరం పరిశీలించారు. బట్టలేసుకోమన్నారు. అమ్మలు బట్టలు వేసుకుంది.

"ఎందుకిలా చేస్తున్నారు?" అడిగింది.

"నీదగ్గర మాకు సంబంధించిన ఏ అంశంకానీ ఉందేమోనని. లేదా టేప్‌రికార్డర్, ఫొటో, కెమేరాకానీ... మాకు అనుమానం కలిగించే ఏ వస్తువుకానీ అక్షరంకానీ కనిపించినా నిన్ను వదిలిపెట్టం" అన్నారు. అలా అన్న ఆడవాళ్ళు బాగా చదువుకున్నవాళ్ళే. వాళ్ళే మళ్ళీ బయటకు తీసుకొచ్చారు.

"మీపేరేమిటన్నారు?"

"అమ్మలు"

"అమ్మలుగారూ! మీరీ ప్రాంతానికొస్తున్నట్లు ఎవరికైనా తెలుసా?"

"తెలీదు"

"ఎందుకు చెప్పలేదు?"

"చెప్తే వాళ్ళు వెళ్ళొద్దంటారని. గతంలో - అంటే ఉద్యోగంలో చేరిన కొత్తలో రెండుమూడు సార్లు ప్రయత్నిస్తే వెళ్ళటం కష్టం వెళ్ళొద్దన్నారు. మా డాక్టరుగారు కూడా! అయితే వాళ్ళు దూరమనే వద్దన్నారుకానీ... ఇలా జరుగుతుందని చెప్పలేదు. బహుశః ఇంత దగ్గర్లో ఉంటారని వాళ్ళకూ తెలీదేమోమరి!" అంది కొంచెం భయం తగ్గటంచేతనే ఏమో ధైర్యంగా సమాధానం చెప్పింది.

"మీదగ్గరున్న మందులేమిటి?"

"పోలియో, డి.పి.టి., వాక్యుమ్సు, ఓ.ఆర్.ఎస్.ద్రావణం, ఏ.పి.సి. టాబ్లెట్లు, కొన్ని ఫామిలీప్లానింగ్ అయిటమ్సు"

"ప్రస్తుతం మీ రాకలో ఆంతర్యం?"

"ఇక్కడ ప్రజలు గేస్ట్రో ఎంట్రైటీస్ వ్యాధికి గురౌతున్నారని, మెదడువాపు వ్యాధితో చనిపోతున్నారని తెలిసింది. అయితే ఇక్కడ ఎవరు ఏమవుతున్నా అవి బయటకు రావు. కారణం - ఇక్కడనుంచీ కంప్లయింట్లుండవు. ఉంటేమాత్రం డి.ఎం.ఓ. దగ్గర్నుంచీ ఇక్కడే మకాం వేసేస్తారు"

"ఇక్కడనుండి కంప్లయింట్లు రావన్నది సత్యం. ఎందుకు రావో గ్రహించారు?"

"గ్రహించాను. వీళ్ళు విద్యావంతులు కాక పోవటంచేతనే"

"కరెక్టు... అంతేకాదు, వీళ్ళు పండించుకున్న పంటనీ, వీళ్ళు సాగుచేసుకుంటున్న భూమినీ కూడా వీళ్ళు తమవని గ్రహించలేని అమాయకులు. దోపిడీకి గురౌతోన్న ఇలాటి వీరి దగ్గరకి మీరు మీ సేవలందించటానికి రావటం గర్వించదగ్గవిషయం. ఉద్యోగస్తులందరూ మీలాగా పనిచేస్తే, ప్రజలందరూ నిజాయితీపరులే అయితే మాలాటివాళ్ళు ఉద్భవించరుకదా!" అన్నాడు అతడు. ముందు 'నువ్వు' అని సంబోధించిన అతను అమ్మలులో ఏ నిజాయితీని చూశాడో కానీ పూర్తిగా నమ్మకం కుదిరింది. అందుకే 'మీరు' అని సంబోధనలోకి మారాడు. గడ్డంతో ఉన్న యువకుని ముఖంలో ఇందాకటి కరకుతనం స్థానంలో ప్రసన్నత చోటుచేసుకుంది.

"నేనో ప్రశ్న వేస్తా. క్షమిస్తారా? ఆ కొండలాటిది ప్రభుత్వం. మీరు శిరస్త్రాణం లేకుండా కొండను ఢీకొంటున్నారు. గ్రహించారా?" అంది అమ్మలు.

"మంచి ప్రశ్న వేశారు. గడ్డిపరకలుసైతం మదపుటేనుగును బంధించాయని ఎప్పుడో చదువుకున్నాం. మీరు చదువుకునే ఉంటారు. గుర్తుందా?" అన్నాడు.

"రక్తపాతం సృష్టించి శ్మశానంలో శాంతి కోసమా మీ పోరాటం? గాంధీ పుట్టిన ఈ దేశంలో, బుద్ధుడు వెలసిన ఈ దేశంలో తుపాకీ విప్లవం సాధ్యపడుతుందనేనా మీ విశ్వాసం?"

తనకంత మాటలొస్తాయని అమ్మలెప్పుడూ అనుకోనేలేదసలు.

అతను నవ్వాడు. "అన్నిటికీ కాలమే జవాబు ఇస్తుంది" అన్నాడు.

అంతలో "దొరా! మల్లమ్మకి నెప్పులొస్తన్నయ్" అన్నాడు ఓ కొండదొర.

అలవాటుగా అమ్మలు పరుగెత్తింది, కిట్ పట్టుకుని. అక్కడ మల్లమ్మ మెలికలు తిరిగిపోతోంది. గబగబా సిరంజ్ తీసింది. వేణ్ణీళ్ళు తెమ్మంది. బాగా స్టెరిలైజ్ చేసింది. సిరంజ్ లోడ్ చేసి ఇంజక్షన్ చేసింది. తిన్నగా పడుకోమంది. రెండు కాళ్ళూ ఎడం చేసింది. పరీక్ష చేసింది. డెలివరీ టైం దగ్గర పడింది. బహుశ కొద్దిసేపట్లో డెలివరీ కావచ్చు. పొత్తికడుపు దగ్గర, నడుము దగ్గరా రాసింది. "ఇదే ప్రధమ కాన్పా?" అడిగింది.

అవునన్నాడు గురువు.

"ఈమె ఎవరు? మీ కేమవుతుంది?"

"మల్లమ్మ నా కూతురే. నాతోపాటే ఉద్యమంలోకి వస్తానంది. సరేనన్నాను. అల్లుడు ప్రస్తుతం పోలీసు కస్టడీలో ఉన్నాడు" అన్నాడతను. అతనన్ని విషయాలు చెప్పటం అమ్మలుకి ఆశ్చర్యం వేసింది. మల్లమ్మ ప్రసవవేదన భరించలేకపోతోంది. "ఏం ఫరవాలేదు. డెలివరీ ఈజీగా అవుతుంది" అని రెండు చేతులూ ఇద్దరాడాళ్ళని గట్టిగా పట్టుకోమంది. కాళ్ళని వెడల్పు చేసింది. మళ్ళీ మరో ఇంజక్షన్ ఇచ్చింది. శిశువు బయటపడింది.

"మగబిడ్డ" గట్టిగా అరిచింది అమ్మలు.

గురువు పరుగెత్తుకొచ్చాడు.

"థాంక్సమ్మా... మీకు చాలా థాంక్సు. మీరిలాగా వస్తారని మేం ఊహించలేదు"

"దైవం నన్ను ఇలా పంపింది"

"మేం మంచి మనుషులనే నమ్ముతాం. దైవాన్ని నమ్మం" అన్నాడు.

అక్కడి కార్యక్రమాలు పూర్తిగా జరిగినంత వరకూ ఉండి "నన్ను వెళ్ళటానికి అనుమతిస్తారా?" అడిగింది.

"తప్పకుండా! వీరేష్... అమ్మని సాగనంపిరా. అమ్మా! ఇదిగో మీ ఫీజు" అని




అతను ఏదో అందివ్వబోయాడు.

"నో థాంక్స్. నేనిక్కడే కాదు. ఎవరి దగ్గరా పుచ్చుకోను. ఇది నా డ్యూటీ" అంది.

"వస్తా" అని వెళ్ళబోతుంటే "అనుకోని విధంగా అతిథి అయారు ఉండండి" అని ఒక గిరిజనుణ్ణి పిలిచి బుట్టడు శీతాఫలాలు ఇచ్చాడు. వాటిని పట్టుకొని వెళ్లమని ఒక మనిషిని పురమాయించాడు.

అతనిలో అమ్మలుకి మనిషి కనిపించాడు. అతడప్పుడు వివేకం ఉన్న పులిలా కనిపించాడు.

"చిన్న హెల్ప్ చేస్తారా?"

"చెప్పండి"

"మాకు కొంత కాటన్ కొన్ని మందులూ కావాలి. మా వాళ్లు టౌన్‌కి వెళ్ళటానికి వీలు లేని పరిస్థితులు. రేపు ఇవి ఎలాగైనా మాకు చేర్చాలి. మా మనిషి వస్తాడు. బైదిబై చివరిగా ఓ మాట. మీరు మాకు స్నేహితులు అయారు. అయినా మీకు వార్నింగ్ కాకపోయినా వార్నింగే. మీరు ప్రమాదం దాటామని మా రహస్యాన్ని మా స్థావరాన్ని బయటపెట్టారో మీకూ మీ కుటుంబానికీ అత్యంత ప్రమాదం. ఇలా అనవలసి వస్తున్నందుకు మరోలా భావించకండి" అన్నాడతను.

అమ్మలు కృతజ్ఞతగా నమస్కరించింది.

ఇంటికొచ్చేసరికి రమీజా లేదు. తన వెనుక సీతాఫలాలు తెచ్చినవాని బుట్టలో కొన్ని తన దగ్గరున్న మందులు, లోషన్లు, ఆయింట్ మెంట్లూ, కాటన్ ఇచ్చిపంపింది.

రమీజా వచ్చాక అంతా తెలుసుకుంది. ప్రభుత్వం సప్లయి చేసిన మందులు ఇచ్చి పంపినందుకు చీవాట్లు పెట్టింది. ఇప్పుడే వస్తానని వెళ్లి తనేమి మందులు, బాటిల్సూ ఇచ్చిందో అన్నీ మోసుకొచ్చింది ఎక్కణ్ణుంచో!

"అసలేంటి నీ భయం?"

"అమ్మలూ! నీకు తెలీదు. నువ్వు చేసినది చాలా సాహసం. దానిక్కి తోడు రెడ్ హాండెడ్‌గా దొరికిపోతావ్. నువ్వు వాళ్లకి వైద్యం చేశావనుకోరు. వాళ్ళకి సాయం చేశావనుకుంటారు. పొరపాటున పోలీసు రైడింగ్‌లో ఇవేం బయటపడినా నిన్నమాంతం మూసేస్తారు" అంది.

రమీజా మాటలు విన్నాక అమ్మలుకి తను చేసిన పొరపాటేమిటో తెలిసింది. కానీ అప్పటికే చేజారిపోయింది.

రాత్రి అమ్మలు ప్రొద్దున్న జరిగిన సంఘటనలు ఒక్కొక్కటే పూస గుచ్చినట్లు చెప్పింది. ఏ అర్ధరాత్రికో నిద్ర పట్టేసింది. ఉదయం ఎవరో తలుపులు టకటకా బాదుతుంటే తెలివొచ్చింది. తలుపు తీసి చూసేసరికి ఒళ్లు ఝల్లుమంది. ఎదురుగుండా ఇద్దరు కానిస్టేబుల్స్.

రమీజా గబగబా వచ్చింది.

"రమీజా! నువ్వా!"

"అవును... ఏమయింది?"

"అమ్మలంటే ఎవరు?"

"అసలేం జరిగింది?"

"ఎస్.ఐ.గారు తీసుకురమ్మన్నారు"

అమ్మలు నిలువునా కూలబడిపోయింది. రమీజా పూర్తి సమాచారం సేకరించింది. నిన్న బుట్టలో మందులని పెట్టి తీసుకెళ్తోన్న గిరిజనుణ్ణి పోలీసులు పట్టుకున్నారు. అయితే గిరిజనుణ్ణి ఎంత అడిగినా వాడు ఆ మందులెవరిచ్చారో చెప్పలేదు. వాడీలోగా కానిస్టేబుల్ని కొరికి, రక్కి పారిపోయాడు. పోలీస్ ఇన్వెస్టిగేషన్‌లో అమ్మలనే ఎ.ఎన్.ఎమ్ ఆ ప్రాంతం వెళ్లినట్లు, ఈ మందులామె ద్వారానే సప్లయి అవుతున్నట్లు అనుమానం కలిగింది, అని చెప్పకూడని సమాచారం రమీజాకందించాడు.

రమీజా అమ్మలుకి ధైర్యం చెప్పింది.

అమ్మలు పోలీస్ స్టేషన్‌కి వెళ్లింది. రమీజా వెంట నడిచింది. ఎస్సై అమ్మలుని చాలా ప్రశ్నలు వేశాడు. వెళ్ళినందుకు చీవాట్లు పెట్టాడు. అన్నీ చెప్పి మందులు మాత్రం తనివ్వలేదంది అమ్మలు. ఎస్సై నమ్మకం కుదరక ఇంటికొచ్చి తన దగ్గరున్న స్టాక్ వెరిఫై చేశాడు. సరిపోయింది. అయినా వార్నింగిచ్చి వెళ్ళాడు.

రమీజా తెలివిగా ముందే స్టాక్ తెచ్చి ఉంచకపోతే అమ్మలు చాలా ప్రమాదంలో చిక్కుకుని ఉండేదే. అదెప్పుడూ మరిచిపోలేదు అమ్మలు. రమీజాతో తన అనుబంధం గురించిన గతం అమ్మలుకి ఎండవల్ల, నడకవ

ల్ల వచ్చిన కష్టాన్ని మరిపించి ఊళ్లోకి చేర్చింది.



ఊర్లోకి చేరుకోగానే ఎప్పటిలాగే తన పనిలో తను లీనమైంది. గర్భిణీ స్త్రీలకు టి.టి. ఇంజక్షన్లు కొంతమందికి బూస్టర్‌డోస్‌లు ఇచ్చింది. పిల్లలకు జ్వరం వస్తే పేరసట్మాల్ సిరప్పూ, మాత్రలూ ఇచ్చింది. సాధారణంగా పల్లెటూళ్లలో గర్భిణీ స్త్రీలు తాము తీసుకోవాల్సిన జాగ్రత్తలను సరిగా పాటించరు. వీళ్ళలో ఆహారలోపం ఒకటి ప్రముఖ సమస్యగా కనిపిస్తుంది. దీనికి తోడు వైద్యం మీద, ఆరోగ్య సూత్రాలమీదా, ఆరోగ్య కార్యకర్తలమీద సరియైన అవగాహన ఉండదు వీరికి. ఆ మాత్రల మీద నమ్మకం ఉండదు. ఆ ధర్మాసుపత్రిలో ఇచ్చిన మందులు తింటే జబ్బులు నయం కావనేది వీళ్ళలో ప్రబలంగా నాటుకుపోయిన అపనమ్మకం. దీన్ని దృఢతరం చేస్తారు హెల్త్ గైడ్లు. పల్లెల్లో కనీస వైద్య సౌకర్యాలు కల్పించే ఉద్దేశంతో ప్రభుత్వం హెల్త్ గైడ్లను నియమించింది. వీరి పని కలరా, గేస్ట్రో ఎంట్రైటీస్, మెదడు వాపు వ్యాధి మొదలయిన వ్యాధులు సోకినపుడు ప్రమాదం కలగకుండా దగ్గర్లో ఉన్న ఎ.ఎన్.ఎమ్ (వీళ్ళనిప్పుడు ఎం.పి.హెచ్. అసిస్టెంటులు అంటారు)లకు గాని, ఆసుపత్రికిగానీ తెలియపర్చటం ఒక్కటే. కానీ విచిత్రం ఏమిటంటే వీళ్ళు పల్లెల్లో అమాయక ప్రజల అజ్ఞానాన్ని సొమ్ము చేసుకుని బతుకుతున్నారు. గవర్నమెంటు తమనే డాక్టర్లుగా నియమించిందని ఫోజు కొడతారు. పట్నంలో ఏ డాక్టరుతోనో, మెడికల్ ప్రాక్టీషనర్‌తోనో పరోక్ష సంబంధాలు పెట్టుకుంటారు. వీళ్ళే ఇంజక్షన్లు చేసేస్తారు. మాత్రలు ఇచ్చేస్తారు. వ్యాధి ముదిరి చెయ్యి దాటిపోతే వాళ్ళు డాక్టరుగారి దగ్గరకు తీసుకెళ్ళి సొమ్ము గుంజుతారు. సొమ్ములేనివాళ్ళని గాలికి వదులుతారు. వీళ్ళు చేసే నిర్వాకం ఇంకా ఏమిటంటే ధర్మాసుపత్రికెళ్తే మృత్యువు నోట్లో తల దూర్చటమేనని, వాళ్ళు ఇస్తున్న మందుల్లో కూడా పవరుండదని లేకపోతే ఆ మందుల కాలపరిమితి దాటిపోయిందని అబద్ధాలు చెపుతారు. కొన్ని చోట్లకి ఎవరూ ఆస్పత్రి సిబ్బంది ఎప్పుడోకాని వెళ్ళకపోవటంతో వీళ్ళదే ఇష్టారాజ్యం అవుతుంది. ప్రజల్ని వీళ్ళు బలిపశువులుగా వాడుకుంటారు. అయితే గమ్మత్తేమిటంటే గొర్రి కసాయివాణ్ణే నమ్ముతుందని ప్రజలు కూడా వీళ్ళనే నమ్ముతారు. అందుకు కారణం ఊళ్ళో వీళ్ళకున్న రాజకీయపు దన్ను.

సరిగ్గా మొదట్లో అమ్మలుకి ఇదే పరిస్థితి ఎదురైంది. ఆ సబ్ సెంటరుకి బదిలీ అయిన క్రొత్తలో వాళ్ళతో చాలా ఇబ్బంది పడింది. ఆమె ఇచ్చిన మందులు వాడేవారుకాదు. చెప్పిన మాట వినేవారుకాదు. అయితే పట్టుదలతో వారానికి రెండు, మూడుసార్లు వెళ్ళి వాళ్ళ బాగోగులు కనుక్కొని వాళ్ళకి వైద్యం చేసేది. మొదట్లో వాళ్ళు డబ్బులిచ్చేవారు. వాళ్ళని వద్దని వారించింది. హెల్త్ గైడుగా ఆ ఊర్లో పనిచేస్తోన్న వ్యక్తి గురించి తెలుసుకుంది. పిల్చి రెండుసార్లు కాషనిచ్చింది. అతడు తల బిరుసుగా సమాధానం ఇచ్చాడు. ఇలాగయితే నీ మీద డాక్టరుకి, డి.ఎం.ఓకి కంప్లయింట్ చేస్తానని బెదిరించింది. అప్పుడు దారికొచ్చాడు. ఇలా కొన్నాళ్ళు గడిచేసరికి అమ్మలంటే అక్కడ పల్లె ప్రజల్లో గురికుదిరింది. ఇక ఏ రాత్రయినా, వాళ్ళకే చికాకు చేసినా పరుగెత్తుకుంటూ వస్తారు. ఎంత వద్దంటున్నా వినక వాళ్ళు రోగ విముక్తులైనందుకు సంతోష చిహ్నంగా స్వల్పకానుకలు ఫలరూపేణానో, కూరగాయల రూపంలోనో తెచ్చి ఇస్తారు.

ఆ కారణంచేత నెలకిన్నని ఫామిలీ ప్లానింగ్ కేసులని తీసుకెళ్లటం కూడా ఆమెకంత కష్టమనిపించేదికాదు. అందరూ అమ్మలుని చూసి అసూయపడేవారు. నెలకి రెండు మూడ




యినా తీసుకెళ్ళాలి. ప్రభుత్వం ఎన్ని పథకాలు పెడుతున్నా ఎంత ప్రచారం చేస్తోన్నా కుటుంబసంక్షేమం గురించి ప్రజల్లో ఇంకా సరియైన అవగాహన మాత్రంలేదు. ఆడవాళ్ళు ఆపరేషన్ చేసుకుంటే శరీరం లావయిపోతుందని, నడ్డినొప్పి వచ్చేస్తుందని, మగాళ్లు చేయించుకుంటే లైంగిక సంపర్కానికి పనికి రారని అపోహలు బాగా వ్యాపించి ఉన్నాయి. ఎ.ఎన్.ఎమ్‌లు చేయాల్సిన ముఖ్యమైన విధి ప్రజల్ని ఒప్పించి కుటుంబ సంక్షేమ శస్త్ర చికిత్సలకు ప్రోత్సహించటమే. ఆ విషయంలో అమ్మలు ఎంతో కృతకృత్యురాలయింది. అప్పటికే ఇద్దరు, ముగ్గురు పిల్లలతో ఉన్నవాళ్లని ఆపరేషన్‌కి ఒప్పించి, వాళ్ళని ఫలానా తేదీన పి.హెచ్.సికీ రమ్మని చెప్పి, ఆ రోజు తన పనిని ముగించుకుంది.

అప్పటికి పన్నెండు దాటిపోయింది.

బస్సు టైమయిందని స్పీడుగా నడుచుకుంటూ వెళ్ళిపోతోంది.

"ఏయ్ పిల్లా! నిన్నే ఆగు" చప్పట్లు కొడుతూ ఎవరో పిలిస్తే తనని కాదని ముందుకు నడిచినా "ఏయ్ ఎ.ఎన్.ఎమ్. పిల్లా. ఆగు" అన్న కేక వినిపించింది. ఆ పిలుపు బాధ కలిగించినా ఆగింది.

వస్తున్న దారిలో దారికి రెండు పక్కలా పెద్ద మామిడితోటలు. ఆ తోటలో వాలుకుర్చీలో కూర్చున్న మనిషి ఆ ఊరికి సర్పంచ్. ఆరడుగుల మనిషి. కండలు తిరిగిన మనిషి. మనిషి నల్లగా నల్లరాతితో చెక్కిన శిల్పంలా ఉన్నాడు. బుర్రమీసాలు అతని పొగరునీ అధికార దర్పాన్నీ చాటుతున్నాయి. తెల్లని పాల మీగడ లాంటి పోలిస్టరు పంచకట్టుకున్నాడు. విశాలమైన ఛాతీ కనిపించేందుకు ఏమో కట్ బనీను వేసుకున్నాడు. షర్టు విప్పి బుజంమీద వేసుకున్నాడు. మెడలో బంగారు ఛెయిన్ ఉంది. రెండు చేతులకీ, బొటనవేలుకి తప్ప తులం ఎత్తు ఉంగరాలున్నాయి. అతని చుట్టూ వందిమాగధుల్లా అతని అనుచరులున్నారు. దగ్గర్లోనే చేతులు నులుముకుంటూ హెల్త్ గైడున్నాడు. అమ్మలు వెళ్ళింది. సర్పంచ్ అని తెలుసుకాబట్టి నమస్కారం చేసింది.

"ఈ ఊరొచ్చి ఎన్నాళ్ళయింది?" అడిగాడు.

"వారానికి రెండుసార్లు వస్తున్నా"

"అది కాదు నేనడిగేది. ఈ ఊరికి బదిలీ మీద వచ్చి ఎన్నాళ్ళయిందని"

"నెల రోజులయింది"

"మరి నెల రోజులయి వచ్చి నన్ను కలుసుకోలేదేం?"

"అవసరంలేక" ముక్తసరిగా జవాబుచెప్పింది.

"మళ్ళెప్పుడొస్తావ్?"

"ఎందుకని?"

"వచ్చినపుడు నన్ను కలుసుకో!" అది అజ్ఞలా వినిపించింది.

"సరే... అలాగే" అని అంతకంటే ఎక్కువ మాట్లాడేందుకు ఆమెకు ఓపిక కూడా లేదు. వస్తానని వెళ్ళిపోబోతుంటే "ఒరే, ఆసారీ! అమ్మకి కొబ్బరి బొండాం పట్రా" అన్నాడు. వద్దనాలనుకుంది గొప్ప దాహంగా ఉండటం వల్ల కాదనలేకపోయింది. అదే ఆమె చేసిన పొరపాటని తరువాత తెలిసిందామెకు.

★ ★ ★

ఆరోజు ఆ పరిషత్ హెల్త్ సెంటర్లో స్టాఫ్ మీటింగ్. ప్రతినెలా ఆ నెలలో ఇరవై నాలుగో తారీఖున అక్కడ మీటింగ్ జరుగుతుంటుంది. ఆ సమావేశానికి ఆ పి.హెచ్.సి.కి చెందిన ఎ.ఎన్.ఎమ్‌లు, హెచ్వీలు, హెచ్చెస్‌లూ, హెల్త్ అసిస్టెంట్లూ, బి.ఇ. (ఇప్పుడు డిజిగ్నేషన్ మారింది. ఎం.పి.హెచ్.ఇ.ఓ)లూ తప్పనిసరిగా హాజరుకావాలి. మెడికల్ ఆఫీసరు మీటింగ్‌ని ప్రిసైడు చేస్తారు. మెడికలు ఆఫీసరు లేని పక్షంలో బి.ఇ. హాజరై ప్రిసైడు చేస్తాడు. ఆ నెలలో ఎన్ని ఫామిలీ ప్లానింగ్ కేసులు నమోదయాయో, ఎంతమందికి నిరోధులూ, ఓరలు పిల్సూ పంపకాలు జరిగాయో మొదలైన రికార్డంతా ఎ.ఎన్.ఎమ్‌లూ హెల్త సిస్టెంట్లూ తీసుకొస్తారు. హెచ్వీలు, హెచ్చెస్‌లూ రికార్డు తనిఖీ చేస్తారు. తక్కిన విషయాల్లో కొంత అశ్రద్ధనీ జాప్యాన్ని సహించినా కుటుంబ సంక్షేమ కార్యక్రమాల్లో మాత్రం నిర్లక్ష్యాన్నీ జాప్యాన్ని సహించరు. నెలకి ఆరు కుటుంబనియంత్రణ కేసులయినా బుక్ చేయాలి. కనీసం రెండు మూడయినా చేయాలి.

ఆరు కేసులని తేనివాళ్ళని హెచ్చరిస్తారు. అంతకంటే తక్కువ కేసుల్ని తీసుకెళ్ళిన వాళ్ళ ని మందలిస్తారు. అసలు ఏ కేసునీ ఆ నెలలో చేపట్టనివాళ్ళకి ఇంక్రిమెంట్లు కూడా స్టాప్ చేస్తారు. ఇలా కొన్నాళ్లు జరిగితే వాళ్ళమీద చర్యలు కూడా తీసుకుంటారు. సాధారణంగా కుటుంబ సంక్షేమ ఆపరేషన్లవల్లనే తగు వంతా వస్తుంది. ఈ బాధ్యత ఒక్క హెల్త్ సిబ్బందికి మాత్రమే ప్రభుత్వం పరిమితం చేయటం లేదు. రివెన్యూ అధికార్లకీ, మండల అధికార్లకీ, చివరకు మండల పరిధిలో పనిచే స్తోన్న ఉపాధ్యాయులకు కూడా ఈ పనులనప్ప గిస్తుంటుంది. అక్కడే హెల్త్ సిబ్బంది బాధప డుతుంటారు. ఎక్కువగా ప్రజల ఆరోగ్య విష యాలతో సంబంధ బాంధవ్యాలు కలిగి ఉన్న వాళ్ళు వైద్య ఆరోగ్య సిబ్బంది. నెలంతా కష్టపడి, గర్భిణీ ఉన్నపుడు తగిన జాగ్రత్తలు తీసుకొని, వాళ్ళకి మందులు సరఫరాచేసి, వాళ్ళకి ఆపరేషన్ మీదున్న అపోహల్ను తొల గించి సిద్ధం చేస్తారు. ఇంతలో ఏ రెవెన్యూ అధికార్లో వస్తారు. ఆపరేషన్ చేసుకున్న వాళ్ళకి పట్టాలో, ఇళ్ళ స్థలాలో, ఋణాలో ఇస్తామని ఆశ చూపెడతారు. ప్రజలు పాలోమని అటువేపు పరుగెడతారు. ఆసుపత్రి సిబ్బంది అయితే తామిస్తోన్న సాధారణ పారితోషికం తప్ప, ఇంకేం ఇవ్వగలరు. అందుకే ఈ ఆపరేషన్లు హెల్త్ సిబ్బంది పాలిట యమ దండంలా తయారవుతున్నాయి. ఏ నెల కేసులు బుక్కవ వో, జీతాలాగిపోతాయో అన్న ఆందోళన వీరికి నిద్రకూడా పట్టనివ్వదు. దీనివల్లనే వీళ్ళు తక్కిన విధుల్ని కూడా సరిగా చేసుకోడానికి కుదరదు.



హాస్పిటలు ఆవరణంతా హడావుడిగా ఉంది. ఆసుపత్రి ఆవరణలో ఉన్న విశాలమైన ఊడలమర్రి కింద ఎ.ఎన్.ఎమ్‌లు అందరూ కబుర్లు చెప్పుకుంటున్నారు. నీ కోటా పూర్తయి పోయిందా? అని ఒకరంటే నీ కోటా పూర్తయిపో యిందా? అని ఇంకొకరు ప్రశ్నించుకుంటున్నా రు. 'నువ్వెంత మందిని బల్లెక్కించావు' అని ఒకరంటే 'నువ్వెంతమందిని కోయించావు?' అని ఇంకొకరు జోకు లేసుకుంటున్నారు. వీళ్ళ ందరికీ దూరంగా ఆరోజు పేపరు చదువుతు న్న అమ్మలు ఆరోజు పడిన ప్రత్యేక బాక్సు న్యూస్‌ను ఆత్రంగా చదువుతోంది. ఇంతలో రమీజా వచ్చిందక్కడికి.

"హాయ్! ఏమిటీ అందరూ అక్కడుంటే నువ్వొక్కర్తివీ పేపర్లో మునిగిపోయావ్. ముందొ చ్చిన దానివి ఇంటికి రావచ్చుగా" అంది.

అమ్మలు ముఖం వాడిపోయి ఉంది.

"రమీ! చాలా ఘోరం జరిగిపోయింది. మరియమ్మ ఆత్మహత్య చేసుకుంది. మరియ మ్మ తెలుసుగా! మనతో కొన్నాళ్ళు పనిచేసి కోసూరు పి.హెచ్.సి.కి వెళ్ళిపోయింది!" అంది.

"ఆఁ..." అని చేతిలో పేపరు తీసుకుంది. అంతలోనే హెచ్.వి., హెచ్.ఎస్ ఒక్కొక్కరూ అక్కడికి చేరుకోవటం, ఆ వార్త అందరికీ రవ్వ గచ్చుమీద నూనెలా జారింది. అందరూ ఆత్రంగా ఆ వార్త కోసం 'ఏదీ, ఏదీ?' అని ముందుకు ఉరికి వస్తున్నారు. రమీజా మరెందుకని గట్టిగా చదవడం మొదలెట్టింది.

"కోసూరు పి.హెచ్.సికి చెందిన పి.మరియ మ్మ అనే ఎ.ఎన్.ఎమ్. తనగదిలో ఫానుకు ఉరిపోసుకుని ఆత్మహత్య చేసుకుంది. ఆమె ఆత్మహత్య చేసుకోడానికి కేవలం తన వ్యక్తిగత సమస్యలేనని ఆమె టేబిలు మీద ఒక చీటీ రాసి ఉంచింది. అయితే అది ఆమె దస్తూ రిలా లేదని కేసును పరిశీలిస్తోన్న ఎస్.ఐ. శ్రీహరిరావు విలేఖరులకు వివరించారు. గ్రామ స్థుల కథనం మరోలా ఉంది. కోసూరు గ్రామ సర్పంచ్ అప్పలరాజు కూతురు మంగళగౌరి, అదే గ్రామానికి చెందిన ప్రముఖ భూస్వామి వెంకన్నచౌదరి కుమారునితో కొన్నాళ్ళుగా అక్రమ సంబంధం ఉన్నట్టు మంగళగౌరి వెంకన్న కుమారుడు జగదీశ్వరచౌదరివల్ల గర్భిణి కూడా అయినట్టు తెలిసింది. అయితే ఆ విషయం తెలిసికున్న సర్పంచ్ అప్పల రాజు ఎ.ఎన్.ఎమ్‌ని పిలిచి ఎబార్షన్ చే యించమని కోరగా, అందుకు మరియమ్మ తిరస్కరించింది. అబార్షన్ చేసే అర్హత తనకు లేదని, హాస్పిటల్‌కి తీసుకెళ్ళి మాత్రం అబా ర్షన్ చేయించగలనని హామీ ఇచ్చింది. ఇందుకు అప్పలరాజు అంగీకరించక అబా ర్షన్ చెయ్యకపోతే నీ అంతుచూస్తానని బెది రించాడు. ఆ రాత్రి కొంతమంది దుండగులు వంట చేసుకుంటున్న మరియమ్మ గదిలోకి బలవంతంగా దూరి ఆమె గోలపెడుతుంటే నోట్లో గుడ్డలు కుక్కి అప్పలరాజు ఇంటికి తీసుకెళ్ళారు. ఆమె మంగళగౌరిని పరీక్షించి అయిదో నెల గర్భిణి కావటంవల్ల అబార్షన్ చేస్తే ప్రమాదకర పరిస్థితులకు దారితీయవ చ్చునని చెప్పింది. అయినా సరేనని బల వంతం చేస్తే అబార్షన్ చేయటానికి ఉపక్ర మించింది. అయితే అయిదో నెల కావటం వలన అబార్షన్ ఫెయిలయి మంగళగౌరి మర ణించింది. ఈ వార్త తెలియగానే అప్పలరాజు ఆవేశంతో రెచ్చిపోయి మరియమ్మ మీద చేయి చేసుకోవటమేగాక నాకు తెలీకుండా నువ్వే అబార్షన్‌కు పూనుకొని నా కూతుర్ని పొట్టన పెట్టుకున్నావని నీ మీద కంప్లయింట్ ఇచ్చి నిన్ను కటకటాల వెనక్కు పంపించగలనని బెదిరించగా, తన ఉద్యోగంపోయి, జైలు పాల వ్వాల్సి వస్తుందనే భయంతో ఆత్మహత్య చేసు కుందని ఆనోటా ఈనోటా అనుకుంటున్నారు. ఇదిలా ఉండగా మంగళగౌరి అబార్షన్ ఫెయి లయి చనిపోవటం అబద్ధం అని జగదీశ్వరచౌ దరితో లేచిపోవటానికి సిద్ధంగా ఉన్న ఆమెను అన్నదమ్ములు కర్రతో కొట్టగా ఆ పరిస్థితుల్లో అబార్షన్ అయిందని, ముందు చెప్పిన అబా ర్షన్ చేయడానికి నిరాకరించిన కారణంగా మరియమ్మని అప్పలరాజు కొడుకులే కొట్టి చంపారని మరిందరి కథనం. అబార్షన్ చే యించటం యదార్థమేనని అయితే అవమా నాన్ని భరించలేని మంగళగౌరి ముందుగా ఎండ్రిన్ తాగిందని, ఎండ్రిన్ తాగిన కార ణంగానే మంగళగౌరి మరణించిందని అందు కే విషయం బయటపడకుండా శవదహనం చేయించారని మరికొందరివార్త. అప్పలరాజు

మాత్రం ఇవేవీ యదార్థంకాదని తన కూతురికి రెండు రోజులుగా జ్వరం వచ్చిందని మరియమ్మ రావటం, ఇంజక్షన్ చేయటం జరిగిందని, తను ఈరోజే ఊర్నించి రావటం చేత రేపు టౌను తీసుకెళ్ళి చూపెడదామనుకున్నానని అర్థరాత్రి దాటాక తన కూతురుకి ధనుర్వాతం రావటం, ఆయుర్వేద వైద్యం చేయించటం జరిగిందని అయినా ఫలితం లేకపోయిందని విలేఖరులకు స్వయంగా చెపుతూ తనను రాజకీయంగా దెబ్బతీయాలని కొందరు పనిగట్టుకుని ఇలాటి పుకార్లు ప్రచారం చేస్తున్నారని కూతురు మరణంతో కృంగిపోతున్న తనమీదా నిష్కలంకమైన తన కూతురి శీలం మీదా బురద జల్లే ప్రయత్నం చేయటం విచారకరమని అన్నారు. తన కూతురు అసలు గుమ్మందాటే ఎరుగదని కూడా అన్నారు. కానీ జగదీశ్వరచౌదరి మాత్రం, అప్పలరాజు చెప్పింది తప్పుడు సమాచారం అని, తనూ మంగళగౌరీ తీయించుకున్న ఫొటోలు, తనను మరిచిపోయి వేరే వ్యక్తితో వివాహం చేసుకోమని చిత్రహింసలు చేస్తున్నట్లు రాసిన ఉత్తరాలు విలేఖరుల దృష్టికి తీసుకొచ్చారు. అందువల్ల మరియమ్మది కూడా ఆత్మహత్య అని తను నమ్మలేకపోతున్నాని, పోలీసులతో కుమ్మక్కయి కేసును మాపు చేయకుండా సమగ్ర దర్యాప్తు చేయించవలసినదిగా ఎమ్మెల్యేకి హెూం మినిష్టరుకు, సి.ఎమ్‌కీ తను పిటిషన్ పెడుతున్నట్టు, తనకు రక్షణ కల్పించాల్సిందిగా కలెక్టరును, ఎస్పీని కోరనున్నట్లు విలేఖర్లకు వివరించారు. గత రెండు రోజులుగా కోసూరులో 144 సెక్షన్ అమలులో వుంది. వచ్చేపోయే అధికార్లతో గ్రామం కిటకిట లాడుతోంది. ఈ విషయమై పోలీసు అధికార్లను వివరణకోరగా కేసును పూర్తిగా పరిశీలించిన మీదటగాని ఏమీ చెప్పలేనని అంటున్నారు'' అని చదివింది.

ఆ వార్త చదవగానే అందరికళ్లూ చెమ్మగిల్లాయి.

రమీజా మనసు పువ్వుకంటే కోమలమయింది కావటం చేతా, మరియమ్మ జీవితం కొంతవరకూ తెలిసి ఉండటం చేత వస్తోన్న దుఃఖం ఆపుకోలేకపోయింది. పమిట చెరగును నోట్లో పెట్టుకుని పొంగివస్తోన్న దుఃఖాన్ని దిగమింగుకుంది.

''మరియమ్మ చాలా మంచిపిల్ల. ఎప్పుడూ ఎవరి జోలికీ వెళ్లేదికాదు. జీవితంలో అన్నీ ఎదురు దెబ్బలే తింది'' అంది అమ్ములు.

''నీకు తెలుసా?'' అడిగింది హెచ్చీ.

''నేనూ మరియమ్మ, రమీజా కలిసి పని చేశాం''

''అలాగా! ఆవిడకున్న సమస్యలేంటనలు?''

''ఒకటేమిటి? అన్నీసమస్యలే. హరిజన కుటుంబంలో పుట్టింది. ఏదో క్రిష్టియన్ సంస్థ చదివిస్తామంటే మతంలో చేరింది. చిన్నప్పుడే తల్లి చనిపోయింది. ఉద్యోగంలో చేరాక తండ్రి లారీ క్రింద పడి మరణించాడు. ఒక హెల్త్ గైడు ప్రేమిస్తున్నానని, నువ్వు కాదంటే విషం త్రాగి మరణిస్తానని బెదిరించగా నిజమని నమ్మి మోసపోయింది. సర్వం అర్పించుకుంది. తరువాత పెళ్లి చేసుకున్నా రోజూ త్రాగి వచ్చి ఏదో అనుమానంతో చాకిరేవు పెట్టేవాడు. డబ్బంతా అతని చేతిలో పోసేది. సొమ్మంతా వారం రోజులలోనే ఖర్చు చేసేసి ఇంకా తెమ్మనేవాడు. ఎంత దూరంలోనుంచి వచ్చి ఎవరు డెలివరీ కేసుందని పిలిచినా వెళ్లి వాళ్ళిచ్చిన డబ్బులు తెచ్చి భర్త చేతిలో పెట్టేది. డబ్బులు తెచ్చినపుడు మెచ్చి మేకతోలు కప్పేవాడు. మరియమ్మలో మంచి గుణం ఏమంటే ఎంతిస్తే అంతే పుచ్చుకునేది. ఇవ్వకపోతే అడిగేది కాదు. అలా ఉత్తి చేతులతో వచ్చినపుడు 'నువ్వు డబ్బుల్ని ఇంకెవడికో ఇచ్చి ఎవడినో మరిగావ్' అని గోడకేసి బాదేసేవాడు. ఒకసారి కర్రతో కొట్టేశాడు. కర్రకంటికి తగిలి కుడి కన్ను పూర్తిగా పగిలిపోయింది. దాంతో డాక్టరుగారితో చెప్పి అతన్ని అరెస్టు చేయించాం. ఆ తరువాత అలాటి మొగుడువల్ల ప్రాణానికి కూడా హానే అని కోర్టుద్వారా డైవర్సు ఇప్పించాం. ఇపుడు ఆమె అందర్నీ, అన్ని సుఖాలనీ వదులుకొని విషాదకరమైన ఒంటరితనంతో జీవిస్తోంది. ఆమధ్య ఒకసారి కలిసి 'అమ్ములుగారూ! ఒంటరితనం భరించలేకపోతున్నాను. మంచి కుర్రాడిని చూడండి. ఏ కులం అయినా సరే పెంచుకుంటాను. నాకేం తెలీదు. ఈ ఉపకారం చేసిపెట్టండి' అని బతిమలాడింది. ఈమధ్యనే నా విషయం మరిచిపోయారా? అంటూ ఉత్తరం కూడా రాసింది.

ఇంతలోనే ఇంత ఘోరం జరిగిపోతుందనుకో లేదు'' అని ఆమె చెప్పటం ముగించేసరికి అందరికళ్ళూ చెమ్మగిల్లాయి. అమ్మలూ, రమీజాలైతే అడుగు ముందుకు వేయలేకపోయారు. గుండెగొంతుకలో నలిగిపోయింది.

''మనం ఏం చేద్దాం?'' హెచ్వీ అడిగింది.

''మనం ఏం చేయగలం?'' హెచ్చెస్ సమాధానం.

''అలాకాదు. యూనియన్‌కి ఫిర్యాదు చేద్దాం. ఆరోగ్యశాఖామంత్రికి కంప్లయింట్ చేద్దాం. ఇవాళామెకు జరిగింది, రేపు మనకు జరగొచ్చు. ఇలా రాజకీయ నాయకుల కబంధ హస్తాల్లో పడి ఎంతకాలం నలిగిపోతాం? దీనికి పరిష్కారం ఆలోచించాలి. ఇవాళ మీటింగ్‌లో రిజల్యూషన్ తయారు చేయాలి'' అన్నాడు ఎం.పి.హెచ్.ఇ.ఓ.

అందరూ సరేనంటే సరేనన్నారు. ఆ రకంగానైనా మరియమ్మ ఆత్మకు శాంతి చేకూరినట్లవుతుందన్నారు. బండెడు విషాదం ముందు నీటిబొట్టంత సంతృప్తినిచ్చింది ఆ నిర్ణయం అక్కడున్న అందరికీ.

తరువాత మళ్లీ ఎవరిగొడవల్లో వాళ్లు మునిగిపోయారు. హెచ్వీ అందరి రికార్డులూ వెరిఫై చేశారు. ఎవరెన్ని కుటుంబ సంక్షేమ చికిత్సలు చేయించిందీ నోట్ చేశారు. క్యాంపెల్లిన డాక్టరుగారింకా రాలేదు. మధ్యాహ్నం పన్నెండు గంటలయింది. అందరూ భోజనాలకి ఇళ్ళకు వెళ్ళిపోతున్నారు.

హాస్పిటల్లో యు.డి.సికి, రమీజాకి ఏదో గొడవ జరుగుతోంది. అమ్మలు ఏదో పని మీద బజారుకెళ్లి వచ్చేసరికి ''నువ్వొట్టి ఫూల్‌వి. మర్యాదగా మసలుకోవటం నేర్చుకో'' అంటోంది రమీజా.

''నీవో గొప్పదానివని నీకు మర్యాద ఇవ్వాలా? ఆఫ్ట్రాల్ ఓ బస్సు కండక్టరుపాటి చేశానుకాదా నేను?'' అన్నాడు.

''వాట్‌డుయూమీన్? బస్సుకండెక్టరు మనిషికాదనా?''

''మనిషో, పశువో నీకే తెలియాలి! నువ్వు మనుమల్ని ప్రేమించవుగా! పశువుల్నే ఇష్టపడే రకానివని తెలుస్తూనే వుంది'' అన్నాడు.

''మరోసారి చెపుతున్నా. హద్దులు మీరిపోతున్నారు. వ్యక్తిగత విషయాల్లో తలదూర్చవద్దని హెచ్చరిస్తున్నాను'' రమీజా కళ్లు చింతనిప్పులయ్యాయి.

''ఏమయింది రమీజా! ఎందుకు గొడవ?''

''నా సొమ్ము నాకు పారేయ్, నా సొమ్ము తీసుకెళ్ళిందిగాక, నన్నే ధిక్కరిస్తావన్నమాట''

''మీ దగ్గర సొమ్ము తీసుకెళ్లినపుడే చెప్పాను, ఆరు మాసాలు దాటితేగానీ ఇవ్వలేనని! అంతవరకూ వడ్డీ చెల్లిస్తానన్నాను, చెల్లిస్తున్నాను. అంతేకానీ మీ దగ్గర సొమ్ము తీసుకెళ్ళానని పిచ్చిపిచ్చి వేషాలేస్తే మాత్రం పళ్ళు రాలిపోతాయి'' అంది. కలకత్తా కాళికలా ఆవేశంతో ఊగిపోతున్న రమీజాని చేయిపట్టుకుని పక్కకి లాగి ''ష్! అసలేం జరిగింది! మీరయినా చెప్పండి యు.డీ.సీగారూ!'' అంది అమ్మలు.

''అవును మీరెలా చెప్పగలరు? చేసిన ఘన కార్యం?'' అని ''ఈ పెద్దమనిషి దగ్గర అవసరానికి పదివేలు తీసుకున్నాను. జి.పి.ఎఫ్ లోను పెట్టి చెల్లిస్తానన్నాను. రోజూ రాగానే పలకరింపులు, విష్ చేయడాలూ మొదలెట్టాడు. దానికేంలే అనుకున్నాను. రెండు మూడు రోజులు కాగానే కన్నుకొట్టడం మొదలెట్టాడు. ఇవాళ సంతకం పెట్టి వెళ్లిపోతుంటే అబ్బ ఇవాళ ఎంత ముద్దొస్తున్నారో! అని మరికొంచెం ముందుకు అడుగువేశాడు, నేను వెళ్ళిపోయాను. మళ్ళీ పనుండి వచ్చాను. చెయ్యిపట్టుకుని మీదకు లాగాడు. ఇతని పిచ్చిచేష్టలు గమనించి తగు జాగ్రత్తలో ఉన్నానుకాబట్టి అతననుకున్నట్టు జరగలేదు'' అంది రోషంగా.

''అసలు నీకంత డబ్బు అవసరం ఏమొచ్చింది?'' అని మెల్లగా అని ''ఏంటిసార్! మీకిది సమంజసంగా ఉందా? ఏఎన్ఎమ్ లంటే హాస్పిటల్లోనూ, బయటా కూడా నానాటికీ మరీ విలువలేకుండాపోతోంది. మా బతుకులు మీకంటికి హీనంగా కనిపిస్తున్నాయా? మేం పరువుగల ఆడవాళ్లుగా బతక కూడదనుకుంటున్నారా?'' అంది అమ్మలు.

''మేడం... ఆవిడ చెప్పిన మాటలు శుద్ధ అబద్ధం. ఆవిడ బస్సు కండెక్టరుతో సినిమా హాల్లో కనిపించారు. అతన్నీకేమౌతాడన్నాను. ఆవిడ సీక్రెట్ నా దృష్టిలో పడి అందరికీ తెలుస్తున్నదని ఆమె భయం. అందుకే పెద్ద




పతివ్రతలాగా ఫోజు కొట్టేస్తోంది'' అన్నాడు.

''నా ఇష్టం... నేను నా జీవితాన్ని నా ఇష్టమొచ్చిన వాడి చేతిలో పెడతాను. ఫర్‌యువర్ ఇన్ఫర్మేషన్... అతడు నా భర్త. ఈ విషయం మీకు తెలీకపోరవద్దారు'' అన్న రమీజా వేపు ఆశ్చర్యంగా చూసింది అమ్మలు. ఆమెకు ఆ మాటలు వినటం ఆమె నోటంట అదే మొదటిసారి!

అయితే తన అంచనాలు నిజమయినాయన్నమాట. ఎందుకో అమ్మలు కుప్పకూలినట్లయింది. ''లీవిట్, వదిలేయండి. నలుగురు రావటం, గోరంతలు కొండంతలు కావటం అనవసరం. ఆరుమాసాల్లో రమీజా ఇవ్వలేనపుడు ఆ డబ్బు నేనిస్తాను. మీరు డబ్బిచ్చారు. డబ్బే తీసుకోండి'' అంది అమ్మలు.

''పద... రమీ... ఇంటికెళ్దాం పద'' అని అక్కడికా గొడవని ముగించి త్వరగా ఇంటికి చేరుకుంది. ఎంత వేగిరం ఇంటికెళ్లి ఎంత వేగిరం పూర్తి వివరాలు తెలుసుకుందామా అని తొందరపడుతోంది ఆమె మనసు. ఇంటికెళ్లగానే మంచం మీద కూలబడి ''రమీజా! ఇప్పుడు చెప్పు. ఇందాక నువ్వు అన్నమాటలు నిజమేనా?'' అంది. రమీజా మౌనంగా తల వంచుకుంది.

''క్షమించక్కా! అనుకోని పరిస్థితుల్లో అతనితో పరిచయమైంది. ఓరోజు పట్నంనుండి తిరిగి వస్తున్నా. కొంతవరకూ బస్సులో మనుములున్నారు. అదేమి విచిత్రమోమరి, గరివిడి దాటేసరికి నేనూ అతనే ఉన్నాం. మొదట్లో భయం వేసింది. నా చేతిలో పుస్తకం ఆ వారం వీక్లీ ఉంటే అడిగాడు, ఇచ్చాను. ఆ తరువాత మళ్లీ మనవేపువస్తుంటే బస్సులో కనిపించాడు. విష్ చేశాడు. అక్కణ్ణుంచీ చాలాసార్లు పలకరించుకోడాలూ, నవ్వుకోవటాలూ మామూలయిపోయాయి. ఎందుకోగానీ అతని రూపం నా మనసులో ముద్రవేసింది. ఒకరోజు అతను హాస్పిటల్‌కొచ్చాడు, మీతో కొంచెం మాట్లాడాలని. ఏమిటని అడిగితే అలా రాగలరా? అని అడిగాడు. బస్సుస్టాప్‌కెళ్లాను. 'మావాళ్లు నన్ను పెళ్లి చేసుకోమని గొడవ పెడుతున్నారు. మీరు ముస్లింల అమ్మాయని తెలిసింది. మేమూ ముస్లింలమే. నా పేరు కమాలుద్దీన్. మాది విశాఖపట్నం. మీరంగీకరిస్తే కట్నం లేకుండా పెళ్లి చేసుకోవాలనుకుంటున్నాను, మా వాళ్లు ఇష్టపడకపోయినా' అన్నాడు. అతడి కళ్లలోని మెరుపు నా హృదయ వీణియమీద మధురరాగాలు వాయించింది. ఎందుకో కాదనలేకపోయా''అని రమీజా అనగానే అమ్మలు కోపంతో, ''వెంటనే 'ప్రియతమా! ఈ విరహాన్ని సైపలేపోతున్నాను' అని అతని కౌగిట్లో కరిగిపోయావా? అసలు నీకేమయింది? ఎవరికీ లొంగని దానివి ఆ బస్సు కండక్టరు వలలో ఎలా పడ్డావ్? నీకు గుర్తుందా? మనం 'మొండెం ఖల్లు'లో పనిచేస్తున్నప్పుడు ఆ డాక్టరుగారు కోరి పెళ్లి చేసుకుంటానంటేనువ్వు రఫ్‌గా రెఫ్యూజ్ చేసిన సంగతి? అంత మంచి వాణ్ణి కాదన్నావ్. ఇలా ఎత్తెత్తి ఎంగిలాకు మీద కాలేస్తావనుకోలేదు. అనలీ అక్క చచ్చిపోయిందనుకున్నావా? నే వస్తా, ఇంక నీ ముఖం చూడనీ జన్మలో'' అని సర్రున లేచిపోయింది అమ్మలు.

''అక్కా! నీ కాళ్లు పట్టుకుంటాను. జరిగింది పొరపాటే. నీకీ విషయం ఎలా చెప్పటమా? అనే ఇన్నాళ్లూ భయపడ్డాను. నీతో మాటమాత్రంగా అనడానికి వీలులేని పరిస్థితులు నన్ను తొందరపెట్టాయి. అంతేగానీ నీకు తెలీకుండా ఇలా జరుగుతుందని నేనూ ఎప్పుడూ ఊహించలేదు'' అని అమ్మలు కాళ్ళు పట్టుకుని ఉండిపోయింది చిన్న పిల్లలా.

అమ్మలు ముందుకు అడుగు వెయ్యలేకపోయింది.

''మా అక్క మంచిది... మా అక్కమంచిది'' అని అమ్మలు ముఖాన్ని రెండు చేతుల్లోకీ తీసుకొని ముద్దుల్లో ముంచెత్తింది, ''మా బంగారక్క'' అని గట్టిగా పెనవేసుకుపోయింది. తరువాత ''అక్కా! ఈ ఒక్క తప్పుకీ క్షమించు. ప్రేమించుకోవడం వరకూ నీకు తెలీకుండా జరిగిపోయింది. పెళ్ళి మాత్రం నీ సమక్షంలోనే జరగాలనుకున్నా కానీ విచిత్ర పరిస్థితుల్లో ఎవరికీ తెలీకుండా రిజిష్ట్రారాఫీసులో కామ్‌గా పెళ్లి జరిగిపోయింది'' అనేసి ''లే అక్కా! కాళ్లు కడుక్కో! భోంచేద్దాం'' అంది.

''నేనేం భోంచేయను'' అంది అమ్మలు.

''ఇదిగో ఆ పేచీలే పెట్టకు''

''నాకు తెలీకుండా అంత తొందర్లో పెళ్లి

చేసుకోవలసిన పరిస్థితులేమొచ్చాయి?''

"అక్కా! విను... అతనితో పరిచయం అయాక రోజూ నైట్ హాల్టు ఇక్కడికే వచ్చేవాడు. పదకొండు గంటలవరకూ కబుర్లు చెప్పుకొని, అప్పుడు వెళ్ళిపోయేవాడు. ఒకరోజు వర్షం పడుతోంటే నేనే ఉండిపొమన్నాను. అతను కొంచెం చొరవ తీసుకున్నాడు. నేను కాదన్నా అతను వినిపించుకోలేదు. నిజానికి నాలో అతని చుట్టూ అల్లుకునే ప్రేమో, కాంక్షో చెప్పలేకపోతున్నాగానీ, నేనంతగా ప్రతిఘటించలేకపోతున్నాను. మగాడు కోరుకునేదీ అదేకదా! ఆ రాత్రి తొలిసారి పురుష సుఖానుభూతిని పొందగలిగాను. ఇంక అతను ప్రతిరోజూ రావటం మొదలెట్టాడు. నేనంగీకరించలేదు. ఒక్కసారి పొరపాటు జరగటమే చాలు. మళ్లీ పొరపాటు జరక్కూడదు అన్నాను. అతను వినలేదు. నేను ఒప్పుకోలేదు. మరెందుకని, పెళ్లికి తొందరపెట్టాను. ఆరకంగా రిజిస్ట్రార్ ఆఫీసులో మా పెళ్లి రహస్యంగా జరిగిపోయింది'' అంది రమీజా ఆమె బుగ్గల్లో కెంపులు కనిపించగా.

"పోనీ, మీ ఇంట్లో చెప్పావా?''

"చెప్పాను''

"ఎప్పుడు?''

"పెళ్ళయిన వారంరోజులనాడు''

"పెళ్ళయినట్లు చెప్పావా?''

"పెళ్ళి చేసుకుంటానని చెప్పాను. నాన్న వివరాలడిగారు. ఆ మరునాడే ఎక్కడికో వెళ్ళి వచ్చారు. వచ్చి ఆ సంబంధం వద్దమ్మా! అన్నారు. ఎందుకని అడిగాను. ముందు తటపటాయించారు. తరువాత మేడ మీదకు తీసుకెళ్ళారు. అమ్మా! ఇన్నాళ్లూ రహస్యంగా ఉంచాను. ఇప్పుడు చెప్పక తప్పటంలేదు. నిన్ను చేసుకుంటానన్నవాడు నీ తల్లిని మోసం చేసిన వాని మేనల్లుడే! ఈ విషయం రూఢి చేసుకోడానికే వైజాగ్ వెళ్లాను. అని నా పూర్వ కథ, అంతకుముందు అమ్మద్వారా విన్నకథని వివరించాడు. అప్పుడు నేనడిగాను, మా అమ్మానాన్నల గురించి. అమ్మ నన్ను కన్న వెంటనే కలకత్తా వెళ్లిందికదా, అక్కడ వాళ్ళు మరోపెళ్ళి చేయబోతే ఆత్మహత్య చేసుకున్నదట. నేను మా అమ్మ కడుపులో పడటానికి కారకుడైన ఆ నీచుడు మాత్రం ఎక్కడి కెళ్లిపోయాడో ఇంతవరకూ ఆచూకీ లేదట. అయినా నా పెళ్లి కమాలుద్దీన్‌తో జరిగిపోయినట్లు నాన్నతో యదార్థం చెప్పేశాను. ఎంతపనిచేశావమ్మా! అని నాన్న చాలా బాధపడ్డాడు. ఇదిగో! ఈ ఫొటోలో వ్యక్తిని పోల్చగలవా?'' అని పెట్లోంచి ఓ ఫొటో ఫ్రేం తీసి చూపెట్టింది.

అమ్మలు ఆ ఫొటోను చూడగానే "ఏం? ప్రేమమైకంలో నీవైతే మతినిపోగొట్టుకున్నావ్ గానీ, నాకింకా మతిపోలేదు'' అంది.

"పోనీ, చెప్పరాదూ?''

ఫొటోనవతలికి తోసేసింది అమ్మలు. రమీజా పట్టువదల్లేదు "ప్లీజ్! అక్కా! సరిగా చూడరాదూ?'' అంది. అప్పుడు అమ్మలు పరిశీలనగా చూసింది. ఎందుకంతలాగా అడుగుతోందో అర్థం కాలేదు. 'నీకేం పిచ్చా? ఇది నీ ఫొటో కాదూ?''

"కాదు కాబట్టే ఇన్నిసార్లు పరిశీలనగా చూడమంటున్నది!'' అంది రమీజా.

"ఏమో! నాకు మాత్రం ఇది నీ ఫొటోయే అనిపిస్తోంది'' అంది అమ్మలు.

"నువ్వు బోల్తాపడ్డావు. ఆవిడ మా అమ్మ'' అంది గొంతు గాద్గదికంగా.

"అంటే?''

"సాక్షాత్తూ నన్ను కన్నతల్లి. అభాగ్యురాలు''

"నిజమా?''

"అబద్ధం ఎందుకు చెబుతానక్కా!''

"నాకేం అర్థం కావటంలేదు. సస్పెన్సుతో చంపక, వివరంగా చెప్పు''

రమీజా కళ్ళొత్తుకుంది "ఆవిడ నిజంగా మా అమ్మే అక్కా! నాన్న నుండి నిజం తెల్సుకున్న తరువాత నాకింకా ఎందుకో ఆయన మాటలు నమ్మబుద్ధికాలేదు. మా అమ్మవాళ్ల చిరునామాని అడిగి తెలుసుకున్నాను. నాన్న- 'చాలాకాలంగా వాళ్ళనుండి ఉత్తరాలు లేవు. ఎప్పుడో వాళ్ళిచ్చిన అడ్రస్ ఉంది', అని పాత కవరొకటి తీసి ఇచ్చారు. ఆ అడ్రస్‌ను పట్టుకుని కలకత్తా వెళ్ళాను. కొంత కష్టపడాల్సి వచ్చినా చివరకు చిరునామా కనుక్కోగలిగాను. నేనెళ్ళేసరికి మా తాతగారు కుర్చీలో కూర్చుని పేపరు చదువుకుంటున్నారు. మా అమ్మమ్మ తాతగారి పక్కన కూర్చొని ఏడుస్తోంది. 'ఊరుకో! ఇంకా ఎందుకేడుస్తావ్? ఎంతకాలం అలా




ఏడుస్తావ్? అసలే నీ ఆరోగ్యం బాగాలేదు' అన్నారు. అదే సమయంలో నేను వెళ్లాను.

'ఎవరూ?' అని లేచి వచ్చిన అమ్మమ్మ నా ముఖంలోకి చూసిన వెంటనే ఏమయిందో ముఖం తిరిగి పడిపోయింది. 'అయ్యో!' అని నేను ఒక్క ఉదుటన వెళ్ళి ఆమెను పొదివి పట్టుకున్నాను. ఇంట్లోకెళ్ళి గ్లాసుతో నీళ్ళు పట్టుకొచ్చి ముఖం మీద చల్లిన కాసేపటికి అమ్మమ్మ తేరుకుంది. అప్పుడు ఆశ్చర్యపోవటం తాతయ్యవంతు అయింది. ఈలోగా నా కళ్ళు అనుకోకుండా మీదకు చూశాయి. నాన్న చెప్పిన మాట నిజమని రూఢీ అయింది. అమ్మ ఫొటోకి దండవేసి ఉండటం కనిపించింది.

'అమ్మా! ఎవరమ్మా నువ్వు? ఎక్కణ్ణుంచివచ్చావ్?' అని తాతయ్యనగానే, అమ్మమ్మ 'అమ్మా! అచ్చంగా మా రజనీలాగా ఉన్నావ్. ఎన్నో ఏళ్ళక్రితం మమ్మల్ని దుఃఖసాగరంలో ముంచి వెళ్ళిపోయిన మా పిల్ల తిరిగి వచ్చినట్లుంది నిన్ను చూస్తుంటే' అనగానే ఇంట్లోంచి చాలా మంది మగాళ్లూ, ఆడవాళ్లూ వచ్చి వింతగా చూశారు. నాకు నోటమాట రాలేదు. నేను పూర్తిగా కోలుకున్నాక నేనెవర్నో, ఎక్కణ్ణుంచి వచ్చానో పూర్తిగా వివరించాను. వాళ్ల ఆనందానికి అంతులేదు. ఆశ్చర్యానికి మేరలేదు. అమ్మమ్మ అయితే నన్ను గుండెలకు హత్తుకుని చిన్న పిల్లలా వలవలా ఏడ్చేసింది. అమ్మా! నా తల్లి తిరిగి వచ్చినట్లుంది. నా బంగారుతల్లి. నా ముద్దుల తల్లీ, ఈ అమ్మమ్మ మీద నీకసహ్యం వేయలేదా తల్లీ? నిజం చెపుతున్నానమ్మా. నమ్ముతావో నమ్మవో నిన్ను ఆరోజుల్లో వాళ్ళింట వదలటం నాకు సుతరామూ ఇష్టంలేదు. ఇప్పుడున్న స్వతంత్రం! ధైర్యం అప్పుడుంటే నాకింత గుండెకోత ఉండేది కాదమ్మా. నాకూతురు నాకు దూరం అయి ఉండేది కాదమ్మా!' అని గుండెలు చిల్లులు పడేలా ఏడ్చింది. తాతయ్య ఎంతయినా మగాడు కదా, గుండె దిటవు చేసుకొని 'అమ్మా! ఏదీ ఇలారా! నా పొరపాటుని మన్నించు, పశ్చాత్తాపంతో రోజూ ఎంత కృంగిపోతున్నానో నేనెవరికి చెప్పనమ్మా. ఒక్కగానొక్క కూతురు పిలుపు వినపడనంత దూరానికి, చూపుకందనంత గగనానికి వెళ్ళిపోతుందని నేను కలలో కూడా ఊహించలేదమ్మా. నా బంగారుతల్లిని నా మూర్ఖత్వానికి బలి చేసుకున్నానమ్మా!' అని నా చేతులు పట్టుకుని ఏడ్చారు. నుదుటిమీద ముద్దు పెట్టుకున్నారు. ఇంట్లో నుండి మేనమామలూ, మేనత్తలూ అందరూ వచ్చి నన్ను ముద్దుల్లో ముంచెత్తారు.

'అమ్మా! తల్లీ! నీ పేరేమిటి అని అడిగేందుకు సిగ్గుపడుతున్నాను' అడిగారు తాతగారు. పేరు చెప్పాను. మళ్ళీ బావురుమన్నారు. గొప్ప హైందవ కుటుంబంలో పుట్టి, ముస్లిం పేరుతో మనుగడసాగిస్తున్నందుకు వాళ్ళని వాళ్లే దూషించుకున్నారు. నేనలానుకున్నాను. 'నా తండ్రి ఎలాటి వాడయినా ముస్లిమేగదా!' అని అనలేకపోయాను.

"మరో విచిత్రం ఏమంటే అక్కా! సరిగ్గా ఆరోజు అమ్మ చనిపోయి పాతిక సంవత్సరాలట. అందుకే వాళ్ళు మరింత కుమిలికుమిలి ఏడుస్తున్నారు. అంతవరకూ లేవడానికి శక్తిలేక వంగివంగి నడిచే అమ్మమ్మకి ఎలాగ శక్తి వచ్చిందో కానీ నా మనవరాలికి నా చేత్తో పాయసం పెట్టాలని లేచి స్వయంగా వెళ్ళి సేమ్యా చేసి తెచ్చింది. జీడిపప్పు, కిసిమిస్‌పళ్ళూ, ఏలకలూ దండిగావేసి రథసప్తమి క్షీరాన్నంలాగా చేసి తన వళ్లో కూర్చోపెట్టుకుని చెంచాతో తినిపించటం మొదలెట్టింది. నాకు సిగ్గేసి లేచిపోబోతే ఇంట్లో అందరూ వారించారు. కూర్చోమ్మా... ఫరవాలేదు. నువ్వు మా ఇంటి దేవతవు. మాకందరికీ చిన్నదానివే అని తలో చెంచాడు సేమ్యా నా నోట్లో పెట్టటం మొదలెట్టారు. అమ్మా! నీ బాలసారె మేం చేయలేకపోయాం. అందుకే కాదనకమ్మా! అన్నారందరూ. అక్కడ వారం రోజులున్నాను. వారం రోజులూ అమ్మమ్మ పక్కలోనే పడుకున్నాను. మా మేనత్తలూ, మేనమామలూ అందరూ నన్ను 'నాతో రా అంటే నాతో రా!' అని కలకత్తా మొత్తం తిప్పేశారు. నన్ను వెళ్ళొద్దని ఒకటేగోల. ఉండిపోమంటారు. ఆ తరువాత వాళ్లు అందరూ సమావేశమై ఒక నిర్ణయానికొచ్చారు. మా మేనమామ కొడుకు ఢిల్లీలో ఎలక్ట్రానిక్స్‌లో బి.ఇ. చేసి ఇంజనీరుగా పనిచేస్తున్నాడు. నాకంటే ఒక సంవత్సరం చిన్నట. అయినా అతనితో నా పెళ్లి చేసి నన్ను ఆ ఇంట స్థిరంగా ఉండిపోవటానికి సన్నాహాలు చేస్తున్నారు. ఆ అబ్బాయి మా అమ్మ ఫొటో చూసి ఇంట్లో తాతయ్య మీద మండిపడతా

డట, మూర్ఖంగా ఆమె మనసుకి విరుద్ధంగా ప్రవర్తించి ఆమెను పొట్టన పెట్టుకున్నందుకు!

అందుకే నన్ను తప్పక చేసుకుంటాడని వాళ్లు నిర్ణయం చేసి నాతో అన్నారు. కానీ అప్పటికే నేను తొందరపడ్డాను. అంతకాలం చాలాకాలం నా మనసులో ఎవరికీ స్థానం కల్పించని నేను కమాలుద్దీన్‌కి చోటివ్వక పోతే ఎంత బావుణ్ణని?

నేను పెళ్ళయిన సంగతిచెప్పేసరికి వాళ్లా నందం చప్పున చల్లారిపోయింది. అయితే వాళ్ళన్నారు, కమాలుద్దీన్‌ను తీసుకుని కలకత్తా వచ్చేయమని. నేనే అంగీకరించలేదు. అయినవాళ్ల అనురాగాలనీ, ఆప్యాయతలనీ అవగింజంతయినా ఎరగని నేను వాళ్ళు చూపిన ఆదరాభిమానాలనిచూసి ఆనందలహరిలో మునిగితేలాను. అమ్మ ఎంత దురదృష్టవంతురాలో, నేనెంత అదృష్టహీనురాలినో నాకప్పుడు తెలిసొచ్చింది. అయితే నాకొక విషయం స్పష్టంగా అవగతమయింది'' అంది.

''ఏమిటది?''

''నేను మా నాన్న పోలికలతో పుట్టి ఉంటే నన్ను గుమ్మంలోకి అడుగుకూడా పెట్టనిచ్చేవారు కాదేమోనని! వస్తున్నప్పుడు నాకు వాళ్ళు బోలెడు బట్టలు పెట్టారు. అమ్మ నగలన్నీ నాకిచ్చారు. అయితే నాకెందుకో ఆ నగలు తీసుకోవాలనిపించలేదు. అమ్మ ఫొటో ఒకటి ఉంటే ఇమ్మన్నాను. అదే ఈ ఫొటో'' అని ముగించింది.

అమ్మలుకేం మాట్లాడాలో తెలీలేదు. మౌన మందారంలాగా కూర్చుండిపోయింది. ''రమీ! నువ్వు నిజంగా తొందరపడ్డావు. పెద్ద తప్పు కూడా చేశావ్. అది సరే! ఆ వెధవ సంగతి తెలిసీ వాడి దగ్గర పదివేలు ఎందుకు తీసుకున్నావ్?'' అని అడిగింది.

రమీజా పెద్దగా నిట్టూర్పు విడిచింది.

''ఏం చెయ్యమంటావక్కా! నేను పెళ్లి చేసుకుంటే తనకేం ఇస్తానో ఇవ్వనో అని నాన్న భయం. చెల్లికి సంబంధం చూసి పెళ్లిచేస్తానని నా సహాయం పదివేలు అర్థించాడు. నీ పెళ్లి అయింది కాబట్టి, . నువ్వే ఇంటిదానివి అయినావుకాబట్టి, తరువాత నేనెలాగూ నిన్నడుగలేనని నిర్మొహమాటంగా అడిగారు. నా దగ్గరంత డబ్బెక్కడది? అయినా వాళ్ళడగటంలో అర్థం లేకపోలేదనిపించింది. చాలా మందిలాగా సినిమాలో చూస్తున్నట్లు ఏ వేశ్యా గృహానికో నన్ను అమ్మేసి ఉన్నా డబ్బుకోసం అమ్మ తన ప్రియునికి కుదువ పెట్టినా ఆ పరిస్థితుల్లో నేనేం చేయగలిగేదాన్ని! వాళ్లు నాకు నేను ఆశించిన అనురాగాదరణలు పంచిపెట్టకపోయినా, బాధ్యతకలిగి నా పట్ల వాళ్లు నిర్ణయాలు తీసుకున్నారు. నా దగ్గరంత డబ్బులేకపోయినా, వాళ్ళడిగిన డబ్బు ఇవ్వడం నా కనీస ధర్మంగా భావించాను. చివరకు అడగకూడని వాణ్ణే అడిగి వాళ్ళకాడబ్బు పంపాను. అమ్మ తెలివైంది. ఆ డబ్బుని వృథా చెయ్యకుండా చెల్లెలికి పెళ్లి చేసింది'' అని చెప్పింది.

అంతకంటే రమీజా మాత్రం ఏం చేయగలదనిపించింది!

ఆ స్థితిలో తనున్నా అంతకంటే భిన్నంగా ప్రవర్తించేది కాదేమో! ననిపించింది అమ్మలుకి. అందుకే రమీజా చాలా ఉన్నతంగా కనిపించింది. రమీజాని దగ్గరకు తీసుకుని ఆప్యాయంగా నుదుటిమీద చుంబించింది.

''మా అక్కకి కోపం పోయిందోచ్!'' చిన్నపిల్లలా నడుం చుట్టూ చేతులేసి ఎత్తుకొని గిరగిరా తిప్పేసింది.

''ఏయ్! పిచ్చి... ఏంటది? వదులు'' అని అంటున్నా వినకుండా చిలిపిగా ముద్దులు పెట్టేసింది.

''సరే... జరిగిందేదో జరిగిపోయింది. మరిది గారెక్కడ?''

''లైనుకెళ్ళారు... రేపొస్తారు. ఈ రోజుండిపో కూడదూ?''

''అమ్మో! మీ బావగారికి కోపం రాదూ?'' అంది.

అప్పటికి టైం మూడు గంటలయింది. లేచి ముఖాలు కడుక్కున్నారు. టీలు తాగి హాస్పిటలుకి బయలుదేరారు. డాక్టరుగారొచ్చారట అని చెప్పారెవరో. ఆ మాటలంటుండగానే డాక్టరు రావటం జరిగింది.

నాలుగున్నరయింది. అందరూ సమావేశం అయారు. ఎవరిసీట్లో వాళ్లు కూర్చున్నారు. డాక్టరుగారూ, బి.ఇ.గారూ పక్కపక్కన కూర్చు

న్నారు. బి.ఇ.గారు మరియమ్మ ఆత్మహత్య విషయం ప్రస్తావించారు. 'అవును విన్నాను' అన్నారు.

"దీనిమీద మనమో రిజల్యూషన్ తయారు చేయాలనుకుంటున్నాం సార్!" అన్నారు.

"ఏమిటట?"

"నానాటికీ ఏఎన్ఎమ్‌ల పరిస్థితి దుర్భరంగానూ కంటక ప్రాయంగానూ తయారయింది. అందునుండి వీటిమీద సరియైన చర్య తీసుకోవాల్సిందిగా ఆరోగ్యశాఖామాత్యులకీ, సి.ఎమ్‌కీ టెలిగ్రాంలు పంపుతే బావుణ్ణని అనిపిస్తోంది" అన్నారు

అతనెంతో ఆవేదనతో అన్నట్లు అతని మాటలు చెవుతున్నాయి. అయితే డాక్టరు కృష్ణారావు ఆ విషయాన్నంత సీరియస్‌గా తీసుకున్నట్లులేదు "వేస్ట్... మన పనిని మనం చేసుకుపోతే ఇలాటివి రావుకదా! అయినా ఎవరి పనినివాళ్లు చెయ్యాలిగానీ కుక్కపని గాడిద చేస్తే ఏమవుతుంది?" అన్నారు.

డాక్టరు కృష్ణారావు అలా అనేసరికి హెచ్వీకి కోపం వచ్చింది.

"క్షమించండి డాక్టరుగారూ! మరియమ్మ నిర్దోషిగా కనిపిస్తోంది" అని అంటుండగానే "మీకు తెలుసా? ఆమె నిర్దోషని మీరు రుజువు చేయగలరా?" అడిగారు.

"పేపరు చదివితే ఎవరికయినా తెలుస్తుంది"

ఆవిడలాగా ఎదిరిస్తుందని ఎవరూ ఊహించలేదు. ఎందుకంటే డాక్టరుగారికీ హెచ్వీగారికీ ఏవో రహస్యసంబంధాలున్నాయని అందరూ అనుకుంటుంటారు. అందుకే కృష్ణారావు కేరెక్టరు ఎంత ఛండాలమయిందైనా ఎవరూ ఆమె ముందు పల్లెత్తు మాటనరు. ఆనువత్రిలో కూడా అనరు.

కృష్ణారావు కేరెక్టరు మొదట్లో మరీ జుగుప్సాకరంగా ఉండేదట. అతడు గవర్నమెంటు డాక్టరుగా ఆపాయింటయిన తొలిరోజుల్లో ఆడవాళ్లు తలనెప్పని వచ్చినా బల్ల ఎక్కించేసేవాడట. ఎక్కించేసి స్టెత్‌తో వక్షస్థలం దగ్గర తనిఖీ చేసేవాడట. జ్వరం అని వెళ్ళినా లంగాని మరీ బొడ్డు కిందకి లాగేసి పొత్తికడుపు కిందని దిగువ భాగంలోనికి చేతిని పెట్టి నొక్కి చూసి సీరియస్‌గా ముఖం పెట్టేవాడట. కొన్ని చోట్ల కొందరి పేషెంట్లని వలలో వేసుకొని తరచుగా వాళ్లింటికెళ్తూ ఉండేవాడట. అందుకే అతనిపూర్వపు కేరెక్టరు గురించి ఆలోచించిన వైద్యసిబ్బంది ఒంటరిగా వెళ్లటానికి భయపడతారట. వయసు ఏభయ్యోపడిదాటి ఇప్పుడు డబ్బుయావ ఎక్కువయింది. అలాగని ఆడ రుచిని విడనాడే స్థితికి మాత్రం ఎదగలేదు. హెచ్వీ గారెదిరించటంతోనూ, ఏఎన్ఎమ్‌లు అందరూ గోల చేయటంతోనూ మాటాడక "సరే మీ ఇష్టం! ఒకటి మాత్రం గమనించండి. ఇందిరాగాంధీని డైరెక్టుగా హత్య చేసిన వారిని ఉరితీయటానికే కొన్ని సంవత్సరాలు పట్టింది. అలాటిది ఆఫ్టరాల్ ఒక ఏఎన్నెంకి జరిగిన సంఘటన గూర్చి ప్రభుత్వాలు అంత శ్రద్ధ తీసుకుంటాయని నాకు నమ్మకం లేదు. మీరు రిజల్యూషన్ చేస్తామంటే సానుభూతిగా మన తరఫునుండి ఓ టెలిగ్రాం పంపటానికి నాకేం అభ్యంతరం లేదు" అని తేలికగా కొట్టి పారేశాడు.

ఆ సంఘటనతో అతనంటే అందరికీ గొప్ప అసహ్యం వేసింది.

మరియమ్మ మరణానికి సంతాప సూచకంగా కొద్దిసేపు మౌనం పాటించిన అనంతరం మీటింగ్‌లో తక్కిన అంశాలు ఎప్పటిలాగానే జరిగాయి. డి.ఎమ్.ఓ నుండి వచ్చిన కాగితం చదివి వినిపించాడు డాక్టరు. దానిలో విషయం కూడా షరా మామూలు లాటిదే. కుటుంబ సంక్షేమ కార్యక్రమాల నిర్వహణలో చురుకుగా అందరూ పాల్గొనాలని హెల్త్ మినిష్టరు జిల్లాల డి.ఎం.అండ్ హెచ్.ఓలకు పంపుతే వాళ్లు డాక్టర్లకు పంపుతారు. డాక్టర్లు కిందివాళ్ల మీద ప్రతాపం చూపుతారు.

డాక్టరుగారు ఆ రోజు జరిగిన చిన్న తిరుగుబాటుని సహించలేకపోయారు. మీటింగ్ అయిపోయిందని లేచిపోబోతుంటే అందర్నీ మందలించి మీటింగ్ అవకుండానే లేచిపోవటం ఏం బాగులేదు. డాక్టరంటే మీకు బొత్తిగా రెస్పెక్టు లేకుండా పోతోందని కేకలేసేసరికి అందరూ తిరిగి కూర్చున్నారు. కొంతమంది గ్రామాలకు సరిగా వెళ్లటం లేదని కంప్లయింట్లొస్తున్నాయి. ఇకపై అలాటి కంప్లయింట్లు రాకుండా జాగ్రత్త పడటం మంచిది. మనకు ప్రభుత్వం వేల జీతాలిస్తున్నది దాన్ని




అనుభవించి ఊరి మీద గాడిదల్లా తిరగటాని కి కాదు. అది గుర్తుంచుకోండి. వర్కు సరిగా జరక్కపోతే మాత్రం నేనంగీకరించేది లేదు. మన పని మనం చూసుకొని రావటం మంచిది. అనవసరపు రాజకీయాల్లోగానీ, గొడవల్లో కానీ తలదూర్చి పి.హెచ్.సీకి చెడ్డపేరు తేవద్దు. అంతేకాదు త్వరలో దీనిని పది పడకల ఆసుపత్రిగా మార్చబోతున్నారు. ఒక డాక్టరు పీరియడ్‌లో ఈ అభివృద్ధి సాధించిందనే మంచి పేరు రావాలికానీ, ఇంత చెత్తగా తయారయిందని మాత్రం పేరు తెచ్చుకోకూడదు. చెడు పల్లానికి ప్రవహించే నీరు లాటిది. వేగిరం సాగిపోతుంది. మంచి అనేది పాతాళ గంగను పైకి తేవటం వంటిది'' అని డాక్టరు గారి ఉపన్యాసం. అది ప్రత్యేకమైన ఓ ధోరణిలో సాగినపుడు అందరూ మనసులో చెడ తిట్టుకున్నారు. పెదాల మీద వ్యంగ్యమైన నవ్వులు విరిసాయి.

ఆరోజు సోమవారం.

బుధవారం నాటికి కుటుంబనియంత్రణ ఆపరేషన్లు కోసం ఇంకొంతమందినయినా తీసుకెళ్లాలి. ముందే కొంతమందిని సమీకరించింది అమ్మలు. అయినా ముందుగా గొర్రెలను తోలుకొచ్చినట్లు దగ్గరుండి వాళ్లకు నచ్చచెప్పి, ఆసుపత్రికి తీసుకురావటం ఆనవాయితీ. ఆ ఆనవాయితీ ప్రకారం రావివలస, నిమ్మలవలస, సంతపురిటి మొదలయిన తన పరిధిలో గల గ్రామాలను చుట్టి వచ్చింది. చివరిగా రావివలస వెళ్లింది, అక్కడో రెండు కేసులుంటే. అవి హరిజన వాడకు చెందినవి. వాళ్లకి అమ్మలంటే గొప్ప అభిమానం. ప్రతి వారం వెళ్లగానే వాళ్ల ఇళ్లకు వెళ్లటం, గర్భిణీలకు ఇంజక్షన్లు ఇవ్వటం, పిల్లలకు కోరింతదగ్గు, జ్వరం లాటి రోగాలు రాకుండా మందులు, టాబ్లెట్లు ఇవ్వటం వలన వాళ్లకో రకమైన అభిమానం ఏర్పడింది. అప్పటికే ముగ్గురు నలుగురు పిల్లలు ఉన్నా ఆపరేషన్ చేయించుకోవాలన్న తలంపులేక, ప్రసవాలు కావటానికి ఆరోగ్యాలు లేక చిక్కిశల్యమై పోతోన్న ఇద్దరికి ఆపరేషన్ చేయించుకోవడానికి నచ్చచెప్పింది. పనిలో పనిగా వాళ్లకోసారి చెప్పిరావాలని వెళ్లింది. వెళ్లేసరికి అక్కడ పరిస్థితి ఇంకోలా ఉంది.

పట్నం నుండి వాళ్ల చుట్టం ఒకామె వచ్చింది. చేతిలో 'శబ్దరత్నాకరం' అన్న పుస్తకం ఉంది. ఆవిడేమిటో చెపుతోంది. జనం ముందు కూర్చుని శ్రద్ధగా వింటున్నారు. అమ్మలు అక్కడికి చేరుకుంది.

ఆవిడ వాగ్ధాటి జనాన్ని బాగా ఆకట్టుకుంది. మనిషి ఎలా ఉన్నా గొంతు మార్దవంగా ఉంది. ఉపన్యాసం ఆకట్టుకునే విధంగా ఉంది.

అమ్మలు అక్కడకి చేరింది. వాళ్ళంతా ''అమ్మగారూ! నమస్కారమండీ!'' అని ఓ స్టూలులాటిది తెచ్చివేసారు. ఎప్పట్లాగే వాళ్ళ యోగక్షేమాలడిగిన తరువాత బుధవారం తెల్లారగానే హాస్పిటలుకి వచ్చేయమని చెప్పి లేవబోతోంది ''దేనికీ?'' అని ప్రశ్నించిందామె. చెప్పింది అమ్మలు

వెంటనే ఆవిడ ''అయ్యో! అయ్యో! ఎంత అపచారం, కుటుంబ నియంత్రణే. ఇది భ్రూణహత్య. 'భ్రూణహత్య మహాపాపం' అని ఆమె తన వాగ్ధాటితో వాళ్ళ మనసు మార్చేస్తోంది. ఇన్నాళ్ళుగా అమ్మలు చెప్పిన హితోక్తులూ, చేసిన సేవలూ గంగలో కలిసిపోయినట్లయ్యాయి. పుట్టబోయే శిశువును నిరోధించే అధికారం మనకెక్కడిది? భగవంతుడు ఈ లోకంలో ఎంతో మందిని సృష్టిస్తాడు. దాన్ని ఆపటానికి మనం ప్రయత్నం చేయటం మహాపాపం! ఇప్పటికే మనం ఎన్నో పాపాలు చేస్తున్నాం'' అని ఆమె చెప్పుకుపోతోంది.

అమ్మలుకి ఆ మాటలు వింటుంటే గొప్ప కోపం వచ్చింది. అది చిరాకుగా మారింది తరువాత దుఃఖమై కూర్చుంది. ఎల్లుండి ఈ రెండు కేసులయినా తీసుకెళ్ళకపోతే తను చాలా చికాకుల్లో ఇరుక్కోవలసివస్తుంది. ఇప్పటికే డాక్టరు ఏదో ఒక నెపంతో తనను చికాకుల్లో పెట్టి, తన పబ్బం గడుపుకోవాలని నక్కలా ఎదురుచూస్తున్నాడు. 'భగవంతుడా! తన పాలిట సైతాన్‌లా ఈవిడ దాపురించిందేమిటి?' అనుకుని ధైర్యం తెచ్చుకుంది.

''అమ్మా! మీకు నమస్కారం చేస్తాను. వీళ్ళందరినీ మీక్కావలసిన మతంలో మీరు కలుపుకోండి. మనది లౌకిక రాజ్యం. అందుకెవరూ అడ్డు చెప్పరు. కానీ, 'కుటుంబ సంక్షేమ కార్యకలాపాలు' దేశశ్రేయస్సుకోసం. ఇవాళ భారతదేశం జనాభా సుమారు 80 కోట్లమంది

ఉన్నారు. ఏమిటి? ఇద్దరూ లేక ముగ్గురూ అనే నినాదం అమలు పరుస్తుంటేనే! అంతేకాదు వీళ్ళకి కడుపునిండా తిండిలేదు. ఉండటానికి గూడు లేదు. కట్టుకోడానికి బట్టలేదు. ఇలాటి వాళ్ళే ఈదేశంలో ఎక్కువమంది ఉన్నారు. మీలాటివారు ఇలాగే ప్రజల్ని వక్కతోవలు పట్టిస్తుంటే మరో దశాబ్దానికి ఒకళ్ళనొకళ్ళు పొడుచుకొని, చంపుకోడానికి ఏమాత్రం వెనుకాడని పరిస్థితి దాపురిస్తుంది. వీళ్ళిప్పటికే అనారోగ్యాలతో కుళ్ళిపోతున్నారు. మీరు తిండి పెట్టండి, చదువు చెప్పండి. అవిద్యనుండి దూరం చెయ్యండి. అంతేకానీ ఇలాటి దురుపదేశాలు చెయ్యకండి. మీకు పుణ్యం ఉంటుంది. దేశశ్రేయస్సునీ, వీళ్ళ ఆరోగ్యాన్నీ దృష్టిలో ఉంచుకొని మాతో సహకరించండి'' అంది అమ్మలు.

వాళ్ళంతా అమ్మలు చుట్టూ చేరారు. అమ్మలు చెప్పిన మాటలు వాళ్ళ మనసుకు ఎక్కాయి. 'నువ్వేళ్ళమ్మా. తప్పక వస్తాం. ఆయమ్మ సెప్పింది ముమ్మాటికీ నిజమే. మా మగోళ్ళు సంపాదించింది తాగటానికే సాలటం లేదు. మా కడుపులకి 'పూట బత్తెం పుల్ల విరుపు' లాగుంది. మరి మా పిల్లలేటి తింతారు? అల్లు దొంగలూ, కూనీకోర్లూ అవటానికే కనాల? మాకు కనటానికి ఓపికలూ లేవు. నువ్వెల్లమ్మా! బుదోరం పెందిలి నెగిసి మామొచ్చెత్తాం. నువ్వు మర్రాకు'' అని వాళ్ళు కొంత దూరంవరకూ సాగనంపారు. అమ్మలుకి ఇంకా అనుమానం పోలేదు. 'నామీద ఒట్టేకదా!' అంది.

''ఓలమ్మ నాతల్లే! నువ్వు మా పాలిదేవతవి. నీ మాటని కాదని మాయసేత్తె మాకు పుట్టగతులుంతాయా?'' అని ''మరెల్లమ్మా! మనసుల్నువ్వే బయాన్నీ ఎట్టుకోకు'' అని వాళ్ళు ధైర్యం చెప్పేసరికి అమ్మలుకి కొండంత ఆశ, ధైర్యం కలిగాయి.

ఆ తరువాత నాయుడువీధి వెళ్ళింది. అక్కడ ఇద్దరికి డి.పి.టి. ఇంజక్షన్లు ఇవ్వాల్సి ఉండటంచేత. అలా వెళ్తుంటే సర్పంచ్ భార్య వాకిట్లో నిల్చుంది. పిల్చింది. పిలుస్తే వెళ్ళింది అటువేపు. ఆమె అప్పటికే నెలతప్పింది. ముఖంలో మంచి కళఉంది. నల్లగా త్రాచుపాము మఠం వేసుకు కూర్చున్నట్లు కొప్పు ముడిచుట్టుకుంది. పెద్ద జుట్టులా కనిపిస్తుంది. కళ్ళు చిన్నవిగా ఉన్నా అందంగా ఉన్నాయి. తెల్లని ఛాయ. చాలా ఆరోగ్యకరంగా కనిపించింది. ఇప్పుడిప్పుడే పట్నవాసపు వేషభాషలకి అలవాటు పడుతున్నదానిలా ఉంది. సాధారణంగా పల్లెటూళ్ళలో జాకెట్లు వేసుకోరు. చీరకూడా కాళ్ళమధ్యనుండి తీసి పంచెకట్టులా కడతారు. కొంతమంది ఆడాళ్ళు నోట్లో పొగాకుచుట్టను అడ్డపొగ వేస్తారు. కానీ సర్పంచ్ భార్య వాటికి భిన్నంగా ఉంది. లేత నీలంరంగు పొందూరు చేనేతచీర కట్టుకుంది. దానికి సరిపడే మేచింగ్ బ్లౌజు వేసుకుంది. చెవులకు దిద్దులు పెట్టుకుంది. మెడలో మాత్రం నెక్లెస్, కాసులపేరు పెట్టుకుంది. ముడిలో మల్లెదండ పెట్టుకుంది. నుదుట లేతగా పసుపు రాసుకుని దానిమీద రూపాయంత బొట్టు పెట్టుకుంది ఆమెను చూడగానే ముచ్చటేసింది అమ్మలుకి.

ఇంట్లోకి నడిచింది ఆమె వెంట.

ఆమె లోపలి గదిలోకి తీసుకెళ్ళిపోయింది. అక్కడ ఆవిడ పందిరి మంచంమీద కూర్చుంది. అమ్మలుకి కుర్చీ వేసింది. ''ఒరే... అమ్మను పిలువు'' అక్కడున్న పనివాడికి పురమాయించింది. ముసలమ్మ వచ్చింది. ''ఏవలూ?'' అడిగింది.

''ఎవులో తరువాత సెప్తానుగానీ, రాజారామ దుకాణానికెళ్ళి నిలువున్నది కాకుండా చూసి డ్రింకొకటి తెప్పించు అమ్మగారికి'' అంది.

''ఇప్పుడేం వద్దమ్మా. నేనర్జంటుగా బస్సుకెళ్ళిపోవాలి'' అంది.

''వోసెల్దురుగాని మెడమ్మా. మీలాటోల్లు మా ఇంట అడుగు పెట్టడం మా పున్నెం. మీ గురించి తరుసుగా ఇంటుంటాను. మీరొచ్చాక ఈ ఊళ్ళో అందరూ ఎంతో సుకపడతన్నారు. పట్నం ఎల్లక్కర్లేకుండా, పైసా కర్సులేకుండా జబ్బులు నయంచేస్తన్నారు'' అంది. ఆవిడ ముఖంలో ఏదో చెప్పాలనే తపన ఉంది.

''దాందేముంది... మా ఉద్యోగధర్మం మేం నిర్వర్తించాలి కదా!'' అంది.

''అమ్మా! నా వినయం కొంత చెప్పాలి''

''మీరు నెలతప్పారుటకదా?''




''మీ కెవులు సెప్పారు?''

''ఇందాక హరిజనపేటలో ఎవరో చెప్పగా విన్నాను''

''నూసారా? ఈ విషయం ఎవరికీ చెప్ప కుండా దాసినా మా ముసిల్ది దాని సంతోసం ఆపుకోలేక ఊదీసుంటాది'' అని అప్పుడే అందరికీ చెప్పేసినందుకు ముందు చిరాకు పడినా, తనవరకూ వచ్చినందుకు ఆమె ముఖంలో సంతోషాన్ని గమనించకపోలేదు అమ్మలు...

''చూడండమ్మా! నాకు నమ్మకంలేదు. ఇలా చాలాసార్లు జరిగింది పెళ్ళయిన తరువాత. ఎప్పుడూ రెండునెలలు దాటడం, మా వోల్లందరూ సంతోషంపడే సమయానికి మళ్ళీ బీడింగయిపోవటం జరుగుతుంది. పట్నం ఎల్లి నూపించుకున్నా మందులు వాడినా నాబం నేకపోతోంది. మీ సెయ్యి మంచిదని ఇన్నాను. తమరు నూసి నికార్స్ అన్న తరువాత ఎలా సెయ్యమంతే అలాగా చేత్తాను'' అంటే మునలమ్మని అవతలికి వెళ్ళమని చీర పొత్తికడుపు క్రిందకు దిగజార్చి పొట్టను తనఖీ చేసింది. 'ఎప్పుడు ఆఖరి మెన్సస్సో కరెక్టుగా చెప్పగలరా?' అడిగింది ఆమె కేలెండరు చూసి చెప్పింది.

''మీరు చదువుకున్నారా?'' అడిగింది.

''ఏం నదువులు? శీతాకాలం నదువులు. నాకయితే నదూకోవాలని ఉండేదికానీ మా యింట్లో అందరూ పెల్లి సేసెయ్యాలని తొందరవడి సేసీసినారు. మా 'మావ' కూడా నదూకుంతే నాను సేనుకోను అన్నాడు. అందుకే నదువు మానిపించీసినారు'' అంది- చదువు మానవలసి వచ్చినందుకు విచారంగా ముఖం పెడుతూ.

''ఇప్పుడు మీకు మూడు వెళ్ళింది. నాలుగు వస్తోంది. మరేం ఫరవాలేదు. ఈసారి వండంటి బాబుని కంటారు. ఈ వారంలో ఓసారి పట్నంవెళ్ళి 'మంగమ్మ' అని ఒక డాక్టరుంటారు. ఆమెకు చూపెట్టండి. మంచి మందులు రాస్తారు. నేను తరచుగా వచ్చి చూస్తుంటాను. ఏదో మళ్ళీ అయిపోతుందని బెంగ మాత్రం వడకండి. మీరెంత నిశ్చింతగా ఉంటే అంత మంచిది'' అంది అమ్మలు.

ఆమె రెండు చేతులూ పట్టుకుని ''మీ నల్లని మనుసుతో సెప్పిన మాట నిజమైతే మిమ్మల్నెపుడూ మర్సిపోలేనమ్మా. ఇప్పటికెన్నో సార్లు రెండేసి నెల్లు ఎగించి ఏమీ కానందువల్ల గొప్ప సికాకొచ్చేసి, ఎవులికీ సెప్పనేదు'' అని ''నువ్వెల్లే ఆటు'' అని అక్కడే సంతోషంతో విప్పారిన ముఖంతో ఉన్న ముసిలిదాన్ని పొమ్మని ''నూడండమ్మా! మొగోడు రెండు దెబ్బలు కొట్టినా భరించకలదు కాని ఆడదయి ముఖంమీద- 'గొడ్డుదాయి' అని ముద్రవడితే బరించటం కట్టం కదమ్మా! అంతేకాదు. మొగాల్ల బుద్ధులు మంచియిగావు. అందులోనూ అతికారం ఉన్నోడికీ, అవిస్వార్యం ఉన్నోడి మనసూ ఎప్పుడు ఎలా మారిపోద్దో ఎవులు కెరుక? నాకు పెల్లయి అయిదు సంవసరాలు ఇంకా అవనేదు. నాకు పిల్లలు ఫుట్టనేదని మల్లీ ఇంకో పెల్లి సేసుకోమనడానికి ఇంట గునగునలు బయలుదేరినాయి. ఆ 'మొగోడి'కింకా ఆ బుద్ధిపుట్టనేదు కాబట్టి సరిపోయింది. నేపోతే నానేమయిపోవాలి? సెప్పండి'' అంటూ తన మనసులో ఉన్న ఆవేదననంతా బయటపెట్టింది ఆమె.

ఆమెను చూస్తే గొప్ప జాలేసింది. ఆమె తృప్తికోసం వేడినీళ్ళు పెట్టించి సిరంజిని స్టెరిలైజుచేసి నీరసంగా ఉందంటే ఇంజక్షను చేసింది అమ్మలు. ఈలోగా డ్రింకు తెచ్చాడు కుర్రాడు. వద్దన్నా విన్లేదామె. డ్రింక్ తాగేసి ''వస్తానమ్మా! మరేం భయాలు పెట్టుకోవద్దు'' అని ఆమె వెళ్తుండగా అమ్మలుని వెనక్కి పిలిచి ''నూడండి ఇది నుద్ద పల్లెటూరు. ఇక్కడ మొగోల్లకి మంచేదో, సెడోదో తెలీదు. రావుణ్ణీ, రావనానురుణ్ణీ ఒకే దృస్టితో చూత్తారు. అంటే మంచిగా నూత్తారని గాదు. మీకెవలు వల్లనయినా ఏ కష్టం కలిగినా నాకు సెప్పండి. మావకి సెప్పి తోలు తీయిత్తాను'' అంది అప్పుడామె ఆ మాటలెందుకన్నదో అర్థంకాలేదు. కానీ మరికాసేపటికే తనకా పరిస్థితి ఆమె భర్తవల్లనే వస్తుందని అమ్మలు ఊహించలేదు.

''ఇక్కడ నాకెలాటి భయంలేదు. ఎవరివల్లా నాకెలాటి కష్టమూ లేదు'' అని చెప్పేసి అక్కణ్ణుండి బయలుదేరింది. ఒంటిగంట దాటిపోతోంది. ఎండ అధికంగా ఉంది.

అయినా వేగిరం ఇంటికి చేరుకోవాలని జోరుగా నడిచి వెళ్తోంది.

సరిగ్గా-

ప్రెసిడెంటు సేరీకి చేరుకుంది. సేరీలో వాలుకుర్చీలో కొబ్బరి చెట్టు నీడలో కూర్చుని పేపరు చదువుకుంటున్నవాడల్లా తనని చూసి నిలబడ్డాడు. పేపరు మడచి నడుంమీద చెయ్యేసుకొని నిలబడ్డాడు. సిగిరెట్టు పొగ వదుల్తున్నాడు. అది గమనించినా గమనించనట్లు ముందుకు పోతోంది.

"ఏయ్! పిల్లా. ఏటలాగెలిపోతన్నేవ్. ఇట్రా!" అన్నాడు.

అటు చూసింది "ఎందుకు?" అడిగింది.

"ఎందుకో అక్కణ్ణుంచే అడుగుతే నానేటి సెప్తాను. ఇట్రా!"

"నాకు బస్సుటయిమయింది. అర్జంటుగా ఇంటికిళ్ళాలి. మరోసారి కలుస్తాను" అని ముందుకు నడవబోయింది.

"మరోసారి ఎలాగూ కలవాలి. ముందిలారా. కొంచెం నీతో మాటాడాల్సిన పనుంది. నీకోసం కొబ్బరి బొండాం తీసి ఉంచాను" అన్నాడు. అమ్మలుకి ఒళ్ళంతా చెమటల్లెక్కాయి. చుట్టుపక్కల జనసంచారం కూడాలేదు. వెళ్ళకుండా తప్పించుకోటానికి కుదర్లేదు. విరాటుని సభలో కీచకుణ్ణి తప్పించుకొనేందుకు ప్రయత్నిస్తోన్న 'సైరంధ్రి'లాటి పరిస్థితి ఆమెది. అతని ఆకారం, చూపు చూస్తే అతని మనసెలాటిదో అర్థం అవుతోంది. వెళ్ళింది. నిలబడింది. "కూర్చో" అని అక్కడున్న స్టూలు చూపెట్టాడు.

"పిలిచిన పని చెప్పండి" అంది.

"ఉరే, రాముడూ! 'అమ్మ'కి కొబ్బరి బొండాం బట్రారా!" అనటం ఏమిటి సాలలో నుండి ఒక పెద్ద కొబ్బరి బొండాం తెచ్చి ముందుంచాడు పాలేరు.

"నాకొద్దు" అని ఆమె తీసుకోలేదు.

"ఫరవాలేదు. తీసుకో. కొబ్బరి బొండాంతోనే సరిపెట్టను"

"ఇంతకీ పిలిచిన పనేమిటి?" ఆందోళనతో అడిగింది.

"ఏటా తొందర? ఇంటికెల్లి ఏటిసేస్తావ్?"

"ఇంటి దగ్గర నాకు బోల్డు పనుంది. మా బాబు నే వెళ్ళేనదాకా పడుకోడు. అల్లరి పెడతాడు" అంది.

"ఏటి? నీకు పిల్లడున్నాడేటి? నీ ఒళ్ళూ, నీ బిగువూ సూత్తుంటే నీకింకా అసలు మగదెబ్బే తగిలినట్లు అనిపించలేదు" అన్నాడు విషపు చూపులతో.

అతడి మాటా, మనసూ ఆమెకు పూర్తిగా అర్థం అయ్యాయి. అక్కడోక్షణం ఉంటే తనకెలాటి ప్రమాదం పొంచిఉందో ఊహించుకుంది. దుఃఖం పొంగివస్తోంది. ధైర్యంతో "వస్తా... నాకు చాలా పనులున్నాయి" అంది.

"సరే... ఎల్లు... మల్లెప్పుడొస్తావు. నేను తొందరపెట్టవలసిన మనిషిని కాను. కానీ ఒకటి మాత్రం నిజం. ఇక్కడకొచ్చిన ఎ.ఎన్నెంలు గానీ, ఆడ టీచర్లుగానీ ఎవులూ నామాట కాదన్లేదు. కాదన్లేరు కూడా. నువ్వూ వేగిరం సుకపడు. నన్ను కాదని తప్పించుకునేవు. పరశురాముడు... ఎవరు ఎల్తుమినిస్టరు మా సుట్టం. ఎమ్మెల్యే... ఎవులు? కృష్ణమూర్తి నాకు సాయానా మేనమావ. రేపు నానూ మండల పెసిడెంటుకు పోటీ సేత్తాను. అందునుంచీ చెప్పొచ్చేదేమంటే ఇవాల కాదన్నా రేపయినా నువ్వు నా మాట ఇనక తప్పదు. అయిష్టంతో బలవంతంగా నా పనిని సెయ్యటంకంటే ఇస్టంతో నా పని జరిగిపోతే ఇద్దరికీ మేలే. ఉరే, రావుడూ! 'అమ్మ'ని దిగబెట్టిరా! ఎల్లిరా!" అన్నాడు.

అమ్మలుకి జ్వరం వచ్చేసినట్టయింది. ఒంటిమీద తెలివిలేదు. తూలినట్టయింది. లేత తోటకారకాడలా వాడిపోయింది. అక్కడనుంచి ఎంతవేగరం బయటపడాలా అని పరుగులాటి నడకతో ముందుకు నడిచింది. భయం ఎంత వేగరం శక్తినిచ్చిందోగానీ అరగంట నడవాల్సిన దూరాన్ని ఇరవై నిమిషాల్లో చేరుకుంది.

బస్సుస్టాపులో జనం నిలబడి ఉండటంచూసి తనెళ్ళవలసిన బస్సింకా వెళ్ళలేదని గమనించి శాంతిపొందింది. నిలుచుందే గాని వేటగాని బారినుండి తప్పించుకొచ్చిన లేడిపిల్లలా ఆమె భయం మాత్రం పోలేదు. ఇంకా ఉచ్ఛ్వాసనిశ్వాసాల జోరు తగ్గలేదు.

సర్పంచ్‌కీ, అతని భార్యకీ ఎంత తేడా?

అసలు ప్రతి రాక్షసుడి భార్యా ఉత్తమ





ఇల్లాలే కావటం విశేషంగా కనిపిస్తోంది. అంత దుర్మార్గుడైన రావణుని భార్య ఎంత పతివ్రత? 'సుమతి'లాటి పతివ్రతామతల్లి భర్త ఎంత కామాంధుడు?' ఆమె మనసు ఆక్రోశిస్తోంది. ఆవేశపడుతోంది. ఆందోళన చెందుతోంది. ఆమెలో వేధిస్తోన్న ఒకేఒక ప్రశ్న! 'ఇతడిబారి నుండి బయటపడేదెలా?' అనేదే!

ఇంతలో బస్సొచ్చింది. ఎక్కేసింది.



**మ**ధ్యతరగతి కుటుంబాల్లో మనుమల్ని అర్థంచేసుకోవటం తక్కువ. అపోహలూ, అపార్థాలూ ఎక్కువ. ఇవే లేకపోతే వీళ్ళంత సుఖజీవులు అసలుండరు. సాధారణంగా వీళ్ళకున్న సమస్యలు తక్కువ. తెచ్చిపెట్టుకున్న సమస్యలే ఎక్కువ. పెద్ద పరుగులకు పరుగెత్తకుండా, ఉన్నదాంతో సరిపెట్టుకోగల్గిగిన కుటుంబాల్లో అయితే 'వీళ్ళకు బాధల్లేవా?' అనిపిస్తుంది. వీళ్ళలో మరో పెద్ద దోషం ఏమిటంటే, ముగ్గురు మనుమలున్నచోట మూడోవ్యక్తి లేకపోతే ఆ వ్యక్తి మీదనే ఈ ఇద్దరూ ఏవో చెప్పుకోవటం ఓ గొప్ప దుర్గుణం.

సరిగ్గా ఆ మధ్యాహ్నం అదే జరిగింది.

అమ్మలు అన్న భార్య పిల్లలతో వచ్చింది. అమ్మలు వస్తే అందరూ ఒకేసారి భోంచేద్దామంది అత్తగారు. సుదర్శనం కూడా ఎంచేతనో టైంకు ఇంటికి రాలేదు. ఏవేవో కబుర్లు చెప్పుకున్నారు. పిల్లాడు- అంటే అమ్మలు కొడుకు ఊరికే ఏడుస్తున్నాడు. వాళ్ళత్త ఎత్తుకున్నా వాడు ఊరుకోవటంలేదు.

"ఏరా! మీ 'అమ్మ'లాగే నువ్వా అందరితో నూ అంటీముట్టనట్లే ఉంటావేమిటి?" అంది అని ఊరుకోక, "వీళ్ళమ్మ అంతేనండి పిన్నిగారూ! ఏం వదినా, బాగున్నావా? అని అడగదు. అంతెందుకండీ? అమ్మలుకు ఇంకా పెళ్ళికాని రోజుల్లో సంగతిలెండి. తిన్నగా డ్యూటీకెళ్ళి వచ్చేసేది. ఆ సామానలా మూలన పడేసేది స్నానం చేసి రావడమో, కాళ్ళు కడుక్కురావటమో చేసివచ్చేది? ఇప్పుడు మీ కోడలు అయింది కాబట్టి, అంటే మీకు కోపం రావచ్చు. కానీ ఉన్నమాట చెప్పడానికి నేను భయపడను. భోజనానికి వచ్చేదా? పోనీ, మగాడుకాదు కదా? భోంచేసి కంచం తియ్యటం తెలీదుటండీ? మగరాయుళ్లా చెయ్యి కడుక్కుని వెళ్ళిపోయేది. మంచం ఎక్కిపోయేది. లేదా ఏదో తన రికార్డువర్కుని అందులో కూరుకుపోయేది. అయితే వాళ్ళమ్మగారో, లేకపోతే నేనో తీయాలి తప్ప ఆవిడేరోజూ ఎంగిల్లెత్తిన పాపాన, వంటచేసిన పుణ్యాన చూసినట్టు గుర్తులేదు. వాళ్ళన్నయ్యతో ఎప్పుడైనా ప్రాణం విసిగి ఈ మాటన్నా 'పోనీలేవే! అది తిరిగి తిరిగి వస్తుంది ఎండలో. అలిసిపోయి ఉంటుంది. నీలాగే అదీ ఉద్యోగంలేక వంటచేసుకోవటమే చేస్తూ ఉంటే నీకంటే ఎక్కువే చేస్తుంది. అయినా అమ్మ చేస్తోందికదా! అదే చెయ్యాలని ఈసెందుకు నీకు?'' అనేవారు. అయినా కొంతమంది పెట్టి పుడతారులెండి. అటు పుట్టింటివారిచేతా, ఇటు మెట్టినింటివారిచేతా సేవలు చేయించుకునేందుకు పెట్టిపుట్టాలిగదండీ! మిమ్మల్ని పొగిడితే నాకేం రాదుకదా, ముఖస్తుతి అనుకోకండి. నాకు ఉన్నమాట చెప్పటం అలవాటు. అదే కొంతమందికి నేను చెడ్డయిపోటానికి కారణం అవుతోంది. ఏం చేస్తాం?"

అంతవరకూ కోడలిమీద ఎలాటి వ్యతిరేకతా లేని ఆమెకు ఆవిడ మాటలతో ఒళ్ళంతా విషం పాకినట్లయింది. ఒంట్లో బాగులేకపోతే మూలుగుతూ అయినా చేసుకునేది. కానీ కోడలు చెయ్యలేదని ఎప్పుడూ మూలిగేది కాదు. అలాటిది కోడలి వదినగారి మాటలు విన్నాక "ఏం చేస్తాం తల్లీ! చిన్నదానివైనా నా కష్టాన్ని అర్థంచేసుకున్నావు. ఆవిడ డ్యూటీ అలాటిదంటుంది. పైగా నేను చేసుకోలేక పనులు విడిచిపెడితే, ఆవిడెప్పుడో వస్తుందికదా! పెళ్ళాం అలిసిపోతుందని మా 'అబ్బాయే' ఆ పని చేసేస్తాడు. చూస్తూచూస్తూ 'మగాడు' ఇంటిపనులు చేస్తుంటే ఊరుకోలేకపోతాను.

పోనీ కొన్నాళ్ళు ఎక్కడికయినా వెళ్ళిరావా లంటే ఎక్కడికెళ్ళను? నాకొక్కడే కొడుకు. ఆడ పిల్లల ఇళ్ళకు వెళ్ళటానికి మనసొప్పదాయె. వెళ్ళినా ఒకటి, రెండు రోజులుకన్నా ఎం ఉండగలం చెప్పమ్మా! నువ్వన్నట్టు, దేనిక యినా పెట్టిపుట్టాలి కదమ్మా!'' అని నిట్టూ ర్చింది.

నల్లకళ్లద్దాలు పెట్టుకున్న వ్యక్తికి లోక మంతా నల్లగా కనిపించినట్లు మనసులో ఒక చెడు భావన కలిగినపుడు చేసిన ప్రతి మంచి లోనూ చెడే కనిపిస్తుంది. చెడ్డగానే స్ఫురి స్తుంది. చెడ్డ అనే విషబీజం మనసులో పుట్ట నంతవరకే. అది మనసులో ప్రవేశించిన తరు వాత మొలకెత్తి, పెరిగి విజృంభించకమానదు. అంతవరకూ నారాయణమ్మకు కోడలితో పడక పోవటం లేదు. ఇప్పుడు ఇన్నాళ్లుగా కోడలు చేస్తోన్న ప్రతి పని వెనుకా, ఆ పనిని చేయటా నికి గల కారణాలను వెదకటం ప్రా రంభించింది.

''రెండు దాటిపోతోంది పిన్నిగారూ! మీరు భోంచేయండి. వాళ్లొస్తేనే వడ్డిస్తాను'' అంది అమ్మలు వదిన.

''అయ్యో! అంతకన్నానా తల్లీ, ఇన్నాళ్లకి నువ్వు పడుకో అన్న మనిషి కనిపించినందుకే కడుపునిండిపోయింది'' అని లేచి ఆకలే స్తోంటే భోజనం చేసి వచ్చింది. నారాయణమ్మ భోజనం చేసి చెయ్యి కడుక్కుంటుండగా కొడు కొచ్చాడు. ''అమ్మలింకా రాలేదా?'' అడిగాడు.

''రాలేదు... ఇంటి దగ్గర ఈ ముసలిపీను గుందికదా! ఎంత లేటయినా ఫరవాలేదని ధైర్యం?'' అంది సణుగుతున్నట్లుగా. సుదర్శ నానికి ఆ మాటలు వింతగా కనిపించాయి. ''వసంతేదీ?'' అడిగాడు చెల్లెలు కనిపించక పోగా.

''కాలేజి నుండి ఇంకా రాలేదు'' అంది.

''తమ్ముడూ ఇంకా రాలేదా?''

''ఆయనగారెక్కడికెళ్లాడో, ఏమో?''

''ఏమ్మా! ఒంట్లో నలతగా ఉందా?'' అని అడిగాడు.

''నాకేం? దుక్కలాగా ఉన్నాను'' అంది నిష్ఠూరంగా. ఇంతలో అలిసిపోయి, వాడిన మల్లెపువ్వులాగా వచ్చింది అమ్మలు. వస్తూనే ''బాబు పడుకున్నాడా?'' అడిగింది.

''ఆఁ... పడుకున్నాడమ్మా. ఇవాళ గొప్పపేచీ పెట్టేశాడు. రేపట్నించీ నీతోపాటు వాణ్ణి తీసుకె ళ్ళు. నేను చెయ్యలేకపోతున్నాను ఇన్నాళ్లలా'' అంది.

ఎప్పుడూ లేనిది అత్తగారలా చిరాకుపడేస రికి అమ్మలుకి బాధనిపించింది. ''చూడమ్మా! ఎంత ఉద్యోగం చేస్తున్నా ఇల్లు, పిల్లలూ, సంసారం మీదా కొంత ధ్యాస ఉండాలి. నువ్వే నీ ధోరణి మార్చుకుంటావేమోనని ఇన్నాళ్ళు అనలేదు. ఒంట్లో సత్తువ లేనప్పుడే కోపతాపా లొస్తాయి. నేనన్నానని ఇంకోలా అపార్థం చేసు కోకు. నీ మీద నాకు కోపం లేదు. చీకట్నే వెళ్ళినదానవు. రెండు దాటిపోయినా రాకపోతే ఎలా చెప్పు? పాలు తాగే పిల్లాడింట్లో ఉన్నాడ న్న ధ్యాస ఉండాలా వద్దా? ఉద్యోగాలు మరెవ్వ రూ చెయ్యడంలేదా?''అని చాలా కఠినంగానే అంది.

వదిన సంగతి అమ్మలుకి తెలుసు. కలిసి ఉన్నప్పుడు అంటే పెళ్ళికాని రోజుల్లో ఇక్కడ మాటలు అక్కడా, అక్కడి మాటలు ఇక్కడా చెప్పి బంధువుల్లో ఎలా తగాదాలు పెట్టేదో పూర్తిగా తెలుసు. తనంటే ఎంతో ప్రేమ వలక బోస్తోన్న వదినవేపు కొరకొరా చూసింది. 'ఇది నీనిర్వాకమా?' అనుకుంది.

''సరేలెండి అత్తయ్యా! ఇవాళ చెప్పారు కదా!'' అని వెంటనే స్టౌమీద నీళ్ళు పెట్టి, నీడిల్సు మరిగించి 'న్యూరోబిన్ ఎంపిల్'లోడు చేసి పట్టుకొచ్చింది. ''రండి... ఒంట్లో నీర సంగా ఉంటే చెప్పండి'' అని ఇంజక్షన్ చే సింది. ''మీరు విశ్రాంతి తీసుకోండి'' అంది.

తరువాత భర్తకి వడ్డించింది. ''మీరూ, ఇప్పుడేనా రావటం?'' అడిగింది. అవునని తలూపాడు సుదర్శనం. అత్తగారు సణుగు తూనే ఉంది.

''మధ్యాహ్నం నేనెళ్తాను పిన్నిగారూ! ఇక్క డుంటే నేనేదో మీ మధ్య తగూలు పెడుతున్న ట్లు ఆవిడ చూస్తోంది. అక్కడకొచ్చి వాళ్లమ్మ గారితో చెప్పిందంటే లేనిపోని గొడవలు'' అని వదిన అత్తగారితో అనటం వినిపించింది.

భోంచేస్తూ భర్త అన్నాడు ''పోనీకానీ నువ్వే క్కత్తైవే జాబ్ చేస్తున్నావా? పైసా రాబడి లేదూ,




క్షణం తీరికలేదూ నీకు. నీతోటివాళ్లు రోజుకి వంద రూపాయలు గడిస్తున్నారు'' అన్నాడు.

''చూడండి... గవర్నమెంటు మనకు జీతం ఇస్తోంది. అందుకే మనం పని చేయాలిగానీ, వాళ్లేదో ఇస్తారని చేయటం నాకు బొత్తిగా నచ్చదు'' అంది.

''నేనంటున్నది నిన్ను సంపాదించి పెట్టమనిగాదు. అంతపై సంపాదనలున్నా వాళ్ళు క్రైంకి వచ్చేస్తారు అని అంటున్నా'' అన్నాడు. అమ్మలు మాట్లాడలేదు. ఆమెకు ఎంతాపుకుందామన్నా దుఃఖం ఆగలేదు. బలవంతంగా దుఃఖాన్ని దిగమింగుకొని కళ్ళు తుడుచుకుంది.

''ఇప్పుడే మన్నానని?''

''మీరేమన్నారనికాదు. ఒక్కొక్క రోజు లేచిన వేళా విశేషం ఏమోగానీ, ఎక్కడకెళ్ళినా ఎదురుగాలులే'' అంది. ఆ మాటలకు సుదర్శనం నోట్లో ముద్దపెట్టుకోవటం ఆపి, ''ఏమయింది? ఎవరైనా ఏమన్నా అన్నారా? అసలేం జరిగింది?'' అడిగాడు.

''ఏం లేదులెండి... మీకేం కావాలి?'' అడిగింది. భార్య సంగతి సుదర్శనంకి బాగా తెలుసు. చెప్పటానికి ఇష్టం లేకపోతే బ్రహ్మ దిగివచ్చినా మరి చెప్పించలేడు. అందుకే మరి ప్రశ్నించలేదు. భార్యాభర్తల మధ్య మౌనం రాజ్యం చేసింది.

''నువ్వు భోంచేయవా?''

''తల నొప్పిగా ఉంది. కాసేపున్నాక భోంచేస్తాను''

''ఇప్పుడే మూడు అవుతోంది''

''కానివ్వండి'' అంటుండగా అత్తగారొచ్చి నేనేమన్నాననే భోజనం మానెయ్యటం? ఆ మాత్రం మాటనడం తప్పయితే... అపరాథం... చెంపలేసుకుంటున్నా'' అని రెండు చేతులతో చెంపలు వాయించుకుంది. ఈ హఠాత్పరిణామానికి అమ్మలు నివ్వెరపోయింది. హతాశురాలయింది.

''మీరన్నారని కాదత్తయ్యా! నాకివాళ చికాగ్గా ఉంది. కాసేపు రెస్టు తీసుకుని అన్నం తినాలనుకున్నానేగానీ... మీ మాటలకి నాకేం కోపం రాలేదు. చేసినప్పుడు మంచి, చెయ్యనపుడు చెడ్డా అనుకునే నీచురాల్నిగాను'' అని ఎంగిల్లత్తేసి అన్నం మీద మూత పెట్టింది.

''చూసావట్రా దాని ధోరణి? అంతేగాని భోంచేస్తానని అనలేదే? కనీసం నువ్వయినా చెప్పొచ్చుకదరా!'' అంది. సుదర్శనంకి అత్తాకోడళ్ల మధ్య ఎన్నడూరాని గొడవ ఇవాళ వచ్చినందుకు గల కారణం తెలిసి రాలేదు. ఎటూ చెప్పలేకపోతున్నాడు. భార్య కూడా గొడవ తెచ్చుకునే రకం మనిషి కాదు, లోపం ఎక్కడుందో తెలిసిరాలేదు.

వసంత వచ్చింది. ఆ వెనుకే తమ్ముడొచ్చాడు.

వసంత వస్తూనే ''ఏం వదినా! పడుకున్నావ్?'' అడిగింది.

''తలనొప్పిగా ఉందమ్మా'' అంది. కాళ్లు కడుక్కొని వచ్చి ''జండూబాం రాయనా?''అంది. 'వద్దులే అమ్మా!' అంది అమ్మలు. అయినా వసంత విన్లేదు. జండూబాం రాసింది. ''వదినా! ఒళ్ళు వేడిగాఉంది. జ్వరం వచ్చినట్లుందేమిటి?'' అంది.

''ఇవాళ బాగా ఎండదెబ్బతిని వచ్చానమ్మా, అంతకన్నా ఇంకేం లేదు'' అంది

అత్తగారు అలా మాట్లాడినందుకు అమ్మలు బాధపడలేదు. వదిన వచ్చి ఇలా చిచ్చుపెట్టినందుకు బాధపడింది. అమ్మలుకు అత్తగారిలో ఈ రకమైన ధోరణికలుగచేసింది వదినేనని పూర్తి విశ్వాసం. ఇదో వక్క బుర్రని దొలుస్తుంటే రావివలస సర్పంచ్ గొడవ ఎలాటి విషమ పరిస్థితులకు దారితీస్తుందోనని మరో వంక భయం. వదిన వెళ్లిపోతే అత్తగారు కొన్నాళ్లకు మారిపోతారన్న ధైర్యం ఉన్నా సర్పంచ్ సమస్యకు మాత్రం పరిష్కార మార్గం కనిపించటం లేదు. భర్తకు విషయం చెప్పినా ప్రయోజనం లేదు. గొప్ప దురుసు స్వభావం కలవాడవటం చేత, చెప్పగానే.తగువుకి వెళ్తాడు. అతనితో తగువు అంత శ్రేయస్కరం కాదు. అతనికి రాజకీయంగా మంచి ఫలుకుబడి ఉంది. చేతిలో డబ్బుంది. కులం బలం ఉంది. అంతేకాకుండా కండబలం ఉంది. తలచుకుంటే తననీ, తన భర్తనీ ఏమన్నా చేయగలడు. ఎప్పుడో చిన్నప్పుడు చదువుకున్న శ్లోకభావం గుర్తొచ్చింది ముల్లూ- మూర్ఖుడూ ఒక లాటివారే. వారి స్వభావం ఇతరులకు

హాని కల్గించటమే. అందునుంచి అవి ఎదురైనపుడు చెప్పుతో కొట్టి బుద్ధయినా చెప్పాలి. లేదా చాకచక్యంగా తప్పించుకొనైనా తప్పించుకోవాలి. మొదటి దానికిక్కడ అవకాశం లేదు. రెండో మార్గమే అనుసరణీయం. తీక్షణంగా ఆలోచిస్తోంది.

"నేను ఆఫీసుకెళ్ళివస్తా, కొంచెం మజ్జిగ అన్నం అయినా తిని పడుకో" అన్నాడు. అని వీధిలోనికి వెళ్ళి వసంతని పిలిచాడు. అమ్మలు నవ్వుకుంది. వసంత తిరిగొచ్చాక "ఏం చెప్పాడు మీ అన్నయ్య?" అంది.

వసంత నవ్వింది. నవ్వి అంది "కొంచెం మజ్జిగ అన్నం తినిపించమన్నాడు కలిపి తేనా?" అని అడిగింది

"వద్దులే... నే వెళ్లితింటాను" అంది అమ్మలు

ఆపైన అమ్మలునడిగి విషయంమంతా తెలుసుకుంది వసంత. వెంటనే తల్లి దగ్గరకెళ్లి- "అమ్మా! అవిణ్ణెందుకన్నిమాటలన్నావు? ఎప్పుడూలేంది, ఏమియిందీవాళ నీకు? అయినా వదిన సంగతి నీకు తెలియదా?" అని అడిగింది గట్టిగా

"ఏం? నిన్ను నా మీదకి దాడికి పంపిందా? నీ పని నీవు చూసుకో. అనవసరమయిన గొడవల్లో తలదూర్చకు ఫో" అంది.

"ఇవాళ నీకేదో పీడ పట్టింది" అని కోపంగా వచ్చేసింది వసంత. తిరిగి వచ్చిన వసంతని అడిగింది, "ఎక్కడకెళ్లావ్?" అని. వసంత సంగతి చెప్పింది.

"ఎంత పనిచేశావు వసంతా! ఆవిడ నన్ను మరింత అపార్థం చేసుకుంటారు" అని కడుపులో పేగులు నకనకలాడుతుంటే భోజనానికి లేచింది. భోజనం దగ్గర సన్నని గొంతుతో అంది "వసంతా! ఒక విషయం చెపుతా నీకేదైనా సలహా తోచితే చెప్పు. లేకపోతే మనసులో ఉంచుకో. ఎవరితోనూ అనకు. ముఖ్యంగా మీ అన్నయ్యకు తెలియకూడదు. తెలిస్తే చాలా ప్రమాదం" అంది.

ఆందోళనగా చూసింది వసంత "ఎవరితోనూ చెప్పనని ఒట్టెయ్యి"

"అసలేం జరిగింది వదినా?" చేతిలో చెయ్యివేస్తూ అడిగింది. సాధారణంగా ఆఫీసులో ఏ గొడవ జరిగినా ముందు భర్తకు చెప్పదు. ఎవరూ లేనపుడు వసంతని పిలిచి చెపుతుంది. ఎంతో జటిలసమస్య అయితేగాని వదిన అంత ఆందోళనగా కనిపించదని వసంత ఇందాకట్నించీ అనుకుంటూనే ఉంది. వదిన ఏం చెపుతుందోనని ఎదురుచూస్తోంది. అమ్మలు ఉదయం సిసీలియా నుండి సర్పంచ్ భార్య సంగతి వరకూ చెప్పి, దగ్గరగారా! అని అసలు విషయాన్ని చెప్పింది. వసంత పిడుగు పడ్డట్టు అదిరింది, "వదినా! ఇంత జరిగితే ఇంత నెమ్మదిగా ఎలాగుండగల్గుతున్నారు?" అడిగింది.

"ఏం చేయమంటావ్? మీద పడబోతున్న దూలాన్ని జాగ్రత్తగా తప్పించుకోవాలిగానీ తొందరపడకూడదు" అని ఈ ఉద్యోగంలో ఇంతకన్నా ప్రమాదాలు ఫేస్ చెయ్యాలమ్మా. మొన్న చదివావుగా మరియమ్మ గురించి" అంది.

"సరిగ్గా ఈ టైంలోనే అమ్మకేం పట్టుకుంది?"

"అది మా వదినగారి ప్రభావంలే. దానికి వర్రీ అవ్వకు"

"ఆవిడలాటి మనిషా? అవుతే మధ్యాహ్నామే పొమ్మని చెప్పేద్దాం"

"దేనికీ తొందరపడకూడదు"

ఆలోచిస్తూ ఉండిపోయింది వసంత. కాసేపటికి అంది, "సర్పంచ్ విషయం అన్నయ్యకు చెప్పడమే మంచిదొదినా!" అంది.

"అదే నేనూ అనుకుంటున్నాను. కానీ ఆయన తొందరపాటు మనిషికదా! పోనీ నీ మనసులో ఉంచుకో. నేను బాగా ఆలోచించాక పరిష్కారమార్గం కుదరనప్పుడు అన్నయ్యకు చెప్పటం మంచిదా, కాదా అన్న విషయం గురించి ఆలోచిద్దాం" అంది. అంతలో వాళ్ళ వదిన వచ్చి, "నేను బయలుదేరుతున్నా అమ్మలూ... జాగ్రత్త. అనవసరంగా గొడవలు పడకు అత్తగారితో" అంది తనకేమీ తెలియనట్లు ముఖం పెడుతూ. అమ్మలు ఉండమనలేదు. "ఉండు, బొట్టుపెడతాను" అని బీరువా తెరిచి జాకెట్టుముక్క చేతిలో పెట్టింది. "ఇవన్నీ ఇప్పుడెందుకమ్మా" అంటూనే బేగ్‌లో పెట్టుకుంది జాకెట్టుముక్కని వదిన. "అమ్మనీ, అన్నయ్యనీ అడిగినట్లు చెప్పు, బాబు పుట్టినరో




జుకు ఉత్తరం రాస్తాం... రండి'' అంది.

ఆ తరువాత ''పిన్నిగారూ! వస్తానండి. తమ్ముడిగారికి చెప్పండి. వెళ్లినపుడు చెప్పటం మరిచాను'' అని అంటుంటే అత్తగారు పిల్లల చేతిలో డబ్బులు పెట్టటం చూసింది అమ్మలు.

''మన అంచనా కరెక్టే'' అని కళ్ళతో సైగచేసింది వసంత. ''పిన్నిగారూ మీ ఆరోగ్యం జాగ్రత్త'' అని ఆమె వెళ్తొంటే వీధి వరకూ సాగనంపి వచ్చి 'పీడా వదిలింది' అంది వసంత.

'నోర్ముయ్' గద్దించింది తల్లి వసంతని.

★ ★ ★

ఆ రోజు ఎం.డి.ఓ. ఆధ్వర్యంలో జనరల్‌బాడీ మీటింగ్ జరుగుతోంది.

ఈ మీటింగ్‌లో ఎం.డి.ఓ. పర్యవేక్షణలో ఉన్న అన్ని విషయాలూ ప్రస్తావనకు వస్తాయి. ఉపాధ్యాయుల సమస్యలూ, వి.డీ.ఓల పనితీరూ, మండల్ ఎడ్యుకేషన్ ఆఫీసర్ల రిపోర్టులూ, పి.హెచ్.సి. కార్యకలాపాలూ అన్నీ ప్రస్తావనలోనికి వస్తాయి. అందుకే ఆ మీటింగ్‌కు డాక్టరుతోపాటు బి.ఇ. హెచ్వీ, హెచ్చెస్‌లూ అందరూ అటెండవుతారు. ముందుగా రోజ్‌గార్ నిధుల పంపిణీ, వాటినెలాగ వినియోగించాలీ అన్న విషయాల గురించి చర్చించారు. తరువాత టీచర్లు ఎం.ఇ.బి. మీద తిరుగుబాటు చెయ్యటం గురించి ప్రధానంగా చర్చించటం జరిగింది. చివరగా పి.హెచ్.సి పరిధిలో పారిశుధ్యం సరిగా ఉండటం లేదనీ, హెల్త్ ఉద్యోగులు గ్రామాలకు సరిగా వెళ్ళటం లేదనీ, కుటుంబ సంక్షేమ కార్యకలాపాలలో చురుకుగా పాల్గొనుట లేదనీ రిపోర్టు చేశాడు డాక్టరుతో. డాక్టరు అందుకు అభ్యంతరం చెపుతూ తన పరిధిలో ఉన్న వైద్య సిబ్బంది చురుకుగా పనులు చేస్తున్నట్లు, అనుకున్న కోటాను మించి కుటుంబ నియంత్రణ శస్త్ర చికిత్సలు చేయిస్తున్నట్లు రిపోర్టులు చూపెట్టాడు. హెచ్చెస్, హెచ్వీలు రికార్డులు చూపించారు. అయినా చేసిన దానికి తృప్తి చెందకుండా మరికొన్ని విజయాలు సాధించాలి అన్నాడు ఎం.డి.ఓ. ఇంతలో రావివలన సర్పంచ్‌లేచి ''అయ్యా! డాక్టరుగారూ! మా సబ్ సెంటరులో ఏ.ఎన్.ఎమ్.ని బదిలీ చేశారు. కానీ కొత్తామెను ఎయ్యరా ఏటి?'' అడిగాడు.

''మీ సబ్ సెంటరుకు ఏ.ఎన్.ఎమ్. రావటం లేదా?''

''వస్తే నానెందుకు అడుగుతానండీ?''

''అదేమిటి? అమ్మలు గారొస్తున్నారుకదా!'' అన్నాడు డాక్టరు. హెచ్వీ, హెచ్చెస్ అందరూ ఆశ్చర్యపోయారు.

''ఆవిడ చాలా సిన్సియరు వర్కరు. రాత్రి పగలూ కూడా పని చేస్తారు. ఆవిడ రావటం లేదంటే మాకందరికీ చాలా ఆశ్చర్యంగా ఉంది'' అన్నారు హెచ్వీ.

''అయితే అక్కడకి మేమే అబద్ధాలకోరుల మేటండీ?''

''అలాగని నేనటం లేదండీ!''

''మరి మీ మాటల కర్థమేటండీ?''

''సరే... ఆమెని పిలిచి మేం అడుగుతాం. మీరు రిటెన్‌గా రిపోర్టివ్వండి'' అన్నాడు డాక్టరు. డాక్టరు అలాగనటంలో అర్థం హెచ్వీ గమనించకపోలేదు. హాస్పిటల్లో ఎవరికీ లొంగని వ్యక్తుల్లో మొదటిది అమ్మలైతే, రెండోది రమీజా. తక్కిన వాళ్లందరూ శీలం తక్కువ వాళ్ళని కాదు కానీ అమ్మలూ, రమీజా శరీర సౌష్టవం, అందం ఉన్నవాళ్లు, సరదాకి కూడా అనవసరపు హాస్య ప్రసంగం చేయనివాళ్లు. డాక్టరు ఎన్నిసార్లో వాళ్ళమీద వల విసిరినా ఆ వలకి వాళ్లు చిక్కలేదు. రెండు మూడు సార్లు ఏదో రకంగా వాళ్లని భరతం పట్టమని హెచ్వీకి చెప్పినా, హెచ్వీ అందుకు సమ్మతించలేదు. ఇప్పుడు రిటెన్‌గా కాగితం ఇస్తే డాక్టరుగా వాళ్ల మీద ఏక్షన్ తీసుకోవచ్చు, పొరపాటు వాళ్లలో ఉంటే. లేదా ఎక్స్‌పలేన్షన్ కాల్‌ఫర్ చేసి కాపీ డిఎమ్వోకి పంపవచ్చు. ఈ రకంగానైనా వాళ్ల మీద కక్ష సాధించవచ్చు. వాళ్ల మీదంటే అమ్మలు మీదే! ఇక రిటెన్‌గా తీసుకుంటే అమ్మలు డ్యూటీకి వెళ్లినట్లు రుజువైతే సర్పంచ్‌కేమీ అవకపోయినా ఫూలవుతాడు. ఇదీ డాక్టరు తెలివి తేటలు.

ఆ వారంలో డి.ఎమ్వో కేంపుంది. అందుకే డాక్టరుగారన్నారు నేనీ విషయం డీఎమ్వో దృష్టికి కూడా తెస్తానని. సర్పంచ్ చాలా సంతోషించాడు. అతను తన ఊళ్లో వాళ్లని పిలిచి ఏఎన్నెం రాలేదని చెప్పమంటే అందరూ అలాగే తలూపుతారు తప్ప ఎదురుతిరగరని



తెలును. అప్పుడు ఏఎన్ఎమ్ కాళ్ల బేరానికి వస్తుందని అతనాశించాడు.

కానీ అమ్మలు అందరిలాంటిది కాదని, ఆవిడ చాలా తెలివైందని, అతనూహించలేదు. ఇక డాక్టరు విషయానికొస్తే రమీజాని నాటకీయంగా వలవేసి పట్టాడు. అమ్మలు ఈ దెబ్బతో తేరుకోలేని దెబ్బ తింటుంది అనుకున్నాడు. కానీ అవసరమైతే ఉద్యోగాన్నయినా వదులుకుంటుందిగానీ మనిషి మాత్రం లొంగేదికాదని అతనికి తెలిసి రాలేదు.

హెచ్వీ మాత్రం అమ్మలుని డాక్టరు పన్నిన ఉచ్చులో పడకుండా చేయాలని దృఢ దీక్షతో ఉంది. చాలా రోజుల క్రితం అంటే మొదట్లో ఈ వృత్తిలో ప్రవేశించినతొలిరోజుల్లో కేరెక్టరు విషయంలో ఆమె చాలా స్ట్రిక్టుగా ఉండేది. కానీ తనూ తనకుటుంబ పరిస్థితి, ఆర్థిక పరిస్థితులూ ఈ వృత్తిలో ఉన్న సాంకేతికపరమయిన ఇబ్బందులూ ఆమె మీద మచ్చవేశాయి. తత్ఫలితంగా ఆవిడ జీవితంలో కోలుకోలేని దెబ్బ తింది. అందుకే ఆవిడ పెళ్లి చేసుకోకుండానే జీవితాన్ని గడుపుతోంది. ఈ వృత్తిలో చేరగానే ముందు చేయాల్సింది ఎవర్నో ఒక మంచి వ్యక్తిని పెళ్లి చేసుకోవటం, లేదా పెళ్ళి చేసుకోవటం అనే విషయాన్ని పూర్తిగా మరిచిపోవటం చెయ్యాలంటుంది ఆమె. వార్డుబోయ్ దగ్గర్నుంచి డిఎమ్వో వరకూ ప్రతీ వ్యక్తి చేసే పిచ్చిపనుల్నించీ ఆకలి చూపుల నుంచీ సురక్షితంగా బయటపడాలంటే ఈ రెండే మార్గాలంటుంది. ఇన్ని జాగ్రత్తలు పడుతున్నా ఇంకా సర్పంచులూ, మండల ప్రెసిడెంట్లూ ఎమ్మెల్యేలూ ఈ తెల్లబట్టలు కట్టుకున్న అందమైన ఆడవాళ్లని చూస్తే పెళ్లయిందన్న విషయం కూడా మరిచి నంగిరోడుతూనే ఉంటారు. అందుకే తీరిక దొరికినప్పుడల్లా తననెవరూ ఆదర్శంగా తీసుకోవద్దంటూ నవ్వుతుంది... నవ్విస్తుంది.

హాస్పిటల్ కెళ్లగానే రమీజాని పిలిచింది. రహస్యంగా విషయం చెప్పింది. అమ్మలునోసారి రమ్మని కబురు చేసింది.

★ ★ ★

ఆసుపత్రిని సర్ప్రయిజింగ్ విజిట్ చేయడానికి డిఎమ్ఓ వచ్చాడు. ఆ సమయానికి సరిగ్గా డాక్టరు అమ్మలుకి సంజాయిషీ నోటీసు ఇవ్వటం, అమ్మలు రావటం రెండూ ఒకేసారి జరిగాయి. అందరూ డాక్టరు మీదే అనుమానపడ్డారు.

డాక్టరుగానీ ఎంక్వయిరీ విషయం డిఎమ్వోకి ఘాటుగా అమ్మలు మీద రిపోర్టు చేశాడా?

రిపోర్టు చేసినా విషయం తేలకుండా డిఎమ్వో జోక్యం చేసుకోరే?

ఒకవేళ జోక్యం చేసుకున్నా ముందుగా తన దగ్గరకి పిలిపించుకుంటారుకదా!

ఇలా రకరకాల ఊహాగానాలు చెలరేగుతున్నాయి. హాస్పిటలు అంతా తిరిగారు. పేషెంట్లునీ, వాళ్ళకిస్తున్న ట్రీట్మెంట్ల గురించీ ఎంక్వయిరీ చేశాడు. బిఇని, హెచ్వీలనీ, హెచ్చెస్సీ పిలిచారు. రికార్డులు మొత్తం మందూ కప్లుతంగా చూశారు. ఓపిలోకి వెళ్లారు. అక్కడున్న మందులు సరిగా ఉన్నాయో లేదో చూశారు. రిజిష్టరు సరిగా మెయిన్టెయిన్ చేయలేదని డాక్టర్ని చీవాట్లేశారు. ఆసుపత్రిలో పరిశుభ్రత లేదని స్టాఫ్ మొత్తాన్ని చీవాట్లేశారు.

ఇంతలో ఓ.పి.నుండి డాక్టరురూంకి తిరిగి వస్తూంటే, అక్కడ ద్వారం దగ్గర నిల్చుని నమస్కారం చేసిన ఏఎన్ఎమ్ని చూసి "నీ పేరేంటమ్మా!" అని అడిగాడు.

"పి.అమ్మలు అండీ" అంది.

"అమ్మలా? అసలు పేరా? ఇంట్లో ముద్దుగా పిల్చుకున్న పేరా!"

"అసలు పేరే అది"

"ఎక్కడ పనిచేస్తున్నావ్?"

"రావివలస సబ్ సెంటర్లో"

"మరి డ్యూటీ చేసుకోక ఈ టైంలో ఇక్కడెందుకున్నావ్?" కోపంతో అడిగాడు.

అందరూ తప్పుకోమని సంజ్ఞ చేశారు. అతనలా అడుగుతూ రూంలోకెళ్లి కుర్చీలో కూర్చుని "ఆ అమ్మలు గార్నిలా రమ్మనండి" అన్నారు.

అమ్మలు మళ్లీ నమస్కారం పెట్టుకుని లోనికెళ్లింది.

"ఎలిమెంట్రీ స్కూలు పిల్లల్లాగా ఇన్నిసార్లు నమస్కారం అక్కర్లేదమ్మా. ఇంతకీ నువ్వు సెలవు పెట్టావా?" అడిగారతను.

"లేదండీ" ధైర్యంగానే జవాబిచ్చింది




అమ్మలు.

"ఏమిటీ సెలవు పెట్టకుండా ఇలా షికార్లు కొడుతున్నావా? డ్యూటీకి ఎగనామం పెట్టి" తీక్షణంగా చూస్తూ అడిగారు.

"అదికాదండీ?" అని డాక్టరు జోక్యం చేసుకో బోతే "నేను మిమ్మల్ని అడగలేదు. ఆమె నడుగుతున్నాను... మీరాగండి. ఊఁ... చెప్ప మ్మా. నువ్వసలు రావటానికిగల కారణం ఏమిటి" అడిగారు.

"డాక్టరుగారు నాకు సంజాయిషీ నోటీ సిచ్చారండీ?"

"దేనికి?"

"డ్యూటీకి సరిగా అటెండవటంలేదని"

"డ్యూటీకి అటెండు కాకపోతే నోటీసివ్వరా? నేను సస్పెండు చేస్తాను"

"అదికాదండీ"

"ఏదికాదు?"

"నేనెటెండు కావటంలేదని ఆ గ్రామ సర్పంచ్ ఫిర్యాదు మేరకు నోటీసిచ్చారు"

"దీనికి నీ సంజాయిషీ ఏమిటి?"

"ఇదిగోసార్" అని ఆమె సంజాయిషీ తయారు చేసిన కాపీలు అతని ముందుంచింది. అతను నొసలు చిట్లించి చిరాకుపడ్డాడు. కళ్లజోడు తీసి రుమాలుతో కళ్లు తుడుచుకున్నాడు. "నాకు చదవటానికి ఓపికలేదు. నువ్వే చదివి వినిపించు" అన్నా రు అతను.

ఆమె ఆ సంజాయిషీ అందుకొని చదవబో యింది. అంతలో మళ్లీ అతనే "చూడు, ఆ గ్రంథం అంతా నువ్వు చదివినా నాకు టైంలే దు. ఇలా కూర్చో. మూడు ముక్కల్లో చెప్పే సెయ్, అసలు సంగతేమిటో" అన్నారు.

అమ్మలు తడుముకోకుండా క్లుప్తంగా, వివరంగా విషయాన్ని చెప్పింది.

"ఎవడా సర్పంచ్?" అన్నాడు కళ్లు చింత నిప్పుల్లా చేస్తూ.

హెచ్వీని పిలిచారు. "ఏమ్మా! వర్క్‌లో ఈమె ఎలాగుంటుంది?" అడిగారు. హెచ్వీకి మంచి అవకాశం దొరికింది. ఆ అవకాశం దొరకటం ఎంతో అదృష్టంగా భావించింది. "ఈ అమ్మాయంత సిన్సియర్ వర్కర్‌ని నేనింతవరకూ సర్వీస్‌లో చూళ్లేద్సార్. డెలివరీ కేసు అర్ధరాత్రివస్తే నడిచి అయిదు మైళ్ళ యినా పరుగెడుతుంది సార్. ఇక ఫామిలీ ప్లానింగ్ ప్రోగ్రాంలో ప్రజల్ని ఎంత మొండి వాళ్లనైనా చాలా చాకచక్యంగా ఒప్పిస్తుంది సార్! ఆ ఊర్లోనే హరిజనవాడ వాళ్ళయితే ఈమెకు బ్రహ్మరథం పడతారు" అంది. అంతలోనే ఏదో గుర్తుకొచ్చి "ఆఁ... నర్సింగూ అక్కడ చెట్టుమీదనుంచి పడిన పేషెంట్... పక్కన రావివలసనుండి వచ్చిన వాళ్ళున్నారు ఇలా పిల్చుకురా!" అంది.

వాడు ఒక్క అంగలో పరుగెత్తుకెళ్లి అతన్ని తీసుకొచ్చాడు.

"ఇతంది ఆ ఊరేనండి" అని పరిచయం చేసింది.

"ఏమయ్యా! ఈవిణ్ణి నువ్వెప్పుడైనా చూ శావా?"

"అదేటండి చూశారా అంతారు? ఆవిణ్ణి ఎరగనోల్లు మా ఊల్లో ఎవురుంతారండి? ఆవిడ మా పాలిట దేవతండి. ఆవిడొచ్చాక మా ఆసారి ఆటలు కట్టేసినాయండి!" అన్నాడు.

"ఆసారంటే?"

"హెల్త్ గైడండీ!"

"అతడేం చేశాడు?"

"ఏటి సేసేవాడని మెల్లగా అడుగుతారే టండి? నన్ను గవర్నిమెంటు ఏసినాది, ఈ ఊరికి నానే డాక్టర్నీ అనేవోడండి. జడ్డిముండాకొ డుకులం కదండీ. నిజమే అని నమ్మినాము. ఆడింది ఆట పాడిందిపాట అయిపోనాదండీ. ఇండీషన్ పొడిస్తే ఇరవై ఇచ్చీవోల్సిందేనండి. ఒకసారి జొరంగుందని ఇండీషనిచ్చినాడండి ఒక కుర్రాడికి. ఆ కుర్రాడికక్కడే సుహతప్పి నచ్చిపోనాడండీ. అతగాడన్నాడండీ- సందిపా తకం కమ్మీసినాది. దేవుడయినా చేసేదేం లేద న్నాడండీ. నమ్మీసినాం. మా ఊరి కూల్లో టీస రుగా వచ్చినామె మాత్రం అనవసరంగా పండంటి కుర్రాణ్ణి పొట్టనెట్టుకున్నాడంటా దండీ. మామలా ఆవిడ మాటలు నమ్మేవో ల్లంకాదండీ. ఈ యమ్మొచ్చాక మాకన్నీ తెలి సొచ్చినాయండీ!" అన్నాడు.

'ఏమండీ! మీ దగ్గరంత సిన్సియర్‌గా వర్కు చేస్తోన్నామె మీద ఆ వెధవెవడో రిపోర్టి

స్తే మీరెలా నమ్మేసారండీ? వెళ్ళమ్మా! నీ డ్యూటీ నువ్వు చేసుకో నీకా ప్లేస్ ఇష్టం లేకపోతే నీకు నచ్చిన చోటుకి కాగితం పెట్టుకో. ఖాళీ ఉంటే ట్రాన్స్‌ఫర్ చేస్తాను. లేదా ఎవరయినా మూచివలు ఇస్తారేమో కనుక్కో. కనుక్కొని అప్లయిచెయ్యి. చాలు నా దగ్గరకు రానవసరం లేదు'' అన్నారు. అనేసి ''వెళ్లండి... మీ పనులు చేసుకోండి'' అన్నారు అందర్నీ. ఆడాళ్లందరూ వెళ్లారు.

ఆ తరువాత చెప్పారు, ఇక్కడ 10 పడకల ఆస్పత్రికి ప్రపోజెల్సు శాంక్షన్ అయినట్లు, దాని ప్రారంభోత్సవానికి వైద్య ఆరోగ్యశాఖ మంత్రి రానున్నట్లు.

ఆ తరువాత 'డి.ఎమ్వో' ముందు ధైర్యంగా చెప్పిన అమ్మలునీ, మంచి సపోర్టిచ్చిన 'హెచ్వీ'ని ఎంతగానో మెచ్చుకున్నారు. డాక్టరుకి మాత్రం గొప్ప పరాభవంగా తోచింది. అక్కణ్ణుంచి 'హెచ్వీ'తో ఎడముఖం పెడముఖంగా ఉన్నా ఆ అలుక ఎన్నాళ్ళో ఉండలేదు.

★ ★ ★

రమీజా గురించి ఆ రకమైన వార్త వినవలసివస్తుందని అమ్మలు అనుకోలేదెప్పుడూ. అది విన్నదగ్గర్నించీ మనస్సు చిల్లులు పడిపోయినట్లయిపోయింది. ఎంత వేగిరం వెళ్ళి ఈ వార్త 'అబద్ధం' అని రమీజా నోట విందామా అని ఎదురుచూసింది అమ్మలు.

ఎక్కడకయినా వెళ్ళాలంటే ఈమధ్య ఇంట్లో ఒకటి చాలా చిక్కగా ఉంటోంది. ఉదయం లేవగానే అత్తగారికి ఏ పనీ మిగల్చకుండా పనులన్నీ ముగించుకుని కేంపులకి వెళ్ళాల్సివస్తోంది. వసంత వెనక సాయం రాకపోతే ఇంకా ఇబ్బంది అయిఉండేంది. ఈమధ్య ఆవిడ వసంతమీద కూడా అనవరసరంగా విరుచుకుపడుతోంది. నిన్నటికినిన్న వసంత చీకట్నే లేచి వంటపని సాయంచేస్తోంది. మునలావిడ లేచింది. చూసింది. ''ఏమే! పరీక్షలు దగ్గర పడుతున్నాయికదా, వంటపొయ్యి దగ్గర తచ్చాడుతున్నావేం?'' అంది. వసంత సమాధానం చెప్పలేదు. ''నీకే చెప్పేది వినిపించటం లేదా?'' అంది. వసంత ఊరుకోలేదు. ''నువ్వు పడుకో, నిన్నెవరూ సాయం చెయ్యమనలేదు. నా బాధేదో నేను పడతాను'' అంది.

''నీకీమధ్య తలబిరుసుతనం ఎక్కువయింది. ఇంటికి నీలకత్తి, పొరుగింటికి బంగారుకత్తి, అన్నట్లుంది వాటం'' అని రుసరుసలాడుతూ వెళ్ళిపోయింది.

''వెళ్ళు వసంతా! చదూకో... నిజమే. పరీక్షలు దగ్గరపడుతున్నాయి కూడా!''

''వదినా! అమ్మ మాటలు లెక్కచేయకు'' అని వసంత ఎంత చెప్పినా విన్లేదు. ఈమధ్య ఈ రకమయిన చికాకుల్తో సతమతమయిపోతోంది. ఈ బాధలు భర్తకి చెప్పి మనశ్శాంతి లేకుండా చేయటం ఇష్టంలేక మనసులోనే అనుభవిస్తోంది.

ఖాళీ దొరికినప్పుడల్లా అమ్మలు మనసు రమీజామీదకే పోతోంది. రమ్మని ఒకరిచేత కబురు పంపినా రమీజా రాలేదు. కబురందిందో లేదో మరి? అనుకుంది. 'జీతాల కోసం ఎలాగూ వెళ్ళాలి!' అనుకొంది.

ఆ రాత్రి సుదర్శనంతో అంది. ''ఏమండీ! రేపు జీతాలరోజు. పి.హెచ్.సి.కెళ్ళాలి. రమీజా ఏదో చికాకుల్లో ఉన్నట్లు తెలిసింది. ఒకసారి అన్ని విషయాలు మాట్లాడి రావాలని ఉంది. బాబుని తీసికెళ్తాను. వీలయితే- అవసరమయితే రాత్రికుంటాను. అంది. 'సరే అలాగే కానీ' అని భర్త అనుమతి ఇవ్వగానే ఎంతో పొంగిపోయింది. ఆ మర్నాడు వంట చేసుకొని బయలుదేరింది. తిన్నగా రమీజా ఇంటికి వెళ్ళింది. ''హల్లో! బాబుని తీసుకొచ్చావా? ఎన్నాళ్ళకెంతో మంచి బుద్ధి కలిగింది? బావగార్ని కూడా తీసుకురాలేకపోయావా?'' అంది.

''చాల్లే... మాబాగా చెప్పావు. ఇప్పటికే పుట్టెడు గొడవలతో చస్తూంటే!'' అంది.

''గొడవలా? నీకేం గొడవలక్కా?'' ఆందోళనా, కంగారూ కలిసిన స్వరంతో అడిగింది.

''గొడవలంటే పీకలు తెగిపోయేవేం కాదులే. మధ్యతరగతి కుటుంబాల్లో ఎప్పుడూ ఉండేవే. ఈమధ్య మా ఇంట్లో ఒక 'సూర్యకాంతం' ప్రవేశించి చిచ్చుపెట్టి వెళ్ళింది. దాని నిప్పు ఇంకా చల్లారలేదు'' అని తన ఇంట్లో గొడవల్ని సంక్షిప్తంగా చెప్పింది అమ్మలు. రమీజా బాబుని ఎత్తుకుని 'ఏరా కన్నా' పిన్ని దగ్గరుండిపోరా! అక్కా, వీణ్ణిక్కడ రెండ్రోజు

లుంచేయ్, సెలవు పెట్టుకుని వీడితోనే రెండు రోజులూ గడిపేస్తాను'' అంది.

''ఏం? మీ ఆయన ఎటెళ్ళాడు?''

''డ్యూటీకి''

''ఎప్పుడొస్తాడు?''

''తెలీదు'' నిర్లిప్తంగా అంది.

''ఇట్రా'' పిల్లాణ్ణి పట్టుకొని ఇంట్లోకి వెళ్ళబోతోన్న రమీజాని ఆపింది. రమీజా ఆగింది. ''ఎక్కడకి వెళ్తున్నావు?'' అడిగింది.

''కూర్చో... ఇప్పుడు కాఫీలూ, మర్యాదలూ నీ నుండి స్వీకరించటానికి నేను రాలేదు. నేను రెండుసార్లు రమ్మని కబురు చేసాను. అందిందా?'' అడిగింది.

అందినట్లు తలూపింది.

''మరెందుకని రాలేదు?''

''తీరుబాటు కుదరలేదక్కా!''

''అబద్ధం!''

జవాబు చెప్పలేదు రమీజా. కూర్చుండిపోయింది. బాబుని వొళ్ళో కూర్చోపెట్టుకుని వాడి జుట్టు నవరిస్తూ తలను వాల్చుకుంది. అమ్మలు ఊరుకోలేదు. ''ఏయ్... జవాబు చెప్పవేం?'' అని చుబుకాన్ని పట్టుకొని మీదకెత్తింది. రమీజా కనుకొనుకులనిండా జారి పడటానికి సిద్ధంగా ఉన్న అశ్రువులు కనుపించాయి.

''ఏయ్ రమీ, ఏంటిది?''

''అక్కా! దయచేసి నన్నేమీ అడక్కు. తెలుసుకుని నీ మనసు పాడుచేసుకోకు'' అంది మునిపంటితో పెదాన్ని కొరుకుతూ, వచ్చే దుఃఖాన్ని ఆపే ప్రయత్నంలో.

''ఏం? నేన్నీకేమీ కానా? నాకు చెప్పకుండా ఒక పొరపాటు చేశావ్. అప్పుడూరుకున్నాను. ఇప్పుడూరుకునేది లేదు. చెప్పకపోతే బాబు మీద ఒట్టే!'' అనేసింది. ఆ మాట నోటమ్మటవస్తుందని అమ్మలూ అనుకోలేదు.

''అక్కా!'' గట్టిగా అరిచింది.

''చెప్పు అయితే'' అంది.

''అయిపోయిందక్కా! ఇన్నాళ్ళూ కట్టుకున్న మడిబట్టమైలపడిపోయింది. జీవితం తగలడిపోయింది. ఇప్పుడు నేను పాపాల పుట్టనయ్యాను'' అని వెక్కివెక్కి ఏడ్చేసింది. అలా ఏడుస్తోన్న రమీజా తన జీవితం ఎలా ముక్కలయిందో చెప్పటం మొదలెట్టింది.



రాత్రి పది గంటలయింది.

భోజనం ముగించి లైటార్పి పడుకున్నాను. అమ్మ జీవితం కళ్ళ ముందు కదిలింది. కలకత్తా వెళ్ళి వచ్చిన దగ్గర్నుంచి నాకు కొత్తగా అయిన అలవాటు ఏమంటే అమ్మ ఫొటోను చూచి ముద్దుపెట్టుకుని, కళ్ళకద్దుకుని పడుకోవటంలో ఎంతో తృప్తి అనిపించేది. ఆరోజే అమ్మమ్మ ఉత్తరం రాసింది. ఆ ఉత్తరంలో ప్రతి వాక్యం ఎన్నిసార్లు చదువుకున్నానో చెప్పలేను. లైటువేసి మళ్ళీ చదవాలనిపించింది. లైటు వేశాను.

''ప్రియమైన మనవరాలు రమీజాకు...

తాతా, అమ్మమ్మ అనేక ముద్దులతో రాసుకున్న ఉత్తరం ఏమనగా- ఇక్కడంతా క్షేమం, అక్కడ నీవు ఒక్కత్తెవే ఎలా ఉన్నావో, ఏమో మాకు బెంగగా ఉంది. ఇన్నాళ్ళూ ఈ బెంగ మీకెందుకులేదూ?' అని నీకనిపించవచ్చు. అలా నువ్వు నిలదీసి అడిగితే కారణం మేం చెప్పలేముకానీ - అది మా ప్రారబ్ధం అని మాత్రం అనుకుంటాము. మా ఇంట అసలు ఆడపిల్లలే లేరు. అటు తరంలోనూ, ఇటుతరంలోనూ మీ అమ్మ ఒక్కతే. ఎంతో ముద్దుగా పెంచాము. అలాంటి మా అమ్మాయికి 'ఆకాశమంత పందిరి భూదేవి అంత పీట' వేసి 'నభూతో నభవిష్యతి' అన్నంత అద్భుతంగా, వారంరోజుల పెళ్ళి- పాత పద్ధతుల్లో చేద్దామనుకున్నాం. కానీ- 'తాము ఒకటి తలిస్తే దైవం ఒకటి తలుస్తుంది' అన్నట్లు అంతా జరిగిపో

యింది. అది భయంతో మాకు విషయం చెప్పలేదు. అది చెప్పేసరికి చాలా ఆసల్యం అయింది. ఆ కుర్రాడికోసం గాలించాం. బాషా గారు కూడా తిరగని చోటులేదు. కానీ ఎక్కడా అతని ఆచూకీ దొరకలేదు. తొమ్మిది నెలలు, మీ అమ్మ నిన్ను కనగానే నిన్ను బాషాగారింట విడిచి, మీ తాత మీ అమ్మని తీసుకొచ్చేసారు. ఎన్నోసార్లు మీ అమ్మ నిన్ను కళ్ళారా చూడాలని కోరుకునేది.. మేమే బలవంతంగా మళ్ళీ అను బంధం పెంచుకొంటే మీ అమ్మ మా మాట వినదని నువ్వు చనిపోయావని అబద్ధం ఆడాం. నీకిలా రాస్తే కోపం వస్తుందికదూ? చేసిన పాపం చెప్తే పోతుందంటారు. ఒక జీవితాన్ని బాగుచేయటంకోసం ఒక అబద్ధం ఆడాం కానీ- ఆ అబద్ధమే మమ్మల్ని జీవి తాంతం దహించేస్తుందని ఆనాడు మేం ఊహించలేదు. ఊహిస్తే- ఎలాగున్నా మా పిల్ల మా కళ్ళముందుంటే చాలనీ దాని కోరికనే నెరవేర్చి ఉండేవాళ్ళం. అనుకోకుండా ఒక మంచి సంబంధం వచ్చింది. మా కులంవా ళ్ళే. ఆ కుర్రాడికి మొదటో పెళ్ళి జరిగింది. పెళ్ళి జరిగిన సంవత్సరం తిరక్కుండానే పె ళ్ళాం పోయిందట. మా పెద్దాడికి బాగా స్నే హితుడు మా అమ్మాయి సంగతి అతనికి పూర్తిగా తెలుసు. తెలిసీ అతను మా పిల్లను చేసుకోడానికి మనసా అంగీకరించాడు. అతనో డాక్టరు. మేమెంతో సంతోషించాం. దాని జీవితం ఒక సరియైనగాడిలో పడిందని సంతో షించాం. కానీ మా ఆశలన్నీ అడియాశలై నాయి. ఆ దిక్కుమాలినవాడు ఏం మాయ మంత్రం వేశాడో మరి! 'తాను పట్టిన కుందేటికి మూడే కాళ్ళ'ని ఎందరెన్ని చెప్పినా అది వినలేదు. దానిమాటే దానిది. 'అతనొస్తారు. మీకు భయపడి రావటంలేదు' అంది. మీ తాతకు కోపం వచ్చింది. ''ఈ పెళ్ళి జరగా ల్సిందే. ఇది జరగనిపక్షాన నా శవాన్ని చూ స్తావ్'' అని ప్రతిజ్ఞచేసారు. అదే మా కొంప ముంచింది. కేవలం మీ అమ్మని దారిలో పెట్టడానికే అలాగన్నారు కానీ వేరే ఉద్దేశ్యంతో కాదు. అయితే అంత కోపంలోనూ మీ తాత దాన్నో మాటనలేదు. చెయ్యెత్తలేదు. ఆ తరు వాత వాళ్ళన్నయ్యలు దగ్గరుండి బోధపరిచా రు. సగం రాత్రయిపోయింది. ఎవరూ భోజనా లకు లేవలేదు. అన్నాలమీద ధ్యానలేదు. ఇంట్లో అందరూ పిచ్చివాళ్ళలా తయారయ్యా రు. చివరకు అది ఒకేఒక మాట చెప్పింది. ''ఈ రాత్రికి నన్ను ఆలోచించుకోనివ్వండి'' అని. ఆ మాటకు ఇంట్లో అందరూ ఎగిరిగంతే శారు. ఇంచుమించు దాని మనసు మారిందనే అనుకున్నాం. కానీ ఇంత ఘోరం జరిగిపో తుందని ఊహించలేదు. దాని గదిలో లైటు వెలుగుతోంది. అప్పటికి సుమారు మూడయి ఉంటుంది. సాధారణంగా అది ఏదో పుస్తకం చదువుకుంటుంటుంది. అలాగే చదూ కుంటుందనే అనుకున్నాంగానీ ఇంకోలా ఊహించలేకపోయాం. మూడు దాటిపోయింది కదాని పడుకోమని చెప్పడానికి వెళ్ళాను. తలుపు గుద్దాను. తలుపు ఎంత చప్పుడు చేసినా ఉలుకూలేదు. పలుకూలేదు. నాకు వెన్నులోంచి ఒణుకు పుట్టింది. భయంవే సింది. ''ఏమండీ! ఏమండీ, పాప గదిలో లైటువేసి ఉంది. ఎంత పిల్చినా పలకటంలే దు. ఒక్కసారి లేచిరండి'' అన్నాను. ఎప్పుడూ అయితే ఆయన ఒకంతటికి లేవరు. అలాటిది ఆయన త్రుళ్ళిపడి లేచారు. తలుపు దబదబా బాదారు. ఆ చప్పుళ్ళకు ఇంట్లో అందరూ లేచిపోయారు. అందరూ ఎంత ప్రయ త్నించినా తలుపు తెరుచుకోలేదు. మా పెద్దా డు ద్వారానికి పైనున్న గాజు తలుపులు బల వంతంగా పగలగొట్టి చూశాడు. ''నాన్నగారూ! చెల్లి అచేతనంగా పడిఉంది'' అన్నాడు. ఇను పఊచ తెచ్చి తలుపు విడగ్గొట్టాడు. దాని ముందు టేబులుమీద ఒక ఉత్తరం ఉంది. దానిమీద పేపరు వెయిట్ పెట్టి ఉంచింది.

ఇంకేముంది?

అయిపోయింది?

మా ఆశల వల్లరులు మాడిపోయాయి.

అందులో ఇలా ఉంది. ''నాన్నగారికీ, అమ్మకీ, అన్నయ్యలకీ, వదినలకీ అందరికీ ఇవే నా నమస్కారాలు. నేను మీ ఇంట్లో పుట్టకుండా ఉంటే నానుండి ఇంత చిత్తక్షోభ అనుభవించి ఉండేవారు కాదేమో! పిల్లలు పుట్టి తల్లిదండ్రులకు ఆనందాన్ని కలి గించాలి. నాలాటి దౌర్భాగ్యురాలివలన మీకా నందం ఎలాగూలేదు. అమితమైన ఆవేదన కలిగించినందుకు మన్నించమని వేడు

ఌంటున్నాను. నేను ఒక తప్పుచేసాను. ఒక అమాయకురాలికి తల్లినయ్యాను. నా పాపని అనాధని చేయటం నాకిష్టంలేదు. నేను చేసిన తప్పుకు దానికి శిక్ష విధించటం నేను సహించ లేకపోతున్నాను. మీ పిల్ల జీవితం నిత్యక ళ్యాణం పచ్చతోరణం కావాలని మీరాశిస్తున్న ట్లే- నా కూతురి జీవితం ఆనందమయంకావా లని నేననుకోవటం అత్యాశ ఎంతమాత్రం కాదేనేది నా విశ్వాసం. అయితే నన్ను మరో ఇంటిదాన్ని చేయటంకోసం నా కూతుర్ని మీరు చంపేసారు. (అంటే చనిపోయిందని అబద్ధ మాడారు) నాకు తెలుసు. మీరు అబద్ధం ఆడుతున్నారని. నేనొక దృఢమైన నిర్ణయం తీసుకున్నాను. అదేమంటే నాకు మగాళ్ళమీద నమ్మకం పోయింది. వైవాహిక జీవితంమీద మోజులేదు. శేషజీవితాన్ని ఒంటరిగా బ్రతకలే నన్నభయం నాకే కోశానాలేదు. నేనెలాగూ డిగ్రీ చేసాను. ఏదయినా ఉద్యోగం చేసుకుని నా స్వంత సంపాదనమీద నా భర్త చనిపోయాడే అనుకొని నా పిల్లని చూస్తూ- దాన్ని గొప్పదాన్ని చేయాలనుకున్నాను. అయితే మీ ఆలోచనలు వేరేగా ఉన్నాయి. అలా మీరాలోచించటం తప్పని నేననలేను. ఏ తల్లిదండ్రులయినా అలాగే ఆలోచిస్తారు. కానీ 'నీ నిర్ణయం ఏమిటి?' అని అడిగితే నేను చెప్పదలచుకు న్నాను. కానీ మీరడగలేదు. నాన్నగారూ! నేను మీ మాట వినకపోతే నాశనాన్ని చూడాల్సివ స్తుందని మీరన్నారు. నాకు భయం వేసింది. అమ్మో! ఆ విషయం తలుచుకుంటేనే నా తల బద్దలయిపోతోంది. అందుకే బతికి నేనెవ్వరినీ బాధపెట్టకూడదని ఈ నిర్ణయం తీసుకుంటు న్నాను. మీకు సమ్మతమయితే ఒకమాట! నా కూతుర్ని తెచ్చి మీ దగ్గరుంచుకోండి. దానికి మంచి బతుకునివ్వండి. అది నాలాటి తొందర పనిని చేసి జీవితాన్ని కాల్చుకోకుండా దాన్ని కాపాడండి. దాన్ని మరొక్కసారి చూసి చచ్చిపో వాలనుంది. కానీ చూడలేకపోతున్నాను. (ఇ క్కడ అక్షరాలు చెరిగిపోయాయి. మరి అది ఎంత ఏడ్చిందో వెర్రితల్లి!) తనివితీరా దాన్ని ఎత్తుకొని ముద్దాడాలనిపిస్తోంది. దానికి కడు పారా పాలిచ్చుకోలేని పాపిష్ఠిదాన్ని!

మీ అందరికీ ఇవే నా కడసారి నమస్కా రాలు''

ఇట్లు

మీనుండి దూరం అవుతోన్న మీ కూతురు''

ఉత్తరం వాళ్ళు చదువుతుండగానే నేను కూలిపోయాను.

ఆ తరువాత వాళ్ళు పాపను డాక్టరుకు చూపటం, అది మింగిన నిద్ర మాత్రల డోసె క్కువయి, ఎంత ప్రయత్నించినా ఫలితం లేకపోవటం జరిగిపోయింది. ఆ తరువాత మీ తాతగారు వైజాగ్ వచ్చి బాషా గురించి ఎంక్వ యిరీ చేసారు. కానీ బాషాగారు బరంపురం వెళ్ళిపోయారన్నారు. అక్కడకువెళ్తే ఇక్కడకెవ రూ రాలేదన్నారు. కొన్నాళ్ళు ఎంక్వయిరీ చేసా రు. చివరకు అంతా ఒక నిర్ణయానికి వచ్చారు. బంగారంలాటి బిడ్డపోయింది. మన ఆశలన్నీ కాలిపోయాయి. ఇంకా దాని రూపానికి ప్రతిరూ పమైన దాని బిడ్డని తెస్తే అమ్మ ఇంకా దాన్ని చూస్తూ ఏడుస్తూ కూర్చుంటుంది. దాని ఆరో గ్యం ఇప్పటికే చితికిపోయింది. అది మనకు దక్కకుండా పోతుంది కూడా. అందుకోసం మరి ఆ గాలింపు ప్రయత్నాలు మానండి' అన్నారు నీ మామయ్యలు. అయితే- నేను మనవలతో ఆనందంగా ఉండటానికి ప్రయ త్నించాను. నేను నా కూతుర్ని మరిచిపోయా నని వాళ్ళనుకుంటారు. పిచ్చివాళ్ళు, ప్రతి రోజు కన్నీళ్ళతో నా తలదిండు ఎంత తడు స్తూందో మీ తాతగారికొక్కరికే తెల్సు.

సరిగ్గా మీ అమ్మపోయిన రోజునే నువ్వు వచ్చావు.

విచిత్రం!

మీ అమ్మకీ నీకూ ఎక్కడా తేడా అన్నది లేదు.

మీ అమ్మకు ఎడం కంటిమీద పుట్టుమచ్చ ఉండేది. కంఠమీద తేనెరంగు పుట్టుమచ్చ ఉండేది. సరిగ్గా నీకూ అక్కడే పుట్టుమచ్చలు. మీ అమ్మ జుట్టు చిన్న వంకీలు తిరిగి ఉండేది. అయినా ఒత్తుగా ఉండేది. అదే జుట్టు నీదీ!

మా ఇంట్లో అందరూ తెల్లని తెలుపు. మీ అమ్మ నలుపు కాదు కానీ- అందరిలాటి తెలుపు కాదు. 'నల్లపిల్ల' అని మా ఇంట్లో వెక్కిరిస్తే- బుంగమూతి పెట్టేది. అలా అది బుంగమూతి పెట్టినప్పటి ఫోటో- ఈ కవర్లో పంపిస్తున్నా నీ రంగూ అలాగే ఉంది. నిన్ను చూస్తే పోగొట్టుకున్న మా పిల్ల మా కళ్ళల్లో




తిరిగింది. నువ్వున్న ఆ రోజుల్లో నా కూతురు చనిపోయిందని నాకనిపించలేదు. భగవంతుడు మమ్మల్నింకా ఎంత బాధపెట్టాలనుకుంటున్నాడో- నువ్వు పెళ్ళిచేసుకోకుండా వచ్చి ఉంటే ఎంత బాగుండేది? మా ఇంట్లో లక్ష్మి తాండవించటం ఆ దేవునికి ఇష్టం లేదేమో!

నువ్వెళ్ళావు.

మళ్ళీ ఇల్లు శ్మశానసదృశమైంది. నువ్వెళ్ళిన తరువాత వారంరోజులు అందరూ నువ్వొచ్చినట్లు కలగని లేచి కూర్చునేవారు. 'రమీజా మున్నీ' వచ్చినట్లు కలవచ్చింది. కొన్నాళ్ళు సెలవుపెట్టి ఇద్దర్నీ రప్పించుకుంటే బాగుణ్ణంటున్నారు మీ అత్తలు. నీతో కల్సి వాళ్ళు తీయించుకున్న ఫొటోల్లో నీ పక్కన వాళ్ళు దిగదుడుపులా ఉన్నారట. ఇదిగో! ఆ ఫొటోలు కూడా పంపుతున్నా.

నేనిక ఎన్నాళ్ళో బతకను. ఈ ముసిలిదాని చిన్నకోరిక తీర్చవూ?

నువ్వూ, బాబూ ఒక్క నెలరోజులు సెలవు పెట్టుకుని రాగలరా?

నువ్వూ అలాగా వెళ్ళాక ఢిల్లీనుండి మీ మామయ్యా, బావ వచ్చారు. నిన్ను చూడటానికి కుదర్లేదని ఎంత బాధపడిపోయారో? మమ్మల్నందర్నీ తిట్టిపోసారు. అప్పట్లో మరోసారి వెతకటానికి కృషిచేసి ఉంటే తను శాశ్వతంగా మనింట్లోనే ఉండిపోయేదిగదా అన్నాడు మీ బావ. వాడికి అత్తంటే గొప్ప ఇష్టం. నాకే జ్ఞానం తెలిసి ఉండేరోజులయితే అత్తని అలాటి అఘాయిత్యం చేసుకోకుండా ఆపి ఉండేవాణ్ణి!' అని ఎంతగా నలిగిపోయాడో. మీ బావ మళ్ళీ నెలరోజుల్లో వస్తాడు. అందునుంచి మీ ఉభయులూ తప్పక రాగలరని పదేపదే కోరుకుంటున్నాను. బాబుకు చెప్పు. నామాటగా! మీరు అన్యథా భావించకండి. మీ ఛార్జీలకోసం వెయ్యి రూపాయల డ్రాఫ్టు పంపిస్తున్నాను.

ముద్దులతో
నీ
అమ్మమ్మ, తాతయ్య''

ఆ ఉత్తరం చదువుతున్నపుడు నా మనసు ద్రవించిపోయింది. 'అమ్మా! అమ్మా! అమ్మా!' అనుకుంటూ గదినిండా పిచ్చిగా తిరిగాను. 'వెర్రిగా అమ్మ ఫొటోని ముద్దుల్లో తడిపేసాను. అయిన వాళ్ళ ఆదరణా, ప్రేమా తెలీని యాంత్రికజీవనం గడిపిన నాకు అమ్మమ్మనీ, తాతయ్యని, మామయ్యలనీ తలుచుకుని ఎంత వేగిరం రెక్కలు కట్టుకుని వాళ్ళచెంత వాలిపోతానా అనిపించింది. కడసారి అమ్మ నన్ను ముద్దుపెట్టుకోవాలన్న కోరికతో చనిపోయిందని తెలిసి నేనంటే నాకే అసహ్యం వేసింది. 'నువ్వు నమ్మవ్! నా చెంపలు కంది పోయేలా రెండు చేతులతో అద్దంముందు నిలబడి లెంపలు వాయించుకున్నాను' నువ్వెంత నష్టజాతకురాలవు రమీజా! అని నన్ను నేనే తెగడుకున్నాను. పిచ్చిగా బుర్రబాదుకున్నాను. అప్పుడు నా చెంత కమాలుద్దీన్ ఉంటే బాగుణ్ణనిపించలేదు. నిజం చెప్పనా? అది రాత్రికాకపోతే- నేను నీ దగ్గర వాలి ఉండేదాన్ని. ఈ తీయని వార్త తెలిసి నువ్వొక్కత్తెవే ఆనందించగలవు. నాకేదేనా అయితే బాధపడటానికీ, నాకు శుభం జరిగితే నిండుమనసుతో ఆనందించటానికీ నువ్వే ఉన్నావ్!

అంతలో తలుపు తట్టిన శబ్దం!

ఇంత రాత్రపుడు ఎవరు చెప్మా?

'ఏదయినా డెలివరీ కేసా? లేక సీరియస్ కేసొచ్చిందని డాక్టరు, స్టాఫ్ నర్సో కబురు పెట్టారా?' అనుకున్నాను. 'ఎవరూ?' గట్టిగా అరిచాను. ఒంటరిదాన్నికదా? భయం వేసింది. అసలే చీకటి రాత్రులు. ఈ ఊళ్ళో గమ్మత్తేమిటంటే వెన్నెల రాత్రులలో విద్యుద్దీపాలు చంద్రునితో పోటీపడి వెలుగుతాయి. చీకటి రాత్రులలో అలిసిపోయినట్లు వెలగటం మానేస్తాయి. కిటికీ తలుపు తెరిచి పక్కనించి చూస్తేనే. 'ఈయన!'

గొప్ప సంతోషం వేసింది!

కానీ ఎంతసేపుందని? విదియచంద్రునిలా వెంటనే మాయమైపోయింది. పుట్టెడు సంతోషంతో తలుపు తీసాను. బట్టలు చెమటకంపు, సిగిరెట్ కంపుతో పోటీ పడుతున్నాయి. నోట్లో 'కారాకిల్లీ కంపు' కడుపులో తిప్పేదిగా ఉంది.

''కిల్లీ వేసుకొచ్చారేంటి?'' అన్నాను.

''పది దాటిపోయిందికదా? నిన్నెందుకు ఇబ్బంది పెట్టటం అని హోటల్లో భోజనంచేసి వచ్చేసాను'' అన్నారు. ఆ మాటలు ముద్దగా వచ్చాయి. నాకు అనుమానం కలి

గింది.

"మాటేమిటి? ముద్దగా వస్తోంది?"

"ముద్దగా కాదు. ముద్దుగా!" అంటూ భుజాన తగిలించుకున్న ఆ తేలుసంచీని అయినా తొలగించకుండా మీద పడబోయారు.

"ఛీ... కంపు... వెళ్ళి స్నానం చేసుకుని రండి" అన్నాను.

ఏమనుకున్నారో ఏమో కానీ చెప్పినట్లే విన్నారు. సబ్బుసగం అరిగిపోయినంతవరకూ ఒళ్ళు రుద్దాను. బీరువాలోంచి ఇస్త్రీ లుంగీ తీసిచ్చాను. పౌడరు రాసుకున్నారు.

"ఆఁ... దేవిగారికిప్పటికైనా దయ కలుగుతుందా?" అని దగ్గరకొచ్చి ముఖంమీద ముఖం పెట్టారు. అతని కళ్ళు ఎర్రగా ఉన్నాయి. ఇందాకటికంటె మాట మరీ ముద్దగా ఉంది. మరింత అనుమానం కలిగి, వెళ్ళి గ్లాసుతో మజ్జిగ తెచ్చి "ముందీ మజ్జిగ తాగండి" అన్నాను. అతను మజ్జిగ తాగటానికి ఇష్టపడలేదు. "ముందు తాగుతారా? తాగరా?" గట్టిగా మందలించాను. మారు మాట్లాడకుండా తాగారు. నాకేడుపొచ్చింది. వలవలా ఏడ్చేసాను "ఏయ్! ఎందుకేడుస్తున్నావ్" అని అడిగారు. దగ్గరకు తీసుకున్నారు. నేను విసిరి కొట్టాను.

"ప్లీజ్! తాగి వచ్చాననేగా! ఇంకెప్పుడూ తాగను. ఒళ్లంతా నొప్పులుగా ఉంటే ఫ్రెండొకడు రమ్మంటే అలా వెళ్ళాను. నన్ను క్షమించు ఇంకెప్పుడూ తాగి రాను. నీ మనసు బాధపెట్టను" అన్నాడతను.

నేనామాటలకి కరిగిపోలేదు. 'తాగిన ప్రతి మనిషీ పెళ్ళాం దగ్గర ఇలాగే కబుర్లు చెపుతాడు మొదటి రోజుల్లో' అన్నాను.

"లేదు రమీ! మరెప్పుడూ తాగను. అల్లా మీద ప్రమాణం చేస్తున్నాను" అని నా బుర్ర మీద చేయివేసాడతను. నాకంత దుఃఖంలోనూ నవ్వు వచ్చింది. "నేను మీకు 'అల్లా'గా కనిపిస్తున్నానా?" అన్నాను. అతను తప్పును తెలుసుకుని, "సారీ! నీమీద ఒట్టు. నా మాట నమ్ము" అన్నారు.

నా జీవితం రొంపిలో దిగిపోతోందని నాకప్పుడు తెలిసింది. "అతని వివరాలు తెలుసుకోకుండా తొందరపడ్డానన్న" ని మాటలు గుర్తొచ్చాయి. గుండె ఝల్లుమంది. అతను తాగుతాడన్న నిజం తెలిస్తేనే నేను సహించలేకపోయాను. ఇంకా ఎన్ని భయంకరసత్యాలు నన్ను కాటువేస్తాయో అనే ఊహవస్తేనే భయంవేసింది.

"చెప్పండి... మీకింకా ఏమేం అలవాట్లున్నాయో? అన్నీ ఒక్కసారే చెప్పి నా గుండె పగిలిపోనీండి!" అన్నాను. పెనుగాలికి లతలా అయిపోయాను.

"ప్లీజ్! ఈ రోజుల్లో ఇది ఒక మామూలు విషయం. దీనికింత హర్టవుతావనుకోలేదు" అన్నారు అతను.

"ఇది సామాన్య విషయమా?" అని నేను తిరిగి ప్రశ్నించేసరికి, అతను సమాధానం చెప్పలేదు. కొంతసేపు ఎవ్వరూ మాట్లాడలేదు. నేనే అడిగాను. "వారం రోజులయింది వచ్చి, రావాలనిపించలేదా?" అడిగాను. టాపిక్ మార్చదలచి. అతనూ అదే ఆశిస్తున్నాడు. 'ఇంటిదగ్గర కొన్ని ఇబ్బందులుండటంచేత రాలేకపోయాను' అన్నారు. అప్పుడు ఆరోజు వచ్చిన అమ్మ ఫొటో, కలకత్తాలో మేం తీయించుకున్న ఫొటోలు చూపించాను. ఫొటోలు చూసి నన్ను ప్రసన్నం చేసుకోవడానికి ప్రయత్నించారు. అతను ఆరోజూ కనీసం తాగకుండా ఉంటే స్వర్గం చూపించి ఉండేదాన్ని!

ఆ తరువాత ఉత్తరం చూపెట్టాను. చాలాసేపు చదివారు. చదివిందే మళ్ళీ చదివారు. "నువ్వు నిజంగా దురదృష్టవంతురాలివి" అన్నారు.

"ఇందాకటివరకూ అలా అనుకోలేదు" అన్నాను.

"ఇప్పుడనుకుంటున్నావా?"

"వేరే చెప్పాలా?"

"ఎందుకని?"

"తన భర్త పెద్ద ఆఫీసరనే గొప్పకంటే, తన భర్త వ్యసనపరుడు కాకపోవటాన్నే గర్వంగా భావిస్తుంది ఏ చదువుకున్నదయినా. కలకత్తాలో మా తాతగారు నాకు పెళ్ళవలేదనుకొని ఒక ఇంజనీరు సంబంధం చెప్పినప్పుడు 'అయ్యో! నేను కండక్టర్ని చేసుకున్నానే' అని బాధపడలేదు. కానీ ఇవాళ మీరు తాగొచ్చి




నందుకే నేను తొందరపడ్డానేమోనని బాధప డుతున్నాను'' అన్నాను. ఆ మాట అనటంలో కూడా నేను తొందరపడ్డానేమోనని ఇప్పుడని పిస్తోంది. అయినా చేసిన పనిని నెమరువేసు కుని బాధపడటం నాకు మొదట్నించీ అలవా టు లేదుకదా! అందుకే దాన్నలా వదిలిపెట్టు. ఆ రాత్రి అతన్ని నా దగ్గరకు రానివ్వలేదు. అతనెంత ప్రాధేయపడినా.

తెల్లార్లేచి అతను డ్యూటీకి బయల్దేరు తుంటే, ''కేంపు సంగతేం రాయమంటారు?'' అని అడిగాను.

''డబ్బులు చూసుకోవాలిగా!''

''వాళ్ళు పంపారుగా!''

''అయినా మనం కొంత పట్టుకెళ్లాలికదా!''

''ఆ విషయం నేను చూసుకుంటాను''

''ఎన్నాళ్ళుంటుంది కేంపు?''

''వాళ్ళు నెలరోజులుండేట్టు రమ్మన్నారు. కానీ నాకు పదిహేను రోజులయినా ఇస్తారో ఇవ్వరో, మామూలుగా అయితే ఒకరోజు సె లవు ఇవ్వడానికే డాక్టరేడుస్తాడు. డి.ఎమ్.ఓ. మంచాయన కాబట్టి రిక్వెస్ట్ చేస్తే లీవు దొరకొ చ్చు. అంతగా అయితే అక్కడికెళ్ళి పొడి గించుకోవచ్చు'' అంది.

''నీ దగ్గర డబ్బులేమన్నా ఉన్నాయా? నా జీతాలింకా అందలేదు''

''నిన్న వాళ్ళు పంపిన డ్రాఫ్ట్ ఉంది''

''మార్చివ్వగలవా?''

''మరి ఛార్జీలకో?''

''ఈలోగా జీతాలొస్తాయిగా!''

''మరి మీరప్పుడే వెళ్ళిపోతే ఎలా కుదురు తుంది?''

''సాయంకాలం వస్తా''

''సరే... అయితే'' అన్నాను. ఆ సాయంకాలం అతను తిరిగివచ్చారు. ఈసారి మామూలుగానే వచ్చారు. మల్లెపువ్వులూ, సంపెంగ పువ్వులూ తెచ్చారు. ద్రాక్షపళ్ళు, కిస్మిస్ తెచ్చారు. చాలా హుషారుగా వచ్చారు. కానీ ఏం లాభం? సరిగ్గా నేనింటికి రానిరోజు!

ఆ మర్నాడు తెల్లారుతూనే డబ్బు పట్టు కుని వెళ్ళిన మనిషి అన్న టైంకి రాలేదు. నేను లీవుకి అప్లయి చేసేసాను కూడా! ప్రయాణ సన్నాహాలన్ని సిద్ధం చేసుకున్నాను. అతనె డ్రస్ నాకివ్వలేదు. ఉత్తరం రాద్దామంటే. ఆలో చనలతో సతమవుతుంటే అతని సూట్‌కేసు కనిపించింది. దానికి తాళం వేసిలేదు. తీస్తే డైరీ ఉంది. డైరీలో ఏం రాసిలేకపోయినా అతని అడ్రస్ మాత్రం దొరికింది. వెంటనే టెలిగ్రాం ఇచ్చాను, 'స్టార్టిమ్మీడియట్లీ' అని. ఆ రాత్రి పదకొండవుతుండగా వచ్చారు. అతనొస్తా రని ఊహించి నేను వీధిలో కూర్చున్నాను. వీధంతా సద్దుమణిగి ఉంది. చీకటిగా ఉంది. మనుషులలికిడయితే కుక్కల రుస్తున్నాయి. అప్పటికే ఆ దారిన పోయేవాళ్ళు ''ఇంకా పడుకోలేదా సర్సమ్మా!'' అని పలకరిస్తూంటే చికాకేసింది. సరిగ్గా అప్పుడొచ్చారు. వస్తూనే ''టెలిగ్రాం ఎందుకిచ్చావ్ ఏం కొంప ము నిగిందని?'' అన్నారు.

''వెళ్ళిన మనిషి వస్తానన్న టైంకి రాకపోతే, కనీసం ఉత్తరం అయినా లేనపుడు టెలిగ్రాం ఇవ్వక ఏంచేయను? అక్కడెలా ఉన్నారో, ఎందుకు రాలేదో కంగారుపడి చచ్చాను. సె లవు పెట్టి కేన్సిలు చేసి మళ్ళీ జాయినవ్వాల్సి వచ్చింది. డాక్టరే కళనున్నాడో ఏమనలేదు. లేకపోతే ససేమీరా మళ్ళీ ఇవ్వననేవాడు'' అన్నాను.

''ఇవ్వకపోతే ఏం కొంపలు మునిగిపోతా యని? కేంపేకదా ఆగిపోతుంది?''

''అసలు టెలిగ్రాం ఇవ్వటంలో వచ్చిన నష్టమేమిటో నా కర్థం కాలేదు''

''నీకెందుకర్థం కావాలి- ఇకపై ఎప్పుడూ టెలిగ్రాంలూ, ఫోనులూ పెట్టకు నేనున్నాను కాబట్టి సరిపోయింది. నేను లేకపోతే ఎంత రాద్ధాంతం కావలసిందో''

''అంత రాద్ధాంతం కావటానికేం ఉందందులో. పెళ్ళి చేసుకున్నానని చెప్పటాని కి మీకంత పిరికితనం దేనికట. నాకు తెలీకడు గుతాను?''

అతనేం జవాబు చెప్పలేదు. వెళ్ళి స్నానం చేసుకుని వచ్చి లుంగీ కట్టుకున్నారు. భోజనా నికి లెమ్మన్నాను. ఆకలి లేదన్నారు.

''ఆకలి లేకపోవటం ఏమిటి''

''అన్నిటికీ కారణాలు చెప్పాల్సిన అవసరం లేదు''

''సరే... కేంపు సంగతేం నిర్ణయించారు?''

''నా జీతాలందలేదు. నువ్విచ్చిన డబ్బు ఖర్చయింది''

''సరిపోయింది'' అని భారంగా నిట్టూర్పు విడిచి ''ఇంతకీ సెలవు సంగతి?''

''మాదేముంది? ఎప్పుడు కావాలంటే అప్పుడే ఇస్తారు''

''సరే... మూడో తారీకున బయలుదేరదాం టికెట్ రిజర్వుచేయిస్తా. తమరు ఫస్టుకే వస్తే బాగుంటుంది''

''ఫస్టుకి రాలేను. రెండు ఉదయం కానీ, సాయంకాలానికిగానీ రాగలను''

''నేనంత టెన్షన్ భరించలేకపోతున్నాను. వీలయినంత ముందుగా వస్తే బాగుంటుంది'' అన్నాను.

''ఆ రాత్రి ఎడముఖంగానే ఉన్నాడతను.

''నాకూ మనసంతా వికలమయింది. ఇక ఈ మునుగులో గుద్దులాట లాభంలేదనిపించింది. నేనే వెళ్ళి వాళ్ళింట్లో విషయం చెప్పటం మంచిదనిపించింది.

ఎంచేతనో ఫస్టుకి రానన్న వ్యక్తి ఆరోజు సాయంకాలానికే వచ్చేశారు. రెండోతేదీ అంతా వస్తువులు సర్దుకోవటంతో సరిపోయింది. మూడవతేదీ ఉదయాన్నే విశాఖపట్నం వెళ్ళి అక్కడ హోటల్లో భోంచేసి ట్రెయిన్ ఎక్కాం. విశాఖపట్నంలోమాత్రం అతను నావక్కన కూర్చోడానికి భయపడినట్లు కనిపించింది. హోటల్లో కూడా అతను దూరంగా కూర్చున్నాడు. ఏం మాట్లాడినా, ఏదడిగినా జవాబు చెప్పలేదు.

నాకూ పలకరించాలనిపించలేదు. ట్రైన్ కుదుపునకు కళ్ళు మూతలు పడుతుంటే ఏవేవో పిచ్చి ఆలోచనలు మదిలో!

దారినపోయే బాటసారిలాటి ఇతనికి తనెందుకు లొంగిపోయిందనలు? ఇతని తత్వమేంటో? ఇతనెలాటివాడో? ఇతని కుటుంబ పరిస్థితులేమిటో కూడా తెలుసుకోకుండా, ఎందుకీవిధంగా నిర్ణయం తీసుకున్నాను? ఎప్పుడూ మబ్బు పట్టిన ఆకాశంలా ఉంటాడు. ఏదీ చెప్పడు. పెళ్ళయి ఇన్నాళ్ళయినా తన విషయం ఇంట్లో చెప్పటానికెందుకు జడుస్తాడు? కుటుంబాన్ని తీసుకొచ్చేయమంటే వాళ్ళొస్తే నీ ప్రాణానికి హాయి ఉండదు. ఇలాగే బాగుంటుందంటాడు. కష్టమయినా, సుఖమయినా అందరూ ఒకచోట ఉంటే అదెంతబాగుంటుంది? వినడేమిటి? పోనీ ఎన్నాళ్ళిలా? అంటే దానికీ జవాబు చెప్పడు. పరిపరివిధాలుగా ట్రైన్‌కంటే వేగిరం పరుగుతీస్తోంది మనసు.

మర్నాడు పదిగంటలకి కలకత్తా చేరుకున్నాము. అంత రద్దీగా ఉన్న స్టేషన్లో కూడా అమ్మమ్మ పోల్చేసి, ''అమ్మా! రమీజా, వచ్చేసేవా తల్లీ?'' అనికేకెట్టింది. అక్కడ తెలుగు మాట్లాడినది ఆమె ఒక్కగొంతే కాబట్టి పోల్చేశాను. తాతయ్యా, మామయ్యలూ సుమారు పదిమందివరకూ వచ్చేశారు. వాళ్ళ సంతోషం ఏమిటో చెప్పలేను. అమ్మమ్మ అది స్టేషనని కానీ, అంత తొడతొక్కిసలాటలో పక్కవాళ్ళకి ఇబ్బంది కలుగుతుందని కానీ తలంపే లేకుండా గట్టిగా కౌగలించేసుకుని ముఖంనిండా ముద్దులు పెట్టేసుకుంది. నాలో ఉన్న డిమ్మంతా ఎగిరిపోయింది. తాతయ్య - ''ఏమ్మా! అలా చిక్కిపోయావేంటి? ఏం బాబూ! బావున్నావా?'' అని పక్కనే ఉన్న ఈయన్ని పలకరించారు. అందరికీ పరిచయం చేశాను. ''హాయ్! నన్ను పోల్చుకోలేవు. నేను నీకేమవుతానో? మామ్మా! ఏమవుతాను. నాపేరు దివాకర్. మీ పెద్దమామయ్య కొడుకును. ఢిల్లీలో ఉంటున్నాను. అప్పుడు నువ్వొచ్చినప్పుడు నేను ఢిల్లీలో ఉన్నాను. నువ్వెళ్ళిన మరునాడే వచ్చాను. గొప్ప బాధపడిపోయాను. వద్దామంటే నాకు టైం చాలలేదు. అందుకే నెలరోజులు సెలవుపెట్టుకొస్తాను - రమీజాను రమ్మని రాయమన్నాను మామ్మతో. నమస్కారం అన్నయ్యగారూ! బాగా అలసిపోయినట్టున్నారు'' అంటుండగా మా పెద్దత్త వచ్చి ''దివా! నీకు బుద్ధిలేదా? ఇంటికొచ్చాక మాట్లాడుకోవచ్చు. వాళ్ళు స్నానాలు కూడా లేకుండా ఉన్నారు. కారవతల ఉంది. పదండి'' అన్నారు. అనేసి ''ఏమ్మా! ఏంటలా అయిపోయావు?'' అన్నారు.

నేనూ, ఈయనా, తాతయ్యా, అమ్మమ్మా కారులో ఎక్కాం. మిగతావాళ్ళు టాక్సీలో ఎక్కారు. ఇంటికి చేరుకోగానే స్నానంచేసి ఫ్రెష్‌గా తయారయ్యాం. పూరీ కూరా చేశారు. అన్నం




పెట్టినట్లు టిఫిన్ పెట్టారు. నేను నాలుగే పూరీలు తిన్నాను. ఈయనమాత్రం వద్దన కుండా తింటుంటే, "ఇది టిఫిన్... భోజనం కాదు" అని నేను హెచ్చరిక చేయటం, మా పెద్దత్త విని "తప్పమ్మా! అలా అనకూడదు. ఎప్పుడు తిన్నారో ఆకలిగా ఉండదూ. ఇదిగో ఆయనకి కంపెనీ నువ్వు కూడా తింటూ కూర్చో" అని నాలుగు పూరీలు వడేశారు. "అ... అ... నేను మరి తినలేను" అని చెయ్యి అడ్డుపెట్టాను. "పోన్లేవే. దానికి కావల సినన్ని తిననీ" అని అమ్మమ్మ అంది. మేం టిఫిన్ చేస్తున్నంతసేపు అమ్మమ్మ, దివాకర్ బావా పక్కనే కూర్చున్నారు. ఏవేవో కబుర్లు చెపుతూనే ఉన్నారు. అమ్మమ్మ ఈయన్ను ఉద్దే శించి "బాబూ! మా పాప అచ్చూ దీనిలాగే ఉండేది. నవ్విందంటే ముత్యాలకూర్పులాగే ఉండేది పలువరుస. భగవంతుడు దాన్ని అల్పాయుష్కురాలిని చేసేశాడు. మా అమ్మాయే ఉంటే వయసుభేదంలో తప్పితే ఇద్దర్నీ పోల్చుకోవటం గొప్ప కష్టమయి ఉండేది. అందుకే మాకా కష్టం లేకుండాచేసేశా డు" మేఘం కనిపించకుండా వర్షం కురిసిన ట్లు అయిపోయాయి అమ్మమ్మ కళ్ళు. నాకూ గొంతు మూగవోయింది.

"నాన్నమ్మా! భగవంతుడు నీమీద జాలితో నీ కూతుర్నీరూపంలో నీ చెంతకు పంపాడు. జరిగిందేదో జరిగింది. ఈ శుభఘడియలను వ్యర్థంచేయకు" అన్నాడు దివాకర్. ఈయన మవునంగా ఉండిపోయారు. ఆవులింతలు తీస్తుంటే, "అన్నయ్యగారూ! మీరు రెస్టు తీసు కోండి. ఇదిగో పిల్లా! నిన్నుమాత్రం పడుకోని చ్చేది లేదు. మేం నీకోసం కళ్ళల్లో వత్తులు వేసుకుని ఇన్నాళ్ళూ ఎదురుచూశాం. నువ్వు మాత్రం రాత్రీ పగలూ మాతో ఉండాల్సిందే. మీ ఊరెళ్ళి హాయిగా నిద్రపోవచ్చు" అన్నాడు దివాకర్.

పదిహేను రోజులే ముందు సెలవుపెట్టాం. కానీ వాళ్ళు వినలేదు. అసలు వాళ్ళందరూ ఏమన్నారంటే - ఇద్దరూ ఉద్యోగాలు రిజయిన్ చేసుకొచ్చేస్తే ఇక్కడే ఏదన్నా ఫర్మ్ పెట్టుకోవ చ్చన్నారు. కేపిటల్ కూడా వాళ్ళే పెడతామన్నా రు. కానీ నేనే ఇష్టపడలేదు. ఇలా అప్పుడప్పు డూ వెళ్ళినప్పుడు పొందే ఆనందం, అక్కడే ఉండిపోవటంలో దొరకదనిపించింది. చీకటి ఉంటేనే వెలుగుకి అందం. కష్టం ఉంటేనే సుఖానికి విలువ. ఎప్పుడూ ఆనందం పొందినా అదీ వెగటుగానే కనిపిస్తుంది. అంతే గాక - అతి చనువూ, అతి ప్రేమా, అతి ఆదరణా అయినా భరించటం కష్టమే! అందు కే మళ్ళీ వస్తామని ఉండటానికిమాత్రం ఒప్పు కోలేదు. అక్కడున్నన్నాళ్ళూ ఒక్కోరోజు ఒక్కొ క్కరు ఒక్కోచోటుకి కార్లో తీసుకెళ్ళిపోయేవారిద్ద ర్నీ. ఎక్కడకెళ్తే అక్కడ ఫొటోలు. ఇంట్లో మాట్లా డుతున్నప్పుడు, భోంచేస్తున్నప్పుడు, ఆడు కుంటున్నప్పుడు వీడియోలు!

అమ్మమ్మ ఈయన చేతులు పట్టుకుని - "బాబూ! అమ్మాయి అన్నీ వాళ్ళమ్మ పోలికలు పుణికి పుచ్చుకుంది. మేం నీ చేతుల్లో పెట్టలే దు., అదే నీ చేతుల్లో వాలింది. దాన్ని పువ్వు లాగా చూసుకోనాయనా! ఆ ఉద్యోగం ఎందుక మ్మానీకని ఎంత చెపుతున్నా అది వినటంలే దు. పోనీ దాని సరదా ఎందుకు కాదనాలి? దానిష్టమేకానీ. కానీ నిండునూరేళ్ళు అది సుఖ శాంతులతో బ్రతకాలి. వాళ్ళమ్మ లేకపోయినా తల్లిలేని లోటు దానికి తెలీకూడదు. రాణిలా బతకాలి. అది నాప్రాణం. మీకెప్పుడేం కావల సినప్పటికీ సంకోచించకుండా రాయండి. దేని కీ ఇబ్బందిపడకండి" అంది. వచ్చేస్తూంటే ఎన్నిసార్లు ఈయన చేతులు పట్టుకుని నాగు రించి జాగ్రత్తలు చెప్పిందో. "నెల తప్పితే అయిదోనెలకే తీసుకొచ్చేస్తాం" అని చెప్పింది. హాస్పిటల్లో పనిచేస్తున్నదానివని వెర్రి ఆలోచన లకి పోక మాకో మునిమనుమరాలినిచ్చి వేగి రంగా" అన్నది. నేను సిగ్గుతో తల దించుకు న్నాను. అంతవరకూ ఎంతో హుషారుగా నవ్వు తూ, నవ్విస్తూ ఉన్న దివాకర్‌బావ ముఖంలో కళలేదు. నిన్నటి మందారపువ్వులాగా అయి పోయాడు. కన్నీటితో వీడ్కోలు చెప్పారు. ఒక మధురమైన స్వప్నంనుండి బయటపడినట్ల యింది. ట్రైన్ ముందుకెళ్తోంటే మనసు వెన క్కి పరుగెడుతోంది.

"నీకింకా ఉండిపోవాలనిపించింది కదూ?" అన్నాడతను.

"అలాగనుకోలేదు"

"మీ దివాకర్‌బావకిమాత్రం నువ్వొక్కత్తెవీ

ఉండిపోతే బావుణ్ణనిపిస్తోందేమో?'' అన్నాడు.

ఆ మాట నా గుండెలో గుచ్చుకుంది. ''మీ కెందుకలా అనిపించిందసలు?''

''అతను నిన్ను కొరికేసేలా చూసేవాడు. నేను లేకపోతే...'' అని అతనంటుండగా అతని తక్కువ బుద్ధిని గ్రహించేసి ''ఆపండి! తక్కువ మనుషులకి తక్కువ బుద్ధులే అన్నారందుకే. అతనికి మా అమ్మంటే పంచప్రాణాలు. ఎప్పుడూ అతన్ని కిందకి దించేది కాదట. అతనేకాదు, ఆ ఇంట్లో అందరి మనసుల్లోనూ ఒకేరకమైన ప్రేమ. అది అవ్యాజమైంది. చెట్టున ఉన్న పువ్వు వాడకుండా చూసుకోవాలని కొందరికి ఉంటుందే ఆరకమైన ప్రేమ. అనుభవించాలనుకున్న ప్రేమలో మాధుర్యం ఉండదు. అవసరం ఉంటుంది. అవసరం తాత్కాలికమైంది'' అనేసి ''మీరింత తక్కువ అంచనా వేస్తారనుకోలేదతన్ని. తెలిస్తే అతనితో అసలు మాట్లాడేదాన్ని కాదు'' అన్నాను.

అతను మళ్ళీ మాట్లాడలేదు. కొంతసేపయ్యాక ''సారీ! నీ మనసు కష్టపెట్టాను'' అన్నారు.

''మీకు వచ్చిన పదాలివేగా?'' అన్నాను సీరియస్‌గా.

వైజాగ్ వచ్చినంతవరకూ అతనితో మాట్లాడలేదు. వైజాగ్‌లో అతను దిగారు. నేనింటికెళ్ళి వస్తానన్నారు. ముందు నేనూ దిగాలనుకున్నాను. కానీ దిగాలనిపించలేదు. ఎప్పుడొస్తారని కూడా అడగలేదు. పాలసముద్రంలోంచి ఉప్పుసముద్రంలోనికి మారినట్లనిపించింది.

మళ్ళీ డ్యూటీలో చేరాను. అందరూ ఎంత బావున్నావంటే ఎంతబావున్నావని తెగ పొగిడేశారు. హెచ్చీగారైతే వచ్చి రహస్యంగా ''అమ్మాయీ,' నిన్ను చూస్తే నాకే ముద్దొస్తున్నావ్. ఆ డాక్టరు మరీ వెర్రెత్తిపోతాడు. కొన్నాళ్ళతనికి కనిపించకు'' అంది. అద్దంలో నా ముఖం చూసుకుంటే నిజమేననిపించింది.

పదిరోజుల తరువాత అతనొచ్చారు. వచ్చినప్పుడు తూలుతూ వచ్చారు. వొంటిమీద తెలివి లేదు. వాచి లెంపకాయ కొట్టాలనుకున్నాను. ''ఏయ్! నువ్వెవర్తివే... తాగుతాను. టాగి టందనాలాడతాను. అంటేగాదు... పదిమందితో





తిరుగుతాను. నాఇష్టం. నీనుంచి బాబును పోగొట్టుకున్నాను. బంగారులాటి బాబును పోగొట్టుకున్నాను'' అన్నారు.

ఆ మాటలతనంటునప్పుడు అతను తాగి వాగుతున్నాడన్న కోపంలేదు. వాటిలో నిజానిజాలెలా తెలుస్తాయన్నది మనసును పిప్పిచేస్తోంది. ''బాబా? ఎవరిబాబు? ఏమయ్యాడు? చెప్పండి. అసలేంటి జరిగింది?'' అన్నాను.

''చెప్పాలా? నీకు చెప్పపోతే ఏంచేస్తావ్. రాక్షసీ! పదిహేను రోజులు చాలవుటే నీ బావతో కులకటానికి. నెలరోజులు పొడిగించి... నా బాబు... నాబాబుని పొట్టనబెట్టుకున్నావ్ కదటే! రాక్షసిముండా!'' అతనేం వాగుతున్నాడో, నేనేం వింటున్నానో నాకర్థంకావటంలేదు. అతను తాగివచ్చాడా? లేక నాకేమన్నా అయిపోతోందా తెలీలేదు.

''చెప్పండి... బాబంటే ఎవరు? చెప్తారా? చెప్పరా?'' అతని చొక్కా కాలరు పట్టుకుని గుంజాను. అతనికి నిలబడే శక్తి లేదు ఒంట్లో. నామీద పడ్డాడు. చచ్చిన పాము శరీరం పడినంత గగుర్పాటు చెందాను. గోడమీదకి తోసేశాను. అతను కూలబడిపోయాడు. వెంటనే ఇంట్లోకెళ్ళి నిమ్మకాయ తెచ్చాను. మర్దన చేశాను. పుల్లటి పెరుగుంటే మజ్జిగ చేసి గేదెపెయ్యికి రెండుదవడలూ సాగదీసి మందు పట్టినట్లు, అసహ్యం వేస్తోన్నా అతని తలను వడిలో పెట్టుకుని నోట్లో పోశాను. అతను నా ముఖంమీద ఉమ్మేశాడు. నా అహం దెబ్బతింది. మనసు చచ్చిపోయింది. గుండె పగిలిపోయింది. కోపాన్ని ఆపుకోలేకపోయాను. జుట్టు పట్టుకుని మూడుసార్లు నేలకేసి కొట్టాను. చచ్చిపోతాడేమోనని భయంవేసింది. అతను చచ్చిపోయినా ఫరవాలేదు. నిజం తెలియాలి!

అందుకే నాలుక ఎక్కలాగి మజ్జిగ నోట్లోపోశాను. ఎన్ని డ్రమ్ములు తాగేశాడోగానీ రాత్రి ఎంత ప్రయత్నించినా తెలివి రాలేదు. పైగా ఇంటినిండా ఉమ్ములు, కేకలు, హుంకరింపులు. ఆ రాత్రి శివరాత్రి అయింది. కాళరాత్రి అయింది. ఎప్పుడు తెల్లారుతుందా? అనిపించింది. తెల్లారింది భయంకరంగా.

అతనికి మత్తొదిలింది. నేను హాస్పిటల్‌కి సెలవు పంపించాను. పళ్ళు తోముకుని వచ్చి ''సారీ రమీ! రాత్రి కొంచెం డోసెక్కువయింది. క్షమించు'' అన్నాడు.

"క్షమించడాలు తరువాత. బాబుని నేను పొట్టన పెట్టుకున్నానని వాగారు రాత్రి. ఎవరా బాబు?''

''బాబా? నేనన్నానా? నువ్వు కలగన్నావా?''

''మీరే అన్నారు. తాగినవాళ్ళ నోట్నుండి నిజాలు వస్తాయంటారు. నిజం చెప్తారా? చెప్పరా?'' కోపంతో అడిగాను. అతను జవాబు చెప్పలేదు. ఇతనిలా జవాబు చెప్పడని పించింది. నా జీవితం కాలిపోతోందని నేను గ్రహించేశాను. ''చెప్తారా? చెప్పరా?'' కాలరు పట్టుకున్నాను. అతను నన్ను బలవంతంగా విసిరికొట్టాడు. కిటికీకి తల గుద్దుకుంది. స్పృహ తప్పింది. నేను లేచేసరికి నా తలకి కట్టుంది.

''ఎవరు కట్టారీ కట్టు?''

''మీ డాక్టర్ని తీసుకొచ్చాను. నీకు మతిపోతున్నదా? నీవు కాలరు పట్టుకునేసరికి కోపాన్ని ఆపుకోలేక నా కాలరు నీ చేతిలోనుండి లాక్కోవాలనుకున్నాను. దూరంగా నెట్టాను. కిటికీ తలుపు తగులుకుంది. నేనెంత పొరపాటు చేశానో నాకు తెలిసొచ్చేసరికి నీవు తెలివితప్పావు. మీ డాక్టర్ని తీసుకొచ్చాను. దెబ్బ చిన్నదే. మరేం ఫరవాలేదన్నాడు'' అన్నాడు నా తలను ఒళ్ళో పెట్టుకుని. నేను చివాలున లేచాను. మళ్ళీ నన్ను వేధిస్తోన్న ప్రశ్ననే వేశాను - ''నామీద ఒట్టువేసి నిజం చెప్పండి. ఏ బాబు చనిపోయాడసలు?''

''పిచ్చిరమీ! ఇప్పుడు గుర్తొచ్చింది. మా పక్కవాళ్ళ బాబుని నేను తరచుగా ఎత్తుకుని తిప్పుతుండేవాడిని, నేను కలకత్తా వచ్చిన తరువాత ఆ కుర్రాడు అంకులు దగ్గరకు తీసుకెళ్ళండని ఒకటే ఏడుపు, పేచీలూనట. వాళ్ళ నాన్నకి చిరాకొచ్చి ఒకరోజు కన్నూ మిన్నూ చూసుకోకుండా కొట్టేశాడట. ఆ రాత్రికి నూటయిదు డిగ్రీల జ్వరం వచ్చేసిందట. మరో గంటకి అంకుల్ నాన్న కొట్టేస్తున్నాడు, అంకుల్ నాన్న కొట్టేస్తున్నాడని ఒకటే కేకలు. డాక్టర్ని పిలుచుకొని వచ్చేసరికి ఏముంది? మరి కేకలు లేవు. మంచుముక్కలా అయిపోయాడు. నేను వెళ్ళగానే కేడ్‌బరీస్ చాక్లెట్ ఎప్పట్లాగే పట్టుకొని ముందు వాళ్ళింటికే వెళ్ళాను. వాళ్ళు గొల్లుమన్నారు. నేను మనిషిని కాలేకపోయాను. ఈమధ్య డ్యూటీకి వెళ్ళలేదు. అక్కడ మనశ్శాంతి లేక ఇక్కడకి వచ్చాను. నీదగ్గరకొస్తున్నాను. తాగితే నీక్కోపమొస్తుందన్న విషయం కూడా మరిచి రోజూకంటే ఎక్కువే తాగాను. అదీ కథ'' అన్నాడతను.

నా మనసు దూదిపింజలా అయిపోయింది. నిజమా? అన్నాను. అతను నా బుర్రమీద చెయ్యేసి నిజమన్నాడు. అతని పాదాలమీద వాలిపోయాను. పాదాలమీద ముద్దుపెట్టుకున్నాను నా భయాలు నిజాలు కానందుకు.

కానీ అతనెంత కథకుడో నేను వారంరోజులకుగానీ తెలుసుకోలేకపోయాను. ఓ సాయంకాలం మనశ్శాంతికోసం అంటే కాదనక సినిమాకెళ్ళాం. ఆ తరువాత నన్ను సెంటర్లో నిలబడమని ఇప్పుడే వస్తానని అంటే నేను పూలకొట్టుదగ్గర నిలబడి పూలు తీసుకున్నాను. అతనొచ్చాడు. ఇంటికెళ్ళాం. ఆరోజు టిఫిన్ చేశాను. సాధారణంగా సినిమాకి వెళ్ళొచ్చినరోజు నాకు భోజనం చేయాలనిపించదని నీకు తెలుసుకదా! టిఫిన్ పెట్టబోతుంటే అతను నన్ను పిలిచాడు. వెళ్ళాను.

''రమీ!'' ఏదో చెప్పాలని తటపటాయిస్తున్నాడు. చెప్పలేకపోతున్నాడు.

''ఏంటి చెప్పండి?''

''నా మనసేం బాగులేదు. ఆ బాబే గుర్తుకొస్తున్నాడు. టెన్షన్ తట్టుకోలేకపోతున్నాను. తలలో నరాలు చిట్లిపోతాయేమో భయమేస్తోంది'' అని అతనంటుంటే నేను హడలెత్తిపోయాను.

''డాక్టర్ని పిలవాలా?'' అన్నాను.

''వద్దు... నాదగ్గర మందుంది. నీ పర్మిషన్ కోసం చూస్తున్నాను'' అన్నాడు.

''మందు వేసుకోడానికి పర్మిషన్ దేనికి?'' అనగానే అతను జేబులోనుండి బాటిలు తీశాడు. ''ఇదా మందంటే?'' గట్టిగా అరవాలనుకున్న నా గొంతు మెత్తగా పలికింది. దాన్ని అతను ఆసరాగా తీసుకున్నాడు. ''ఇది వేసుకోకపోతే చేజేతులా నువ్వే నన్ను దూరం చేసుకున్నట్లవుతావ్! ఈ ఒక్కరోజుకి పర్మిషన్ ఇవ్వు'' అని కాళ్ళుపట్టుకున్నాడు.

నిజానికి అతని వాలకం చూసి నాకెందుకో భయంవేసింది. ఈ ఒక్కరోజుకి అయితే సరే

అన్నాను. అతను విజృంభించేశాడు. నేనటు వెళ్ళలేదు. స్నానం చేసి బట్టలు మార్చుకుంటున్నాను. లంగా, జాకెట్టుతో ఉన్నాను. అతను వెనకనుంచి వచ్చి, కళ్ళుమూసి గ్లాసు నా పెదవులదగ్గర పెట్టి నోట్లో అతను తాగుతోన్న విస్కీ పోశాడు. నేను హతాశురాలనయ్యాను. అతనొదల్లేదు. ముక్కు మూశాడు. గొంతు కాలిపోతోంది. గింజుకున్నాను. గ్లాసు విసిరికొట్టాను. గాజుముక్కలు గదినిండా తుళ్ళిపోయాయి. పడగ విప్పిన పాములా బుసలుకొట్టాను - "మీరు మనుషులా? పశువులా?" అరిచాను.

"రమీ! ఇవాళొక్కరేజే. నన్ను అన్నీ మరిచిపోనీ! జీవితంలో థ్రిల్ కావాలంటే మరెలాగొస్తుంది?" అన్నాడు.

నేను భోరున ఏడ్చాను.

నాచేత బలవంతంగా టిఫిన్ చేయించాడతనే!

నాకు మైకం ఆవరించింది. అతనేవో ప్రశ్నిస్తున్నాడు. ఆ మాటలు నాకంతగా గుర్తులేవు కానీ దివాకర్ గురించి అతనడిగినట్లు గుర్తు! అర్ధరాత్రయింది. అతను మంచి నిషాలో ఉన్నాడు. నన్ను నలిపి ముద్దుచేశాడు. అందునుంచి ఎవరో తలుపు తట్టిన శబ్దం వినిపించినా నాకు లేచే శక్తి లేకపోయింది. అతనే లేచివెళ్ళి తలుపుతీశాడు. 'ఎవరూ?' అన్న మాట కూడా నోట్నుండి సరిగా రాలేదు.

"ఎవడో ఆస్పత్రినుండి వచ్చాడు. ఏదో అర్జంటు డెలివరీ కేసొచ్చింది. రమ్మంటాడు!" అన్నాడు.

అంత మత్తులోనూ ఒక్కసారి లేవబోయాను. కాని లేవలేకపోయాను. "మరేం కొంపలంటుకోవులే! లేరని చెప్పాను" అన్నాడతను. నాకు భయం వేసింది. అతనేంటేంటో చేస్తున్నాడు. నేను నలిగిపోతున్నాను. శక్తంతా తోడేస్తున్నట్లయింది. మరో అరగంటలో మళ్ళీ తలుపు చప్పుడు. అతనే లేచాడు. కేకలేస్తున్నాడు. "ఇప్పుడు రాదు వెళ్ళవయ్యా! నీ దిక్కున్నదగ్గర చెప్పుకో. వెళ్ళు" అని అరిచాడు. నాకవన్నీ వినిపిస్తున్నాయ్. ఏంలాభం? నరాలు తోడేస్తున్నాయి. నిస్సత్తువ, మనసులో భయం!

తెల్లారి ఎనిమిది గంటలయింది.

మళ్ళీ తలుపు చప్పుడు. నేనే తీశాను.

హాస్పిటల్ వాచ్‌మెన్. "అయ్యగారు మిమ్మల్ని ఉన్నపళంగా రమ్మన్నారు" అన్నాడు.

"ఏం? ఏంజరిగింది?" అడిగాను.

"ఏమీ తెలీదు. నేనిప్పుడే డ్యూటీకొస్తున్నాను. రాత్రి నైట్‌వాచ్‌మన్ మూడుసార్లొచ్చాడట మిమ్మల్ని పిలవడానికి. మీరు రాలేదు. మీ ఆయనగారు దిక్కున్నదగ్గర చెప్పుకో, నేను పంపను అన్నారట. అయ్యగారు మండిపడుతున్నారు" అని చరచరా వెళ్ళిపోయాడు నేను ఇంకా అడగదలచుకున్న ప్రశ్నలకి అవకాశమివ్వకుండా.

"ఏమండీ! రాత్రి నైట్ వాచ్‌మెన్‌మీద మీరు కేకలేశారా?" అని అడిగాను

"అబ్బే, నేనా? నేనెందుకేస్తాను. ఇప్పుడమ్మగారు నిద్రపోతున్నారు. రారు పో అన్నానంతే" అన్నాడు.

నేను చలించిపోయాను. "ఎంతపనిచేశారండీ! ఏదో పోనీలే అని మీకు పర్మిషన్ ఇచ్చానని నాచేత తాగించారు. డాక్టరు పంపిన మనిషిని తిట్టి పంపారు. ఎంతపని చేశారండీ?" అని వెక్కివెక్కి ఏడ్చాను.

"ఇప్పుడేమయిందని? థ్రిల్లుకోసం ఓ పిసరు తాగించానుకానీ నీకు విషం ఇవ్వలేదు కదా! అయినా నాకు నువ్వు పర్మిషన్ ఇవ్వటం ఏమిటి? నేనంత వ్యక్తిత్వం లేనివాడిగా కనిపిస్తున్నానా? పోనీకదాని ఊరుకుంటే రెచ్చిపోతున్నావ్!" అని కేకలేశాడు.

"తప్పుచేసింది కాక, ఆ తప్పును కప్పిపుచ్చేందుకు దబాయిస్తున్నారా?" అన్నాను. అతనేం మాట్లాడలేదు. విసురుగా షర్టు వేసుకుని వీధిలోకి బయలుదేరాడు కండక్టరు బేగ్ పట్టుకుని.

"ఎక్కడికి?"

"ఇవాళ డ్యూటీకెళ్ళాలి!" అతనెళ్ళిపోయాడు.

నేను గబగబా తయారయి ఆసుపత్రికెళ్ళాను. డాక్టరు సీరియస్‌గా ఉన్నాడు., "ఏమండీ! మీకు ఉద్యోగం చేయాలని లేదా?" అడిగాడు.

యు.డి.సి.ని పిలిచాడు. "విలేకర్లని పిలిపించి ప్రెస్ రిపోర్టు ఇవ్వండి - మెటర్నిటీ




అసిస్టెంట్ నిర్లక్ష్యంవలన ఒక నిండుచూలాలు మరణించిందని!" అన్నాడు. ఆ మాటలు వింటున్న నాకు మతిపోయింది.

"అలాగే డి.ఎమ్మోకి రిపోర్టు పంపండి" అన్నాడు. అనేసి కుర్చీలోంచి లేచి చకచకా వెళ్ళిపోతున్నాడు నేను చెప్పిన మాటలని వినిపించుకోకుండా. యు.డి.సి. అప్పుడే రిపోర్టు తయారుచేసేస్తున్నాడు. అతనోసారి వెకిలిగా చూశాడు. డాక్టరు స్కూటరేసుకుని ఇంటికెళ్ళిపోతున్నాడు. నాకేం చేయాలో తోచలేదు. యు.డి.సి. దగ్గరకెళ్ళాను. "దయచేసి ఆగండి. విలేకర్లవరకూ విషయం వెళ్ళనివ్వకండి" అన్నాను.

"ఆ విషయం చెప్పేది మీరు కాదు. డాక్టరుగారు"

"డాక్టరుగారింటికెళ్ళిపోయారు"

"మీరూ వెళ్ళి బ్రతిమిలాడండి" అతననగానే మరో ఆలోచనకు తావివ్వకుండా ఆసుపత్రినుండి రిక్షాలో డాక్టరుగారింటికి బయలుదేరాను. నేనెళ్ళేసరికి డాక్టరుగారు బాత్‌రూంలో దూరిపోయారు. ఇంట్లో ఎవ్వరూ లేరు. పనిమనిషి ఉంది. అదీ నేనెళ్ళగానే "అయ్యగారూ! టిఫిన్ టేబులుమీద పెట్టాను. నానెళ్తన్నాను" అని వెళ్ళింది. లోపలినుండే డాక్టరుగారు "తలుపు చేరవేసి వెళ్ళు" అన్నారు.

"ఏ.ఎన్నెం రమీజాగారొచ్చారు"

"నరే... ఉండమను. నువ్వెళ్ళు" అన్నాడు.

బిక్కుబిక్కుమని సోఫాలో కూలబడ్డాను. అయిదు నిమిషాల్లో స్నానం చేసివచ్చాడు డాక్టరు. "ఏం? ఎందుకొచ్చారిక్కడకి?" అన్నాడు కోపంగా.

"డాక్టరుగారూ! ఈ ఒక్క తప్పుకు మన్నించండి. మా ఆయన ఆ మాటలన్నట్లు నాకసలు తెలీదు"

"అని ఎలా నమ్మమంటావ్? అయినా ఒక నిండుప్రాణం నీవల్ల బలైపోయింది. దానికి బాధ్యత వహించాల్సిందే!" అన్నాడు అనేసి "వెళ్ళండి. మీరిక్కడ ఉండటం మంచిదికాదు" అన్నాడు.

"డాక్టరుగారూ! నా ఉద్యోగం పోతుందండీ. మీరెలాగయినా రక్షించాలి" అని ప్రాధేయపడ్డాను

"నీలాంటిదాన్ని రక్షిస్తే నాకేమిటి లాభం?"

"డాక్టరుగారూ! మీకెంత కావలసినా ఇస్తాను. ప్లీజ్... ఈ ఒక్కతప్పు మన్నించండి"

"నాకు డబ్బెందుకూ? లంచం పుచ్చుకున్నానన్న అపనింద నాకొద్దు" అన్నాడు. నేను గుండెలవిసిపోయేలా రోదించాను. అతను కరగలేదు. అదే అతను అవకాశంగా తీసుకున్నాడు.

"నరే! ఒక్క కండిషన్. నేను చెయ్యమన్నట్టు చేస్తావా?" అన్నాడు. ఆత్మరక్షణ ప్రయత్నంలో ఆలోచనను కోల్పోయాను.,

"చేస్తాను" అన్నాను.

"ఇలారా!" అన్నాడు.వెళ్ళాను.-కూర్చోమన్నాడు. కుర్చీలో కూర్చున్నాను.

"నా కళ్ళలోకి చూడు!" అతను చెప్పినట్లే చేస్తున్నాను.

"తరువాత నింద నామీద తోస్తే నీ అంతయినా చూస్తాను" అన్నాడు సీరియస్‌గా.

నాకప్పుడు మరో ఆలోచన లేదు. ఊహ లేదు. భయంలేదు. ఉన్నదల్లా ఒక్కటే భయం. ఉద్యోగం పోతుందేమోనని! లేచి నిలబడ్డాను. "డాక్టరుగారూ! మీకు చేతులెత్తి మొక్కుతాను. నన్నీ ఆపదనుండి రక్షించండి. జన్మజన్మలకీ రుణపడి ఉంటాను" అన్నాను.

"నీ ఉద్యోగం పోకుండా చేసే పూచీ నాది. ఇప్పుడే ఆసుపత్రికి ఫోన్ చేస్తాను ప్రెస్ రిపోర్ట్ ఆపమని" అంటూ అతను రెండు చేతులతో నన్ను చుట్టేశాడు. నేనూహించలేకపోయాను. "డాక్టరుగారూ! వదలండి. వదలండి. ఇదా నానుండి మీరు కోరేది?" అరిచాను.

"ష్... గొడవచేయకు. గుట్టు రట్టవుతుంది. నువ్వు నా ఇంట్లోకొచ్చావు. నేను నీ ఇంటికి రాలేదు" అని అతను బలవంతం చేయబోయి "ఆలోచించుకో... ఇప్పటికీ నీకే వదుల్తున్నాను. కాదంటే తలుపులు తీసుకొని వెళ్ళిపో. నావనిని నేను చేస్తాను. తరువాత అవస్థలు పడేది నువ్వే. అన్నీ ఆలోచించుకో" అన్నాడు.

"డాక్టరుగారూ! మీ పాదాలు పట్టుకుంటాను, నన్ను పవిత్రంగా బతకనివ్వండి. అవకాశం వచ్చిందని వినియోగించుకోకండి. మీ కూతురులాటిదాన్ని" ఏడుస్తూ నేలమీద వాలి

పోయాను. అతను నన్ను రెండు చేతులతో లేవనెత్తాడు. నాకు ప్రతిఘటించే ఓపిక లేకపోయింది రాత్రల్లా నిద్రలేకపోవటంచేత. నేనేమయిపోతున్నానో నాకు తెలిసేసరికే నేనన్నీ కోల్పోయాను. ఇన్నాళ్ళూ ఎంతో పవిత్రంగా బ్రతికిన నేను మైలపడిపోయాను. నా బ్రతుకు మాడి మసైపోయింది. జీవితం దగ్ధమైపోయిందక్కా! ఆ రాక్షసుడు నన్ను కబళించేశాడు''' అని పిచ్చిగా గోడకేసి బుర్ర గుద్దుకొంటోంది.

రమీజాను ఆపటం అమ్మలువశం కాలేదు.

''అక్కా! ఆ రాత్రి ఆత్మహత్య చేసుకోవాలనుకున్నాను. కానీ అమ్మమ్మ గుర్తుకొచ్చింది. ఒక నిర్ణయాన్ని వెంటనే అమలుచెయ్యలేకపోతే తరువాత ఎన్ని కష్టాలు ఎదురౌతాయో తరువాతగానీ నాకు తెలిసిరాలేదు'' అని అమ్మలు ఒళ్ళో వాలిపోయింది. ఎలా ఓదార్చాలో అమ్మలుకీ అర్థంకాలేదు.

''రమీ! మనం నిమిత్తమాత్రులం. అయితే నువ్వు డాక్టరింటికి వెళ్ళకుండా వుంటే పరిస్థితి ఇంకోలా ఉండేదేమో'' అంది.

''కానీ ఆ యు.డి.సీ.గాడేమీ ఆలోచించుకోనీలేదు. ఆ పరిస్థితిలో నాకింతకంటే ఏ ఆలోచనా బుర్రకి అందలేదు'' అంది.

''కష్టాలు వచ్చినప్పుడు ఒకదానివెంట ఒకటి పరంపరగా వస్తుంటాయి. ఈ దెబ్బతో నేను మానసికంగా కృంగిపోయాను. ఇంతలో గోరుచుట్టుమీద రోకటిపోటులా మరో దెబ్బ. ఆసుపత్రిలో ఓ.పి.లో ఉన్నాను. ఎవరో ఒక ముసలామె, ఆమెవెంట ఒక ముప్ఫయ్యేళ్ల స్త్రీ వచ్చి ''రమీజా అంటే ఎవరు బాబూ?'' అని డాక్టరు దగ్గరకే వెళ్ళి అడిగారు. అక్కడేం జరిగిందో నాకు తెలీదు. డాక్టరుగారు నన్ను కబురుచేస్తే వెళ్ళాను.

''కబురు పెట్టారట?'' తలెత్తి నేరుగా అతని ముఖంలోకి చూడలేకపోయాను.

''ఆఁ... చూడమ్మా... నీకోసం ఎవరో వచ్చారట?'' అన్నారు.

''ఎవరూ?''

''మేమే తల్లీ. నువ్వేనా రమీజావు. ఏమమ్మా! మా బ్రతుకులో ఎందుకమ్మా ఇలా నిప్పులు పోశావ్? నీకు మేమేం అన్యాయం చేసేం? మాతో ఎందుకిలా చెలగాటాలాడుతున్నావ్?'' అని శివమెత్తిపోతోంది.

ఆవిడ ఆకారం వికృతంగా ఉంది. జడలు విప్పిన రాక్షసిలా ఉంది. పూనకం వచ్చిన అమ్మవారిలా ఉంది.

''ఎవరు మీరు? మీకు నేను చేసిన అన్యాయం ఏమిటి?''

''నీకెలా తెలుస్తుంది. మాయలమారివి. ఎందరి సంసారాలు కూలదోస్తున్నావో? నంగనాచిలాగా ఏమీ ఎరగనట్టు ముఖం పెడుతున్నావ్'' అని ఊరికే అరుస్తోంది.

''అమ్మా! మీకు నామీద కక్ష ఉంటే నన్నో కత్తితో పొడిచేసి చంపేయండి. నేనిప్పటికే చితికిపోయి ఉన్నాను. నేను మీకు చేసిన అన్యాయం ఏమిటో చెప్పకుండా ఇలా నా పరువు తీయడానికే వచ్చినట్లు కనిపిస్తోంది. మీకు చేతులెత్తి నమస్కారం చేస్తాను. నాకు అర్థమయినట్లు చెప్పండి'' అని రెండు చేతులతో నమస్కారం చేశాను.

డాక్టరు జోక్యంచేసుకుని అక్కడున్న అందర్నీ వెళ్ళిపొమ్మన్నారు. నేనూ, వాళ్ళిద్దరూ, డాక్టరే ఉన్నాం. ''చూడండమ్మా! మీరావేశపడకండి. మీరెందుకొచ్చారు. ఎక్కణ్ణుంచి వచ్చారు? ముందు వివరంగా చెప్పండి'' అన్నారు డాక్టరు.

ముసలావిడ ఏదో అనబోతోంది. నాకామెను చూస్తుంటే కడుపులో దేవేస్తున్నట్లుంది. ''అమ్మా! మీరు చెప్పండి. ఆమెకు సభ్యతకూడా తెలిసినట్లు లేదు'' అన్నాను.

''నాకు లేదటే సభ్యత?'' అని మళ్ళీ విరుచుకుపడబోతుంటే, ''నువ్వాగమ్మా! విషయం చెప్పకుండా ఎందుకలా అరుస్తావ్?'' అనేసి, ''చూడమ్మా! మాది విశాఖపట్నం. ఈమె నా తల్లి. కమాలుద్దీన్ నా భర్త'' అంది.

ఆకాశం విరిగి పడిపోతోంది. నేను పాతాళంలోకి కూరుకుపోతున్నాను. తల చెక్కలయిపోతోంది.

''కమాలుద్దీన్ మీ భర్తా? అయితే మొన్న చనిపోయింది మీ బాబేనా?'' వెంటనే సంశయ నివృత్తికోసం అడిగాను. ముసలావిడ మళ్ళీ రెచ్చిపోతోంది. ''చూశావంటే నంగనాచి బుంగమూతి. ఏం తెలీనట్టు ముఖం పెట్టింది,




ఒలమ్మోలమ్మో!'' అని అరుస్తోంది. ఈసారి ఆమెని వారించటానికి నాకు శక్తిలేదు. ఓపిక లేదు. ధైర్యంలేదు.

''అవునమ్మా... చనిపోయింది మాబాబే. నాన్నని చూడాలీ... నాన్నని చూడాలీ... అంటూ ప్రాణం విడిచాడు. ఎక్కడకెళ్లారో తెలీదు. అన్నిచోట్లా ప్రయత్నంచేశాం. నెలరోజులకి తిరిగొచ్చారు. ఇంట్లో ఏ దినుసూ లేదు. చంటిపిల్లకి కూడా రెండు మెతుకులు పెట్టలేకపోతున్నాం. పెద్దకుటుంబం. అసలాయన మీకిన్ని విషయాలు చెప్పారో లేదో కూడా నాకు తెలీదు. చెప్తే మీరాయన్ని పెళ్ళిచేసుకొని ఉండరేమోననే నా నమ్మకం!'' అంటుంటే-

''ఎందుకు తెలీదే, బాబు చచ్చిపోయాడని చెప్పినవాడు, తక్కిన విషయాలు చెప్పకుండా పోతాడా?'' అంది.

నాకప్పుడు ఈ బాహ్యప్రపంచం గుర్తొచ్చింది. ''డాక్టరుగారూ! నేను వీళ్ళనింటికి తీసుకెళ్తాను. నాకు సెలవు కావాలి!'' అనడిగాను. వెళ్లమని పర్మిషన్ ఇచ్చాడు డాక్టరు.

''ఇంటికి పదండి. అన్ని విషయాలూ అక్కడ మాట్లాడుకుందాం!'' అన్నాను. ఇంటికి నడిచారు. ''చూడండి... నావల్ల మీకేం అన్యాయం జరగనివ్వను. మీ జీవితంతో చెలగాటం ఆడుకోవలసిన వ్యక్తిని కాన్నేను. ముందు స్నానం చేయండి. టిఫిన్‌చేద్దురుగాని'' అని మాతో వచ్చిన హాస్పిటలు వాచ్‌మెన్‌కి డబ్బులిచ్చి టిఫిన్ తెమ్మన్నాను. ఫ్లాస్కు నిండా టీ తెచ్చి పెట్టమన్నాను.

ఆ యువతిని చూస్తే గొప్ప జాలి వేసింది. ముసలామెమీద కూడా నాక్కోపం రాలేదాసమయంలో. తన కూతురికి అన్యాయం జరిగినప్పుడు ఏ తల్లిమనసు ఆక్రోశించదు? వాళ్ళు స్నానంచేసి వచ్చారు. కమాలుద్దీన్ భార్య మవునంగా ఉండిపోయింది. ముసలావిడమాత్రం నన్ను తినేసేలా చూస్తోంది.

టిఫిన్లొచ్చాయి. వాళ్ళముందు పెట్టాను. ముసలావిడ కొరకొరా చూసింది. కాని ఆవురావురుమంటూ తినేసింది. ''తినే! ముందు టిఫిన్ కానీ!'' అంది. ఆవిడ మోకాళ్లో తల దూర్చుకుని ఉండిపోయింది. ''మీ పేరేమిటో నాకు తెలీదు. ముందు టిఫిన్ చేయండి'' అన్నాను.

''నా పేరు నజ్మా'' అని పేరుచెప్పి ఒకే ఒక ఇడ్లీ తిని ఊరుకుంది. గ్లాసుల్లో టీ పోసి ముందుపెట్టాను. వాళ్ళు టీ తాగారు. వాచ్‌మెన్‌ని వెళ్ళమని చెప్పాను. అతడు వెళ్ళిపోయాడు. నేనే కమాలుద్దీన్‌తో నా పరిచయం, మా పెళ్ళి గురించి చెప్పాను. అతన్నన్నెలా మోసంచేసిందీ వివరించాను. కలకత్తా వెళ్ళొచ్చాక జరిగిన సంగతీ వివరించాను. తాగినమైకంలో నా బాబుని పొట్టన పెట్టుకున్నావ్ అన్నప్పుడే నాకనుమానం వచ్చింది. కానీ అతను నన్నెలా నమ్మకద్రోహం చేసిందీ వివరించాను. వారంరోజులయింది వెళ్ళి. ఈరోజున శనివారం. తప్పక వచ్చే అవకాశం ఉంది. మీరుండండి. మీ అమ్మగారన్నట్లు నేను నంగనాచినో, కాదో మీకే తెలుస్తుంది'' అన్నాను కళ్ళొత్తుకుంటూ.

''చెల్లెమ్మా! అమ్మ మాటలు పట్టించుకోకండి. అతను గతంలో కొంతమంది ఆడాళ్ళ జీవితాలతో చెలగాటమాడాడు. కానయితే పెళ్ళి వరకూ రానివ్వలేదు. మిమ్మల్నీ మీ ఉద్యోగాన్నీ చూశాకా అతనికీ దుర్బుద్ధి అధికమై ఉంటుంది. అమ్మ మీ మనసు క్షోభపెట్టినందుకు అమ్మ తరఫున నేను క్షమార్పణ కోరుకుంటున్నాను'' అంది నజ్మా.

ఆమె ఎంతగానో నచ్చింది. మిన్ను విరిగి మీదపడినా చలించని తత్వం ఆమెదని ఆ కొద్దిక్షణాల్లో తెలిసిపోయింది. వాళ్ళు వెళ్ళిపోతామంటే నేను ఉంచేశాను. అనుకున్నట్టే పదవుతూ ఉంటే తలుపు చప్పుడయింది. వెంటనే వాళ్ళని లేపి మూలగదిలో ఉండమన్నాను. అతను వచ్చాడు. ఈసారి తాగిరాలేదు. లుంగీ మార్చుకుంటూ ''ఈరోజు తాగి రాలేదు. మరి తాగదలచుకోలేదు'' అన్నాడు.

''బాబు గురించి మరిచిపోయారా?'' అన్నాను. గతుక్కుమన్నాడతను.

''నిజం చెప్పండి. బాబు మీకేం కాడా?''

''ఏం? ఎందుకలా అడుగుతున్నావ్?''

''నా ప్రశ్నకి సమాధానం చెప్పండి?''

''ఇవాళ కొత్తగా చెప్పడానికేముంది? ఆరోజే చెప్పానుకదా?''

''ఎందుకిలా నా గొంతుకోశారు? మీకిదివరకే

పెళ్ళికాలేదా? మీకు పిల్లల్లేరా? మీ కన్నకొడుకు పోతే పక్కవాళ్ళ బాబని ఎంత చక్కని కథ అల్లి చెప్పారండీ?" అని ఏడ్చాను.

"నీకు మతిపోయిందా? నాకు పెళ్ళవటం ఏమిటి?"

"నజ్మా మీ భార్యకాదా? ఆ అమాయకురాలి జీవితాన్నెందుకలా మసిచేస్తున్నారు?"

"నజ్మా... అదిక్కడికీ వచ్చిందా? అదో పిచ్చిది. దాంతో ఓ ముసిల్ది వచ్చిందా?"

"అవును... నిజాలు చెప్పినవాళ్లు పిచ్చివాళ్ళే మరి!"

"అనవసరంగా నన్ను రెచ్చగొట్టకు"

"ఇన్నాళ్ళూ వైజాగ్ మీ ఇంటికొస్తానంటే మీరెందుకు అబద్ధం ఆడారో నాకివాళ అర్థమైంది. హాస్పిటల్లో నా పరువు పూర్తిగా పోయింది" అన్నాను రుద్ధకంఠంతో.

"వాళ్ళేమయ్యారు? వాళ్లనుంచినట్లయితే వాళ్ళ భరతం పట్టేవాణ్ణి"

"ఏంచేస్తారు?"

"నిజానిజాలు నీముందే తేల్చి నిన్ను పిచ్చిపిచ్చిగా వాగనివ్వకుండా చేసి ఉండేవాణ్ణి" అన్నాడతను. వెంటనే వెనుకగదిలో ఉన్న వాళ్ళని తీసుకొచ్చాను. అతను అప్రతిభుడయ్యాడు. చలించిపోయాడు. కోపంతో ఊగిపోయాడు. "మీరెందుకొచ్చారిక్కడికి? మిమ్మల్నెవరు రమ్మన్నారు?" అరిచాడు.

"ఏం? ఇలా ఎందరి గొంతులు కోస్తున్నావ్? నీ అంతు తేలుస్తానివాళ. ఈ విషయం తెలిసిందగ్గర్నుంచీ ఈవిడేదో మాయలమారి అనుకున్నాను. గదిలో ఉండి నీ మాటలన్నీ విన్నాం. మేం పిచ్చివాళ్ళమా? మేం ఇలాగా బతకడంకూడా నీకిష్టంలేదా? మమ్మల్నందర్నీ ఇంత విషమిచ్చి చంపేయ్. పీడా విరుగడవుతుంది." అని కేకలేసింది ముసలమ్మ.

కమాలుద్దీన్ వెంటనే అక్కడున్న వాలుకుర్చీ కర్రతీసి ముసలమ్మని రెండుమూడు దెబ్బలు కొట్టాడు. "ఆగండి! ఆవిడమీద దెబ్బ పడితే మర్యాద దక్కదు. చేసింది వెధవపనిను. పైగా చెయ్యిచేసుకోడానికి సిగ్గులేదా?" అని బలవంతంగా వెనక్కితోసేశాను.

"నోర్ముయ్. నువ్వెర్తివి నన్నడగటానికి? నా ఇష్టం" అనేసి "నజ్మా! వెళ్ళిపో. నాకు కోపం తెప్పించకు. నిన్నసలు ఇక్కడకి రమ్మని ఎవరు చెప్పారు?" అని కేకలేశాడు. నజ్మా జవాబివ్వలేదు. కుమిలికుమిలి ఏడ్చింది.

"ఇంట్లో సరుకులు నిండుకున్నాయి. మీ నాన్నగారికి ఒంట్లో ఏం బాగులేదు. రెండురోజులుగా కళ్ళు తెరవటంలేదు. పాపకీ జ్వరం తగ్గలేదు. చేతిలో డబ్బుల్లేవు" అంది మెల్లిగా.

జేబులోంచి డబ్బులు తీశాడు. అయిదొందలిచ్చాడు. "వెళ్ళు... నేను రేపొస్తాను" అన్నాడు.

"ఇప్పుడెక్కడకెళ్తారు? పదిగంటలు దాటిపోయిందికూడా. రేపు వెళ్తారు" అన్నాను.

నజ్మా వినలేదు. నేనే వారించాను. ముసలమ్మా ఎందుచేతనో మరోమాట మాటాడలేదు. రాత్రల్లా సణుగుతూనే ఉంది. నజ్మా ఎంత ఉన్నత వ్యక్తిత్వం కలదో ఒక్క విషయంలో చెప్తాను. మా ఇద్దర్నీ ఒకేగదిలో ఉంచి ఆమె పక్కగదిలో పడుకోబోయింది. ఆమెకు మనసులోనే జోహార్లర్పించుకున్నాను. ఆ మరునాడు వాళ్ళతో అతనూ వెళ్ళాడు. పదిరోజులు రాలేదు. తరువాతనోరోజు వచ్చాడు. పొమ్మన్నాను. వినలేదు. ఇంట్లోకొచ్చి పడుకున్నాడు. నేను వేరేగదిలో తలుపేసుకుని పడుకున్నాను" అని చెప్పి ఆగిపోయింది.

"చెప్పక్కా! నన్నేం చేయమంటావ్?" అనడిగింది.

అమ్మలు ఆలోచిస్తూండిపోయింది! ఇలాటి విషయాల్లో స్వయంనిర్ణయాలే ఉత్తమం.

"నేను ఉద్యోగం రిజయిన్ చేసేద్దామనుకుంటున్నాను. చేసి కలకత్తా వెళ్ళిపోతాను. కమాలుద్దీన్‌కి డైవోర్సు ఇచ్చేస్తాను. ఆ విషసర్ప స్పర్శని సహించలేను. ఇక్కడే ఉంటే అతను నన్ను వెన్నంటుతూనే ఉంటాడు. ఇలాటి నిర్ణయం తీసుకోకపోతే నజ్మాకి నేను తీరని అన్యాయం చేసినదాన్నౌతాను" అంది.

రమీజా నిర్ణయం సబబుగా కనిపించింది.

"అయితే వ్యవహారాలన్నీ సెటిలయిందాకా ఇక్కడే ఉండాలి తప్పదు. నువ్వు అప్పట్లో ఎవరైనా మ్యూచివలు ట్రాన్స్‌ఫర్ ఇస్తే బాగుణ్ణ





న్నావ్. మనం ట్రాన్స్‌ఫర్ పెట్టుకుందామా?'' అంది.

''సరే! నీఇష్టం. కానీ ముందుగా నువ్వే పనిచెయ్యి. కొన్నాళ్ళు సెలవు పెట్టుకొని నాదగ్గరకు వచ్చేసెయ్'' అన్నది అమ్మలు.

''వద్దు అక్కా! నానుంచి నువ్వు కూడా ట్రబులవటం నాకిష్టంలేదు. ఇప్పటికే బోలెడన్ని గొడవల్తో నువ్వు నలిగిపోతున్నావ్'' అంది ఎంతచెప్పినా వినక.



తెల్లవారుతోంది అప్పుడే.

రోజూలాగే అమ్మలు లేచి కాలకృత్యాలు ముగించుకుని కాఫీ పెట్టుకుతాగింది. కాఫీ గొంతులో పడకపోతే ఏ పనీ చెయ్యలేదు. ఇంతకుముందు పనులన్నీ అత్తగారు చేసుకునేది. గొడవలు ప్రారంభమయిన దగ్గర్నుంచీ సాధ్యమయినంతవరకూ అన్ని పనులూ తనే చూసుకుంటోంది. అప్పుడప్పుడూ వసంత చెయ్యబోతే వద్దని వారిస్తోంది కూడా. ఇంటిపని కూడా తనే చేయాల్సి వస్తున్నందుకు రవంత కూడా బాధపడటంలేదు. సుదర్శనం అప్పుడప్పుడు ఆమె వంటరిగా ఉన్నప్పుడు - ''అమ్మలూ! వసంతా నీమీదనే పడిపోతోంది. నీకు విశ్రాంతి లేకుండాపోతోంది. చివరకు నువ్వేమయిపోతావో నాకు భయమేస్తోంది'' అంటున్నా ''ఎవరైనా వింటే నవ్వుతారు. గేసూ, కుక్కరూ, మిక్సీ ఇవన్నీ చేస్తున్నాయి. నేనేం శ్రమపడిపోవటంలేదు. అయినా అవ్వాకావాలీ బువ్వా కావాలీ అంటే ఎలా కుదురుతుంది? అప్పటి కంటే ఇప్పుడే నాకు హాయిగా ఉంటోంది'' అన్నప్పుడు సుదర్శనం తృప్తిగా వెళ్ళేవాడు. సరిగ్గా ఆవేళ కూడా సుదర్శనం అమ్మలుతో పాటే లేచి సాయం చేయబోతే వద్దని దెబ్బలాడింది. ''మీరు పోయి పడుకోండి'' అంది. సుదర్శనం బాత్రూంకెళ్ళివచ్చి పడుకోబోతుంటే, ''బాబూ! టైమెంతయిందిప్పుడు?'' అని తల్లి అడిగేసరికి గోడగడియారం ఆరుసార్లు కొట్టింది. ''ఆరయిందమ్మా!'' అన్నాడు.

''ఏంటో మూడు గంటలయి ఉంటుంది. అప్పట్నుంచీ మరి నిద్రపట్టలేదురా'' అని లేచి కూర్చుంది. ''కోడలు లేచిందా?'' అడిగింది. లేచిందని సుదర్శనం సమాధానం చెప్పి ''పడుకోమ్మా!'' అన్నాడు. తల్లి వినలేదు. లేచి వెళ్ళి పళ్ళుతోముకుంది.

''ఏమత్తయ్యా! కాసేపు పడుకోలేకపోయారా? ఇప్పట్నించే లేచి ఏం చేస్తారు?'' అంది. ''ఒంట్లో చికాగ్గా ఉందే. పళ్ళు తోముకుని కాస్త కాఫీ తాగితే సర్దుకుంటుందేమోనని లేచాను'' అంది.

''సరే, అయితే పళ్లు తోముకురండి. కాఫీ ఇస్తాను'' అంది అమ్మలు.

నారాయణమ్మ పళ్ళు తోముకోడానికెళ్ళింది. అమ్మలు కూర తరిగింది. అన్నం, కూర, పప్పు కుక్కరు గిన్నెల్లో పెట్టి, కుక్కరులో పెట్టింది. కాఫీ కలిపింది అత్తగారికోసం. అత్తగారెప్పటికీ రాకపోతే చిన్న ప్లేటు మూతపెట్టింది. ఎప్పటికీ రాకపోతే నూతిదగ్గరకు వెళ్ళింది. నూతిపక్కన గట్టుమీద కూర్చుని పళ్ళు తోముకుంటోందామె. ఆ గట్టుపక్కన పడిపోయి ఉంది. రెండే రెండు అడుగుల్లో వెళ్ళి ''అత్తయ్యా! అత్తయ్యా!'' అని కేకేసింది. నారాయణమ్మ మూలుగుతోంది. అమ్మలుకి భయంవేసింది. ''ఏమండీ! ఏమండీ! అర్జంటుగా రండి!'' పెరట్లోంచి కేక వేసింది. సుదర్శనానికి ఆ కేక వినిపించలేదు. గదిలో చదువుకుంటోన్న వసంత పరుగున వచ్చి ''ఏమయింది వదినా?'' అంటూ ఆత్రుతగా అడిగింది.

''వసంతా! అర్జంటుగా అన్నయ్యని లేపు. అమ్మ పెరట్లో పడిపోయారు'' అంది. వసంత కంగారుగా పరుగెత్తి ''అన్నయ్యా! అన్నయ్యా! అమ్మ పడిపోయింది పెరట్లో. వేగిరంగా అన్నయ్యా!'' అంది.



సుదర్శనం మంచంమీదనుంచి ఒకే దూకు దూకాడు. అమ్మలు ఎంత ప్రయత్నించినా నారాయణమ్మ లేవలేకపోతోంది. భర్త సాయంతో ఇంట్లో మంచంమీదికి చేర్చింది. “వసంతా! ఆ గదిలో కాఫీ మూత పెట్టి ఉంచాను. ఇలా తీసుకురా!” అంది. వసంత కాఫీ తెచ్చింది. అమ్మలు అత్తగారిచేత కాఫీ తాగించింది. “నేనింజక్షనిస్తాను. శివని లేపి డాక్టరుగార్కి కబురుచేయండి” అంది. అని సూరోబిన్ ఇంజక్షను చేసింది. నారాయణమ్మ





ఏదో చెప్పాలనుకుంటోంది. గొంతు పెగలటంలేదు. అందరికీ పరిస్థితిని చూసి భయం వేసింది. అమ్మలు భర్తతో మెల్లగా అంది - "పెరాల్సిస్ స్ట్రోకు వచ్చినట్లుంది. మరి ఆలస్యం చేయకుండా టౌన్‌కి తీసికెళ్ళిపోవటం మంచిది. వెళ్ళి ఆ ప్రయత్నం చేయండి" అంది.

"ఇప్పుడెలా తీసుకెళ్ళటం?" అంటుండగా శివ డాక్టరుని తీసుకుని వచ్చాడు. డాక్టరు బి.పి. చూశాడు. 180 ఉంది. కిట్ తెరిచి రెండు ఇంజక్షన్లు ఇచ్చాడు. "ఏమయింది డాక్టర్?" అన్నాడు సుదర్శనం.

"జస్ట్ పెరాల్సిస్ స్ట్రోక్. మరేం భయంలేదు. బి.పి. రైజవటంవుండి వచ్చింది" అన్నాడు డాక్టరు. ఆనేసి నారాయణమ్మ దగ్గరకెళ్ళి - "నిద్ర పడుతోందా?" అని అడిగాడు. లేదన్నట్లు తలూపింది.

"మూడు గంటలకు తెలివొచ్చింది. నిద్ర పట్టలేదట. కాఫీ తాగి పడుకుందామని పళ్ళు తోముకోడానికెళ్ళి పడిపోయింది" అన్నాడు సుదర్శన్. అమ్మలు డాక్టరుగారికి కాఫీ తెచ్చి ఇస్తూ "టౌన్ తీసుకెళ్దాం అంటున్నాను" అంది.

"మంచిదే, కానీ ఆవిణ్ణెలా తీసుకెళ్తారు. అదీగాక ఆమెకు విశ్రాంతి అవసరం" అనేసి, "మీరు తీసుకెళ్ళాలీ అనుకుంటే నా కారు ఇస్తాను తీసుకెళ్ళండి. కానీ అవసరంలేదని నా ఉద్దేశ్యం" అన్నాడు.

"చూడండి... మీరు అవసరమంటేనే తీసుకెళ్దాం. అక్కర్లేదూ అంటే మరెందుకు?" అన్నాడు సుదర్శనం. అమ్మలు అంది - "ఆవిడకు మాట రావటంలేదు డాక్టరుగారూ!" అని.

డాక్టరుగారు నారాయణమ్మ చెయ్యిపట్టుకుని చూశాడు. "ఇందాకటికంటే కొంచెం పరిస్థితి బాగుంది. ఆవిడకు నీరసం ఎక్కువగా ఉంది. అంతేతప్ప మరేం ప్రమాదం లేదు. పోనీ, సాయంకాలంవరకూ చూద్దాం. అప్పటి పరిస్థితినిబట్టి ఆలోచిద్దాం. ఈలోగా పరిస్థితి ఎప్పటికప్పుడు నాకు తెలియపరుస్తూ ఉండండి" అని డాక్టరు కదిలాడు.

ఆవేళ ఫామిలీప్లానింగ్ ఆపరేషన్లు ఉన్నాయి. ముగ్గురు వస్తామని కూడా చెప్పారు. ఏంచేయాలో తోచలేదు. శివని పిలిచింది. మేల్ అసిస్టెంటుకి ఒక ఉత్తరం రాసి పంపింది. ఫలానావాళ్ళు హాస్పటల్లో తనకోసం ఎదురుచూస్తారని, వాళ్ళ కేసులు తనపేరున నమోదుచేసి ఆపరేషన్లు చేయించమని. శివ వెళ్ళి ఉత్తరం ఇచ్చి వచ్చేశాడు.

అమ్మలు ఆరోజు మరి డ్యూటీకి వెళ్ళలేకపోయింది. వసంత ఏడుస్తూ కూర్చుంది. పెంకివాడుగా కనిపించిన శివలో కూడా బేలతనం కనిపించింది. సుదర్శనం డీలాపడిపోయాడు. అత్తగారిని చూస్తే అమ్మలుకి భయంవేసింది. కానీ అందరూ భయపడిపోతే ఇంట్లో ఏ పనీ అవదని ధైర్యం తెచ్చుకుంది. ఇంట్లో పనిని చూసుకుంటూనే ప్రతి పావుగంటకీ ఒకసారి వచ్చి చూస్తూనే ఉంది.

ఒకపక్క కుటుంబ నియంత్రణ వారోత్సవాలు జరుగుతున్నాయి. కేవలం హాస్పిటలు సిబ్బంది మాత్రమేకాక రెవెన్యూవాళ్ళు, మున్సిపలు సిబ్బంది, మండల ప్రజాపరిషత్తు, జిల్లా ప్రజాపరిషత్తులలో పనిచేస్తోన్న ఉపాధ్యాయులకు కూడా తప్పనిసరిగా కొందరి వ్యక్తులచే ఆపరేషన్ చేయించినట్లు చేయాలని కలెక్టరు ఉత్తర్వు అందర్నీ గొప్ప ఇబ్బందుల్లో పెట్టింది. ఎందరు ప్రయత్నించినా కేసులన్నీ రెవెన్యూ వాళ్ళే నొల్లేసుకుంటున్నారు. కారణం - వాళ్ళ చేతుల్లో రుణాల పంపిణీ, ఇళ్ళ స్థలాల పంపిణీ, భూముల పంపిణీవంటి పథకాలున్నాయి కాబట్టి, ప్రజలు అటే మొగ్గుచూపుతున్నారు. ఉపాధ్యాయ సంఘాలవాళ్ళు దీనిమీద ఉద్యమం తెచ్చే ప్రయత్నంలో ఉన్నారు. ఎటొచ్చీ చికాకంతా ఆసుపత్రి సిబ్బందిదే! వాళ్ళు పనిచేస్తున్నది ఉద్యోగంలో. ప్రధాన కర్తవ్యం కుటుంబ సంక్షేమ ప్రచారమే అయినా, ఎక్కువ జనాన్ని సమీకరించలేకపోతున్నారు. అలాటి స్థితిలో అమ్మలు తనకు ప్రజల్లో ఉన్న మంచితనంవల్ల నలుగురు వ్యక్తులను ఆపరేషన్‌కు సుముఖులను చేయగలిగింది. కానీ సరిగ్గా సమయానికి తను సెలవు పెట్టింది. అసలే డాక్టరు అవకాశంకోసం ఎదురుచూస్తున్నాడు. ఇప్పటికే రమీజాని అవకాశం చూసి దెబ్బకొట్టాడు. అమ్మలు కావిషయం గుర్తుకొస్తేనే గుండె ఝల్లుమంటుంది. ఒక్కతే ఎలా గుందో ఏమో? క్షణానికోరకమైన ఆలోచనలు!

'భగవంతుడా! అత్తగారి ఆరోగ్యం కుదుటపడేటట్లుచేయి. ఆవిడకేప్రమాదం సంభవించినా ఇంట్లో ఒక పెద్ద దిక్కు లేకుండాపోతుంది' అనే ఆలోచన వచ్చేసరికి అమ్మలు కళ్ళు చెమ్మగిల్లాయి.

"ఏమండీ! ఎందుకయినా మంచిది - మీ అక్కలకి టెలిగ్రాంలు కొట్టండి. లేదా ఫోన్ చేయండి" అంది. సుదర్శనం ఆలోచనలోపడ్డాడు. "తొందరెందుకు? అందర్నీ హడావుడి పెట్టడం?" అన్నాడు.

"నా మాట వినండి. తరువాత ఏదానికేదొచ్చినా మిమ్మల్నెవరూ అనరు. అందరూ వస్తే ఇంట్లో చాకిరీ చెయ్యాల్సి వస్తుందనీ, అదే కబురు పంపొద్దనేసి ఉంటుంది అనగలరు" అంది.

సుదర్శనంకి అమ్మలు చెప్పిన మాటలు

నిజమే అనిపించాయి. అసలే తన బావలకి నోటిదురుసుతనం. ముందూ వెనుకా ఆలోచించకుండా మాట విసిరేస్తారు. అలాగని చెడ్డవాళ్ళు కాకపోయినా, ఒక్కోసారి ఎదుటవాళ్ళు బాధపడతారని ఆలోచించరు అని అనుకొని "సరే... నేను ఫోన్‌చేసి వస్తా" అని వీధిలోకి వెళ్ళాడు. పెద్దబావ రాజమండ్రిలో ఉన్నాడు. ఎస్.టి.డి.వల్ల వెంటనే కబురందింది. రెండో ఆయన రైల్వేమనిషి - సమయానికి దొరకడు. అయినా అతనికి ఫోన్ వెళ్ళింది. మూడోఆయనకి కబురుపంపటం కష్టం. వీళ్ళకంటే దగ్గర్లోనే ఉన్నా శుద్ధ పల్లెటూరు. ఏంచేయాలో తోచక ఆలోచిస్తుంటే ఆ ఊరెళ్తోన్న మనిషి కనిపించాడు. అతనికి విషయం చెబితే వెళ్ళగానే కబురుచేస్తాను. మీరు వర్రీ అవకండని భరోసా ఇచ్చాడు. తనూ వారంరోజులు సెలవు పెట్టివచ్చాడు. ఇంటికి రాగానే "కబురుచేశారా?" అడిగింది అమ్మలు.

"అందరికీ కబుర్లెళ్ళాయి. మరేం కంగారు పడనవసరంలేదు" అన్నాడు.

"వదినా! అమ్మ కాఫీ కావాలంటోంది!" అంది. నారాయణమ్మగారు కాఫీ కావాలని తననోటితో చెప్పిన మాటలు ముందుగా ఎవరూ గుర్తించలేదు. కాఫీ ఇవ్వాలన్న విషయానికే ప్రాధాన్యత ఇచ్చారుగానీ. కాఫీ కలుపుతోన్న అమ్మలుకు సందేహం వచ్చింది. "వసంతా!" పిలిచింది. వసంత పరుగున వచ్చింది. "కాఫీ కావాలని ఎలా చెప్పారు?" అంది. అప్పుడు వసంతకు గుర్తొచ్చింది.

"అవునొదినా! నేను గుర్తించనేలేదు. అమ్మే స్వయంగా చెప్పింది" అంది.

"ఏమండీ!" కాళ్ళు కడుక్కోడానికి నూతిదగ్గరకెళ్ళిన భర్త దగ్గరకి అత్తగారికి మాట వచ్చిందని చెప్పడానికి వెళ్ళిపోయింది. సుదర్శనం భార్య పరుగెత్తి రావటంచేత ఏం కొంపమునిగిందోనని ముందు భయపడిపోయాడు.

"ఏం అమ్మలూ?"

"అత్తగారు మాట్లాడుతున్నారండీ!" అంది.

"ఆహాఁ..." అని తువ్వాల్తో ముఖం తుడుచుకుంటూ తల్లిదగ్గరకెళ్ళాడు.

"ఏమ్మా! ఎలాగుంది?" అడిగాడు. తల్లి కొంచెం కష్టంమీద - "ఈ కాలే నా వశంలో లేకుండాపోయిందిరా!" అంది పక్కకు ఒత్తిగిల్లుతూ.

మరేంఫరవాలేదు. డాక్టరుగారిందాకే చెప్పారు: నీరసం బాగా ఉందని. అయినా ఈమధ్య నీకు ఉపవాసాలు ఎక్కువయిపోతున్నాయి. చెప్పినమాట వినవూ" అన్నాడు తల్లి తన ఆరోగ్యంమీద శ్రద్ధ తీసుకోనందుకు.

"నా ఉపవాసాలు నా పీకలమీదకిలా తెచ్చిపెడతాయని నేననుకోలేదురా! ఏదో ఆ పిల్ల తలమీద రెండక్షింతలు వేసేస్తే నాకు మరే కోరికా లేదు. చంటాడున్నాడంటే మగాడు. వాడెలాగయినా బతికేస్తాడు" అంది కళ్ళంట నీళ్ళొస్తుంటే.

అప్పుడే అక్కడకొచ్చిన అమ్మలు - "మీరు అనవసరమైన ఆలోచనలు పెట్టుకోకండి. హాయిగా రెస్టు తీసుకోండి. వసంతకింకా పాతికా, ముప్ఫయిదాటిపోలేదు. ముందీ కాఫీ తాగి పడుకోండి" అని దెబ్బలాడింది.

భర్తతో అంది - "మీరు డాక్టర్ని కలిసి విషయం చెప్పండి. మాట బాగానే ఉందని"

"అయితే సరే. నే వెళ్ళొస్తా. వసంతా! నువ్వమ్మదగ్గరే ఉండు. శివా! నువ్వెక్కడికీ వెళ్ళబోకు!" అని హెచ్చరికలు చేసి వీధిలోకి వెళ్ళాడు.

వీధిలోనికెళ్ళి డాక్టర్ని తీసుకొచ్చాడు. డాక్టరుగారు మళ్ళీ బీ.పి. చూశారు. ఇప్పుడు 160కి దిగింది. "బాగా కంట్రోలయింది. మీరు రెస్టు తీసుకోండి" అని ఆమెతో అని, "మరేం ఫరవాలేదు. కాలు కూడా స్వాధీనంలోనికి వచ్చేస్తుంది" అని మరో ఇంజక్షన్ చేశాడు. డాక్టరు వెళ్ళబోయేంతలో రాజమండ్రినుండి, బరంపురంనుండీ అక్కా, బావలూ వచ్చారు. వాళ్ళు వస్తూనే - "అసలేమయింది? ఇప్పుడెలా ఉంది? ఏం అత్తయ్యా! ఏంటిదంతా?" అని అల్లుళ్ళడుగుతే, "అమ్మా!" అని కూతుళ్ళిద్దరూ బావురుమన్నారు. అక్కణ్ణుంచి నారాయణమ్మా ఏడుపు మొదలెట్టింది.

"మిమ్మల్ని చూస్తాననుకోలేదు తల్లీ! ఆ భగవంతునికి ఎక్కడో ఇంకా ఈ పాపిష్ఠిదాని మీద దయ ఉంది. మిమ్మల్నిలా చూడగలిగాను" అంటూ రాగం తీయటం మొదలుపెట్టింది.

"ఇంకా నయం అక్కా! పొద్దున్నయితే అన్నలు మాటలేదు. మేమంతా ఎంత కంగారుపడిపోయామో?" అంది వసంత.

డాక్టరు పరిస్థితిని చూశాడు - "ఆవిడకి విశ్రాంతి అవసరం. ఆమెని మీరెవ్వరూ మాట్లాడించటానికి ప్రయత్నించకండి. ఆవిడెంత విశ్రాంతి తీసుకుంటే అంత మంచిది" అని ఏమనుకున్నాడో ఏమో మళ్ళీ నిద్రపట్టడానికి ఇంజక్షన్ ఇచ్చాడు. "ఆవిడకి నిద్రపట్టడానికి ఇంజక్షనిచ్చాను. మీరేం గాబరాపడకండి" అనిచెప్పి వెళ్ళాడు.

డాక్టరు వెళ్ళగానే చిన్న బావ అన్నాడు - "మీరు నెగ్లెక్టు చేస్తున్నారెందుకు? పెరాల్సెస్ రాగానే కె.జీ.హెచ్.కి తీసుకెళ్ళి జాయిన్ చేస్తే మరేం భయం ఉండదుకదా! అర్ధరాత్రి ఏదయినా చికాకుచేస్తే ఎటు పరుగెత్తగలరు? ఇలాటపుడు డబ్బుకోసం చూడకూడదు" అన్నాడు - డబ్బు ఖర్చవుతుందన్న భయంతో ఇక్కడ ట్రీట్‌మెంట్ ఇప్పిస్తున్నట్లు.

ఆ మాటలు విన్న సుదర్శనం హర్టయాడు. లోపల్నించి వస్తోన్న అమ్మలు మనసు చివుక్కుమంది.

"చూడండి బావా! డాక్టరుగారు వెంటనే వచ్చి చూశారు. అమ్మకి బి.పీ. 180 ఉంది. ఇంత బి.పీ. ఉన్నప్పుడు ఇక్కణ్నుంచి వెళ్ళటానికి బస్సులు తప్ప టాక్సీలు లేవు. అందులోనూ డాక్టరుగారేం చెప్పారంటే, నాలుగు వరకూ చూసి కంట్రోలు కాకపోతే తన కారులోనే తీసుకెళ్ళొచ్చన్నారు. మరేం ఫరవాలేదు. ఇది వీక్నెస్‌వల్లనే వచ్చింది అన్నారు" అని చెపుతుండగానే, చిన్నబావ మధ్యలోనే సుదర్శనం మాటను తుంచేస్తూ, "డాక్టర్లు అలానే అంటారు. వాళ్ళ చేతులు దాటిపోతే, అప్పుడు కాళ్ళు చాపేస్తారు" అన్నాడు.

"అది కాదు బావా! పొద్దున్న అమ్మకసలు మాట రాలేదు. డాక్టరు చాలా చక్కగా ట్రీట్ చేశారు. ఇప్పుడమ్మ శుభ్రంగా మాట్లాడుతోంది. కాలు కూడా వచ్చేస్తుంది. మరేం ఫరవాలేదన్నారు" అన్నాడు. అమ్మలుమాత్రం వాళ్ళేం మాటనేస్తారోనని భయంభయంగా చూస్తోంది వాళ్ళవేపే.

"చెల్లికెలా కబురుచేశారు?" అంది పెద్దాడపడుచు.

సమాధానం చెప్పలేదు అమ్మలు.

సుదర్శనం అన్నాడు - "మనూరువాడొకడు ఈ ఊరు పిల్లని చేసుకున్నాడు. వాడు ఇవాళే వెళ్తుంటే వాడిచేత కబురుచేశాను" అనేసి "మరో గంటకో, అరగంటకో వాళ్ళు రావచ్చు" అన్నాడు. ఇంకా ఆ మాటలు సుదర్శనం నోట్లోనే ఉన్నాయి. "అదిగో, బుచ్చక్కా, బుచ్చి బావ వస్తున్నారు" కనుచూపుమేరలో రిక్షాలో వస్తున్న వాళ్ళనుచూసి అంది వసంత.

"ఏం వదినా బావున్నారా?" ఇంటోకి వస్తోన్న బుచ్చి వదినను పలకరించింది అమ్మలు. ఆ మాటలు వినిపించుకోకుండానే "అమ్మకెలా ఉంది?" అనడిగింది.

"మరేం ఫరవాలేదు. ఇప్పుడే డాక్టరుగారొచ్చి ఇంజక్షన్ చేశారు. నిద్రపోతున్నారు" అని జవాబు చెప్పి ఇంట్లోకెళ్లి ఫ్లాస్క్‌లో కాఫీ తెచ్చి ఇద్దరికీ ఇచ్చింది.

"ఏరా! నువ్వు పాలు తాగుతావా?" అడిగింది బుచ్చి కొడుకును. వాడు అడ్డంగా తలూపాడు.

"కాఫీ తాగి గ్లాసుకింద పెట్టి బుచ్చి సమరానికి సిద్ధమైనట్టు ముఖం గంభీరంగా పెట్టి, "మీరెప్పుడు వచ్చారు?" అడిగింది.

'మేం సాయంకాలమే వచ్చాం' జవాబిచ్చారు అక్కలు.

"మీకు కబురెలా తెలిసింది?"

"వాళ్లకి కబురుపెట్టడం కష్టం కాదమ్మా! ఎస్.టి.డి. సౌకర్యంవలన రెండు నిమిషాల్లో కబురెళ్లిపోయింది. మీకు కబురెలా వెళ్తుందా? అన్నదే అర్థంకాలేదు"

"అవును... పోనీ కబురు పెట్టడం మానీవలసింది. శవాన్ని చూడడానికి వచ్చిఉండేదాన్ని" విసురుగా అంది.

ఆ మాటలు సముద్రంలా గంభీరంగా ఉండే అమ్మలులో తుఫాను రేపింది.

"వదినా!"

"ఏం అదేం తప్పుమాటందని?" వత్తాసు పలికాడామె భర్త.

"అదికాదు బావా!"

"ఏది కాదయ్యా! పెద్దవాళ్లిద్దరికీ ట్రంక్‌బుక్

చేసి కబురంపావ్. నా దగ్గర కొచ్చేసరికి నీకు డబ్బులు కక్కుర్తి వచ్చేసిందా? పోనీ, ఫోన్‌చేసి ఇంతయిందంటే, ఆ డబ్బులు నేనే ఇచ్చి ఉండేవాణ్ణికదా'' అన్నాడు.

''ఏమిటి బావా మీరనేది? ఉదయం పరిస్థితుల్లో ఎవరికేం చేయాలో కూడా తోచలేదు. మీకు ఫోన్ సౌకర్యంలేదు. టెలిగ్రాం ఇస్తే మామూలు పోస్టులో వస్తుంది. ఉత్తరం రాస్తే మూడురోజులు పడుతుంది. సమయానికి ఆ నాయుడు కనిపించాడుకదా, కబురు సులువుగా చేరుతుందని అన్నయ్య కబురు పెట్టాడు. దానికంత సీరియస్ అయిపోవాల్సిన పనేముంది? ఇద్దరికి ట్రంకుబుక్ చేసినవాడు పదిరూపాయలకోసం ఆలోచించాడని అంత సంకుచితంగా ఎందుకాలోచిస్తున్నారు?'' వసంత కలుగచేసుకుంది.

''వసంతా! ఎందుకమ్మా. లేనిపోని గొడవలు. ఆవిడారోగ్యం అసలే బాగులేదు. ఈ మాటలకి ఆవిడకి తెలివొస్తే చికాకు. ఇప్పుడే బీ.పి. తగ్గింది. మళ్ళీ రెయిజయితే ప్రమాదం. అన్నయ్యగారూ! మేం ఏ దురుద్దేశంతోనూ లేం. కబురు వేగిరం ఎలాగ అందుతుందా అని ఆలోచించాం తప్ప, ఇలా అపార్థం చేసుకుంటారనుకోలేదు. ఆ కుర్రాడు మరిచిపోతే ఏం చేయాలాని భయపడ్డాం!'' అందిఅమ్మలు అపాలజీ చెప్పుకుంటూ.

''అదికాదు అమ్మలూ! ఎవరో దారినపోయిన దానయ్యతో కబురంపారు. వాడు చెప్పకపోతే ఏం చేద్దామనుకున్నారు. పోనీ, కనీసం ఉత్తరం ముక్కయినా రాసిపంపాడా? అదీ లేదు. వాడేం చెప్పాడో తెలుసా? మీ వాళ్ళకెవరికో సీరియస్‌గా ఉందట అర్జంటుగా రమ్మని కబురుచేశారు. ఎవరికి ఒంట్లో బాగులేదు. ఏమీ తెలియదన్నాడు. ఆ మాత్రం కాగితంముక్క రాసిస్తే ఎంత బాగుండేది?'' అంది బుచ్చికొంత అబద్ధాన్ని జోడించి.

''అది కాదక్కా! నన్నర్థం చేసుకో. ఏంచేయాలో తెలీని పరిస్థితిల్లో అతను కనిపించాడు. ఉత్తరం రాసిద్దామనుకునేంతలో బస్సు కదిలిపోతోంది. అందుకని ఉత్తరం రాయలేకపోయాను'' అన్నాడు సుదర్శనం.

బి.ఎ. సోషియాలజీ చేస్తోన్న వసంతకి మధ్యతరగతి మనసులు ఎంత ఇరుగ్గా ఉంటాయో పరిశోధన చేస్తే బాగుణ్ణనిపించింది. మంచి కార్యంలోనూ, చెడుకార్యంలోనూ ముందు ఎక్కడ లోటు దొరుకుతుందా? కయ్యానికి కాలుదువ్వుదామా? అని ఆలోచిస్తారెందుకో. మొన్నమొన్నటివరకూ పెళ్ళికానిరోజులలో ఎంతో విశాలభావాలతో కనిపించిన అక్క ఇవ్వాళెంత మూర్ఖంగా వాదిస్తోంది? పదిరోజుల క్రితం సంఘటనొకటి గుర్తుకొచ్చింది. వసంత తన స్నేహితురాలింటికెళ్ళింది. ఆరోజు టి.వి.లో సినిమా చూస్తున్నారంతా. స్నేహితురాలి తమ్ముడు పదేళ్ళవాడు కుర్చీలోంచి లేచి ఇంట్లోకెళ్ళాడు. ఈలోగా కన్నవారింటికొచ్చిన వాళ్ళత్త కుర్చీలో కూర్చుండిపోయింది. ఆ కుర్రాడొచ్చి 'నేనేనుకున్నానీ కుర్చీ. నువ్వులే అంటాడు' వెంటనే వాళ్ళత్త సీరియస్‌గా 'ఇది నీ ఇల్లనుకున్నావా? మీ నాన్న కష్టపడి సంపాదించలేదు. మీ ఇంట్లోకొచ్చినపుడు నీ ఇష్టంకానీ, ఇక్కడ కాదు' అందామె. ఏదో సరదాకి హాస్యం ఆడిందేమో అనుకున్నాను. కానీ చిలికి చిలికి గాలివానయింది. ఈలోగా స్నేహితురాలి తండ్రి 'అత్తమీద తిరుగుబాటుగా మాట్లాడినందుకే కుర్రాణ్ణి తిడుతుంటే వాళ్ళందరూ కూల్ అయ్యారు. గొడవ చల్లారింది. ప్రతీ చిన్న విషయానికీ ఇంత రాద్ధాంతాలు దేనికి చేసుకుంటారో అర్థంకాలేదు. వసంతకు ఈ సంఘటన గుర్తుకొచ్చి అందరిమీదా అసహ్యంవేసింది.

''ఏమే! నీకూ కొమ్ములొచ్చేసాయ్? అంత కళ్ళునెత్తికెక్కాయా? పెద్దంతరం, చిన్నంతరం చూడకుండా జవాబు చెబుతున్నావ్? బి.ఎ. వెలగబెడుతున్నాననా?'' అంది చెల్లెలిమీద కస్సుమని లేస్తూ. వసంత కళ్ళల్లో నీటిపొరలు కమ్మాయి. బుచ్చక్క నోరు మంచిదికాదని తెలుసు. నోరుతో పాటే ఆవిడ మనసు కూడా అలాటిదేనని పెళ్ళిలోనే అందరికీ తెలిసిపోయింది. సాధారణంగా ఆడవాళ్ళు అత్తవారింటికెళ్ళాక పెట్టుపోతలు దగ్గరకొచ్చేసరికి కన్నవారి స్థితిగతుల గురించీ ఎక్కువమంది ఆలోచించరు. కానీ అక్క పెళ్ళికిముందే బావకి బట్టలు తీసినపుడు, వాచీ కొన్నపుడు, ఉంగరం చేయించినపుడు తక్కువ ఖరీదులో అయితే ఒప్పుకోక పేచీలు పెట్టింది. అప్పుడు నాన్న అమ్మ దగ్గరకొచ్చి బాధపడుతుంటే విన్న



వసంత 'అక్క ఎంత స్వార్థంగా మారిపో యింది?' అనుకుంది.

ఇంతలో పిల్లాడి ఏడుపు వినిపించింది. "వదినా! బాబు ఏడుస్తున్నాడు... మీరెళ్ళండి" అంది వసంత అక్కణ్ణుంచి కదులుతూ.

"వసంతా! ఇల్లోసారి తుడిచేసి కంచాలు పెట్టు" అని లోనికెళ్ళింది. ఏమనుకుందో ఏమో బుచ్చి మళ్ళీ మరోమాటనలేదు. అక్కడి కా గొడవ సద్దుమణిగింది.

★ ★ ★

అమ్మలు ఫీల్డు మీదకెళ్ళి వారంరోజుల యింది. సెలవు పెట్టకుండా ఇన్నాళ్ళు డ్యూటీ కెళ్ళకుండా ఉండిపోలేదు. ఉదయమే భర్తతో అంది. "ఏమండీ! వారం రోజులయింది కద ల్లేదు. ఇవాళ వంట వండేసి ఓసారి అలా ప్రక్క ఊరువెళ్ళొస్తాను. డి.పి.టి. కొంతమందికి ఇచ్చిరావాలి. అత్తగారి ఒంట్లో కొంత నిమ్మ ళంగా ఉందికూడా కదా" అంది.

"వెళ్ళిరా! వసంత ఇంట్లో ఉంటుంది కదా!"

"ఏమో! అడగాలిమరి" అని వసంతని పిలిచి అడిగింది.

"వెళ్ళిరండొదినా! అసలే ఆ సర్పంచ్ మంచివాడు కూడా కాదు" అని నోరుజారింది. "ఏ సర్పంచ్?" అడిగాడు సుదర్శనం.

"అబ్బే ఏంలేదులెండి" అని ఎంత చె ప్పినా వినక సుదర్శనం వసంత వలన విషయం పూర్తిగా తెలుసుకున్నాడు. భారంగా నిట్టూర్పు విడిచాడు."జాగ్రత్త! వాడు మంచి వాడు కూడా కాదు..." అన్నాడు.

అత్తగారికి ఇంజక్షనిచ్చి, మాత్రలు వేసుకో మని చెప్పి మెల్లగా అడిగింది, "అత్తయ్యా! వారంరోజులయింది నేను ఫీల్డుకెళ్ళి. ఓసారి వెళ్ళిరాకపోతే బావుండదు, వెళ్ళనా?" అని అడిగింది.

అప్పటికే అన్నీ వింటోన్న నారాయణమ్మకి కోడలిమీద అవ్యాజమైన ప్రేమ కలిగింది. "వెళ్ళిరామ్మా! త్వరగా వచ్చేసెయ్ నువ్వు లేకపోతే వీళ్ళెవరూ ఏ పనీ సరిగ్గా చెయ్యలేర నుకో- అయినా వెళ్ళిరా!" అంది.

ఆ మాటలు అమ్మలు హృదిలో అమృతవర్షా న్ని కురిపించాయి. గబగబా పనులు తెము ల్చుకుని, చెయ్యాల్సిన పనులు 'వసంత'కు అప్పచెప్పి వెళ్ళింది. ఊళ్ళోకి వెళ్ళేసరికి అంతమందీ ఎన్నాళ్ళో అయిపోయినట్లు, 'బా వున్నారామ్మా' అని అడిగింది. అందర్నీ పలక రించి, గర్భిణీ స్త్రీలనూ, పిల్లలనీ అందరినీ తనిఖీ చేసేసి, ఇవ్వాలసినవాళ్ళకి ఇంజక్షన్లూ, మాత్రలూ సరఫరా చేసి తిన్నగా వెళిపో తుంటే, గుర్తుకొచ్చింది సర్పంచ్ భార్య విషయం. మళ్ళీ వెనక్కివెళ్ళి సర్పంచ్ ఇంటికి వెళ్ళింది. సర్పంచ్ గుమ్మంలో కూర్చుని పేప రు చదువుకుంటున్నాడు. అమ్మలు రాకకు ఆశ్చర్యపోయి నిలబడ్డాడు. అతడి ఆనందాని కి అంతులేకుండా అయింది. సర్పంచ్ అత్త లోపలున్న కూతురితో, "అమ్మీ! నర్సమ్మ వచ్చి నాది" అనగానే పరుగులాటి నడకతో వచ్చి, "రండి! ఏటి మామీద కోపమొచ్చినాదో ఏటో అనుకున్నాను. రాకపోతే! ఇంకా ఇవాళ కబురు సేదామనుకుంటున్నాను. ఆసారి నడిగితే నాకు తెలీదు. ఆవిడ రావటంలేదన్నాడు. మాలపేటనుండి పంచాయితీ నెంబరు మాల చ్చివస్తే అడిగినాను. అల్లత్తగారికి నుస్తీ గుందని సెప్పింది. ఏటిప్పుడు నిమ్మ లంగుందా అత్తమ్మకి?" అంది. కుర్చీ వేసింది. కూర్చొని కాసేపు కబుర్లు చెప్పింది. తరువాత ఆమెను లోపలికి తీసుకెళ్ళి పరీక్షచే సింది. "ఇప్పుడారు కదా?" అంది. అవునన్న ట్టు తలూపింది.

'పురిటికి ఇక్కడే ఉంటారా?" అనడిగింది.

ఆమె ముసిముసిగా నవ్వుతూ అంది, "ముందల మా ఇంటికి తీసుకపోతానంది మాయమ్మ. కానీ రెండుసార్లు గర్భణీకాలు అయిపోనాయికదా! తరువాత ఇది మూడోకా న్పు. కన్నోరింటికాడ పనికి రాదు' అంది. అదీగాక నాకూ అక్కడకెల్లాలని లేదు. మీకు సెప్పకేం? రెండుసార్లు కడుపోయింతరు వాత, అయితే ఒక బిడ్డనెత్తుకోని ఎల్లడమో, నేపోతే ఆ మట్టే తొక్కప్పోవడమో జరగాలని నిర్ణయించుకున్నాను" అంది కళ్ళంట నీళ్ళొ స్తూంటే.

"మీకేం భయంలేదు. అర్ధరాత్రయినా కబు రుచేస్తే నేనొచ్చి పురుడుపోస్తాను. చక్కని బాబుని నా చేతుల్లో మీకందిస్తాను" అంది





సాధారణంగా అందరిదగ్గరా అన్నట్లే!

''నాతల్లే... నువ్వు దేవతవి. నీ చేతులు బంగారుచేతులు. నాకు నువ్వన్నట్టుగా నీ చేతులతో బంగారుబాబు పుట్టాల. నీ చేతులకి నాను బంగారు గాజులు తొడిగించాల'' అని రెండు చేతులనూ తన చేతుల్లోకి తీసుకుని ముద్దు పెట్టుకుంది. పిల్లలులేని ఆడవాళ్ళు పిల్లలకోసం పడే తపన ఎలాగుంటుందో ఆమెకు అర్థం అయింది. బంగారు గాజులు ఆవిడ పెట్టడం అతిశయోక్తిగా కనిపించినా, అమ్మలు లేవబోతుంటే ఆపి పెద్ద గ్లాసుతో 'హార్లిక్స్' కలిపి తెచ్చిందామె తల్లి. 'అబ్బే... నేను ఇంటికెళ్ళి భోంచేయాలి!' అంది. ''ఏమ్మా! మేం కాపోళ్ళమని తాగనంతన్నారా? అటిల నీళ్ళు కలపనేదు. ఇప్పుడే మరిగించిన పాలలో కలిపి తెచ్చాను'' అంది. గ్లాసు నోటిదగ్గర పెట్టుకునేసరికి పిడకలమీద కాచిన పాలేమో గుబురు వాసనవేసింది. వసంతకి ఆ వాసన అసలు పడదు. వాంతి చేసుకుంటుంది. కానీ- అమ్మలుకి ఆ వాసన ఎంత ఇష్టమో! ఉదయం టిఫిన్ కూడా చేయకుండా బయలుదేరటంవలన ఆకలి అధికంగా ఉంది. అందుకే మరో ఆలోచనకు తావివ్వకుండా త్రాగేసింది. 'వస్తా'నని లేచింది.

''అమ్మా! ఈ ఊరు వచ్చినపుడల్లా రావాలి. నా కోసమయినా'' అంది. ఎందుకో సర్పంచ్ మీద ఎంత అసహ్యమో, అతని భార్యంటే అంత ఇష్టం అమ్మలుకి. అప్పటికే పన్నెండయింది. ఎంత వేగిరం 'వెళ్ళిపోవాలా?' అని చూస్తోన్న అమ్మలుకి వీధి గుమ్మంలో కూర్చున్న సర్పంచ్ కనిపించలేదు. ఆ విషపు చూపులు నుండి ఎలా తప్పించుకోవాలా అనుకున్న ఆమెకు ఆ బాధ తప్పింది అనుకుంది కానీ అతను దారిలో పొంచి ఉన్న పులిలా ఉన్నాడని గమనించలేదు. తొందరగా నడుస్తుంటే సేరీ మీదనుంచి అడ్డుగా వస్తూ, ''ఏయ్, ఏ ఎన్నెమ్మా! ఏటలా పారిపోతన్నావ్?'' అని కేకేశాడు. సంస్కారహీనంగా పిలుస్తోన్న అతని పిలుపు వినిపించుకోకుండా ముందుకు నడుస్తుంటే అతను గబాలున వచ్చి చేయి పట్టుకున్నాడు. ''ఏటా తలబిరుసతనమేటి? ఇనిపించట్లేదా?'' అన్నాడు చేయి వదుల్తూ.

అమ్మలు వణికిపోయింది. ''మర్యాదగా తప్పుకోండి. నన్ను విడిచిపెట్టండి. నేను మీరూహించినట్టి మనిషినిగాను. నన్నెందుకిలా వేధిస్తారు?'' అని రోదించింది.

''నిన్నేటి సేసీన్లేవే బెదిరిపోకు. నేన్నీకింకా బైమిస్తున్నాను. అప్పటికీ నువ్వు నొంగప్పోతే నిన్నెలా దార్లె బెట్టాలో నాకు తెలుసు. అసలు నిన్నెందుగ్గాదు పిలిసింది. ఏటి మా ఇంటికొచ్చినా వేటి నాను కపురెట్టకంట?'' అన్నాడు.

''మీ ఆవిడకి ఆరోనెల. టెస్టు చేయడానికొచ్చాను'' అంది.

''ఓస్... నువ్వో ఎంబీబియ్యేస్ డాక్టరివి మరి. నువ్వు నేపోతే దానికి పురడవదు కదూ? సూడు, అలాగా దాన్ని మంచి సేసుకొని తాబేలుని తిప్పికొట్టాలనుకుంతన్నావేమో? దాని పురుడు 'వొయిజాగు'లో జరుగుతాది. నువ్వేదో గొప్ప ఉపకారం సేసినట్టు పీలవకు. నాన్నీమీద డి.ఎమ్మోకి, ఎల్తుమినిట్టరుకీ కంప్లయింటిచ్చినాను. ఆటిని సక్కదిద్దుకోనానికి నా కాల్లకాడికి నువ్వే ఒత్తావు. నానేం తొందరపడక్కర్నేదని సెప్పనానికే ఇక్కడ నీకోసం కాసుక్కూసున్నాను. ఇక ఎల్లు'' అన్నాడు. ''ఇదిగో! నిన్నిక్కడేం జేసినా నీకు దిక్కెవరూనేరు. ఎవుడో ఎదవ నీకు ఆస్పటల్లో సపోర్టిచ్చినాడట ఆడికాలూ సెయ్యీ దీసెద్దును. గానీ టయివుంది. ఇంతకీ సెప్పొచ్చేదేటంటే నాను రావనానురుణ్ణి. నీ సేత బతిమాలించుకొని, ఒప్పించిన తరువాతే నాన్నీమీద సెయ్యేత్తాను. ఇది నా పెతిజ్ఞ. ఇకెల్లు'' అన్నాడు.

గడ్డిలో జర్రున పాకి వెళ్తోన్న పాములా అమ్మలు మెలికలు తిరిగి జోరుగా ముందుకు నడిచింది. వాచీ చూసుకుంది. ఒంటిగంటయింది. రోడ్డుకెళ్ళేసరికి బస్సు వెళ్ళిపోయింది. మళ్ళీ మూడువరకూ బస్సులేదు. రిక్షాలు కానీ, జట్కాలు కానీ ఉండవక్కడ. ఒక చిన్న టీ కొట్టుంటుంది. అది పన్నెండువరకే ఉంటుంది. పన్నెండు దాటితే అక్కడెవ్వరూ ఉండరు. టీ కొట్టువాడు పాయ్యార్పి పడుకుంటాడు. మళ్ళీ బస్సొచ్చే వేళకి లేచి నిప్పు రాజేస్తాడు. అతను పడుకున్నాడు. అక్కడో మట్టి గడప ఉంటే 'ఉస్సురంటూ' కూలబడింది. అమ్మలు మనస్సు ఏదోలా ఉంది. 'రమీజా మ్యూచివల్ అడిగింది. ఇచ్చేస్తే వీడి

బాధ తప్పుతుందనిపించింది. కానీ మళ్ళీ అంతలోనే అనుకుంది, రమీజా ఇప్పటికే చితికిపోయి ఉంది. ఇక్కడసలు పనిచేయలేదు. 'పెనంలోంచి పొయ్యి'లోకి పడినట్లు అవుతుందేమో!' అనుకుంది. ఇలాగా పరిపరివిధాలుగా ఆలోచిస్తూంటే, "ఏంటమ్మా! ఇక్కడ కూర్చున్నారు?" అడిగాడు తనతో పనిచేస్తోన్నకో వర్కరు మేలసిస్టెంట్. తలెత్తి చూసింది. "మీరా?" అంది. బస్సు మిస్సయిన విషయం చెప్పింది "మీరెలావెళ్తారు?" అన్నాడు.

"అదే ఆలోచిస్తున్నా" అంది. అతను వెహికలుతో ఉన్నాడు. వయసులో తనకి కూతురిలాటిదయినా ఆవిడెప్పుడూ తన బండిమీద 'లిఫ్టిమ్మ'ని అడగలేదు. ఆమె ఏమనుకుంటుందోనని అతనూ అడగలేదు. "భోజనం కూడా చేయలేదు కాబోలు" అన్నాడు.

"నా మాటకేంగానీ, మా అత్తగారికి ఒంట్లో బాగులేదు. ఇంటిలో చుట్టాలున్నారు. వేగిరం వచ్చేస్తానని చెప్పి వచ్చాను. ఏం తోచటంలేదు" అంది.

"అమ్మా! నువ్వేమీ అనుకోకపోతే వెనకాల జాగ్రత్తగా కూర్చోగలనంటే, లిఫ్టివ్వటానికి నాకేం అభ్యంతరంలేదు" అన్నాడు. ఇంకొకప్పుడయితే 'అక్కర్లే'దని ఉండేది. కానీ ఇప్పుడెలాగయినా ఇంటికెళ్లాలని! అనుకోవటంచేత మారు మాట్లాడకుండా కూర్చుంది. అతడూ ఆశ్చర్యపోయాడు 'అన్నట్టు! మొన్న ఆపరేషన్ కేసుల గురించి మా 'శివ' చేత కబురంపాను. దగ్గరుండి చేయించమన్నాను. మీకు ట్రబులిచ్చాను" అంది.

"అయ్యో! మీకావిషయం చెప్పలేదుకదూ? వాళ్ళయితే వచ్చారు. కానీ వాళ్ళని ఆ సర్పంచ్ రెవెన్యూ వాళ్ళకి అప్పచెప్పాడట. వాళ్ళకి 'భూములిస్తా'యని వాళ్ళు అటెళ్ళిపోయారు. 'అదేమిటయ్యా? ఆవిడెంతో మీకు చెప్పారట కదా?' అని కూడా అడిగాను. అడిగితే, "బాబూ! అతగాడు మా ఊరికి పెసిడెంటు. మంచికయినా, చెడుకయినా మేము అతని కాళ్ళదగ్గరికే ఎళ్లాలి. అదీగాక బూవులిప్పిత్తన్నాడు. అమ్మగోర్ని మరేమనుకోవద్దని సెప్పండి" అన్నారు. ఒక్కడు మాత్రం నేను అమ్మగోరికి పెవానకం సేసినానని భూముల ఆశను కూడా వదులుకుని వచ్చాడు. అది మాత్రం మీ పేరున బుక్కయింది" అన్నాడు.

అమ్ములు మనసు చివుక్కుమంది. 'వాళ్ళకెంతగా నచ్చచెప్పానో?' అంది. ఊళ్ళోకి చేరుకోబోతుంటే 'ఇక్కడాపేయండి. నేను నడిచివస్తా' అంది. ఆయన బండాపాడు. అప్పుడే సందు మలుపులో సిగిరెట్ కాలుస్తూ వస్తోన్న శివ కనిపించాడు. తనను చూసి సిగిరెట్టు కాలువలో పడేసి గబగబా సందులోనికి పారిపోయాడు.

శివ సిగిరెట్లు కాలుస్తుండటం చూసిన అమ్ములు చాలా కలతచెందింది. ఇంటికి రాగానే జోళ్ళు మూలకి విసిరేసి ఆతురతగా ఇంట్లోకి వెళ్ళింది. అందరూ నిద్రపోతున్నారు. "వసంతా! అమ్మ భోంచేసారా?" అనడిగింది. "ఇంతవరకూ చూసి ఇప్పుడే వడ్డించాను. భోజనం చేశాక మాత్రలు ఇచ్చాను. అలా మంచంమీద నడుంవాలుస్తానని వెళ్ళింది" అంది.

'హమ్మయ్య!' అంది. అనేసి "తక్కినవాళ్ళు భోంచేశారా?" అంది. "బావలు భోంచేశారు. అక్కలిద్దరూ పదకొండుకి టిఫిన్ చేసి, అలా తిరిగొచ్చారు. బుచ్చక్క మోర్నింగ్ షోకి వెళ్ళింది. శివ ఇంకా వీధిలోకి వెళ్ళిరాలేదు. అన్నయ్య అర్జంటుగా పనుందని బ్యాంకుకెళ్ళి ఇంకా రాలేదు. బాబు ఏడిస్తే సీసా ఇచ్చాను. బజ్జున్నాడు" అందరి గురించీ ఏకరవు పెట్టింది. "సరే... అక్కయ్యలను లేపు" అంది. వసంత అక్కయ్యలను లేపింది. ఇంతలో సినిమాకెళ్ళిన వాళ్ళు తిరిగొచ్చారు. "ఏం సినిమా?" అడిగింది అమ్ములు. "ఏదో ఇంగ్లీష్ పిక్చరు. వాడికి జనరేటర్ లేదు. మధ్యలో కరెంటుపోయింది. ఒంటిగంటకి బిగిన్ చేశాడు. 'పరమానందయ్యగారి శిష్యుల'కు వెళ్దామంటే 'ఎన్నిసార్లు చూస్తామని ఈయనగారు దానికి తీసుకెళ్ళారు. పరమబోరు. ఒక్క డైలాగూ అర్థమయి చావదు. ఏమిటో ఎవరో వస్తూండటం. ఇంకొకళ్ళని పొడిచి చంపుతుంటం ఇదే పిక్చరంతా. పైగా సిగిరెట్లు, చుట్టలకంపు ఒకటి" అని పెరట్లోకి వెళ్ళి కాళ్ళూ చేతులూ కడుక్కుంది. చీర మార్చుకుంది. ఈలోగా సుదర్శనం, శివ వచ్చారు.

అందరూ భోజనాల దగ్గర కూర్చున్నారు. ఏవేవో కబుర్లు చెప్పుకుంటున్నారు. "ఏమండీ! శివకి ఫ్రండ్సు ఎక్కువవుతున్నారు. పోనీ మంచివాళ్ళయితే ఫరవాలేదు. చెడు సావాసాలకు లోనౌతున్నాడు" అంది అమ్మలు.

"ఏం? ఏంటి చేసేడేం?" అడిగింది బుచ్చి.

వాడు చెప్పబోయే సమాధానంకోసం అందరూ ఎదురుచూస్తున్నారు.

"ఏరా ఏం చేశావ్?" అడిగాడు సుదర్శనం. వాడు జవాబు చెప్పలేదు. "ఏం చేశాడింతకీ?" అడిగాడు భార్యని. అమ్మలు శివ ముఖంలోకి చూసి, "ఏమయ్యా! చెప్పమంటావా?" అడిగింది. శివ సీరియస్‌గా వదిన కళ్ళల్లోకి చూసి, "చెప్పు... నేనూ చెప్తాను నీ సంగతి!" అన్నాడు. అమ్మలు దెబ్బతింది. "శివా! నేనేం తప్పుచేసానో చెప్పయ్యా!" అంది.

"ఏం? నువ్వెవరి స్కూటరుమీదనో రాలేదా? మా ఫ్రెండ్సెంత హీనంగా మాట్లాడారో?" అన్నాడు.

అమ్మలు ముఖంలో రక్తం లేనట్లయిపోయింది.

సుదర్శనం భార్య కళ్ళలోనికి చూశాడు. అమ్మలు ముఖం వాడిపోయింది. "శివా! నువ్వు పెద్దవాడివయావయ్యా! మాటలు నేర్పిన కుక్క ఉస్కో అంటే ఉస్కో అందట. నీ గురించి పట్టించుకోవటం నాదే తప్పు" అంది కళ్ళొత్తుకుంటూ.

సుదర్శనంకి నోటమాట రాలేదు. అతడికి గొప్ప అవమానంగా ఉంది. బావల ముందు శివ అలా చెప్పటం. అమ్మలు దాన్ని ఖండించకపోవటంతో అతడికి గొప్ప అవమానంగా తోచింది. ఆ బాధని మరిచిపోటానికి "శివ ఏం చేశాడు?" అన్నా అమ్మలు జవాబు చెప్పలేదు. మళ్ళీ రెట్టించాడు.

"సిగెరెట్లు కాలుస్తున్నాడు" అంది.

"ఏరా! నిజం చెప్పు" అని శివ జుట్టు పట్టుకొని అటూఇటూ ఊపాడు. "ఏమండీ! ఆపండి. వదలండి. నేను చెప్పటమే తప్పు మీరు మళ్ళీ మరో తప్పు చేయకండి" అంది.

వాళ్ళ చిన్నక్క "తప్పు చేసినవాణ్ణి దండించటంలో తప్పులేదు. వాడికి తిండి పెట్టకండి, రెండురోజులు" అంది.

"సరే... చిన్నవాడు కాబట్టి వాణ్ణి దండించాలంటున్నావు. పెద్దవాళ్ళు చేసిన తప్పుకేం చేయాలి? 'పెద్దలు చేస్తే ఫలహారాలు. చిన్నలు చేస్తే చిరుతిళ్ళు. అయినా భార్య సంపాదనని ఆశించేవాళ్ళు ఆమె ఏంచేసినా సహించాలి. తప్పదు. వీధిలోనికెళ్ళనంతసేపే ఆడదాని గౌరవం. వీధిలోనికెళ్తే ఆడదీ మగాడితో సమానమే" అన్నాడు ఆమె భర్త.

అన్నంలో చెయ్యి పెట్టిన అమ్మలు, కంచంలో చెయ్యి కడుక్కొని లేచిపోయింది.

"బావా! మీరు నోటికెంతమాటొస్తే అంత మాటా అనేస్తున్నారు. ఇంటికి తొందరగా రావాలని, బస్సు తప్పిపోతే ఎవరినో లిఫ్టడిగి ఉంటుంది. అదో పెద్ద తప్పుగా భావించి బయట తిరిగే ఆడవాళ్ళని చాలా నీచంగా చూడ్డం మీకు తగదు" అంది వసంత.

"ఇదిగో అమ్మాయి! నువ్వు హద్దులు మీరిపోతున్నావ్. ఇది రెండోసారి. నేనేమన్నాను. ఉన్న మాటంటే అంత ఉలుకెందుకు?" అంటున్నంతలో ఎవరో తలుపు గుద్దారు. బుచ్చి వెళ్ళి తలుపు తీసింది.

"అమ్మలమ్మ ఉందా?"

"ఉంది"

"ఓసారి పిలుస్తారా?"

"ఒరే బాబూ! ఎవరో వచ్చారు. మీ ఆవిడని పిలువు" అనగానే సుదర్శనం భార్యని పిలుచుకొచ్చాడు. అమ్మలు పైటతో కళ్ళు తుడుచుకొని వీధిలోనికి వచ్చింది. "నమస్కారమండీ!" అంది.

"మీరు మీ పరుసు నా బండిలో ఉంచారు. మరిచిపోయారు. నేనూ ఇంటికెళ్ళి భోంచేసాక గుర్తొచ్చింది. నరే... ఎలాగూ మీ అత్తగారిని ఓసారి చూసినట్లుంటుంది అని వచ్చేశాను" అన్నారు.

అందరూ హాల్లోకి వచ్చి 'ఎవరా?' అని చూశారు.

అప్పుడంది అమ్మలు, "ఈయనివాళ లిఫ్టు ఇవ్వకపోతే ఇంకా నేను ఆ రోడ్డుమీదే ఏడవవలసి ఉండేది" అని.

అందరూ అతని ముఖంలోకి చూశారు.

అతని వయస్సు రిటైర్మెంటుకు దగ్గ రుంటుంది.

వసంతకు కోపం వచ్చింది. ఇందాక చిన్న బావ నోరు పారేసుకున్నందుకు. "శివా! ఇలారా" అంది వసంత. శివ వచ్చాడు. 'పద లోనికి' అంది. లోనికెళ్ళాడు. "వెధవా! నీ కళ్ళు బైర్లు కమ్మాయిరా! అంత పెద్దాయన వెనుక కూర్చుంటే, నీ ఫ్రెండ్సు నీచంగా మాట్లాడతారా?" అని చెంప ఛెళ్ళుమని పించింది. శివ వసంత కంటే సంవత్సరమే చిన్న అయినా వసంత దగ్గర జడుస్తాడు. ఆ దెబ్బ చిన్నబావ కొట్టినంత ఫీలయాడు. అతని ముఖం ముడుచుకుపోయింది. "వెధవా, వయసు పెరిగితేనే చాలదు. బుద్ధి కూడా పెరగాలి" అంది మెల్లగా. ఎవ్వరూ మాట్లాడ లేకపోయారు... అక్కణ్ణుంచి వెళ్ళిపోయి గ్లాసు డు మజ్జిగ పట్టుకెళ్ళి అతనికిచ్చింది. అతనో గంట కూర్చున్నాడు."అత్తగారిఒంట్లో బాగున్న ట్లేనా?" అన్నాడు. తలూపింది అమ్మలు. వసంతని అతను ఎగాదిగా చూశాడు. "మీ ఆడపడుచనుకుంటాను" అవునన్నట్లు తలూ పింది. ఈమధ్యనే బదిలీమీద ఆ ఊరు రావ టంచేత వాళ్ళ కుటుంబానికి ఎవరితోనూ పరి చయం లేదతనికి. "ఈ అమ్మయేనా బి.ఏ ఫైనలియర్ చదువుతూంటం?" అన్నాడు. తలూపింది అమ్మలు. అతనే మళ్ళీ "మా రెండో అబ్బాయి బి.ఏ. సెకెండియర్ చదువు తుండగా టీచరు ట్రయినింగ్‌లో సీటొస్తే అందరూ పంపేమన్నారు. పంపేసాను. ఉద్యోగం వచ్చి రెండు సంవత్సరాలయింది. వాళ్ళమ్మ మంచి సంబంధం చూసి వేగిరం పెళ్ళిచేసెయ్యమంటోంది" అన్నాడు

"అలాగా!" అంది అమ్మలు.

"మీ పాప వయస్సెంత ఉంటుంది?"

"ఇరవై ఒకటి నడుస్తోంది"

"మీ గోత్రం?"

చెప్పింది అమ్మలు. కొంతసేపు తటపటా యించి "మీరు శాఖాంతరాలు చెయ్యరా?" అడిగాడు.

అమ్మలు నవ్వింది. "మాది శాఖాంతర వివాహమే!" అంది.





"మరి చెప్పరేం? ఇంకేం? మీ 'వసంత'ని మాకోడలిగా మేం చేసుకోవాలనుకుంటే మీక భ్యంతరమా?" అన్నాడు.

అమ్మలు ముఖం ఒక్కసారి వెలిగిపో యింది. వాళ్ళ రెండో అబ్బాయి చాలా తెలివై నవాడూ, మంచివాడూ అని విని ఉంది.

"అంతకన్నానా? ఇదిగో పెద్దలందరూ ఇక్క డే ఉన్నారు" అంది. అందర్నీ చూపుతూ. చిన్న బావ అందుకున్నాడు వెంటనే, "మీరు కోరి అడిగారు కదాని కట్నం తక్కువ చేయం. నాకు ముప్ఫయి ఇచ్చారు. ఇది ఆఖరుది, మరో అయిదో, పదో ఎక్కువేకాని తక్కువ ఇవ్వరు" అన్నాడు వాళ్ళు కానీ ఒట్టినే చేసేసుకుంటారే మోనని భయంతో.

"మా పెద్దాడికి పెళ్ళికి పైసా కట్నం తీసుకో లేదు. పైగా వాళ్ళకి చేయి సాగకపోతే రెండు వేల వరకూ పెళ్ళి ఖర్చులు కూడా మేమే పెట్టుకున్నాం" అన్నాడాయన. అనుకోకుండా వచ్చాను. పిల్లను చూశాను. పిల్ల నాకు నచ్చింది. మా వాడికి తగ్గట్టుగా ఉంది. మా వాడూ ఆరడుగుల మనిషి. తెల్లగా ఉంటాడు. వాడూ ఈ సంవత్సరం బి.ఏ ఫైనలుకి వెళ్తు న్నాడు. సరే... పిల్లా పిల్లాడు చూసుకున్నాక ప్రదానం చేసేసుకుంటే మూఢాలుపోయాక మన వీలునుబట్టి పెళ్ళి జరిపించుకోవచ్చు.

అందరి ముఖాలు అరవిందాలయాయి.

శివ మోపిన నేరం అలా నీరుకారిపో యింది. తరువాత అందరూ శివని చీవాట్లేసా రు.



భార్యకి ఆపరేషన్ జరిగితే, మళ్ళీ తెలిసీ భర్తకి ఆపరేషన్ చేయించిందని, ఇది ప్రభు త్వాన్ని పూర్తిగా మోసం చేయటమేనని, దీని

పై 'అమ్మలు' అనే ఏ.ఎన్.ఎంపై తగిన చర్య తీసుకోవాలని రావివలస సర్పంచ్ కేసు పెట్టగా, డి.ఎమ్మో దర్యాప్తుకొస్తున్నట్లు జిల్లా వైద్యాధికారినుండి ఆదేశాలు రావటంతో డాక్టరు కృష్ణారావు మహదానందంలో ఉన్నాడు. వెంటనే మర్నాడు ఉదయం బహిరంగ విచారణకు హాజరుకావలసిందని అమ్మలుకి నోటీసు జారీచేశాడు.

ఆసుపత్రిలో యు.డి.సి, డాక్టరు తప్ప మిగతా అందరూ అమ్మలు ఏం దెబ్బతింటుందోనని ఒకరంటే, సస్పెండు చేస్తారని కొందరు, అది ప్రూవయితే ఉద్యోగం డిస్మిస్ చేస్తారని కొందరూ చర్చించుకుంటున్నారు.

"అది కాదయ్యా! నా భార్య చేయించుకోలేదూ, నేను చేయించుకుంటానని ఒకాయన వచ్చి అంటాడు. వాళ్ళావిడ పుట్టింటనో ఎక్కడో ఆపరేషన్ చేయించుకొని వచ్చేస్తుంది. ఏ ప్రలోభాలవల్లనో, లేక హెల్త్ సిబ్బందిని రిస్కులో పెట్టడానికో అలా చేసారనుకుందాం. అప్పుడేం జరుగుతుంది? వాడు చేసిన దగాకి మనమెంత వరకూ బాధ్యులం? అంట" అని ఒకరంటే, "అయ్యా! జరిగిపోయినంతకాలం ఏం చేసినా చెల్లిపోతుంది, లేనప్పుడే ఇలాటివన్నీ అయినా ఆ సర్పంచ్‌కి మంచి పలుకుబడి ఉంది. వాడేదయినా చెయ్యగలడు! అమ్మలు ఈ దెబ్బతో వాడివశంకాక తప్పదు" అన్నాడింకొకడు.

"అమ్మలు లొంగుతుందన్నది మాత్రం కల్ల"

"మొన్నటివరకూ రమీజా గురించీ అలానే అనుకున్నాం"

"రమీజా కూడా లొంగవలసింది కాదు. కొంతమంది ఆమెని ట్రాప్‌చేసారు" యు.డి.సి.కి దెబ్బతగిలేవిధంగా అన్నాడా వర్కరు.

అతను గుటకలు మ్రింగి "ఎవరికి అవసరం? ఆవిడ ఉద్యోగం నిలబెట్టుకోవడంకోసం ఆవిడే వాళ్ళింటికెళ్ళింది. కాంపన్సేషన్ చెల్లించుకుంది" అన్నాడు అక్కణ్ణుంచి వెళ్ళిపోతున్న రమీజాని ఉద్దేశించి.

ఒకప్పుడయితే తోక త్రొక్కిన త్రాచులా లేచేది రమీజా. కానీ ఇప్పుడామెలో ఏ భావమూలేదు. ఎవరెన్ని మాటలన్నా చెవిటిదానిలా విని వెళ్ళిపోతోంది.

★ ★ ★

సర్పంచ్ ఇంటి ఆవరణలో ఎంక్వయిరీ జరుగుతోంది. అమ్మలు ధైర్యంగా నిల్చుంది. ఆపరేషన్ చేయించుకున్న వ్యక్తి ఊరొదిలి పారిపోతే సర్పంచ్ బలవంతంగా పట్టించి తీసుకొచ్చాడు. మధ్యలో వేయబడిన వాలు కుర్చీలో డి.ఎమ్మో కూర్చున్నారు. పక్కన డాక్టరు కృష్ణారావు కుర్చీ ఉన్నా నిల్చునే ఉన్నాడు. ప్రెసిడెంట్ కుర్చీలో కూర్చున్నాడు. జనం చుట్టూ మూగిపోయారు. ఒకరిని తోసుకుంటూ ఒకరు లోనికి వచ్చేస్తుంటే ప్రెసిడెంట్ కర్ర పట్టుకుని అందర్నీ వెనక్కి నెట్టుతున్నాడు.

"ఏమయ్యా! ఈవిడెవరో తెలుసా?" అన్నారు డి.ఎమ్మో.

"తెలుసండీ... నర్సమ్మగోరండీ" అన్నాడొకడు.

"ఎలా తెల్సు?"

"ఆవిడ వారానికి రెండుమూడు పరిటీలొత్తారండి"

"వచ్చి ఏం చేస్తారు?"

"గర్బినులకీ, సిన్నపిల్లలకీ, జొరంతో నున్నోల్లకి మందులిత్తారండి" అన్నాడొకడు.

"అబద్ధం ఆడకండి. అమ్మలు అనబడే ఈ నర్సమ్మ అసలు ఊళ్లోకే రావటం లేదుకదూ? నిజం చెప్పండి. ఇలాటి వాళ్ల మీద కనికరం చూపుతే మీరే నష్టపోతారు" అన్నారు డిఎమ్మో. ఎవరికీ ఆ మాటలు నిజం అని చెప్పటానికానీ, అబద్ధం అని చెప్పటానికి ధైర్యం చాల్లేకపోయింది. నిజం చెపుతే ప్రెసిడెంటు చంపేస్తాడని భయం. అబద్ధం చెప్పడానికి వాళ్ల వశంకావటం లేదు. అంతలో వీధి గుమ్మంలోకి ఏమిటాని వచ్చి చూసిన సర్పంచ్ భార్యకి విషయం అర్థమయింది.

"ఏం? ఈవిడ మీ ఊరికి రాకుండా వచ్చానని మీకు చెప్పమందా?" అనడిగారు మళ్లీ.

సర్పంచ్ భార్యకి విషయం తెలిసిపోయింది. ఆమెకి సర్పంచ్ దగ్గర భయంలేదు. సర్పంచ్‌కి ఆమంటే గొప్ప ముద్దు. అందుకే

ధైర్యం చేసింది "చూడండి బాబూ! నేను మధ్యలో అడ్డొస్తే షమించండి. మీరడుగుతున్న పెన్నలకి నేను జవాబు చెపతాను. ఈళ్ళు గొర్రెల్లాటోళ్ళు. ఈళ్ళకి నోర్లిచ్చినది తిండికేత ప్ప, ధైర్యంగా నిజాలు చెప్పనానికి కాదు. ఆయమ్మ దేవత. ఆవిడి వారానికి రెండు సుట్లు వచ్చి, అందర్ని పరిచ్చించి, మందులి చ్చి ఎల్తాది. నా మట్టుకునాకు తెలిసినంత వరకూ ఈ మద్దిల ఆలత్తగోరికి బాగులేదని నాలుగు రోజుల సెలవెట్టింది. అప్పుడే రానే దు. ఆవిడ రానేదనిగానీ, రాకంటానే వచ్చిన ట్టు తప్పుడు సమాసారం సెప్పమందనిగానీ, ఎవలేనా సెప్పితే అల్లనోల్లు పడిపోతాయి" అంది.

ఎప్పుడైతే నాయురాలు ధైర్యంగా ముందుకొచ్చి యదార్థం చెప్పిందో అప్పుడే అందరికీ తెగింపువచ్చేసింది. మాలపేట జనం ముఖ్యంగా ఆడవాళ్లు గుండెలు బాదుకుని "ఆయమ్మొచ్చినకానిండి మాకెంత మేలు సేస్తందో సెప్పనేం. మాకు మందులిచ్చి, మాకులిచ్చి మమ్మల్ని రచ్చిస్తంది. మాకు జొరాలొచ్చినా, నెగనేక తొంగున్నా సొంత మడిసిలాగా... ఇంకా అంతకంటే అతికంగా మా బాగోగులును తెలునుకుంతన్న దేవత" అని ఒకర్ని తోసుకుని ఒకరు ముందుకొచ్చి చెపుతున్నారు.

"నరే... మీసాల గౌరినాయుడెవరూ?" అనడిగాడు. ఎవరూ పలకలేదు. ఆ తరువాత మరికొన్ని పేర్లు పిలిచాడు. ఎవరూ పలకలేదు. 'వీళ్లెవరూ లేరా?' అన్నారు. ఆ పేర్లుగలాల్లెవులూ ఇక్కడోరునేరండీ" అన్నాడు.

"నరే ఆచారీ... ఎక్కడ ఆచారీ? ఎవరీ ఆచారీ?" అన్నారు డిఎమ్ అండ్ హెచ్ఓ.

"నేనేనండీ?"

"ఎవరు నువ్వు?"

"నేనిక్కడ హెల్తు గైడ్నండీ"

"నువ్వేమిటంటావ్. ఈవిడ డ్యూటీకి సరిగా హాజరుకావటం లేదనీ, మందులూ, ఇంజక్షన్లూ అమ్ముకుంటోందనీ నువ్వూ కంప్లయింట్ చేసావ్. రుజువుచెయ్యగలవా?"

"రుజువు చేస్తానండీ!" అని కొంతమందిని తీసుకొచ్చాడు. "చెప్పండి ఆవిడ మీ చేతికిచ్చి అమ్మమందని మీరేగా నాకు చెప్పింది?" అన్నాడు.

వాళ్లు ముందుకయితే వచ్చారుగానీ అబద్ధం చెప్పటానికి ధైర్యం చేయలేక నీళ్లు నమిలారు.

"చెప్పండర్రా!" అన్నాడు ఆచారి.

"బాబూ! సత్తె పెమానకంగా సెప్తన్నాం. ఆవిడ మా సేతికి మందులు" అని ఆగిపోతుంటే, "సెప్పండర్రా, నిజం చెప్పడానికి భయపడతారేం?" అన్నారు. వాళ్లు చుట్టూ చూసారు. జనం ఉప్పెనలా కనిపించారు. వాళ్ళకి భయం వేసింది.

"ఆవిడ మా సేతికి మందులిచ్చి అమ్మించిందన్న మాట అబద్ధం. ఈ ఆసారి మాకు నూరేసి రూపాయిలు ఇత్తానన్నాడు. నరే అలాగే సెప్పాలనుకున్నాం. ఇదిగిప్పుడే మా యాడోళ్లు మా పిల్లలమీద పెమానకం సేసి ఉన్నదున్నట్టు సెప్పమన్నారు. పిల్లల్తో ఉన్నవాళ్లం, పెమానకం చేసినోల్లం. అబద్ధం సెప్పనేక నిజం సెప్పేసినాం. నంతకాలు సేసినందుకు మమ్మల్ని సెమించండీ తప్పుకి" అన్నారు.

ఆచారి చెమట్లెక్కిపోయాడు.

"డాక్టర్! వీణ్ణింతకుమునుపే తీసెయ్యమని చెప్పితే ఎందుకు తీసెయ్యలేదింత వరకూ? వీడి మీద పోలీసు కంప్లయింటిచ్చి, ఈ వెధవని అరెస్టు చేయించండి" అన్నారు డిఎమ్వో! ఆచారి నిలువునా పడిపోయి డిఎమ్వో గారి పాదాలను బట్టేసాడు.

"ఉద్యోగం తీసేస్తే తీసెయ్యండి. నన్ను విడిచిపెట్టండి. పిల్లలుగలవాణ్ణి" అని ప్రాధేయపడ్డాడు.

"వెళ్లు... వీణ్ణి తీసుకుపోండి అవతలకు" అన్నాడు డియమ్వో. ఆచారిని బలవంతంగా అక్కణ్ణుంచి లేవనెత్తితే, అక్కడి పల్లెజనం తలో గుద్దు గుద్దారు.

ఇక- "అప్పలసామి ఎవరయ్యా?"

"నానేనండీ"

"ఏమయ్యా? నీ భార్యకి ఫామిలీప్లానింగ్ ఆపరేషన్ జరిగిందా?"

"జరిగిందండీ!"

"మళ్లీ నిన్ను చేసుకోమని ఈవిడ చెప్పినపుడు నీ భార్యకి ఆపరేషన్ జరిగినట్లు ఎందుకు




చెప్పలేదు?''

అతను జవాబు చెప్పలేదు.

''నీ భార్యకి ఎక్కడో ఆపరేషన్ జరిగింది. ఇక్కడవారికి తెలీదు. నిన్ను చేసుకోమని ఈవిడ చెప్పిందికదూ?'' అడిగాడు.

''అవునండీ... నేనక్కడకీ అమ్మా, ఈ నిజం బయటపడితే తరువాతేదయినా సికాకేమో అని నానెంత బయపడినా నీకేం పరనేదు. నాను సూసుకుంతాను, అని ఆవడ దవిర్యంసె ప్పింది'' అన్నాడు.

''సరే నీ పెళ్లానికి ఆపరేషన్ జరిగినట్టు ఇక్కడ తెలుసా?''

''అందరికీ తెలీదు కానండి కొంతమందికి తెలుసు''

''సరే... నీకెంతమంది పిల్లలు?''

''ఇద్దరు పిల్లలు''

''మీ ఆవిడెక్కడుంది''

''ఇక్కడే, ఈ ఊళ్ల ఉంది''

''వెళ్లి ఎవరైనా వాళ్ళావిణ్ణీ, పిల్లల్నీ తీసుకు రండి''

తలయారి వెళ్లి అప్పలస్వామి భార్యని, పిల్లల్నీ తీసుకొచ్చాడు. ఆమె జనాన్ని తోసు కుని ఇద్దరి పిల్లల్తో ముందుకొచ్చింది. వాళ్ల నెందుకు రప్పించారో ఎవరికీ తెలీలేదు. అందరూ ఉత్కంఠతో అటే చూస్తున్నారు. డిఎమ్వోగారు తీక్షణంగా ఆలోచించి ''ఏమ్మా! నీపేరు?'' అడిగారు. ఆమె తన పేరు చెప్పింది. ఇతను నీ భర్తేనా? అంటే అవునంది.

''నువ్వు పిల్లలు పుట్టకుండా ఆపరేషన్ చేయించుకున్నావా?''

''అవునండీ''

''ఎక్కడ?''

''మా కన్నారూళ్లో''

''ఏ ఊరు?''

చెప్పిందామె. ''మరి నువ్వు చేసుకుని, నీ భర్తని ఎందుకు చేసుకోమన్నావ్?'' అడిగారు.

''ఏటీ? నా భర్త ఆపరేసన్ సేసుకున్నాడా? ఓలమ్మ ఓలమ్మో. ఎంతపని సేసినాడు దేవుడో?'' అని నెత్తినోరూ బాదుకోవటం మొదలుపెట్టింది. ఎవరికీ ఏమీ తెలీలేదు. ఆవిడెందుకేడుస్తోందో సర్పంచ్‌కీ అర్థం కాలేదు.

''చూడమ్మా! ఏడవకు. అసలు సంగతేమిటో చెప్పు?'' అన్నారు డిఎమ్వో.

''ఇద్దరు పిల్లలు పుట్టిన తరువాత నానాపరేసన్ సేయించుకుంతానని ఇతగాడు అన్నప్పుడు నానొప్పుకోనేదు. ససేమిరా ఈల్లేదని, నానే సేయించుకున్నాను. అక్కణ్ణుంచీ ఇతగాడు సిరమరసిరమరలాడీవోడు అసలింతకీ సంగతేటంటే ఇతగాడికో ఎవ్వారం ఉంది. ఆయమ్మకి పెల్లికానేదు. ఆ ఎవ్వారం కొనసాగాలంతే ఇతగాడు ఆపరేసన్ చేసుకోవాల. నాను ముందుగా పసిగట్టేసి ఇతగాడికి తెలకంట బల్లెక్కేసినాను. రెండు మూడుసార్లు ఆయమ్మ కడుపు రావటం, కడుపుని దించుకోడం జరిగింది. ఇప్పుడాపరేసన్ జరక్కంట ఆయమ్మ రానివ్వదు. ఆ యమ్మతగానితో ఉండాలంటే ఇతగాడాపరేసన్ సేయించుకోవాల! పోనీ, ఆయమ్మే సేయించుకోవచ్చుగదాని మీరనొచ్చు. ఆయమ్మందుకు ఇష్టపళ్లేదనితెలిసింది. ఓలమ్మోలమ్మో! ఎంత దగా చేసినావురో, ఎంత మోసం సేసినావురో?'' అని ఆవిడ రోదిస్తుంటే నవ్వాపుకోవటం డిఎమ్వోకి కష్టం అయింది. అందరూ గొల్లున నవ్వారు.

''ఏమయ్యా! నీ పిల్లల మీద ప్రమాణకం చేసి నిజం చెప్పు. ఈ ఏఎన్నెంగారు నిన్ను నీ విషయం చెప్పినా ఆపరేషన్‌కు బలవంతం చేసారని!'' అని అన్నారు.

''ఓలమ్మ దేవుడో! అతగాడు దగుల్బోజీ. ఎంతకయినా తెగిస్తాడు'' అని పైట కొంగును మొలలో దోపుకుని ''ఏమయ్యా! ఒకరికి తెద్దునా, ఇద్దరికి తెద్దునా, అర్ధరేత్రపుడందరికీ తెద్దునా!'' అని మాకు ఎసరెట్టింది సాలక ఆయమ్మకెసరెడదామనుకున్నావా? నిజం సెప్పు. దగుల్బోజీ! నువ్వా బతికినావ్! పందీ బతికినాది'' అని ఒక్కతాపు తన్నింది. ఆ దెబ్బ నసాళానికి అంటినట్లుంది. వెంటనే నిజం చెప్పేసాడు. తనే అబద్ధం ఆడి తప్పు ఏఎన్నెంగారి మీద నెట్టినట్లు!

డిఎమ్వో గారు తనతో వచ్చిన విలేకర్లను ఉన్నదున్నట్లు రాయమన్నారు. మర్నాడు పేపర్లో ఏఎన్నెం అమ్మలు నిర్దోషి అని వచ్చిన వార్త అమ్మలు సాధించిన ఘనవిజయంగా ఆనుప

త్రిలో అందరూ అభివర్ణించారు.

అమ్మలు పేరు అన్ని పేపర్లలోనూ రావటం, ఎంతో పలుకుబడి ఉన్న రావివలస సర్పంచ్ అబానుపాలు కావటం, సమయం చూసి దెబ్బ తీయాలనుకున్న డాక్టరు కృష్ణారావు పాచికలు పారకపోవటంతో ఆస్పత్రి వర్గాల్లోనూ, డిఎమ్ అండ్ హెచ్ఓ ఆఫీసులోనూ అమ్మలు పేరు మారు మ్రోగిపోయింది. అంతేకాదు ఇంట్లోను, ఊర్లోనూ కూడా ఎవరి నోట విన్నా అమ్మలు గురించే. అయితే అమ్మలు మాత్రం అదో పెద్ద విజయంగాకానీ, గర్వకారణంగా కానీ భావించ లేదు. పడగ విప్పి పొంచి ఉన్నపాములా ఎదురు చూస్తోన్న సర్పంచ్‌లో మార్పును తేగ లిగినప్పుడుకానీ, అతని బాధ పూర్తిగా తొలగి పోయిందనుకున్నపుడుగానీ తనకు తృప్తి లేదు.

అయితే

ఇంట్లో అత్తగారి అనారోగ్యకారణంగా వచ్చి చిన్నచిన్న గొడవలు చిలికిచిలికి గాలివానగా మారుతున్న సమయంలో ఈ సంఘటన జర గటం ఒకరకంగా మనశ్శాంతిని ప్రసాదించిపె ట్టింది. అంతకు ముందే కొద్ది రోజుల క్రితం శివ రేపిన అలజడివల్ల మనశ్శాంతిని కోల్పో యిన అమ్మలుకు అత్తగారు, ఇంటల్లుళ్ళు, ఆడపడచులవల్ల అంత ఆదరణ లభి స్తుందని అనుకోలేదు. రెండు రోజులక్రితం వరకూ ఉద్యోగం చేస్తోన్న ఆడాళ్ల మీద ఉన్న నికృష్ట భావం కొంతవరకూ వాళ్లలో తగ్గింది. అందుకు ఉదాహరణ చిన్న అల్లుడు "ఏంవోయ్! నీవూ ఉద్యోగం చేయాలను కుంటున్నావ్. మీ అమ్మలులాగా ఆత్మస్థయి ర్యం ఉంటే హాయిగా చేసుకోవచ్చు. అలాగాక ఊర్లో గొడవలన్నీ నా చెవిలో పోసీ కర్ణభేరి పాడుచేస్తేనే చికాకు" అన్నాడు భార్యతో.

"అక్కడకి నేనేదో రోజూ ఏవో గొడవలు మీతో చెప్పేస్తున్నట్లు" అని ఆమె అలిగింది.

అత్తగారు మంచం మీద కూర్చుంది. అల్లు ళ్లు, కూతుళ్లూ, మనవలూ చుట్టూ కూర్చున్నా రు. టిఫిన్లు చేస్తున్నారు.

"ఇదిగో! మీ అందరికీ ఇదే చెప్పటం. వచ్చే కార్తీకమాసంలో ముహూర్తాలున్నాయి. అమ్మా యీ, అబ్బాయీ చూసుకున్నారు... ఇష్టపడ్డా రు. ఏదో అమ్మలు మంచితనంవల్ల కాణీ ఖర్చులేని బంగారంలాటి సమ్మంధం కుది రింది. దాని పెళ్లి గురించే నాకు బెంగగా ఉండేది. అమ్మలు అనేది వసంత గురించి బెంగపడొద్దని. కలిసొచ్చే రోజుల్లో నడిచొచ్చే కొడుకు అన్నట్లు నాకీ జబ్బు వచ్చినయం కావటం, వసంతకు సంబంధం మీ అందరి సమక్షంలో కుదరటం జరిగాయి గనుక చెప్తు న్నాను. వాడు చిన్నవాడు. ఒక్కడే చేసుకోలేడు. దానికి సెలవు ఎక్కువ రోజుల్వీరు. మీ ముగ్గు రాడపిల్లలూ నెల రోజుల ముందేవచ్చి పెళ్లి వనులు దగ్గరుండి చేసుకోవాలి. వాడిని నిందించటం మాత్రం తగదు. కార్యంలో ఏలో టూ రాకుండా చూసుకోవటం మీ అందరి బాధ్యత. మీరు చుట్టాల్లా వచ్చి కూర్చొని వంక లు పెడతామంటే మాత్రం చెప్పండి. ఏ గుళ్ళోనో ఆ మూడు ముళ్లూ వేయించేసి అందరికీ ఓ పార్టీ ఇప్పించేస్తాం. ఇప్పుడంతటా అదే జరుగుతోంది" అంది నారాయణమ్మ.

'అమ్మకిన్ని తెలివితేటలెప్పుడొచ్చేసాయా?' అని ఆశ్చర్యపోయింది వసంత.

సుదర్శనం కళ్లు కాంతితో వెలిగిపోవటం గమనించింది అమ్మలు. అందరూ మాట్లాడు కుంటున్నారు. ఎవరో కుర్రాడు వచ్చి 'మీకు రమీజాగారీ ఉత్తరం ఇవ్వమన్నారు' అన్నాడు. అనేసి వెళ్లిపోయాడు. ఆ ఉత్తరంలో ఎక్కువ రాయలేదు. 'వీలు చూసుకొని ఒక రాత్రి ఉండేట్లురా. కొన్ని ముఖ్యమయిన విషయాలు మాట్లాడాలి' అని మాత్రం రాసి పంపింది. ఇంటినిండా చుట్టాలు. వీళ్లమీద పని వదిలివె ళ్లటం మంచిదికాదు అనుకుంది. పోనీ, తనకి కబురు చేసినా మాట్లాడ్డానికి ఇక్కడ కుదరదు అనుకుంది. ఇంతకీ కారణం ఏమయి ఉంటుంది? మ్యూచివల్ కోసమేమో? తని క్కడ పనిచెయ్యగలదా? మళ్లీ మరో రొంపిలోకి తనని దింపినట్లవుతుందేమో! పోనీ ఈయన్నో సారి వెళ్లి రమ్మంటే బాగుణ్ణేమో? అనుకొని, ఈయనతో తన కష్టసుఖాలు ఏం చెప్పుకోగల దు? మళ్లీ ఏం కొత్త సమస్యలొచ్చాయో ఏమో?, అని పరిపరి విధాలుగా ఆలోచించింది. ఎలా గైనా తీరుబాటు చూసుకొని రేపోసారి వెళ్లిరా వాలి! అనుకుంది. అనుకొని లేవబోతుంటే తన




ఏరియాలో ఉన్న నిమ్మలవలస నుండి తల యారీ వచ్చి ''అమ్మా! రెండ్రోజులుగా ఊళ్లో పరిస్థితి ఏం బాగులేదు. అందరికీ వాంతు లూ, విరేచనాలూను. చాలా ప్రమాదకరంగా ఉంది'' అన్నాడు.

''అదేంటి నేను మొన్న సోమవారం నాడే వచ్చాను?'' అంది.

''అవునమ్మ... ఇయ్యాల గురువారం కదా! ఊర్లో బంగారమ్మ జాతర జరిగినాదికదా! ఆ పండుగ జరిగిన తరువాత నుండి ఎవ్వులికీ ఒల్లల్ల బావులేదు. నిన్నటికి బాగా ఎక్కువయి పోనాయి'' అన్నాడు. వెంటనే బయలుదేరింది ఇంట్లో చెప్పి. భోంచేసి వెళ్లమన్నారు. ఇంట్లో భోంచేసి వెళ్ళటం కష్టం అని గబాలున లేచి మందులు, ఇంజక్షన్లూ పట్టుకుని బయలుదే రింది. స్టాండుకెళ్లగానే బస్సు వచ్చి ఉంది. ఎక్కిపోయింది. నిమ్మలవలసరోడ్డు సైడేకాబట్టి పెద్ద శ్రమక్కర్లేకపోయింది. వెళ్ళిన వెంటనే ఊళ్లో పరిస్థితి చూసింది. పిల్లలు, పెద్దలూ తేడా లేకుండా వాంతులూ, విరేచనాలతో సత మతమయిపోతున్నారు. ఇంత ఊరునీ ఒక్కతే చూసుకోవటం కష్టం. తలయారుని పంపి మేల్ అసిస్టెంటుని పిల్చుకు రమ్మంది. అత ను హుటాహుటాని బండి మీద వచ్చాడు. పరిస్థితిని చూసాడు. పిల్లలు డీహైడ్రేషన్ స్థితిలో ఉన్నారు. వెంటనే సెలైన్సు ఎక్కించాలి! ఎన్నని ఎక్కిస్తారు? కొబ్బరి బొండా లు తెప్పించి చెంచాతో ఆరారా కొబ్బరి నీళ్లు పొయ్యమన్నారు. అమ్మవారి పండుగజర గటం, అప్పుడుఅన్నీ కొనుక్కుని తినటం, ఊర్లో అంతా చెత్తాచెదారం పేరుకుపోవటం, నీరు పూర్తిగా కలుషితం కావటం గమనించా రు. వెంటనే విలేజి అసిస్టెంటుని పిలిచి డాక్టరుగారికి కబురు చేశారు. 'ఊర్లో కలరా- చావు బ్రతుకులలో జనం. వైద్య సిబ్బంది నిర్లక్ష్యం' అనే హెడ్‌లైన్లతో పేపర్లో వార్తలొచ్చే శాయి. ఆ వార్తని చూచి కలెక్టరు జిల్లా వైద్యాధి కారికి పంపి తక్షణం ముందు జాగ్రత్త చర్యలు తీసుకోమనటం డిఎమ్హో రావటం జరిగిపో యాయి. పరిస్థితిని సమీక్షించి పేపరు వార్తని ఖండించటం జరిగింది. హెచ్వీ, హెచ్చెస్‌లూ, డాక్టరూ, ఇంకా వైద్య సిబ్బంది యుద్ధ ప్రాతిప దికలో ఆ ఊళ్లో దిగి సేవా కార్యక్రమాలు మొదలెట్టారు. అక్కడో కాంపు వేసినట్లు ఉండి పోయారు. వీధుల్లో మందులు చల్లించటం. నూతుల్లో మందులు కలపటం చేశారు. ప్రతి ఇంటికీ వెళ్లి నీళ్లు' మరిగించి చల్లార్చి త్రాగ మని సలహా ఇచ్చారు. మురిగి ఉన్న వస్తువు లూ, ఎండు చేపలూ, నిన్నటి కూరలూ, పచ్చ ళ్లూ ఏవీ వాడవద్దని పదేపదే హెచ్చరించి, అలాటివాటిని దగ్గరుండి దూరంగా పారబో యించారు. చాలా ప్రమాదకర స్థితిలో ఉన్న కేసులను అంబులెన్సు తెప్పించి హాస్పిట లుకు తరలించారు. డిఎమ్హో ఒకరోజున్నారు. డాక్టరు డిఎమ్హోతో ఫాలో అయి మళ్లీ తెల్లవారే సరికి వచ్చేశాడు. అక్కడ ఆసుపత్రి సిబ్బంది ఉండటానికి కనీస సౌకర్యం లేదు. ఎలి మెంటరీ స్కూలు ఉందంటే దానికి తలుపులు లేవు. ఎవరింట ఉండటానికి భయంగానే ఉంది. అక్కడ ఊరు మధ్యలో రామమందిరం ఉంది. దాంట్లో బస చేశారు. టౌన్ నుంచి కేరియర్లు, నీళ్లూ తెప్పించుకున్నారు.

పాలు తాగే పిల్లాణ్ణి, ఇంటివద్ద విడిచి రావటంతో అమ్మలుకి పిల్లాడికి పాలివ్వకపోవ టంచేత జ్వరం వచ్చేసింది. వెంటనే హెచ్వీ విషయం తెలుసుకుని అంబులెన్సు వస్తుంది నువ్వు ఇంటికెళ్లి రేపురా! అంది. ఆ రాత్రికి ఇంటికెళ్లింది. అమ్మలుకీ జ్వరం 103° వచ్చే సింది. అందరూ గాబరాఎత్తారు. ఏం కంగారు పడనవసరంలేదని తనే ఇంజక్షన్ చేసుకుంది. కాఫీత్రాగి పడుకుంది. పిల్లాణ్ణి పక్కలో వేసు కుంది. వాడూ అవురావురుమంటూ పాలు తాగేసాడు. అర్ధరాత్రి తిరిగేసరికి టెంపరేచరు తగ్గింది. తెల్లారేసరికి హెచ్వీ వచ్చింది. ఈ రోజు రెస్టు తీసుకో... నేనుంటాను'' అని చె ప్పింది. ''రమీజా ఏమన్నా చెప్పిందా?'' అంటే ''నాకేమీ చెప్పలేదే?'' అంది.

కలరా నిర్మూలనా కార్యక్రమం పూర్తి చేసేస రికి వారం రోజులు పట్టింది. ఈవారం రోజుల్లో హాస్పిటల్ సిబ్బంది ఎవరికీ నిద్రాహారాలు లేకుండా అయిపోయాయి. ఊర్లో మాత్రం అందరూ హాయిగా ఉన్నారు. విచిత్రమేమి టంటే సత్వర చర్యలు తీసుకోవటం చేత కలరాసోకి మరణించిన వారెవరూ లేరు. చచ్చి పోతారనుకున్నవారు కూడా ప్రాణహాని నుండి బయటపడి ఆసుపత్రిలో కోలుకుంటున్నారు.

డాక్టరుగారు చిన్న సమావేశం లాటిది ఏర్పాటు చేశారు. ఆసుపత్రి సిబ్బంది ఎంతో సమైక్యంతో ఉంది. నిర్విరామ సేవ చేసినందుకు అందరికీ ప్రత్యేక కృతజ్ఞతలు చెప్పారు. "డాక్టరుగారూ! మాకు మీరు కృతజ్ఞతలు చెప్పడమెందుకు? ఇది కూడా మా విధేకదా! కానీ ఒక్క రిక్వెస్టు. మేం పూర్తిగా అలసిపోయి ఉన్నాం. వాళ్ళ కలరాపోగొట్టేసరికి మాకు నిస్సత్తువలు ఆవరించాయి. అందునుంచి మాకు కనీసం మూడు నాలుగు రోజులు రెస్టుకావాలి. మేం డ్యూటీల్లోకి వెళ్ళలేం!" అంది అమ్మలు. డాక్టరుగారు "ఓ వారం రోజులు తీసుకోండి మీ ఇష్టం కానీ మళ్లీ ఏదయినా సడెన్‌గా తెలిస్తే మాత్రం వెళ్లడానికి రెడీగా ఉండండి. అందరికీ అన్ని జాగ్రత్తలూ చెప్పండి. మాత్రలు మందులూ ఇచ్చి కరెక్టుగా వాడమని చెప్పండి" అన్నాడు.

ఇంతలో ఆ ఊరి మేలసిస్టెంటు, "డాక్టరుగారూ! మా రెండో అబ్బాయికి కార్తీకంలో పెళ్లి నిశ్చయమయింది. పెళ్లికి తప్పకుండా మీరూరావాలి" అన్నాడు.

"తప్పకుండా కార్తీకంలో అయితే పిక్‌నిక్‌లా ఉంటుంది. ఇంతకీ అమ్మాయి ఎవరు? కట్నం ఎంత?" అడిగాడు.

"అమ్మాయి ఎవరోకాదు. మన అమ్మలుగారి ఆడపడుచు. బిఏ పరీక్షలు రాసింది. కట్నకానుకలేవీ మావాడిష్టపడడు. పిల్లనచ్చింది. ఒప్పుకున్నాడు" అన్నాడు.

"ఇంకేం అయితే అమ్మలుగారికన్నీ శుభాలే. పెద్ద పార్టీయే ఇవ్వాలి ఆవిడ!" అన్నాడు. అమ్మలు డాక్టరు రమీజా విషయంలో ప్రవర్తించిన తీరు, మరిచిపోలేకపోతోంది. అందుకే బాగుండదన్నట్టుగా నవ్వి ఊరుకుంది.

అందరూ ఆ ఊర్నించి డిస్పర్స్ అయిపోయారు.

వారం రోజులు ఇంట్లో హాయిగా బాబుతోనూ, చుట్టాలతోనూ గడపాలనుకుంది. రెండ్రోజులు అలసట పూర్తిగా తగ్గింతరువాత రమీజా దగ్గరకు వెళ్లాలనుకుంది.

★ ★ ★

అమ్మలుకి పెళ్ళయి సరిగ్గా మూడు సంవత్సరాలయింది ఆరోజుకి. తెల్లారేసరికి తలంటుపోసుకుంది. ఇంట్లో అందరూ మొదట మరిచేపోయారు. అమ్మలు తలంటుపోసుకుని వస్తుంటే అత్తగారికి గుర్తొచ్చింది.

"అవునే అమ్మలూ! ఇవాళ మీ పెళ్లిరోజుకామోసు?" అంది.

అవునన్నట్టు తలూపింది.

"బాబూ! సుదా" అనిపిలిచింది.

షేవింగ్ చేసుకుంటోన్న సుదర్శనం వచ్చాడు. "ఏరా! నీకూ గుర్తులేదా? ఇవాళ మీ పెళ్ళిరోజు అన్న సంగతి?" అడిగింది.

"గుర్తుందమ్మా!"

"అయితే చీరకొన్నావాలేదా?"

"నేను కొనాలనుకుంటే, తనే ఒప్పుకోలేదు"

"ఏం? ఎందుకొప్పుకోదు? అయినా దాన్ని అడగటందేనికిరా?"

"అదికాదత్తయ్యా?"

"ఏదికాదు... వెళ్లు... ఇదిగో ఈ డబ్బులు తీసుకెళ్ళి మంచిచీరకొని పట్రా!" అంది. ఆవిడకు నాలుగొందలు పెన్షన్ వస్తుంది. అందులో నెలకు మూడొందలు వసంత పేరున బ్యాంకులో వేయగా వంద ఉంటుంది. అది అలా ఖర్చుచేయకుండా ఉంచుతుంది. సుదర్శనం చిలిపిగా 'మరినాకో!' అన్నాడు. ఆవిడ జవాబు చెప్ప లేకపోయింది. కళ్ళనీళ్ళు పెట్టుకుంది. "నిజమేరా! కానీ నా దగ్గరంతే ఉంది. పోనీ ఎక్కడయినా తెచ్చుకో. నేను తరువాత తీరుస్తాను" అంది.

"బాగుందండి... అయినా మీరివ్వటం దేనికి? ఉంచండి" దెబ్బలాడింది అమ్మలు.

"అమ్మ ఇస్తున్నప్పుడు నువ్వు కాదనకూడదు నువ్వెళ్లి మంచి చీర తీసుకో' అంది చిన్నక్క.

వసంత వచ్చి "నాకివ్వన్నయ్యా! నేను సెలెక్టు చేసి తెస్తాను" అని ఆ డబ్బులు తీసుకుంది.

"బాగుందిపిల్లా... నీకు చక్కని మొగుణ్ణి సెలెక్టు చేసి ఇచ్చింది మీ వదిన. నువ్వో చక్కని చీరకొని తీసుకురా!" అని హాస్యం ఆడాడు వాళ్ళ పెద్ద బావ.




'వెవ్వెవ్వె' అని వెక్కిరించింది వసంత.

"ఏంటి? ఇదొత్తి అమాయకురాలు. అత్తారింట్లో ఎలా పేరు తెచ్చుకుంటుందో?" అంది నారాయణమ్మ.

"ఏంటీ మీ కూతురమాయకురాలా? అడవిలో పులీ, ఇంట్లో వసంతే. మీకేం పరవాలేదు. వెళ్లిన మరునాడే మొగుణ్ణి చేతిలో ఉంచేసుకుంటుంది" అన్నాడు బుచ్చిబావ

అందరూ పకాలున నవ్వేశారు.

వసంత బజారుకెళ్లి చేతిలో రెండు ప్యాకెట్లతో తిరిగి వచ్చింది.

"వదినా! చూడు ఇదిగో ఇది నాకు నచ్చింది. స్నఫ్ కలరు. మీ ఒంటికెంతో బాగుంటుంది. ఇదిగో నీకు నచ్చుతుంది. స్కై బ్లూ. ఏది సెలెక్టు చేస్తావు?" అంది. రెండోది సెలెక్టు చేస్తే వసంత చిన్న బుచ్చుకుంటుందని గమనించిన అమ్మలు స్నఫ్ కలరు శారీనే ఉంచమంది.

వసంత ఎగిరి గంతేసింది. "అబ్బ వదినా! ఇవాళెందుకో ఈశారీ నువ్వు తప్పక లైక్ చేస్తావనుకున్నాను. పాతిక చీరలు తిరగేయించాను" అంది.

"అవుతే... ఇదుంచేస్తా. దీనిమీదకి బ్లౌజు పీసు తీసుకొస్తా" అని వెళ్ళబోతుంటే, "ఉండవే! నాకూ పనుంది" అని చిన్నక్క తనతో కూడా వెళ్లింది. షాపులో చిన్నక్క రడీమేడ్‌లో పాంటూ, షర్టు తీసుకుంది. మూడొందల రూపాయాలయాయి. 'ఎవరికీ?' అడిగింది వసంత.

"మీ బావకి... ఈ ఊర్లో రడీమేడ్ బావున్నాయట. నిన్న బజారుకొచ్చారట. ఎందుకో బట్టల షాపులో దూరితే ఇవి కనిపించాయట" అంది.

నవ్వుకుంది వసంత. 'అన్నయ్యకోసం సెలెక్టు చేస్తున్నావేమో! అనుకున్నాను' అనాలనుకుంది. అనలేకపోయింది. ఆ మాటలు గొంతులోనే ఉండిపోయాయి. ఇంటికెళ్లాక చీర వదిన చేతిలో పెట్టేసి 'అంచు కుట్టేసేదా?' అంది. 'ఫాలు కూడా తెచ్చేవలసింది' అని చిన్నక్కంటే 'వదిన ఫాలు కుట్టుకోదు' అంది.

"ఒరే బాబూ! ఇలా రా!" పిలిచింది సుదర్శనాన్ని. అతను వచ్చాడు.

"ఇదిగోరా! మీ బావగారి ప్రెజెంటేషన్. తొడుక్కుని కాళ్లకు దండంపెట్టు" అంది. "ఎందుకే అక్కా ఇప్పుడివన్నీ. అమ్మలుకి ఆర్భాటాలు ఇష్టం ఉండదు. అయినా పిల్లాడు కూడా పుట్టిన తరువాత ఇంకా పెళ్లిరోజులేమిటి?" అన్నాడు.

"నోర్ముయరా! పిల్లడు పుట్టేస్తే నువ్వేం ముసలాడివయిపోలేదు. మరేం మాట్లాడకు. బట్టలు కట్టుకోండి. అలా 'వెంకటేశ్వరస్వామి' కోవెలకు వెళ్లివద్దాం" అంది.

"వెళ్లిరండ్రా" అంది నారాయణమ్మ.

పెద్దక్క వచ్చి అంది "ఇప్పుడిప్పుడే తొమ్మిదయింది. ఈ పూటకి.వంటేమిటి?" అని "పులిహోర, బొబ్బట్లూ చేసుకుందాం. వాడికి పులిహోర ప్రాణం. దానికి బొబ్బట్లు ప్రాణం" అంది నారాయణమ్మ.

"అయితే కుక్కరు నే పెట్టేస్తాను. మీరెళ్లండి. మీరు కూడా వెళ్లిరండి" అంది భర్తను కూడా ఉద్దేసించి. నారాయణమ్మ పెద్దకూతురు...

ఎక్కడికయినా తొందరగా తెమలాల్సి వచ్చినప్పుడు వసంత అమ్మలుకి జడవేస్తూంటుంది. అమ్మలు తొందరగా తెమలాల్సి వచ్చినప్పుడు చాలా అలస్యంగా తెముల్తుంటుంది. అందుకని ఇంట్లోకెళ్లి దువ్వెన పట్టుకొచ్చి వదులుగా జడవేసింది. సంపెంగ పువ్వులు పిన్నుకు గ్రుచ్చిపెట్టింది.

"వదినా! ఒక్కసారిలా వస్తావా?" దేవుడింట్లోనుండి పిలిచింది. వెళ్లింది అమ్మలు. "కళ్లు మూసుకోండి" అంది. "ఎందుకు వసంతా?" అని కళ్లు మూసుకుంది. అమ్మలు ముఖాన్ని రెండు చేతుల్లోనికి తీసుకుని ఆ బుగ్గమీదా, ఈ బుగ్గమీదా గట్టిగా ముద్దుపెట్టుకుంది. "ఏమిటీ చిలిపితనం?" బుగ్గలు తుడుచుకుంటూ అంది.

"అన్నయ్య వంతు ఒకటి. నా వంతొకటి. ఇవాళెంత బాగున్నావో తెలుసా? నువ్వు కోవెల నుండి వచ్చేసరికి దిష్టితియ్యకపోతే ప్రమాదమే" అంది.

"చాల్లే. నవ్విపోగలరు ఎవరైనా వింటే?" అంటుండగా సుదర్శనం వచ్చాడు. "ఏంటి




వసంతా! ఏమిటీ హడావుడి?'' అన్నాడు.

వసంత అన్నయ్యవేపు చూసి, ''అన్నయ్యా నువ్వు అబద్ధం ఆడకుండా చెప్పు. ఇలా కోవెల కి వెళ్లి తిరిగివచ్చాక వదినకు దిష్టితగు ల్తుందంటావా? తగలదంటావా?'' అంది.

''మెల్లగా అంటావేమిటి? ఇవాళ పెళ్లిరో జులా లేదు. తోటలో దిగినప్పటి రోజులా కని పిస్తోంది మీ వదిన'' అన్నాడు.

''వసంత చప్పట్లు కొట్టింది. ''ఇప్పుడే మంటావు?'' అని. ఇంతలో అందరూ అక్కడ కి వచ్చారు. ''ఏంటర్రా?'' అనుకుంటూ.

''ఏంలేదు. అన్నాచెల్లెళ్లకి మతులు పోతు న్నాయి'' అంది, అమ్మలు.

''నిన్ను చూస్తుంటే ఇవాళ మాకే మతులు పోతున్నాయమ్మాయ్'' అని చిన్నక్క అనేసరికి వసంత మరీ గెంతింది. భార్యాభర్తలిద్దరూ నారాయణమ్మ పాదాలకి సాష్టాంగపడ్డారు. ''నిండునూరేళ్లు చిలకాగోరింకల్లాగా బతకాలి. గంపెడు పిల్లలు కలిగి, అష్టైశ్వర్యాలతో తుల తూగాలి!'' అంది మనసారా దీవిస్తూ.

''రెండోది మాత్రం ఈ రోజులకి పనికిరాదత్త గారూ!'' అన్నాడు చిన్నల్లుడు. 'పదండి' అంటే 'పదండి' అని ఒక్కొక్కరే వీధిలోకి నడిచారు. అమ్మలూ, సుదర్శనం మిగిలారు. అమ్మలు సుదర్శనానికి నమస్కారం చేసింది వంగి.

''నమస్కారంతో ఆపేస్తావా?''

''ఇంకేం కావాలి?'' కొంటెగా అంది.

''ము...ము...'' అని ముందుకు వంగబో యాడు. ''ష్... వాటిని రాత్రికి కేటాయించండి. ఇప్పుడు కాదు'' అని తన చేతిని పట్టుకున్న అతని చేతిని విడిపించుకుని అక్కణ్ణుంచి తప్పుకుంది.

అందరూ కోవెలకి వెళ్లి సరదాగా తిరిగివచ్చా రు.

''ఆఁ... ఇప్పుడు చెప్పండి. సాయంకాలం సినిమా ప్రోగ్రాం పెట్టుకుందామా?'' అన్నాడు పెద్దబావ. ఊర్లో ఒకే హాలుంది. దాంట్లో సినిమా కూడా చాలా పాత జానపదం. పల్లెటూ ళ్లలో విఠలాచార్య పిక్చర్లకింకా జనాదరణ తగ్గలేదు. జనం విపరీతంగా వస్తున్నారు. మనం ఆ కంపులో కూర్చోలేం'' అంది వసంత.

''అయితే ఒకపని చేద్దాం. శుభ్రంగా భోజనా లయిపోయాక రెస్టు తీసుకుని రెండు క్యాసెట్లు తెప్పించుకుందాం. హాయిగా ఇంట్లోనే ఎంజాయ్ చెయ్యొచ్చు. అన్నట్లు, కాసెట్లు దొరుకుతాయా ఇక్కడ?'' అన్నాడు చిన్నల్లు డు.

''ఓ!'' అంది. వసంత 'ఏ సినిమా అంటే ఏ సినిమా' అని మొత్తంమీద విశ్వనాథ్ పిక్చరొకటి, బాపు పిక్చరొకటి సెలెక్టు చేసుకు న్నారు. భోజనాలు చేసి పడుకున్నారు. అమ్మ లు పిల్లాడు ఆకలితో గోలచేస్తోంటే పక్కలో వేసుకుంది. వాడు పాలు తాగుతున్నాడు. అమ్మలు ఏదో ఆనందంలో మునిగిపోయింది. మనసు గతకాలపు పొరల్లోకి వెళ్లిపోయింది.

అమ్మలు తండ్రి వెంకట్రామయ్య బీ.పి.ఎమ్.గా పనిచేసేవాడు. అతనికి ఒక ఎకరం పొలం పిత్రార్జితం. ఒక మగపిల్లాడు. ఇద్దరాడ పిల్లలూ! మగపిల్లాడు స్కూలు ఫైనలు పోయింది. పెద్ద పెద్ద చదువులున్నవాళ్లే ఉద్యో గాల్లేక ఏడుస్తున్న రోజులలో స్కూలు ఫైనలు తప్పినవాళ్లకి ఏం ఉద్యోగాలొస్తాయి? ఊర్లోనే తిరిగేవాడు. అమ్మలు టెన్త్ పాసయింది. ఇంటర్ చదవాలని పట్టుపట్టింది. చదివించా లని వెంకట్రామయ్యకి ఉన్నా, పట్నం వంపి చదివించే స్తోమత తనకులేదు. పట్నంలో బావమరిది దగ్గరవెళ్లి 'పిల్ల ముచ్చటపడు తోంది. ఇక్కడుంచి చదివిద్దామనుకుంటున్నా' అని చెపితే, 'మాకే గడవటం చాలా కష్టంగా ఉంది. అయినా ఎవడ్నో చూసి ఆ మూడుము ళ్లు వేయించక, ఆడదానికి చదువెందుక య్యా? నువ్వు చదివించినా, దానికి పెట్టవల సిన సొమ్ము ఖర్చు పెట్టకుండా అది ఒక అయ్యచేతిలో పడదుకదా!'' అన్నాడు. 'ని జమే' ననిపించింది. వెంటనే డీలాపడి వచ్చేశా డు. 'అన్నయ్యేమన్నాడు?' అన్న భార్యతో విషయం చెప్పి, ''పీతకష్టాలు పీత కుంటాయి'' అన్నాడు.

ఆ తరువాత ఆరుమాసాలు ఖాళీగా ఉండి పోయింది. పల్లెటూరు కావటంచేత ఏం చె య్యటానికీ లేక ఇంటిపనులతోనే గడిపేది. ఒకరోజు 'కమలమ్మ' అనే ఏ.ఎన్నెం కార్డుల కోసం వచ్చింది. ఏదో మాటలమీద ఇంటి

విషయాలన్నీ అడిగితే వివరాలు చెప్పాడు వెంకట్రామయ్య. వెంటనే 'అయితే అమ్మాయిని పిలవండి' అంది. అమ్మలును కేకేశాడు. కమలమ్మ అంది. ''ఏమ్మా! ఏ.ఎన్నెం ట్రైనింగ్‌కెళ్తావా? బోల్డు పోస్టులు ఖాళీ ఉన్నాయి. హాయిగా ఉద్యోగం వచ్చేస్తుంది కూడా!'' అంది. ఆ ఉద్యోగం ఏమిటో, దానిలో సాధకబాధకాలేమిటో అసలు తెలియకపోయినా 'సరే'నని తలూపింది. అక్కడే ఎం.బి. ఫారం తీసుకొని పదిరూపాయలు ఎమ్మో చేసింది. ఏఎన్నెం శిక్షణా కేంద్రానికి దరఖాస్తు పంపమని వారంరోజుల్లో దరఖాస్తు పట్టుకుని ఆవిడే వచ్చింది. ఫారం పూర్తిచేసి పంపింది. ట్రైనింగ్ సీటొచ్చింది. కమలమ్మే స్వయంగా వెళ్లి జాయిన్‌చేసి వచ్చింది. వాళ్లేదో కొంత స్టయిఫండు ఇస్తారట. కొంత మీరు పంపగలరా? లేదంటే నేను పంపుతాను'' అంది. ఆమెకెవ్వరూ లేరని చెప్పింది. అందుకే తనే దోలా ఎవరికయినా సహాయం చేయడమే లక్ష్యంగా పెట్టుకుంటున్నట్లు చెప్పింది. ఆవిడ గొప్పకోసం చెప్పుకోటంకాక ఆచరణలో పెట్టింది. అమ్మలులాటివాళ్లని ముగ్గురుని ట్రైనింగ్‌కి పంపింది.

ట్రైనింగ్ పూర్తయిన కొద్దికాలానికే అమ్మలుకి ఏజన్సీ ప్రాంతంలో అపాయింట్‌మెంటిచ్చారు. అక్కడ ఏజన్సీ అలవెన్సు జీతంకంటే హెచ్చుగా ఉండటంచేత, డ్యూటీకెళ్లకపోయినా అడిగేవాళ్లు లేకపోవటంచేత ఎక్కువ మంది అక్కడకి బదిలీకోసం ట్రై చేస్తుంటారు. అందువల్ల కొంతకాలం చేసిన తరువాత అమ్మలుని అక్కడ్నించి ప్లెయిన్ ఏరియాకి బదిలీ చేసేశారు. అప్పుడు కమ్మలమ్మ అక్కడికి 'హెచ్వీ'గా ప్రమోటయివచ్చింది.

ఏజన్సీ ప్రాంతంలో పనిచేసే రోజుల్లో డాక్టరుగానీ, స్టాఫ్‌గానీ తన్నెవరూ ఇబ్బంది పెట్టలేదు. గ్రామీణ ప్రాంతాల్లో కూడా మంచి విలువనిచ్చేవారు. కానీ ప్లెయిన్ ఏరియాకు వచ్చాక 'ఈ ఉద్యోగం చేయలేనేమో' అనుకునేది. ఒక్కొక్కసారి ఏడ్చేది. తనతో పనిచేస్తోన్న మలేరియా వర్కర్లు, హెల్త్ ఇన్స్‌పెక్టర్ల కుళ్ళు జోకులు, ఆకలిచూపులూ, ఎత్తిపొడుపు మాటలూ భరించలేకపోయేది. ఇంటికొచ్చాక ఏడ్చుకుంటూ పడుకుండిపోయిందోసారి. అలాంటి ఓ సాయంకాలం ఒంటరిగా గదిలో పడుకున్న అమ్మలు దగ్గరకి వచ్చింది కమలమ్మ. ఎంతోసేపు ఏడ్చి, ఏడ్చి పడుకుండిపోవటంచేత కనురెప్పలు ఉబ్బిపోయి ఉన్నాయి.

''ఏమిటీ? డ్యూటీకెళ్ళలేదా?'' అడిగింది.

''వెళ్ళొచ్చాను'' అంది. ఏమ్మాట్లాడకుండా ఉండిపోవటంచూసి ''ఉద్యోగం ఎలా ఉంది?'' అంది.

''మనుషులమధ్య చేస్తున్నట్లు లేదు. జంతుప్రపంచంమధ్య ఇరుక్కుపోయినట్లు ఉంది. సరేగాని ఆంటీ ఒకటి అడుగుతాను. నిజంగా చెప్తారా? అబద్ధం ఆడకూడదు'' అంది ముందే కండిషన్‌గా

''ఏంటమ్మా! నీమీద ఒట్టు. నిజం చెపుతాను'' అంది.

''మీరు ఏ.ఎన్నెంగా కొన్నాళ్ళు చేసి ఇప్పుడు ప్రమోషన్ పొందారుకదా! మీరు ఇంత కాలం ఎలాటి ఒడిదొడుకులకూ గురికాలేదా?''

ఆ ప్రశ్నలోని అమాయకత్వం, ఆ చూపులోని స్వచ్ఛత, నిర్మలత్వం ఆమెను అబద్ధం చెప్పించలేకపోయాయి.

''తల్లీ! ఈ ఉద్యోగాలు తెల్లవస్త్రాలలో అందంగా కనిపిస్తాయి. కానీ ఇది ఒక ఊబిలాటిది. ఇందులో పంకజాలూ ఉంటాయి. నాచూ ఉంటుంది. ఇంకా ప్రమాదకరమైన ముళ్ళూ ఉంటాయి. అయితే ఈ ఉద్యోగంలో ప్రవేశించాకా ఎవరేమన్నా అనుకోనీ నా డ్యూటీ నేను చేసుకొనిపోతాను. అనుకోవాలి! లేదా వాళ్ళెంత రఫ్‌గా ఉంటే మనమూ అంత రఫ్‌గా ఉండటం నేర్చుకోవాలి. రఫ్‌గా ఉంటే వాళ్ళు కొంత చనువు తీసుకుంటారు. ఒక్కోసారి మన శీలానికి సంబంధించిన దెబ్బలు తగుల్తాయి. అందుకే ఎవర్నో ఒకర్ని పెళ్ళి చేసేసుకుంటే కొంతవరకూ పరవాలేదు. అయితే పెళ్ళి చేసుకున్న మగాడు సరిగా చూసుకుంటాడా? అని అడగొచ్చు. మగాడు తను వెధవ తిరుగుళ్ళు తిరిగినా ఫరవాలేదు. ఆడది తిరుగుతే ఎలానూ సహించలేడు. కనీసం ఫ్రీగా మూవ్ అయినా చూడలేడు. అందునుంచి పెళ్ళి చేసుకున్నా ఇబ్బందులుండవనీ నేననలేను. ఉంటాయి. కానీ ఈ ఉద్యోగంలో ఉన్న ఆడవా




ళ్ళకి పెళ్ళి ఒక కవచంలాటిది'' అంది.

అమ్మలు ఇంకా ఊరుకోలేక సందేహంగా, ''సరే! మీరు పెళ్ళిచేసుకోకుండా ఇన్నాళ్ళు ఈ వృత్తిలో పవిత్రంగా ఎలాగున్నారు?'' అడిగింది.

''పెళ్ళి చేసుకోకుండా, సెక్సు సంపర్కం లేకుండా ఉండడమనేది ఆడాళ్ళకికానీ, మగాళ్ళకి కానీ ఒక యజ్ఞంలాటిదే! అందులో ఈ ఉద్యోగంలో పెళ్ళి చేసుకోకుండా పవిత్రంగా ఉండటం అనేది ఇంపాజిబుల్. ఇక్కడెన్నో కొండచిలువలూ, ఖడ్గమృగాలూ ఆకలితో ఆవురావురుమంటూనే ఉంటాయి. నాదో అంతులేని కథ. ఈ వృత్తిలో చేరిన పది సంవత్సరాలు నేను నిప్పులాగా బ్రతికాను. నన్ను చూసి మాట్లాడ్డానికే భయపడేవారు. నా డ్యూటీలో నేనెప్పుడూ అశ్రద్ధ చూపేదాన్ని కాదు. అర్థరాత్రి, అపరాత్రీ అనకుండా శ్రమించేదాన్ని. అప్పుడే వచ్చి కూర్చున్నా ఎవరైనా పిలుస్తే పరుగెత్తేదాన్ని. వారినుండీ పైసా ఆశించేదాన్ని కాను. ఇలా పబ్లిక్‌తో నాకు మంచి సంబంధాలుండేవి. అందుకు నన్నే మగాడయినా పన్నెత్తి మాటన్నాడని ఎవర్తోనైనా అన్నానో వాడికేజబ్బకాజబ్బ, ఏకీలుకాకీలూ విరిచిపారేసేట్లుగా ఉండేవారు జనం. అందుకే డాక్టర్లు కూడా నాదగ్గర భయపడేవారు. దీనికితోడు నేను ఒక ఎం.బి.బి.ఎస్ డాక్టరు చేయలేని పనిని కూడా చేసెయ్యగలనన్నంత నైపుణ్యాం సంపాదించాను. ఇవే నా వృత్తిలో నాకు రక్షణ కవచాలయ్యాయి. అయితే మేం ఆరుగురు చెల్లెళ్ళం, ఒక తమ్ముడు. నాన్నకు ఉద్యోగం లేదు. అయిదెకరాల భూమి ఉండేది. అదెప్పుడో హరించుకుపోయింది. ఉద్యోగం చేసి నా సంపాదనమీద నా కుటుంబాన్నంతా ఈదుకురావలసి వచ్చింది. నా జీవితం ఎలాగూ నా కుటుంబంకోసం అంకితం అయిపోయింది. చెల్లెళ్లకు పెళ్ళిళ్ళు చేసి వాళ్ళయినా హాయిగా ఉంటే చూసి సంతోషించాలనుకున్నాను. నేనింకా ఇల్లు చూసి పల్లెటూళ్ళో ఉన్న మా కుటుంబాన్ని తీసుకురావాలని నిర్ణయంలో ఉన్నాను. ఘోరమైన వార్త. బల్లి పడిన ఆహారం తిని మొత్తం కుటుంబం అంతా పోయారు. ఆ దెబ్బతో ఎన్నాళ్ళో కోలుకోలేకపోయాను. అప్పటికి నా వయసు ముప్పై అయిదు సంవత్సరాలు. ఎందుకో నాకు పెళ్ళిమీద మోజుపోయింది. అప్పటికే నేను వయసు తొందర్లో, ఎంతనిగ్రహించుకుందామన్నా వీలుకాక కొన్ని తప్పులు చేశాను. మలినపడిన ఈ శరీరంతో, నేను ఏమీ తెలీని 'పతివ్రత'నని మోసపుచ్చి, ఇంకొకరి జీవిత భాగస్వామిని కాలేకపోయాను''

ఎంతో నిండుకుండలా కనిపించిన ఆమె నిండుకుండ నేలమీద పడి బద్ధలయినట్లు అయిపోయింది. చాలాసేపటికి కానీ తేరుకోలేకపోయింది.

''ఆంటీ... మిమ్మల్ని బాధపెట్టాను. నన్ను మన్నించండి'' అని ఆమె రెండుచేతులూ పట్టుకుని ప్రాధేయపడింది.

''పిచ్చితల్లీ! చేసినపాపం చెపితే పోతుందంటారు. నీకు చెప్పి నేను తేలికపడ్డాను'' అనేసి, ''నువ్వు నీ డ్యూటీ సక్రమంగా చేసుకొని పో... వర్కులో నీకు కొన్ని మెళకువలు చెప్తాను. తీరికయినప్పుడు వస్తూండు'' అన్నారామె.

ఆవిణ్ణి ఆదర్శంగా తీసుకున్న అమ్మలు ఎన్నో చికాకులు అవలీలగా ఎదుర్కొంది. తరువాత తండ్రికి కళ్ళు కనిపించకపోవటం, ఊర్లో మంచితనంవల్ల ఆ ఉద్యోగం అన్నయ్యకు రావటం జరిగింది. ఏదో ఒక ఉద్యోగం ఉందిక దాని పెళ్ళి కూడా చేసి వాణ్ణి వదిలి, తల్లీ, తండ్రీ, చెల్లెలూ అమ్మలుదగ్గరకే వచ్చేశారు. చెల్లెల్ని చదివిద్దామనుకుంది అమ్మలు. కానీ దానికి చదువు అబ్బలేదు. ఈలోగా ఎవరూలేక ఒంటరిగా ఉన్న ఆ ఊరి పోస్ట్‌మేన్ గురించి చెపితే ఎంక్వయిరీ చేసింది. అన్నీ సేకరించింది. కులగోత్రాలు సరిపోయాయి. ఆ కుర్రాడు చెల్లెల్ని చూసుకున్నాడు. ఇష్టపడ్డాడు. మూడువేలు కట్నం ఇచ్చి పెళ్ళి జరిపించేసింది. పెద్దదానికి పెళ్ళి కాకుండా చిన్నదానికి చేస్తే తరువాత పెద్దపిల్లకు పెళ్ళవటం కష్టమని కొంతమంది తలిదండ్రులని భయపెట్టారు. కానీ కమలమ్మ వచ్చి తలిదండ్రులని మందలించి పెళ్ళి దగ్గరుండి జరిపించేసింది.

తలిదండ్రుల భయానికి తగ్గట్లే కొందరు అమ్మలును పెళ్ళిచూపులకి వచ్చి 'అక్క

ఉండగా చెల్లెలికి ముందు ఎందుకు చేశారు పెళ్ళి?' అని అడగటం, అలా అడిగి వెళ్ళినవాళ్ళు ఏ కబురూ చెప్పకపోవటం జరిగిపోయింది. తండ్రి ఆ బెంగతోనే మంచంపట్టాడు.

ఆ తరువాత కొన్నాళ్ళకు తండ్రి మరణించాడు. అమ్మలు ఒంటరిదయింది. ఆ సమయంలో అన్నయ్య దగ్గరలేడు. అప్పుడు పక్కింట్లో సుదర్శనం కుటుంబం ఉండేది. సుదర్శనం తండ్రి తాలూకాఫీసులో గుమస్తాగా పనిచేసి రిటైరయ్యాడు. సుదర్శనంకి పర్మినెంటు జాబ్ లేదు. తండ్రి మృతదేహం దగ్గర ఏడుస్తోన్న అమ్మలునీ, తల్లినీ వాళ్ళెంతో ఓదార్చి ధైర్యంచెప్పారు. సుదర్శనం వెళ్ళి అన్నయ్యనీ, వదిననీ తీసుకొచ్చాడు. అక్కణ్ణుంచీ ఆ కుటుంబంతో బాగా పరిచయమైంది. ఒకరోజు కమలమ్మగారొచ్చేసరికి సుదర్శనం అమ్మలు తల్లితో ఏదో మాట్లాడి వెళ్తున్నాడు. అప్పుడు కమలమ్మగారు 'ఈ అబ్బాయి ఎవరు?' అని అడగటం, వివరాలు సేకరించటం, వాళ్ళింటికెళ్ళి పెళ్ళి మాటలాడటం జరిగిపోయింది. ఓ సాయంత్రం ఇంటికొచ్చి, "అమ్మలూ! సుదర్శనం బావుంటాడుకదూ?" అనడిగారు. అమ్మలు సమాధానం చెప్పలేదు. "నచ్చలేదా?" అడిగిందామె.

"అతనికేం? అయినా నేనతన్ని పరిశీలనగా చూడలేదెప్పుడూ!"

"పోనీ, పరిశీలనగా చూసి రేపు చెప్పు!" అన్నారామె.

ఆరోజు సాయంకాలందాటి చీకటి పడుతుండగా సుదర్శనం టక్ చేసుకుని ట్రింగా తయారయి వచ్చాడు. అతన్ని చూసి మనస్సు ప్రఫుల్లితమయింది అమ్మలుకు. అతనలా అడుగుతాడనుకోలేదు. "నేనంటే మీకిష్టమేనా?" అడిగాడు. అప్పుడు అమ్మలునోట ఆ మాటెలా వచ్చిందోకానీ "మరి నేను?" అంది. ఎవరూ లేరన్న ధైర్యమో, అతన్నిష్టపడ్డానన్న సంతోషమో తెలీదుకానీ అతను తలుపుమీద ఉంచిన అమ్మలు చేతిని చొరవగా చేతిలోనికి తీసుకుని ముద్దుపెట్టుకున్నాడు. జీవితంలో మొట్టమొదటి ఆ పురుషస్పర్శ ఆమెలో విద్యుత్తును నింపింది. ఆ మధురానుభూతి ఎప్పుడూ మరిచిపోలేదు అమ్మలు!

ఆ తరువాత తండ్రి పోయిన సంవత్సరానికిముందే పెళ్ళి చేస్తే కన్యాదాన ఫలితం లభిస్తుందని కమలమ్మగారే తన డబ్బు కూడా కొంత పెట్టి పెళ్ళి జరిపించారు. పెళ్ళి గురించి ఎంత బెంగపడిందో, ఇప్పుడంత సుఖపడుతోంది! ఈ తలంపుల్లో పరధ్యానంగా ఉన్న అమ్మలుకి నిద్రపోతూ స్తన్యం గ్రోలుతున్న బాబు కితకితలు పెట్టినట్లయ్యింది.

"ఏంటమ్మలూ! అంత పారవశ్యంలో ఉన్నావ్?" అన్న సుదర్శనం మాటతో ఈ లోకంలోకి వచ్చిన అమ్మలు ముసిముసిగా నవ్వేసింది. ఆ సాయంకాలం అందరూ పనులు తెముల్చుకున్నారు. ఒకే సినిమా చూసిన అమ్మలు నిద్ర వస్తోందని వెళ్ళిపోయింది. సుదర్శనం కూడా వెళ్ళి పడుకోవాలనుకున్నా బావలు ఎగతాళి చేస్తారని ఉండిపోయి, సోఫాలో కునికిపాట్లు పడ్డం మొదలెట్టాడు. పెద్దక్క సుదర్శనం అవస్థ గమనించి, "బాబూ! నిద్ర వస్తే పోయి పడుకోరాదూ?" అంది. "వెళ్ళవయ్యా! వెళ్ళి పడుకో. ఆహార విహారాల్లో సిగ్గు పనికిరాదు" అన్నారు బావలు. అనగానే లేచిపోతే బాగుండదని కాస్సేపు కూర్చుని వెళ్ళాడు. గదిలో అమ్మలు నిద్రపోతోంది. పక్కకి చేరి అమ్మలుమీద చెయ్యేసి పడుకున్నాడు. అమ్మలుకి తెలివిరాలేదు. నిద్రపోతోందని లేపటం ఇష్టంలేక అటు తిరిగి పడుకున్నాడు.

అందరూ సినిమా చూస్తున్నారు. తలుపు తట్టిన సవ్వడి వినిపిస్తే ఎవరూ? అని తలుపు తీసింది వసంత. ఆజానుబాహుడు, భారీమనిషి, రాజకీయ నాయకునిలాటి ఆకారం. ఆ పక్కన ఓ నలభైయ్యేళ్ళవాడు, నాగరీకుడు కనిపించారు. వాళ్ళు 'ఏ.ఎన్.ఎమ్.గారి ఇల్లు ఇదేనాండీ?" అని అడిగారు.

"ఇదే. ఏం?"

"ఆవిణ్ణి పిలుస్తారా? ఓసారి?"

"పడుకున్నారిప్పుడే!"

"అర్జంటు పనుందమ్మా! లేపుతారా!" అన్నారు వాళ్ళు. వాళ్ళని డిస్టర్బు చేయటం అక్కడున్న ఎవరికీ ఇష్టపడలేదు. "అసలెందుకట?" అన్నది వసంత పెద్దక్క తలుపుదగ్గరకి వస్తూ.

"అమ్మా! ఒక నిండు చూలాలు ప్రసవవేదనలో ఉంది. తొందరగా వెళ్ళకపోతే ఆమె




ప్రాణానికే ముప్పు రావచ్చు'' అన్నాడా నాగరీకుడు.

''మంచి కేసొచ్చిపడింది మూర్తం చూసుకొని'' అంటూ తలుపు కొట్టింది. సుదర్శనంకు తెలివి వచ్చింది. ''అమ్మలూ! ఎవరో తలుపు కొడుతున్నారు. వెళ్ళి చూడు!'' అన్నాడు. అమ్మలు తనకెప్పుడు నిద్ర పట్టేసిందో, భర్త వచ్చి ఎప్పుడు పడుకున్నాడో అని ఉసూరుమంటూ లేచింది. తలుపు తీసింది. ''ఎవరో వచ్చారమ్మా నీకోసం!'' అంది.

''సరే, వస్తాను కూర్చోమనండి'' అనేసి భర్తను సమీపించి ''సారీ అండీ! మీరొచ్చినట్లు నాకు తెలివిలేదు. ఏమనుకోకండేం?'' అని బుజ్జగించినట్లు మాట్లాడింది. ఎందుకంటే ఒక్కోసారి సుదర్శనం అలుగుతుంటాడు. ''నేనే లేపలేదు. మంచి నిద్రలో ఉన్నావ్. నిద్ర లేపటం ఎందుకని?'' అన్నాడు.

గుమ్మంలోకి వచ్చి చూసేసరికి అమ్మలు గుండెలదిరిపోయాయి.

''నమస్కారం అమ్మా! నన్ను చూసి భయపడకండి. నానిప్పుడు నా భార్య పానం కాపాడమని అర్థిస్తున్నాను. నామీద మరో దురభిప్రాయం ఉంచుకోకండి. మీర్రాకపోతే నా భార్య సచ్చిపోద్ది. అది మిమ్మల్నే తీసుకురమ్మని పట్టుబట్టింది. అందుకే ఈ మేస్టరుగార్ని తీసుకొచ్చాను. సెపుండి మాస్టరుగారూ!'' అన్నాడు తను చెప్పటం పూర్తిచేసి.

''అవునమ్మా! తను పిలిస్తే నమ్మరేమోనని నన్ను తీసుకుని రమ్మన్నారు. నాయురాలికి మీరు మాటిచ్చారట. పండంటి బిడ్డని చేతుల మీదుగా మీకందిస్తానని. ఎందుకో ఆమెకి మీరంటే గొప్ప గురి. అందుకే నాయుడుగారు టవునుకు తీసికెళ్ళిపోదామన్నా ఆవిడ విన్లేదు. అంతేగాక, ఈ అర్ధరాత్రి పట్నం వెళ్ళటమూ కష్టమే!'' అన్నాడు మేష్టరు.

అమ్మలు తీక్షణంగా ఆలోచించింది. సర్పంచ్ ముఖంలో భయం తప్పించి ఇంకే భావమూ కనిపించలేదు. అతనిమీద అపనమ్మకం కలగలేదు. ఇలాటప్పుడు అపనమ్మకంతో వెళ్ళటం మానేస్తే రేపేదయినా ఆమెకు ప్రమాదం సంభవిస్తే - దానికి బాధ్యతవహించాల్సిన మాట అటుంచి తననే నమ్ముకున్న అమాయకురాలి ప్రాణం తనవలన పోయిందన్న చెడ్డపేరుతోపాటు, విషాదస్మృతి కలకాలం తనను మాడ్చేస్తుంది. అందుకే వెంటనే ఓ నిర్ణయానికి వచ్చింది. ''ఆమెకిప్పుడు డెలివరీ టయిం కూడా కాదే?'' అంది.

''మేమూ అందుకే తొందరపళ్ళేదు. కానీ అందరూ ఆలోచిస్తే ప్రమాదం అన్నారు. మీకాడికొచ్చినాం'' అని జవాబిచ్చాడు. వెంటనే ఇంట్లోకెళ్ళింది. సెలైన్ బాటిల్సు రెండూ, ఎపిడోసిన్, సెంటోసిన్, మిథమ్జిన్ ఏంపిల్స్ కూడా తీసి పట్టుకుంది. కుట్లు వేయాల్సి వస్తుందేమోనని అందుకు కావలసిన సామాగ్రిని కూడా కిట్‌లో సర్దుకుంది. భర్తకి చెపితే వెళ్ళనివ్వడేమోననుకుని చెప్పకుండా ఏదో డెలివరీ కేసుకని చెప్పి వెళ్ళింది. పెళ్ళిరోజున కూడా సరదాలేక అలా వెళ్ళవలసి వస్తున్నందుకు ఇంట్లో అందరూ ఎంతో బాధపడ్డారు అమ్మలుతప్ప.

సర్పంచ్ మైసూరెడ్లు బండి తీసుకొచ్చాడు. బండి తోలడానికి ముందునించి ఎక్కాడు. మాస్టారు వెనగ్గా కూర్చున్నాడు. అమ్మలు బండి మధ్యలో కూర్చుంది. నాయుడు బండి తోలుతున్నాడు. బండి గాలిలో వెళ్తున్నట్లు వెళ్తుంది. చంద్రుడు డ్యూటీ ముగించుకుని వెళ్ళిపోయాడు. చీకటి దట్టంగా ఉంది. వెళ్తోన్న దారిలో చుట్టూ తోటలే. రాక్షసుని నోట్లోంచి వెళ్తున్నట్లుంది. చింతగీర్లు రొద విపరీతంగా ఉంది. బండి తోలుతున్న సర్పంచ్‌ని చూసింది. ఒకప్పుడయితే కాటు వేయడానికి సిద్ధంగా ఉన్న కోడెనాగులా కనిపించాడు. ఇప్పుడు మంత్రగానిముందు తలూపుతున్న పాములా ఉన్నాడు. రబ్బరుపాములా ఉన్నాడు. అవకాశం మనిషిని ఎంత క్రూరంగా తయారుచేస్తుందో, అవసరం మనిషిని అంతగా వంచేస్తుందని సర్పంచ్‌ని చూస్తే అనిపించింది అమ్మలుకి. సర్పంచ్ కనీసం వెనుదిరిగి చూడటం కూడాలేదు. అతని మనసునిండా ఆందోళనే.

''నొప్పులు ప్రారంభమయి ఎంతసేపయింది?'' అడిగింది.

''రాత్రి సరిగ్గా తినలేదు. ఇరోసనాలు అయినాయని. గంటక్రిందటనుండి ఉండీ ఉడిగీ నొప్పులు ప్రారంభం అయింది'' అన్నాడు

సర్పంచ్. ముందు భయం వేసింది. ఇంకా ఆమె చెప్పినదానిప్రకారం ఎనిమిదోనెల!

మరో పదినిమిషాల్లో బండి సర్పంచ్ వాకిలిలో ఆగింది. ఆమెకాశ్చర్యం వేసింది. తల్చుకుంటేనే భయం కూడా వేసింది. నిన్నమొన్నటివరకూ అతనంటే పట్టపగలు వణికిపోయేది. ఇవాళ అర్ధరాత్రి అతనివెంట బయలుదేరింది. అతనొకవేళ మోసంచేసి దార్లో ఏదయినా చేస్తే తనేం చేయగలిగేది? మాస్టారుమాత్రం సర్పంచ్ దగ్గర భయంచేత నోరు మెదపకపోయి ఉండొచ్చుగా! ఆ ఆలోచన రాగానే చెమటలుక్కిపోయింది. మళ్ళీ అంతలోనే నవ్వు వచ్చింది. ప్రమాదంలో ఉన్నప్పుడు భయం రాలేదు. ప్రమాదం లేదూ అని తెలిసి గట్టున పడినప్పుడు ఆమెను గతం భయపెడుతున్నందుకు నవ్వు వచ్చింది.

"రండి" అని లోనికి తీసుకెళ్ళి "ఎలా ఉంది" అన్నాడు ఆత్రుతగా.

"అలాగే ఉంది" అంది ముసిల్ది. సర్పంచ్ ఇంటినిండా ఆడాళ్ళు. అందరూ అనుకున్నదొకటి జరిగిందింకొకటి. 'అమ్మలుగారు రారు. నాయురాలు బతకదు' అనుకున్నారు. అయితే అమ్మలుని చూసి 'నాయురాలికింక ఫరవాలేదు' అనుకున్నారు. అమ్మలు త్వరగా కిట్ పట్టుకుని లోనికి పరుగుతీసింది. "వచ్చావా తల్లీ! అమ్మో... అమ్మో... నన్ను బతికించమ్మా!" చేతులెత్తి నమస్కరించింది.

చుట్టూ ఉన్న ఆడాళ్ళనందరినీ వెళ్ళిపొమ్మంది. లంగా బొందు తీసి లంగా విప్పేసి వక్కన పడేసింది. చీర తొలగించి కాళ్ళు ఎడంచేసింది. పరిస్థితి బాగానే ఉంది. మరో గంటలో డెలివరీ అవుతుంది అనుకుంది. పల్సు చూసింది. నీరసం కూడా లేదు. బాగానే ఉంది. ఆలోచించి ఎందుకయినా మంచిదని రెండు ఇంజక్షన్లు చేసింది. ఓసారి గది బయటకు వెళ్ళింది. టైము చూసుకుంది. రెండు దాటింది.

"అమ్మలమ్మా! ఎలాగుందమ్మా?" అన్నాడు సర్పంచ్

"ఏం కంగారులేదు. అయితే బిడ్డ ఎదురు కాళ్ళతో పుట్టేటట్టుంది. కుట్లు పడతాయి" అంది. అని మళ్ళీ లోనికెళ్ళింది. నాయురాలు బాధని భరించలేకపోతోంది. మరికొంతసేపటికి ప్రసవం మొదలయింది. ముందుగా కాళ్ళు వచ్చాయి. చుట్టుపక్కల ఉన్న ఆడాళ్ళని పిలిచి చేతులూ కాళ్ళూ గట్టిగా పట్టుకోమంది. వెడల్పుచేసి బిడ్డని జాగ్రత్తగా లాగింది. ఇక తప్పదని కోతపెట్టింది. "మగ పిల్లడే!" అంది.

ఆ వార్త పక్కనే నిలబడ్డ ఒకామె "పెనరంటన్నా! మొగోడే. అబ్బాయేనట. నర్సమ్మ చెప్పింది" అని చెప్పి లోనికి వెళ్ళిపోయింది. మళ్ళీ బిడ్డ పూర్తిగా నేలమీద పడినప్పుడు నాయురాలు అరిచిన అరుపునకు భూమి బీటలు వారుతుందా అనిపించింది. అమ్మలు మనసు తేలికపడింది. అయితే బిడ్డ నేలమీద పడ్డాక రక్తస్రావం ఎక్కువయింది. వెంటనే రక్తస్రావం తగ్గటానికి ఇంజక్షన్ చేసింది.

తెల్లారింది. నాయురాలు క్షేమంగా ఉంది. పక్కలో బిడ్డణ్ణి చూసుకుని మురిసిపోయింది మగతలోనే. మాట నిస్సత్తువగా ఉన్నా "నర్సమ్మేరీ" అడిగింది. బయట వాలుకుర్చీలో కళ్ళు మూసుకుని నడుం వాల్చిన నర్సమ్మని - "అమ్మా! నాయురాలు పిలుస్తంది" అన్నారు.

"ఆమెకు తెలివి వచ్చిందా?" అని లోనికెళ్ళింది.

"ఏమ్మా! నేనన్నట్లే నీకు నా చేతులతో మగబిడ్డని అందించాను. ఇంక ధైర్యంగా ఉండండి" అంది.

"అమ్మా! నల్లని తల్లివి. నువ్వన్నట్లే మాట నెరవేర్చావు. ఇట్టా రామ్మా. వచ్చి కూర్చో. నీ మాట నువ్వు నిలబెట్టుకున్నావ్. నామాట నేను నిలబెట్టుకోవద్దా?" అని ఆమె చేతికున్న రెండు బంగారు గాజులు తీసి పరధ్యానంగా ఉన్న అమ్మలు చేతికి తొడిగింది.

"ఏంటిది? మీకేం పిచ్చా. నా పని ఇది. ఇలాటివి నేను పుచ్చుకోను" అని తీసేస్తుంటే, "అమ్మా! కాదనకు. నా బిడ్డని చూసినప్పుడు నేనెప్పుడూ నిన్నే చూసుకుంటాను. నా గాజులు నీ చేతికి తగిలినప్పుడు నన్ను నువ్వు గుర్తుంచుకోవాలి... కాదనకు" అంది కళ్ళంట నీళ్ళు పెటుకుంటూ.

"ఇలాగైతే నేను రాకపోదును"

"నువ్వు రాకపోతే నేను బతకనని నీకు తెలునుకదా!" అంది నాయురాలు. సర్పంచ్‌ని

పిలిచి, "మీరే బండిలో మల్ల అమ్మగార్ని దిగబెట్టిరండి" అంది. సర్పంచ్ బండిమీద కూర్చున్నాడు. బండి ముందుకు కదిలింది. గంటలో ఇల్లు చేరుకుంది. బండి దిగుతోంటే అమ్మలుతో అన్నాడు సర్పంచ్-

"మీఅంత ధైర్యం ఉన్న ఆడదాన్ని నేనింత వరకూ సూడలేదు. రాత్రి మీరు రారనుకున్నాను. నేనే కాదు అందరూ అలాగే అనుకున్నారు. మీరే రాకపోతే నా పెల్లాం సనిపోయి ఉండేది. తొలిసారిగా పరాయి ఆడాళ్ళలో సెల్లెల్ని చూసిందివాలే!" అని చేతులు జోడించి అతను వెనుదిరిగాడు. జీవితంలో అంత ఆనందాన్ని అనుభవించటం అది రెండోసారి!



సర్పంచ్‌లో వచ్చిన మార్పు అమ్మలులో ఒక నూతనోత్సాహాన్ని తెచ్చింది. వెంటనే వృత్తిలో తనకింత సహనం, పట్టుదల ఉండటానికి కారకురాలయిన కమలమ్మకు ఉత్తరం రాసింది. అప్పుడు గుర్తుకొచ్చింది. రమీజాను కలుసుకొని పరస్పర బదిలీకి అప్లయి చేయించాలనుకుంది. లేదా స్వయంగా డి.ఎమ్.ఓ.గార్ని కలిసి అప్లికేషనయినా ఇవ్వాలనుకుంది. ఆ రాత్రి సరిగ్గా నిద్రలేకపోవటంచేత ఒక్కరోజు విశ్రాంతి తీసుకుని వెళ్ళాలని నిశ్చయించుకుంది. ఇన్నాళ్ళూ రమీజాని మళ్ళీ మరో రొంపిలో దింపటానికి మనసు ఇష్టపడలేదు. ఇప్పుడు ఆ బాధ లేదు. సర్పంచ్ మారాడు కాబట్టి రమీజా గురించి చెప్పి, నాయురాలికి అప్పచెప్పాలనుకుంది. భర్తతో కూడా అదే చెప్పింది. సుదర్శనం సరేనన్నాడు.





సరిగ్గా అదేరోజు -

అమ్మలు రాకకోసం ఎదురుచూసిన రమీజా కబురు పెట్టగానే సాధారణంగా వచ్చేది. ఎందుచేత రాలేదో. వాళ్ళత్తగారిని కూడా చూసి వచ్చినట్లుంటుంది. వెళ్తే బాగుండుననుకొంది. కానీ హాస్పిటలు డ్యూటీ చేసుకొని వచ్చిన రమీజా అలిసిపోయింది. ఎక్కడకీ కదలాలనిపించలేదు. అలానే మంచంమీద వాలిపోయింది.

తను డైరీలో రాసుకున్న విషయాలు చదువుకొందోసారి! కమాలుద్దీన్ పరిచయం అయిన తొలిరోజులలో కొన్ని పేజీలు. 'కమాలుద్దీన్ వచ్చాడు. చాలా సేపు కూర్చున్నాడు. అతనేమిటో చెప్పాలనుకుంటున్నాడు. చెప్పలేకపోతున్నాడు. అతన్ని చూస్తుంటే ఎందుకో మళ్ళీ మళ్ళీ మాట్లాడాలనిపిస్తోంది. ఆ వంకీల జుట్టు, ముఖంమీద పడుతున్న ఆ ముంగురులూ అతని అందాన్ని ద్విగుణీకృతం చేస్తున్నాయి. మనిషి మాటలు కూడా వినాలనిపిస్తున్నాయి. అతను మాట్లాడుతుంటే ఎన్నడూ లేనిది తనలో ఒకవిధమైన సంగీతం మొదలయింది. బహుశః ప్రేమంటే ఇదేనేమో! కానీ మోటారు కులంవాడు కావటంచేతనో, ఆ కండక్టరు వాలకంచేతనో కొంచెం మొరటుదనం కనిపిస్తోంది. మళ్ళీ వస్తానన్నాడు. శీఫిన్ చేయమంటే చేయకుండా వెళ్ళిపోయాడు. బాధనిపించింది. అసలు తనకెందుకంత బాధ? అతనెవరు? అతనితో తనకెందుకు పరిచయం? పరిచయం పెంచుకోవటంకంటే తగ్గించుకోవటం మంచిది'

పేజీ తిరగేసింది.

'ఇన్నాళ్ళూ తన మనసులో చోటుచేసుకున్న మగాడు ఎవరూ లేరు. కమాలుద్దీన్ రాత్రి కలలోకి వచ్చాడు. కమాలుద్దీన్‌తో కలసి ఎక్కడికో చాలా దూరప్రాంతం వెళ్తాంట. అంతలోనే నడుస్తూన్న జనం, బస్సులూ, ట్రాఫిక్కూ మాయమయిపోయాయి. అలలతో ముందుకురికి వస్తోన్న సముద్రం. సముద్రం దగ్గర ఇసుకలో తను కూర్చుంది. చేత్తో ఇసుకని వేళ్ళసందుల్లోంచి వదుల్తోంది. కమాలుద్దీన్ తన వళ్ళో తల పెట్టుకుని మత్తుగా తన కళ్ళలోకి చూస్తున్నాడు. 'ఏయ్! ఏంటి కొరికేస్తున్నట్లు ఆ చూపు?' అంటోంది తను. కొరికేయాలని కాదు. జుర్రేయాలనిపిస్తోంది. నీ కళ్ళు కమలాలలో

తుమ్మెదనైపోవాలనిపిస్తోంది. నీ ముఖపద్మం ముడుచుకుంటే అందులో ఇమిడిపోవాలని ఉంది?' అని అతనంటున్నాడు.

'ఏయ్! ఎక్కడ్నుంచి ఊరిపోతోందీకవిత్వం?' అంటోంది తను.

"నిన్ను చూస్తే కవినేకాదు. శిల్పిని, చిత్రకారుణ్ణి కూడా అయిపోతాను" అంటున్నాతడు. ఇంతలో గోడగడియారం మ్యూజిక్ విని పించింది. కల చెదిరింది. టైం చూశాను. నాలుగయింది. ఎంతకీ నిద్రపట్టలేదు. నాలుగప్పుడొచ్చిన కలలు నిజమవుతాయంటారు. అసలు కలలకు అర్థం ఉందా? మనిషి ఊహించుకున్న ఊహలే కలలవుతాయి. కొన్ని సంఘటనలు అసలెప్పుడూ ఊహామాత్రంగా కూడా మనసులోకి రావు. సముద్రం, సెలయేరు, ప్రవాహం ఇవి కలలోకి వస్తే మనసులో అణగారి ఉన్న సెక్సు కోరికలకు ప్రతీకలు అని ఎక్కడో చదివాను.

ఇంకో పేజీలో...

'ఇవాళ కమాలుద్దీన్ వచ్చాడు. అతను రాగానే మనసు గాలిలో గువ్వలా అయిపోయింది. దూదిపింజలా అయిపోయింది. 'ఇన్నిరోజులుగా నన్ను చూస్తున్నారు. మాట్లాడుతున్నారు. మీలో ఏ భావం కలుగలేదా?' అతనడిగినప్పుడు తను లేదనవలసింది. 'మీరూ చూస్తున్నారుకదా? మీకేం అనిపించలేదా?' అనటం కొంత పొరపాటే. మగాడికి అవకాశం దొరకాలేగాని, ఊరుకుంటాడా? అతను గబుక్కున 'నాకేం అనిపిస్తోందో చెప్పనా?' అని నన్ను నుదిటిమీద చుంబించాడు. నేను ప్రతిఘటించకపోవటం పొరపాటు. ఎందుకు ప్రతిఘటించలేకపోయాను? అతనిలో ఏ అయస్కాంత తత్వం నన్ను అతనివేపు లాగింది? అతనెళ్ళాక నామీద నాకే అసహ్యం వేసింది. ఆడది లొంగనంతవరకూ ఒకలాగ ఉంటాడు. లొంగిన తరువాత వేరొకలాగా ఉంటాడు. ఏంటో? నేను చేస్తోన్న పని మంచో చెడో నాకే తెలీటంలేదు. అమ్మలుకి చెప్తే తిట్టిపోస్తుంది!'

తేనెలూరిన మనసులోంచి మంటలు లేస్తుంటే మరో పేజీ తిప్పింది.

పదకొండు గంటలవుతుంది. తలుపు చప్పుడయింది. ఎవరో హాస్పిటలుకు రమ్మని కబురేమో అనుకున్నాను. చూద్దునుగదా! కమాలుద్దీన్! ఒక్క నిమిషం తటపటాయించాను. 'ఏంటీ అర్థరాత్రి ఇలా వచ్చారు?' అన్నాను. బస్సు ఇప్పుడే వచ్చింది. డ్రైవరు బస్సులో పడుకుంటానన్నాడు. హొటలు కెళ్తే కట్టేశాడు. ఆకలిగా ఉంది. ఇలా వచ్చేశాను. రావటం తప్పనుకుంటే వెళ్ళిపోతాను' అలాగన్నప్పుడు ఊరుకోలేకపోయాను. చూస్తూ, చూస్తూ ఒక పరిచిత వ్యక్తి ఇంటికి వస్తే ఆకలితో పంపటం ఏం బాగుంటుంది. 'అతిథి దేవోభవ!' అన్నారుకదా! అందుకే గబగబా అందుబాటులో ఉన్న ఆంధ్రుల అర్జంటు తయారీ టిఫిన్ ఉప్మా చేసి పెట్టాను. నచ్చినవాళ్ళు చేస్తే ఉప్పు ఎక్కువయినా, కారం ఎక్కువయినా అది అమృతోపమానమే. అమృత సమానమే. అతడు తెగ మెచ్చేసుకుంటే అలాగే అనుకున్నాను. టిఫిన్ చేసి కబుర్లు మొదలెట్టాడు. లైట్లారిపోయాయి. కుక్కలరుస్తున్నాయి. అతను కదల్లేదు. వెళ్ళమంటే బాగుండదేమోనని నిద్ర వస్తోంది. మీరేం చేస్తారు? అన్నాను.

"ఏం చెయ్యమంటారు? పొమ్మంటే పోతాను" అన్నాడు. నేనేం జవాబివ్వలేదు. అతను చీకట్లో దగ్గరయ్యాడు. ఏమిటేమిటో చేస్తున్నాడు. బాగుండదు. వెళ్ళిపొండి అన్నాను. అతన్నామాట విన్లేదు. "మిమ్మల్నే... వెళ్ళిపొండి" విడిపించుకోడానికి ప్రయత్నించినా అతను వదల్లేదు. ఆక్రమించేశాడు నన్ను. హరించేశాడు నన్ను. వెక్కి వెక్కి ఏడ్చాను. నన్నోదార్చాడు. కాళ్ళు పట్టుకుని బతిమాలాడాడు క్షమించమని. "వెళ్ళిపొండి. ఇక్కణ్నుంచి వెళ్ళిపొండి. మీరెప్పుడూ రావద్దు" అన్నాను.

అతను మవునంగా వెళ్ళిపోయాడు.

మనసు ఊగిపోయింది. తనువు చలించిపోయింది.

"వెధవ... నంగనాచి వెధవ. వాడు పెద్ద ప్రయత్నంలోనే వచ్చాడు. తను తెలుసుకోలేకపోయింది. అలాటి వెధవని చంపేసి చచ్చిపోతే లోకానికి కొంత మేలయినా జరుగుతుంది" పళ్ళు పటపటా కొరికింది. డైరీ మూసి దూరంగా విసిరేసింది. ఏడ్చింది. జుట్టు పీక్కుంది. అలానే స్తబ్దుగా ఉండిపోయింది. వెళ్ళి డైరీ చేతుల్లోకి తీసుకుంది.

పేజీలు లయబద్ధంగా తిరగేసింది.

ఒక పేజీలో-

"కమాలుద్దీన్ వచ్చాడు భయపడుతూ. నేనూ అతని రాకకోసమే చూస్తున్నాను. నేను తిడతానేమో అనుకున్నట్లుంది. నానుంచి భయపడకండి. నేనెక్కువసేపుండను. వెళ్ళిపోతాను. ఒక్క విషయం చెప్పటానికి వచ్చాను. మీరంగీకరిస్తే పెళ్ళి చేసుకుంటాను. కానీ ఆర్భాటాలు నాకిష్టపడవు. రహస్యంగా రిజిస్ట్రార్ ఆఫీసులో జరిగిపోవాలి పెళ్ళి!" అన్నాడు. మనసులో మధురమైన ఊహలు నెమలి నాట్యంచేశాయి. కనీసం అమ్మలుకైనా చెప్పక పోతే ఎలా? అతను వినలేదు. ఆ మర్నాడే సెలవుపెట్టి కాకినాడ తీసుకుపోయాడు. పెళ్ళి జరిగిపోయింది. రెండురోజులు భార్య జీవితాన్ని గడిపి తిరిగి వచ్చాం! ఈ రెండురోజులూ ఎంత ఆనందంగా గడిచిపోయాయో!

వారంరోజులు రాయవలసిన డైరీని ఒకే రోజు రాసుకున్న పేజీ అది.

చదువుతున్నంతసేపూ పూలపల్లకిలో విహరిస్తున్నట్లుంది. ముగించాకా అగ్నిగుండంలో దొర్లుతున్నట్లనిపించింది.

ఎందుకో కలకత్తాలో గడిపిన పేజీలు తిప్పింది.

ఆ పేజీలు చదువుతుంటే ఆనందనందనంలో విహరిస్తున్నట్లు, ఆకాశగంగలో హంసలా ఈదుతున్నట్లు అనిపించింది. అమ్మమ్మ, తాతయ్యలు చూపిన ఆదరణలు మనసును పులకింపచేసింది అప్పుడు రమీజాలో రకరకాలయిన ఆలోచనలు.

అమ్మలుతో పరస్పర బదిలీ తీసుకుంటే డాక్టరు బాధ తప్పిపోతోంది. లేకపోతే ఈ రాక్షస కౌగిలిలో మళ్ళీ నలిగిపోవాల్సిన రోజు వస్తుంది. ఆరోజు మళ్ళీ వస్తే... అమ్మో! వద్దు. ఆరోజు మళ్ళీ రారాదు. కానీ ఇక్కడే ఉంటే - ఇక్కడే ఉంటే ఈ ప్రాంతంలో ఎక్కడున్నా అతను ఆకాశంలో ఎగిరే గద్ద భూమిమీద ఆడుకుంటోన్న కోడిపిల్లను తన్నుకుపోయినట్లు తన్నుకుపోతాడు. ఇంక ఇక్కడుండి ప్రయోజనం లేదు. కలకత్తా వెళ్లిపోతే తన ప్రాణానికి హాయిగా ఉంటుంది. వెన్నెల చల్లదనంలో విహరించినట్లుంటుంది. అమ్మమ్మ కూడా ఆనందంలో తేలియాడుతుంది. అక్కడైతే తన నెవరూ కింద కాలయినా మోపనివ్వరు!

అమ్మలు ఏమంటుందో?

లేక - కొన్నాళ్ళు సెలవు పెట్టేస్తే బాగుంటుందేమో?

వాళ్ళకి కమాలుద్దీన్ సంగతి తెలిస్తేమాత్రం పేగులు తెగినట్లు ఏడుస్తారు? వాళ్ళకి చెప్పి బాధించకూడదు. 'నీ సంతోషాన్ని ఇతరులకు పంచు. నీ బాధనిమాత్రం నీలోనే అణగార్చుకో!' అన్న కొటేషన్ ఎక్కడ చదివిందో ఆమెకు గుర్తులేదు. కానీ అక్షరాలా ఆ మాటలని ఆచరించాలనుకుంది. మనసును అధీనంలోనికి తెచ్చుకుంది. స్థిమితపరచుకుంది. అమ్మలులాగా కష్టానికి కృంగిపోక, సుఖాలకి పొంగిపోని తత్వాన్ని అలవర్చుకోవాలనుకుంది.

అమ్మలు గుర్తుకొచ్చేసరికి ముచ్చటేసింది.

ఎంత కాదనుకున్నా వంశపారంపర్య లక్షణాలు తప్పక వస్తాయి. తన తల్లి తొందరపాటుతోనే జీవితాన్ని మాడ్చుకుంది. తనూ తొందరపాటుతనంతోనే మంటల్లో పడింది. మాడిపోకుండా బయటపడాలి!

ఇన్నాళ్ళూ శ్లేష్మంలో పడిన ఈగలా గింజుకుంది.

కానీ-

మంటల్లో పడిన శలభం మాత్రం కాకూడదు అనుకొంది! విశాఖపట్నంనుండి 'నజ్మా' ఆమెతల్లీ వచ్చి వెళ్ళిన తరువాత ఒక్కసారే వచ్చాడు కమాలుద్దీన్. వచ్చినపుడు పెద్దపాట్లాంతో మల్లెపువ్వులూ, స్వీట్లూ పట్టుకొచ్చాడు. ఇంట్లోకి వస్తుంటే, "ఎవరికోసం వస్తున్నారిక్కడకి? మర్యాదగా వెళ్ళండి" అరిచింది రమీజా.

"ఇంకా కోపం పోలేదా?"

"కోపం పోయేటంత చిన్న తప్పుకాదు మీరు చేసింది"

"సరే, వెళ్తాను. నా మాట కూడా కొద్దిగా వింటే, నేను చెప్పదలచుకున్నది చెప్పి వెళ్తాను" అన్నాడు. అని, రమీజా కూర్చోమనకుండానే ఆమె పక్కన వచ్చి కూర్చున్నాడు. అతను వచ్చి కూర్చున్నపుడు గొంగళిపురుగు మీద పడినట్లయిందామెకు. చివాలున లేచింది. అతను చెయ్యి పట్టుకున్నాడు. "వద





లండి. నన్ను వదలండి. 'రజ్జు సర్పభ్రాంతి' అంటారు మనవాళ్ళు. కానీ నేను పామును తాడనుకొని భ్రమపడ్డాను. దాని నైజం అది చూపెట్టుకుంది. మీ సంజాయిషీలు, సమాధానాలు వినే ఓపిక నాకు లేదింక. నేను దిగినది పన్నీటి వాహిని అనుకున్నాను. కానీ మున్నీటి సుడిలో అనుకోలేదు. ఉద్యోగం ఎలాటిదయినా, ప్రేమించే హృదయపు పొందులో జీవితం ఆనందమయం చేసుకోవాలనుకున్నాను. కానీ విష సముద్రంలో ఊపిరాడక కొట్టుకుంటాననుకోలేదు. నన్నిలా బ్రతకనివ్వండి. నా బాధ నేను పడతాను'' అని రోదించింది.

''నేనేం చెప్పినా నువ్వు వినేస్థితిలో లేవు. నేనెందుకు నీకీవిషయాలు చెప్పలేదో కూడా చెప్పాలనుకున్నాను. చెప్పదలచుకున్న విషయాలు వినకపోతే నష్టపోయేది నువ్వే'' అన్నాడు. ఆ మాటలకి రమీజా మరీ రెచ్చిపోయింది.

''నేనిప్పుడు కొత్తగా నష్టపోయిందేమీ లేదు. ఇంకా నష్టపోకుండా ఉండాలన్నదే నా కోరిక. ఇంకా మాడిపోకుండా ఉండాలన్నదే నా అభిమతం. ఇంకా మసైపోకుండా తప్పుకోవాలన్నదే నా నిర్ణయం. వెళ్ళండి'' అంది రమీజా.

అతను వెళ్ళలేదు. కదలక, మెదలక కూర్చున్నాడు.

కళ్ళొత్తుకున్నాడు. రమీజా కరిగిపోలేదు. అసహ్యించుకుంది. ''ఛీ, సిగ్గులేదూ ఏడవటానికి. మీకు జరిగిన అన్యాయం ఏముంది? ఏడవటానికి?'' అంది. దాన్ని ఆసరాగా తీసుకున్నాడు. ఉపోద్ఘాతం మొదలెట్టాడు.

''నువ్వు నన్ను నిజంగా ప్రేమించావనుకున్నాను. కానీ నీది హృదయపూర్వక ప్రేమకాదని తెలుసుకున్నాను. నీకో భర్త కావాలి. ఒక మగ దక్షత కావాలి. అందుకే నేను స్వాగతం పలకగానే కాదనలేకపోయావు. ప్రేమించే హృదయం అయితే 'హత్య'చేసినా హత్యచేయడానికి దారితీసిన పరిస్థితుల గురించి అన్వేషించేదానివి. ముస్లిం సాంప్రదాయం ప్రకారం మగాడు ఎందరినయినా పెళ్ళిచేసుకోవచ్చు'' అంటూండగానే...

''ఇలా వంచనతోనా?'' అడిగింది.

''కాదు. కానీ నేను వంచన చెయ్యలేదు. నీకో నిజం చెప్తున్నాను. నేను 'నజ్మా'ని పెళ్ళిచేసుకోలేదు. 'నజ్మా' కోర్టుకెళ్ళినా చెల్లదు. అధికారికంగా పెళ్ళిచేసుకున్నది నిన్నే. ఆమె నన్ను వంచనచేసింది. నేను వాళ్ళింట్లో అద్దెకున్నాను కొన్నాళ్ళు. వాళ్లింట్లో పేయింగ్ గెస్టుగా ఉన్నాను. ఆ ముసిల్ది రాక్షసి. పిశాచి. గొప్ప మాయావి. నమ్మకద్రోహం చేసింది. నమ్మించి నన్ను గోతిలోకి దింపింది. 'తమ్ముడూ, తమ్ముడూ!' అని పిలిచేది. ఒకరోజు అది 'నా భర్తకి సీరియస్‌గా ఉంది. కబురొచ్చింది. వెళ్ళాలి. నజ్మా ఒకర్తే ఉంటుంది. అమాయకురాలు. పక్కవాళ్ళ పిల్లసాయంగా వస్తుంది. పడుకుంటుంది. నువ్వు కూడా ఇంటిపట్టున ఉండు తమ్ముడూ! తెల్లారితే వచ్చేస్తాను' అని చెప్పి వెళ్ళింది. వెళ్ళిన మనిషి మూడు రోజులు తరువాత వచ్చింది. ఈలోగా జరగకూడనివి అన్నీ జరిగిపోయాయి. పక్కవాళ్ళపిల్ల పడుకోడానికి రాలేదు ఒంట్లో బాగా లేదని. ఏమాటకామాటే చెప్పుకోవాలి. నజ్మా స్ఫురద్రూపి. ముచ్చటగా అలంకరించుకుంది. ఒంటరితనం ఎలాటివాళ్ళకైనా చెడుకోరికలను రేపుతుంది. 'అబ్బ. నజ్మా ఎంత అందంగా ఉన్నావో!' అని దగ్గరకి తీసుకున్నాను. ముద్దుపెట్టుకున్నాను. నజ్మా అభ్యంతరం చెప్పలేదు. ఆమె అభ్యంతరం చెప్పి ఉంటే నేనంత ధైర్యంచేయలేనేమో మరి!

తరువాత ఆమె వచ్చింది - అంటే వాళ్ళమ్మ.

'నువ్వేదో మంచివాడివి. బుద్ధిమంతుడివి అనినమ్మి వెళ్ళినందుకు మంచిపని చేసావ్. నా కూతురి బ్రతుకు ఇలా పాడుచేస్తావా? నీ అంతం చూస్తాను' అని నోరు పారేసుకుంది.

నలుగురూ చేరితే నవ్వులాటకి దారితీస్తుందని ''నీకేం భయంలేదు. నేను పెళ్ళిచేసుకుంటాను. ఇవాళ్టినుండి నజ్మా నా భార్య'' అన్నాను.

అనగానే ముసిల్ది - ''తల్లిగా నా బాధవల్ల నేనలా అన్నాను. చిన్నవాడివయినా నీ చేతులు పట్టుకుంటున్నాను. నన్ను మన్నించు'' అంది.

నాకు దాన్ని చూస్తే జడలు విప్పుకున్న దెయ్యంలా కనిపించింది. రోత పుట్టింది. జుగుప్స కలిగింది. దాని మాట వినదలచుకోలేదు.

నజ్మా మౌనమందారంలా ఉండిపోయింది. కర్పూరపు బొమ్మలాగా కరిగిపోయింది. నా చేతిలో గువ్వలా వాలిపోయింది. నా పాదాలను కళ్ళకద్దుకుంది.

అయితే- నేనెంత మోసపోయానో తరువాత తెలిసింది.

అప్పటికే నజ్మాకి అయిదోనెల!

నేను 'నజ్మా'ను ముట్టుకుని మూణ్ణెల్లే అయింది. 'నజ్మా'ని అప్పుడే ఎవరో మోసం చేసారు. అందుకే నన్ను బుట్టలోవేసి, నా మీద, వలవన్ని తను కేంపెళ్ళింది. 'నజ్మా'ను గట్టిగా అడిగాను. నిజం చెప్పేసింది. అయితే ముసిల్ది గొప్ప తెలివైంది. నావల్లనే నజ్మా గర్భవతయిందని అందరికీ చాటింది. నేనా ఇంట్లో దిగి ఆరు మాసాలు అవటంచేత నేను నిజం చెప్పినా ఎవరూ వినరు, నమ్మరు. అందుకే కిమ్మనక ఊరుకుండిపోయాను. తరువాత ఇద్దరు పిల్లల తండ్రినయాను. అయిన వాళ్ళకి దూరమయాను. మోసపోయిన మనసు దెబ్బతీయటానికి వెనుకాడలేదు. విచిత్ర పరిస్థితుల్లో నువ్వు కలిసావు. తరువాత జరిగిన కథ నీకు తెలును" అన్నాడు కళ్ళొత్తుకుంటూ.

"నాకు ముందే ఎందుకు చెప్పలేదు?"

"అది నాస్వార్థం. నీవు దూరం అయిపోతావేమోనన్న భయం" అన్నాడు.

"మీ భయానికి నన్ను బలిపశువును చేసారన్నమాట" అనేసి "ఇది మరోకట్టుకథకాదని నమ్మకం ఏమిటి?" అన్నది రమీజా.

అతను సీరియస్‌గా చూశాడు. ఆ చూపుల్లో ఉన్నది ఏభావం అని ఆమె వెతకలేదు.

"ఇన్నిసార్లు అబద్ధం చెప్పి, నీతో కాపురం చేయటం ఎంత కష్టమో నాకు తెలును?"

అనేసి "నేనో నిర్ణయానికి వచ్చాను. నజ్మావల్ల నీకేం ప్రమాదం ఉండదు. ఒకవేళ నజ్మాతో ఉండటం నీకిష్టం లేకపోతే ఆమెకి డైవోర్సు ఇస్తాను. నిర్ణయం నీకే వదిలేసాను. కానీ- నన్నుమాత్రం దూరంచేసుకోవద్దని నిన్ను ప్రార్థిస్తున్నాను. ఈ రాత్రి నిన్ను ప్రశాంతంగా ఉండి ఆలోచించుకోడానికి వీలుగా నేను వెళ్ళిపోతున్నాను. మళ్ళీ వారం రోజుల తరువాత వస్తాను" అని అతను కదిలాడు.

'ఇప్పుడెక్కడకి వెళ్తారు?' అడగాలనుకున్న మాట గొంతులో ఉండిపోయింది. అదే మంచిదయిందేమో అనిపించింది తరువాత. ఆ తరువాత ఆ రాత్రి అంతా రమీజాకి నిద్రపట్టలేదు. అంత అమాయకంగా కనిపించిన నజ్మాలో ఇంత కథ దాగిఉందా? అతను చెప్పినదాన్లోకూడా నజ్మాకు వ్యతిరేకంగా ఏం చేప్పలేదు. ముసలిదాని మోసమేనా ఇది? నిజమేనేమో! ముసలిదాని తీరు, పొగరు, దాని రూపూ చూస్తే ఎంతటి తెగింపుకైనా సిద్ధమయిన మనిషిలానే ఉంది.

కానీ-

నజ్మా చెప్పిందేమాట. తనని పెళ్ళి చేసుకోకముందో, తరువాతనోగాని కమాలుద్దీన్‌కు కొంతమందితో సంబంధాలుండేవని, అవి పెళ్ళి వరకూ ఎదగలేదని! ఆమె అబద్ధం ఆడాల్సిన మనిషిలా కనిపించటంలేదు! తనను నమ్మించటానికి కమాలుద్దీన్ పన్నిన మరో పన్నాగమే ఏమో!

మరి ఈరోజు తన్ను ఆలోచించుకోమని వెళ్ళాడే?

ఈ అర్థరాత్రి ఎక్కడకి వెళ్తున్నట్లు?

అమ్మలు వస్తే ఈ సమస్యలకి ఒక పరిష్కారం కుదిరేదేమో! కానీ తను కబురు చేయలేదు? చేస్తే? మళ్ళీ మనసులో రకరకాల ఆలోచనలు! అమ్మలును తీసుకెళ్ళి విశాఖపట్నం వాళ్ళింటికెళ్తే? పాపం! తనే అత్తగారి అనారోగ్యంతో ఖాళీలేక సతమతమవుతోందని తెలిసింది! మళ్ళీ తననెందుకు బాధపెట్టడం?

చాలాసేపు తనేనిర్ణయానికీ రాలేకపోయింది!

అప్పుడు సరిగ్గా నాలుగయింది.

విశాఖపట్నానికి మరో గంటలో బస్సు ఉంటుంది.

కమాలుద్దీన్ కూడా ఇంటికి వెళ్ళడేమో!

వెళ్లకపోతేనే మంచిది. నిజాలన్నీ బయటపడతాయి.

ఒకవేళ అతను చెప్పిందే నిజమయితే!

ఏమయినా, నజ్మాకి తనవలన అన్యాయం జరక్కూడదు. తనకి ఉద్యోగం ఉంది. తనను





పువ్వుల్లో పెట్టి చూసుకునే పెద్ద కుటుంబం, ఆత్మీయులూ ఉన్నారు. తనెలాగయినా జీవించగలదు! కానీ - నజ్మామాత్రం కమాలుద్దీన్ వదిలేస్తే బతకలేదు ఆర్థికభారంతో.

ఒకవేళ-

నజ్మాని వదిలిపెట్టి, తనతోమాత్రం జీవితాంతం ఉంటాడని గ్యారంటీ ఏమిటి? ఇంకో మంచి ఆడది, అందమైనది తారసపడితే? మగవాళ్ళు నూతన ప్రియులు. నిజాలు తెలీకుండా నిర్ణయాలు తీసుకోకూడదు. మరోసారి గోతిలో పడిపోకూడదు. ఆలోచనలు ఇంకా అల్లుకుపోతుంటే ఒక నిర్ణయానికి వచ్చి లేచింది. త్వరగా తయారయింది. బస్సుకు బయలుదేరింది. బయలుదేరినప్పుడు అనిపించింది - కండక్టర్ కమాలుద్దీన్ అయితే? అని.

నిజం చెప్పేయ్యాలి!

విశాఖపట్నం మీతో వచ్చి ముఖస్థంగా అన్నీ తేల్చుకుందామనుకుంటున్నానని.

కానీ ఆమె అనుకున్నట్టు కమాలుద్దీన్ లేడు. ఆ కండక్టర్ కూడా తెలీని ముఖమే! బతుకు జీవుడా! అనుకుంది. ఎనిమిదో గంటకల్లా విశాఖపట్నం చేరుకుంది బస్సు. గాజువాక వెళ్ళటానికి సిటీబస్సు రెడీగా ఉంది. ఎక్కిపోయింది. గాజువాకలో దిగింది. ఇల్లు కనుక్కోవటం కష్టమనిపించలేదు. వెతకపోయిన తీగ కాళ్ళకు తగిలినట్లు నజ్మా వీధిగుమ్మంలో నిలబడి పరధ్యానంగా ఎటో చూస్తోంది. రమీజా కొన్ని గజాలదూరంలో ఉందనగా గుమ్మం దిగి వచ్చింది. 'రండి - ఇంట్లోకి' అంది.

రమీజా ఇంట్లోకి నడిచింది.

పాప ఆడుకుంటోంది. బొద్దుగా, ముద్దుగా ఉంది. జుట్టు ఒత్తుగా ఉంది. తెల్లగా ఉంది. కళ్ళు నిర్మలంగా స్వచ్ఛంగా ఉన్నాయి. ద్వేషానికతీతమైన ప్రేమ మననునిండా వ్యాపిస్తే మనసులో ఉన్న బాధలన్నీ మరిచి ఆ పాపని ఎత్తుకుని ముద్దాడింది తనివితీరా. నజ్మా ఇంట్లోకెళ్ళి టీ తెచ్చింది కప్పుతో. తాగింది రమీజా.

"ఆయనింట్లో లేరు" అంది కమాలుద్దీన్ కోసమే వచ్చిందేమోననుకుని.

"తెలుసు. నేను మీకోసమే వచ్చాను. మీతోనే మాట్లాడాలి!" అంది రమీజా.

ఇంతలో అరవయ్యేళ్ళ ముసలాయన వచ్చాడు. గడ్డం పండిఉంది. కళ్ళు లోతుగా ఉన్నాయి. నీరసంగా ఉన్నాడు. ముసలాడైతే కమాలుద్దీన్ ఇలాగే ఉంటాడనుకుంది. అలాగనుకున్నప్పుడు అనిపించింది - అతను కమాలుద్దీన్ తండ్రేమోనని! అతను దగ్గరకు వచ్చాడు. "ఎవరమ్మా నువ్వు?" అని అడిగాడు. రమీజా అతని ప్రశ్నకు జవాబివ్వక "మీరు కమాలుద్దీన్ తండ్రిగారా?" అంది. ఔనన్నట్లు తలూపి "నీవెవరమ్మా?" అన్నాడు.

ఆమె ఏం చెప్పగలదు?

'కోడలనా? కమాలుద్దీన్‌చే వంచింపబడిందనా?' ఘర్షణ పడుతోంది ఆమె. "నేనొక విధివంచితురాలిని. మీరు నాతో సహకరిస్తే కొన్ని నిజాలు తెలుసుకోవాలని వచ్చాను" అంది. ఏమిటన్నట్లు చూశాడతను.

కొంచెం తడబడింది రమీజా. ఇంతలో నజ్మా రమీజాని మామగారికి పరిచయం చేసింది.

"రండి. ఇంట్లోకి రండి" అంది నజ్మా.

ఇంట్లోకి వెళ్ళాక - "తాపీగా మాట్లాడుకోవచ్చు: ముఖం కడుక్కోండి" అంది. "వద్దులెండి. నేను చాలా తొందరగా తిరిగి వెళ్ళాలి" అంది. "ఇప్పుడేం వీల్లేదు. రేపు వెళ్దురుగాని. మా అమ్మ మీతో ఆవిధంగా ప్రవర్తించినందుకు ఇంకొకరయితే మీ ఇంటి గుమ్మం తొక్కనిచ్చేవారు కాదు. కానీ ఆ రాత్రి మీరు చూపిన ఆదరాభిమానాలు నా గాయాన్ని పూర్తిగా మాన్పేశాయి. మా అమ్మ తరుపున క్షమార్పణలు కోరుకుంటున్నాను" అంది. ఆ ముఖం ఎంత అందమైనది? అనిపించింది రమీజాకి.

"ఆ స్థితిలో ఏ తల్లిమనసైనా ఆవిధంగానే ఘోషిస్తుంది. ఇంతకీ మీ అమ్మగారు లేరా?" అడిగింది రమీజా. బజారుకెళ్ళిందని జవాబు చెప్పింది నజ్మా. "మీ అత్తగారు లేరా?" అడిగింది. "అత్తగారు కూతురుదగ్గరకెళ్ళారు" అంది నజ్మా. కమాలుద్దీన్ తండ్రి కుర్చీలో కూలబడ్డాడు. అతన్ని చూస్తూ అడిగింది - "నజ్మాగారిని కమాలుద్దీన్ స్వనిర్ణయంమీద పెళ్ళిచేసుకున్నారా? మీరే పెళ్ళి జరి

పించారా?'' అని. అతనామె కళ్ళలోకి చూశాడు. "మీకు వాడేం చెప్పాడనలు?'' అనడిగాడు.

"చూడండి. మీరు పెద్దవారు. నిజం తెలుసుకోవాలని వచ్చాను నేను. నన్ను ప్రశ్నించినానుండి తెలుసుకోవాలంటే నిజం చెపుతాను మీరూ నిజం చెపుతారని భావిస్తున్నాను. నజ్మాని పెళ్ళి చేసుకోలేదని - ఒక పొరపాటు జరిగిన కారణంగా ఆమెతో ఉండిపోవాల్సి వచ్చిందని అతను చెప్పాడు. అని కమాలుద్దీన్ చెప్పిన కథ చెప్పింది. ముసలాయన కళ్ళు తుడుచుకున్నాడు. నజ్మా మొణుకుల్లో తల దూర్చుకుని ఏడ్వసాగింది.

"ఆ వెధవ నా కొడుకని చెప్పుకోవడానికి సిగ్గేస్తోందమ్మా. వాడు చెప్పిందంతా అబద్ధం. వాడు నజ్మాకి డైవోర్సు ఇచ్చేసినా దానికి నష్టమేంలేదు. అది దేవత. నేను వెతికి వెతికి వాళ్ళ కుటుంబ గౌరవాలు తెల్సుకుని ఈ సంబంధం చేశాను. నజ్మా తండ్రి చాలా పెద్దమనిషి. అతని మొదటి భార్య చనిపోయింది. ఆమె కూతురీవిడ. తరువాత కూతురుమీద మమకారంతో ఆయన మళ్ళీ పెళ్ళిచేసుకోలేదు. వాళ్ళింట పనిచేస్తున్న మనిషే ఈమెను పెంచి పెద్దచేసింది. అందుకే నజ్మా ఆమెను అమ్మా అనే పిలుస్తుంది. మాట మోటుగా కనిపించినా నజ్మామీద ఈగవాల్తే సహించలేదు. నజ్మాకి మా సంబంధం కుదరటానికి కారణం ఆమే. వాడెందుకంత అబద్ధం చెప్తున్నాడో నాకర్థంకావటంలేదు. నేను ముస్లింనే అయినా ఏకపత్నీవ్రతునిగానే ఉన్నానిన్నాళ్ళూ. ఒక్కగానొక్క కొడుకుని కొడుకనే మోహంతో వాడెన్ని వెధవ పనులు చేస్తున్నా సహించానిన్నాళ్ళూ! కానీ మిమ్మల్నీ వాడూ మాయమాటలతో మోసగించాడని తెలిసి నానా చీవాట్లూ పెట్టాను. అందుకే ఇంటికి సరిగ్గా రావటంలేదు. మీకు జరిగిన అన్యాయాన్ని విని నేను చలించిపోయాను. ఆ క్షణంలో వాడుంటే ఆ కోపంలో ఏం చేసేవాడినో'' అన్నాడు.

నజ్మా ఏడుస్తూనేఉంది శోకదేవతలా.

"లెండి... ఏడిచి ప్రయోజనం ఏముంది? ఏదోరకంగా ఇద్దరం మోసపోయాము. అతని మాటలు నిజమనే నమ్మాను. మిమ్మల్ని చూశాక అతని మాటలు నమ్మాలనిపించలేదు. అందుకే స్వయంగా అన్ని విషయాలూ తెల్సుకుందామని వచ్చాను. నావల్ల మీ జీవితానికే ప్రమాదం ఉండదు. కమాలుద్దీన్‌కు విడాకులివ్వదలచుకున్నాను. అంతేకాదు, మీకెప్పుడేరకంగా ముఖ్యంగా ఆర్థికంగా సహాయం కావాలన్నా నిర్మొహమాటంగా రండి'' అని లేచింది రమీజా. భోజనం చేసి వెళ్ళాల్సిందిగా నజ్మా ఎంత బ్రతిమిలాడినా వినకుండా బయలుదేరిపోయింది రమీజా.

ఆ తరువాత కమాలుద్దీన్ మళ్ళీ ఇంతవరకూ రాలేదు. బహుశః తను విశాఖపట్నం వెళ్ళిన సంగతి తెలిసిపోయి ఉంటుంది. ఇంకా ఏముఖం పెట్టుకుని రాగలడు? అనుకుంది.

అప్పటికి చీకటి బాగా అల్లుకుంది. గదిలో లైటయినా వేసుకోలేదు. వేసుకోవాలనిపించలేదు. చీకటి జీవితానికింక వెలుగెక్కడది? నిరాశ రమీజాలో చీకటికంటే దట్టంగా వ్యాపించింది.

పెళ్ళయి సంవత్సరం కూడా కాలేదు.

అప్పుడే ఎన్ని వింతలు జరిగిపోయాయి. జీవితం అంటే ఇదే కాబోలు. చీకటిని అనుకొని వెన్నెల. వెన్నెలని తోసుకుని చీకటి. సుఖాన్ని నెట్టుకుని దుఃఖం. దుఃఖాన్ని రూపుమాపుతూ సుఖం. కేవలం సుఖమే ఉంటే మానవ జీవితానికి అసలు అందం ఉంటుందా? గనిలోంచి బంగారం తీసినట్లు కష్టంలోంచి సుఖం వస్తుందా? అందుకే కాబోలు ఈ జగత్తంతా మిథ్య అంటారు. ఈ జగత్తంతా మిథ్యామయం అని తెలిసి కూడా మానవుడు ఈ సుఖాల ఎండమావులకోసం ఎందుకు పరిగెడతాడో అసలు? ఇది తనకేనేమిటి? మహామహా పురుషులకుసైతం ఈ సుఖదుఃఖాలకతీతంగా బతకటం సాధ్యపడలేదు. రమీజాలో వేదాంతం చోటుచేసుకుంది గదిలో చీకటిలాగే.

"అమ్మా! డాక్టరుగారు రమ్మన్నారు అర్జంటుగా'' ఆ గొంతు విని లైటేసింది. నైట్ వాచ్‌మెన్! రమీజాకు వెళ్ళాలనిలేదు. అతని మాటవిన్నా అతని రూపం చూసినా కడుపులోంచి దేవేస్తోంది.

'వెధవ!





నీచుడు

ఛండాలుడు! డర్టీఫెలో!

ఆడరక్తం తాగమరిగిన పులి. ముంగిలా ముఖం వాడూను. నంగిరి వెధవ. పింజారీ వెధవ. ఇంకా తిట్టాలనుకుంది. గట్టిగా తిట్టాల నుంది. 'నువ్వు ఫో. నేను రాను. నన్ను సస్పెండు చేస్తాడా? చెయ్యమను. దమ్ముంటే' అనాలనుకుంది. అనలేకపోయింది. ''వస్తాను... వెళ్ళు'' అంది. వాడు మరోసారి చెప్పాడు. ''అర్జంటు కేసొచ్చింది స్టాఫ్ నర్సు లేదు. సిజరిన్ ఆపరేసన్ చేయాలట నానెల్లి వత్తాను'' అని వెళ్ళాడు.

టైము చూసుకుంది. ఎనిమిది అయిపోతోంది. వంట చేసుకోలేదు. ఆకలేస్తోంది. వంట గదిలోనికెళ్లి స్టౌ వెలిగించి నీళ్ళు పెట్టింది. హార్లిక్స్ కలుపుకుని తాగింది. పర్సు పట్టుకుని బయలుదేరింది. సరిగ్గా అప్పుడే గుమ్మందగ్గర అలికిడయింది. ఎవరాని తలెత్తింది.

కమాలుద్దీన్

చేతిలో సూట్‌కేసు. ముఖంమీద జుట్టుపడి ఉంది. జుట్టు బాగా చెదిరిపోయి ఉంది. మరో కథ అల్లుకొని వచ్చినట్లుంది ముఖం చూస్తే. ఆ చూపు భరించలేకపోయింది. విలన్‌లా కనిపించాడు.

''ఎందుకొచ్చావ్ మళ్ళీ?'' ఏకవచన ప్రయోగమే చేసింది.

''నీకోసమే!''

''నీకూ నాకూ ఇక ఎలాటి సంబంధం లేదు. వెళ్ళిఫో... గతం ఒక కల, పీడకల అనుకున్నాను. నా జీవితంలోంచి నిన్ను చెరిపేసుకున్నాను. తుడిచేసుకున్నాను. నీ కథలు విని మోసపోయాను. మనుమల్ని చూశాను. వాళ్ళ మోసాల్ని విన్నాను. కానీ నీఅంతటి పచ్చి దగాకోరుని చూడలేదు. పయోముఖ విషకుంభంలాటివాడివి నువ్వు. నా జీవితాన్ని తగలెట్టేశావ్! అమాయకురాలయిన నజ్మా జీవితాన్ని మసిచెయ్యకు. నువ్వేదయినా ఉపకారం చెయ్యదలచుకుంటే అదే! వెళ్ళు'' అని కేకలేసింది.

''నేను లేనప్పుడు నువ్వు ఇంటికొచ్చావట. వాళ్ళు నిన్ను మోసంచేశారు. నజ్మా వట్టి మాయలాడి. దాని నంగనాచితనాన్ని నువ్వు నమ్మేశావ్. అనవసరంగా తొందరపడుతున్నావు. నేన్నీకేం అన్యాయం చేయలేదు. నన్ను నమ్ము. నాకున్న ఒక్క పాపమీద ప్రమాణం చేస్తున్నాను'' అన్నాడు.

ఇక సహించలేకపోయింది రమీజా.

''ఏం వాగావ్‌రా! నజ్మా నంగనాచిదా. పతివ్రతలాటి ఆ అమాయకురాల్నింకో మాటన్నావంటే ఏంచేస్తానో నాకేతెలీదు. ఉన్న ఆ ఒక్క బిడ్డ ఉసురు పోసుకుని ఆ అమాయకురాలి గుండెకోతను అధికం చేద్దామనుకుంటున్నావా? అసలు నువ్వు ఒక మనిషివేనా? నీ నాలుకను భగవంతుడిచ్చింది అబద్ధాలు చెప్పడానికేనా? ఒక్క నిజం కనీసం ఒక్క నిజం చెప్పలేవా ఆ నాలుకతో' అని కాలరు పట్టుకుని ఊపేసింది. ''ఇదిగో నీకే చెపుతున్నాను. మర్యాదగా గడప దిగు. లేదా, ఇవాళ నా చేతిలో ఛస్తావ్!'' అని అక్కడే అందుబాటులో ఉన్న కత్తిపీట తీసింది. ఈ హఠాత్‌పరిణామానికి కమాలుద్దీన్ జడిసిపోయాడు. వణికిపోయాడు. మరో మాటాడితే అతనామె కత్తిపీటకు బలౌతాడన్న విషయం అతనికి అర్థమయిపోయింది. దూరంగా వెనక్కి జరిగాడు. జరిగి -' ''సరే, వెళ్తున్నాను. కానీ ఒక్క విషయం - నువ్వనుకున్నంత తేలిగ్గా నిన్ను విడిచిపెట్టను. నువ్వు కత్తిపీట చూపెడితే భయపడిపోయేంత పిరికివాణ్ణి కాను. నిన్నెలా లొంగదీసుకోవాలో నాకు తెల్సు. నయాన చెప్పవలసిన రీతిలో చెప్పాను. నజ్మా నా భార్యే. నేన్నీకు చెప్పినది కట్టుకథే. ఇన్నాళ్ళూ నిన్ను నానుండి దూరం కాకుండా అబద్ధాలు చెప్పాను. కానీ ఇకమీదట అబద్ధాలు చెప్పను. నిన్ను భయపెట్టి వంచుతాను. నా కాలికింద చెప్పులా ఉంచుతాను. నేను చెప్పిన అబద్ధాలు నీచేత నిజమని అందరికీ చెప్పిస్తాను. ఇది నా సవాలు. నా ప్రతిజ్ఞ... వస్తాను'' అంటూ గడపదిగాడు.

రమీజా కుప్పలా కూలిపోయింది మంచంమీద. పొంగి వస్తోన్న దుఃఖం గుండెల్ని ప్రయ్యలుచేసింది. ఎత్తిన కత్తిపీట ఎందుకు దించేశానా? అనిపించిందామెకు. తనను భయపెట్టి సాధిస్తాడా? చెప్పినవన్నీ కథలేనని ఒప్పుకుని సవాలు చేస్తాడా? ఫూల్... తననెలా లొంగదీసుకోవాలో అతడికి తెలుసట.

తనేం చిన్నపిల్ల అనుకుంటున్నాడు కాబోలు. అనవసరంగా తన జీవితాన్ని, తననీ అల్లరిపాలు చేద్దామనుకుంటున్నాడా? తననేం చేయగలడని? మళ్ళీ వచ్చినట్లైతే తగిన బుద్ధి చెప్పాలి. పోలీస్ రిపోర్టు ఇవ్వాలి - తనని మోసం చేసింది కాక అప్రతిష్ఠపాలు చేయడానికి ప్రయత్నిస్తున్నాడని! భవిష్యత్తులో ఏం చేయాలో, ఎలా చేయాలోనన్న విషయాన్ని గురించే ఆలోచిస్తోందగా మళ్ళీ నైట్ వాచ్‌మెన్ వచ్చాడు.

"అమ్మగారూ! డాక్టరుగారు అర్జంటుగా రమ్మంటున్నారు" అన్నాడు.

"హాస్పిటల్‌లో ఎవరెవరున్నారు?"

"డాక్టరుగారున్నారు. ఆయా ఉంది. తోటి ఉన్నాడు. యు.డి.సి.గోరున్నారు" అన్నాడు.

"సరే... వస్తున్నా పదా" అని కళ్ళు తుడుచుకుని లేచింది. లైటార్పింది. తలుపు తాళం వేసి బయలుదేరింది.

రమీజా వెళ్ళేసరికి హాస్పిటల్లో డాక్టరు గదిలో యు.డి.సి. ఉన్నాడు. వాడి విషపు చూపులు భరించలేకపోయింది. "నమస్కారం సార్!" అంది డాక్టరుకు.

"ఇవాళ మనకు చేతినిండా పని ఉంది" అన్నాడు.

జవాబివ్వలేదు రమీజా. "నేనొస్తా సార్" అని లేచాడు యు.డి.సి. "ఆఁ... వెళ్ళిరండి. రేపటికల్లా ఆ కాగితాలు తయారుకావాలి. ఎల్లుండి నేను డి.ఎం.ఓ. దగ్గరకెళ్ళి వాటిని స్వయంగా ఇచ్చేస్తాను" అన్నాడు.

"రేపు తయారుచేస్తానులెండి" అని వెళ్ళాడు. ఓసారి రమీజాను ఆకలిగా చూశాడు. అలాగ వెళ్ళినవాడు తిన్నగా బార్ కెళ్ళిపోయాడు. అది నిజానికి పట్నం కాదు. మేజరు పంచాయితీ. తాలూకాలున్నప్పుడు ఆ ఊరుకంత ప్రాధాన్యం ఉండేది కాదు. కానీ మండలాలు ఏర్పడిన తరువాత చిన్న బస్సు కాంప్లెక్సు, ఒక పోలీస్ స్టేషనూ ఏర్పాటుచేశారు. పోలీసు స్టేషన్ పెట్టిన దగ్గర్నుంచీ పనిలేకపోతే పోలీసులకి ఉద్యోగాలు పోతాయేమోనని తగువులు పెరిగాయి. తగువులాడుకోడానికి, వాటిని మరిచిపోడానికి అనువుగా కడుపు నిండా తాగడానికి యారక్ డిపోలున్నాయి. నాగరీకులకోసం బ్రాందీషాప్ కం బారు కూడా ఏర్పాటయింది. దానిముందు మిరపకాయల బజ్జీల బండీ, వేడివేడి పకోడీలు చేసే బళ్ళూ పోటీలమీద లేచాయి.

వెళ్ళి కూర్చున్నాడు యు.డి.సి. లైట్లు డిమ్ముగా ఉన్నాయి. "హల్లో! బావున్నారా?" పలకరించాడు యు.డి.సి. ఎదురుగా ఉన్న కమాలుద్దీన్‌ను. "ఏం కావాలి?"' సర్వరు వచ్చి అడిగాడు యు.డి.సి.ని. అతను చెప్పాడు.

"ఎప్పుడొచ్చారు?"

"ఇప్పుడే"

"ఇంటికెళ్ళలేదా ఇంకా?"

వెళ్ళలేదన్నట్లు తలూపాడు. కమాలుద్దీన్ అక్కడ అనుకోకుండా కలవటం యు.డి.సి.కి మహదానందంగా ఉంది. తన కక్ష తీర్చుకోడానికి తగిన సమయంగా కనిపించింది. అతను లేవబోతుంటే "అయిపోయిందా అప్పుడే? కూర్చోండి సార్. ఇవాళ నాకెవరూ కంపెనీ లేరనుకున్నాను" అని సర్వరుని పిలిచి కమాలుద్దీన్‌కోసం ఆర్డరిచ్చాడు. "వొద్దు సార్. ఇప్పుడే తీసుకున్నాను" అన్నాడు.

"ఆఁ... దాందేముంది?" అని సర్వర్ తేగానే "నాకు కంపెనీ లేకపోతే తాగాలనిపించదు" అన్నాడు. "తీసుకోండి" అని పొట్లాంలోంచి మిరపకాయల బజ్జీలను అందించాడు. కమాలుద్దీన్ మందు తాగుతూ, మిరపకాయ బజ్జీలు తింటున్నాడు. అతని కళ్ళు ఎరుపెక్కుతున్నాయి.

"బహుశః ఈ రాత్రికి ఆవిడ ఆసుపత్రి నుండి రారేమో?" అన్నాడు.

"ఏం?"

"ఆ డాక్టరేదో కారణంచేత ఆమెనలా పిలుస్తూనే ఉంటాడు కారణం లేకపోయినా?" అనేసి "ఆవిడొచ్చిందాకా ఎక్కడుంటారు మరీ?" అడిగాడు. జవాబు చెప్పలేదు కమాలుద్దీన్. అదే అలుసుగా తీసుకున్నాడు.అవకాశంగా గ్రహించాడు. తాగటం పూర్తయ్యాక ఇద్దరూ లేచారు. దూరంగా ఊరిచివర కాలువ మీద కూర్చుని కబుర్లు చెప్పుకున్నారిద్దరూ. ఆ కబుర్లలో కమాలుద్దీన్‌కు రమీజా గురించి ఎంత చెడ్డగా చెప్పాలో అంతా చెప్పాడు. గతంలో ఒక డాక్టరీమెను ఉంచుకున్నాడనీ, ఆ




డాక్టరు బదిలీ అవటంతో ఇప్పుడీ డాక్టర్ని వలలో వేసుకుందనీ, కేవలం లైసెన్సుకోసమే పెళ్ళి చేసుకున్నదని తాగిన మనిషికి ఇంజక్ట్ చేశాడు. మొదలే కోతి, దానికి కల్లు తాగిస్తే ఎలాగుంటుందీ? అన్నట్లు అయింది కమాలుద్దీన్ పరిస్థితి. నోటికొచ్చిన బూతులు తిట్టాడు రమీజాని. దాని సంగతీరోజు తేలుస్తాను. అందుకా అది నన్ను కాదంటున్నది?'' పళ్ళు పటపటా కొరికాడు. ఇంక ఫరవాలేదనుకున్నాడు. అనుకొని ''చూడండి! ఒక అమాయకునికి అన్యాయం జరిగితే సహించలేక చెప్పాను. కానీ మీలో కలతలు రేపాలనీ, గొడవలు సృష్టించాలనీ నా అభిమతం కాదు. వస్తా... అప్పుడే పది కావస్తోంది'' అని లేచాడు. ''వస్తా... నేనూ... అటేగా వచ్చేది?'' అని తూలుతూ, తూలుతూ లేచాడు. ఇద్దరూ ఊళ్ళోకి చేరుకున్నారు.

అదేసమయంలో-

ఆసుపత్రిలో అడ్మిటయిన స్త్రీకి కొంచెం కష్టమయినా, సిజేరియన్ అవసరం లేకుండా డెలివరీ అయింది. అక్కడి కార్యక్రమం పూర్తయ్యేసరికి మరో గంటయింది.

''రా... కూర్చో'' అన్నాడు డాక్టరు సీట్లో కూర్చుంటూ. తోటీని ఎక్కడికో పంపాడు. ఆయా ఏదో పనిలో ఉంది. నైట్ వాచ్‌మన్ ఫ్లాస్కు పట్టుకుని కాఫీ తేడానికెళ్ళాడు. రమీజా మవునంగా కూర్చుంది. మనసు అసహనంతో నలిగిపోతోంది. అక్కడ కూర్చోవాలని లేకపోయినా ఇంకా తన పని ఉండటంచేత కూర్చోక తప్పలేదు. డాక్టర్ ఆమె ముఖంలోకి చూస్తూ - ''ఏమిటీ? డల్‌గా ఉన్నావ్?'' అడిగాడు. జవాబు ఇవ్వలేదు రమీజా.

''ఇదిగో... టిఫిన్ చెయ్యి. ఇంకా గంటసేపుండాలి'' అని ఇంటినుండి తెప్పించిన టిఫిన్ బాక్సులోంచి పూరీలు ప్లేట్లో పెట్టి, కూర వేశాడు. ''తీసుకో'' అన్నాడు. ''వద్దు. నాకు ఆకలిగా లేదు'' అందామె.

''ఆకలిగా లేకపోవటం ఏమిటి? నాకు కంపెనీ ఉండొద్దూ .. తీసుకో'' అన్నాడు.

ఆమె తీసుకోలేదు. డాక్టరే ప్లేటు ముందుకు తోశాడు.

రమీజా కుర్చీలోంచి లేచింది. ''నేను పేషంట్ దగ్గరుంటాను. నాకు ఆకలిగా లేదు'' అని వెళ్ళబోయింది. లేస్తున్న ఆమెను చెయ్యి పట్టుకుని ఆపాడు డాక్టరు. ''ఏంటా తొందర? అక్కడ నువ్వు చెయ్యాల్సిన పనేంలేదు. నీతో మాట్లాడాలి. కూర్చో'' అన్నాడు.

''నన్ను వదలండి. ప్లీజ్... నన్నిలా బతకనివ్వండి. ప్లీజ్!'' గట్టిగా ఏడ్చింది.

''ష్! అసలేమయిందివాళ? ఎందుకిలా అయిపోతున్నావ్? గొడవ చేయకు. గోడలకు కళ్ళుంటాయి చెవులేకాదు. ఇప్పుడే అంత రహస్యంగా ఎవరికీ తెలీదనుకున్న మన వ్యవహారం ఆస్పత్రిలో అందరికీ తెలిసిపోయినట్లుంది. ఏదో గుసగుసలు ప్రారంభమయ్యాయి. నా మాట విను. కూర్చో ముందు టిఫిన్ చెయ్'' అన్నాడు. అప్పుడే కమాలుద్దీన్ కిటికీలోనుండి ఈ దృశ్యాన్ని చూసి వెళ్ళటం ఎవ్వరూ గమనించలేదు.

''వద్దు... నేను కూర్చోలేను. దయచేసి నాజోలికి మళ్ళీ రాకండి. ఇప్పటికయిందే చాలు. నా జీవితాన్ని పాడుచేశారు మీరు. నన్నెందుకిలా బాధపెడ్తున్నారు. నేను ఎంతో పవిత్రంగా బతకాలనుకున్నాను. మీరు నన్నూ నా బతుకునీ కాల్చేశారు. నన్ను మలినం చేశారు'' వెక్కివెక్కి ఏడ్చింది.

''రమీజా! ఆవేశపడకు. నేను తొందరే పడ్డాను. పెద్దవాడ్నయినా నన్ను మన్నించు. నీకేం అన్యాయం చేయను. నేను చేసిన పొరపాటుకు చింతిస్తున్నాను. నీకు ఒక ఇల్లు రాసిస్తున్నాను. నీకెంత కావలిస్తే అంత ఇస్తాను. నీ భర్తకీ నీకూ గొడవలు వస్తున్నాయని మొన్ననే తెల్సింది. అతను నిన్నొదిలేసినా నీకేం భయంలేదు. నా మాట విను. నన్ను కాదనకు'' అని ఆమెను తన బాహువుల్లోకి తీసుకున్నాడు.

''వదలండి... మీ డబ్బూ వద్దు. మీరూ వద్దు. నన్ను విడిచిపెట్టండి. నా బతుకు నేను బతగ్గలను. ఎవరి దయాధర్మం భిక్షవల్ల నా జీవితం వెళ్ళనక్కర్లేదు. చివరికి ప్రాణాలనైనా త్యజిస్తాను. కానీ ఈ నీచమైన బ్రతుకు నాకొద్దు. దీన్ని నేను భరించలేను. ఇప్పటికయింది చాలు'' అని అతన్ని విసిరికొట్టింది.

''రమీజా! ఈ ఒక్కసారికి కాదనకు. నిన్ను మళ్ళీ కన్నెత్తిచూడను. నా మాటవిను... ప్లీజ్'' మళ్ళీ రమీజా చేతిని అందుకున్నాడు.

"మీకే చెప్తున్నది విడిచిపెట్టండి. నేనేమవుతున్నానో తెలియని అచేతనస్థితిలో ఉన్న నన్ను పాడుచేశారు. నేనింకా ఎందుకు బతికి ఉన్నానన్నది ఇప్పటికీ నాకర్థం కావటం లేదు. తెలిసీ మీకోరికను తీర్చే హీనస్థితికి నేనింకా దిగజారలేదు వస్తా" అంటూ ద్వారం దాటి వెళ్ళబోతోన్న రమీజానుద్దేశించి డాక్టరు కృష్ణారావు అరిచాడు

"రమీజా! నీ అంతు చూస్తాను. నేను నీ మీద ఇప్పుడే క్రమశిక్షణచర్యలు తీసుకుంటున్నాను. నీవు వర్కులో ఇర్రెగ్యులర్‌గా ఉన్నావని నీ మీద రిపోర్టు చేస్తున్నాను" అని. వెనుదిరిగి చూసింది పురుగును చూసినట్లు.

"నేనూ నీ పని ఇప్పుడే చెప్తాను నీ భార్యతో. నువ్వేలాటి నీచుడివో, నాకెంత అన్యాయం చేశావో నీ భార్యకు చెప్పి నీ సంసారంలో నిప్పుపెడతాను... కక్షతీర్చుకుంటాను" అని పరుగుపరుగున గేటు దాటి వెళ్ళిపోయింది. అప్పుడే గేటులోనికి ఎంటరవుతోన్న అటెండరుకి ఈ పరిస్థితి తెలీక "కాఫీ తెచ్చాను అమ్మగారూ! తాగరామరి" అన్నాడు. జవాబు చెప్పకుండా వెళ్ళిపోయింది రమీజా.

పులి వెంటాడితే తప్పించుకు వచ్చిన లేడిపిల్లలా బెదురు చూపులతో ఇల్లు చేరుకుంది తలుపుతీసి లోనికి వెళ్ళింది. వెళ్ళి మంచంమీద బోర్లా పడుకుని ఏడుస్తోంది. ఆమె వీపుమీద ఒక పెద్ద బరువు పడినట్లయి త్రుళ్ళిపడింది. తిరగడానికి ప్రయత్నించింది. ఆమె ప్రయత్నం ఫలించకుండా రెండు చేతులు నిరోధించాయి. లేవటానికి శక్తినంతా కూడదీసుకుంది. ఫలితం లేకపోయింది. వెనుక నుంచి కాళ్ళతో గట్టిగా తన్నింది. అప్పుడు లేవడానికి వీలయింది. పైట సవరించుకుని లేచి చూసింది. అతడు కమాలుద్దీన్!

"ఒరేయ్! నువ్వెందుకొచ్చావ్! నిన్ను రావద్దని చెప్పానా? నా మీద నీకేం అధికారం ఉన్నది? వెళ్ళు... వెళ్ళిపో ఇక్కణ్ణుంచి!"

"అర్థరాత్రి వరకూ ఇక్కడ ఉన్నది నువ్వు వెళ్ళమంటే వెళ్ళడానికి కాదే! అమీతుమీ తేల్చుకోవాలని వచ్చాను"

"ఏమిటీ నువ్వు తేల్చుకునేది?"

"చెప్పు... ఆ డాక్టరుగాడికీ నీకూ ఎన్నాళ్ళుగా సాగుతోందీ వ్యవహారం? చెప్పవే. చెప్పకపోయావో, నీ ప్రాణాన్నయినా తీస్తాను" అన్నాడు మీదకు రాబోతూ.

"ఆగు... అడుగు ముందుకేసావో నిన్ను చంపి నేను జైలుకెళ్తాను" అని అక్కడున్న వాలు కుర్చీ కర్రలాగి అడ్డుకుంది. అతను రమీజా చేతిని గట్టిగా పట్టుకున్నాడు. ఆమె అతని చేతి మీద గట్టిగా కరిచింది. 'అమ్మా!' అని "ఒసేయ్! నిన్నింక వదలనే. నిన్ను వదిలే ప్రసక్తిలేదు. ఇదే నీకు చరమాంకం" అన్నాడు. అని ఆమె జడను గట్టిగా లాగాడు. ఆమె వెనక్కివాలింది. తలుపు గుద్దుకుంది. దెబ్బతిన్న బెబ్బులి అయింది. తిరిగింది వెనక్కి. అతని జుట్టు రెండు చేతులతో పట్టుకుంది. కిందకు వంచింది. కసితీరా పిడిగుద్దులు గుద్దింది. అతను ఆమె కాళ్ళు పట్టుకుని వెనక్కిలాగి ముందుకు తిరగేశాడు. ఆమె వెల్లకిలా పడిపోయింది. అతను ఆమె మీద చిన్నపిల్లాడిలా కూర్చున్నాడు. ఆమె గింజుకుంటోంది. "చెప్తావా? చెప్పవా? ఎన్నాళ్లనుండి సాగుతోందీ నాటకం?" అన్నాడు.

"నీకు చెప్పవలసిన అవసరంలేదు నాకు. వదులు నన్ను" తప్పించుకోడానికి ఆమె ప్రయత్నిస్తూనే ఉంది. అతడు కసిగా ఉన్నాడు. ఆకలిగా ఉన్నాడు. బలవంతంగా రమీజా జాకెట్టును చింపేశాడు. చీరపీకేశాడు. మీదపడి పశువులా ప్రవర్తిస్తున్నాడు. ఆమెకు తెలిసిపోయింది. ఇక తనెంతోసేపు బతకదని. ఇదే తన ఆఖరిపోరాటమని. ఓడిపోవటం ఆమెకిష్టం లేదు. బలంగా ముందుకు దేకింది. అక్కడున్న ఇనపగూటం అందుకుంది. బలంగా కమాలుద్దీన్ నెత్తిమీద కొట్టబోయింది. కమాలుద్దీన్ పసిగట్టేశాడు. ఆమె మీద నుంచి లేచిపోయాడు. మన్ను కుమ్మినట్టు ఆమెను తొక్కేశాడు. కాళ్లతో గట్టిగా ఆమె ముఖం మీద తన్నాడు. అతని పాదపు దెబ్బకు ఆమె ముక్కు చిట్లింది. రక్తం ప్రవాహంలా పారింది. అతను పాదంతో ఆమె కంఠం మీద ఒక తొక్కుతొక్కాడు. ఆమె నవనాడులూ లాగేశాయి. గిలగిలా కొట్టుకుంటోంది. నాలుక కరచుకుంది. అతడింకా వెర్రెత్తిపోతున్నాడు. రమీజా పీక కోసిన కోడిపుంజులా గిలగిలా తన్నుకుంటోంది. అతనేం పట్టించుకోడంలేదు. "నన్నే చంపుదామనుకున్నావటే!" అని గట్టిగా




పొట్టలో పొడిచాడు. ఈసారి రమీజా అమ్మా! అని అరవలేకపోయింది.

కారణం

అప్పటికే ఆమె చచ్చిపోయింది.

★ ★ ★

ఎనిమిది గంటలయింది.

అమ్మలు వేగిరంగా పనులు తెముల్చు కుంది. భర్తకు రాత్రే చెప్పేసింది, 'రమీజా రెండుసార్లు కబురుపెట్టింది. అక్కడి పరిస్థితి ఎలాగుందో ఏమిటో? ఒకసారి వెళ్లిరావాలని' సుదర్శనం కూడా వెళ్ళి రమ్మన్నాడు. వీల యితే ఇక్కడకు తీసుకొచ్చేయమన్నాడు సె లవు పెట్టించేసి. అంతలో ఒక కుర్రాడు వచ్చి "అమ్మగారూ! మీకెవులో ఉత్తరం పంపినారు. టీకొట్టు అప్పలసామి ఇమ్మన్నాడు" అని. సుద ర్శనం ఉత్తరం అందుకున్నాడు. చదవటానికి విప్పాడు.

"అమ్మలుకి,

నువ్వు ఉన్నపళంగా అర్జంటుగా రా.... చాలా దారుణం జరిగిపోయింది. రమీజా దారుణంగా హత్య చేయబడింది. ఏమాత్రం ఆలస్యం చేయకుండా రా!

ఇట్లు
హెచ్‌వీ

చదివిన సుదర్శనం "అమ్మలూ!" అంటూ పిడుగుపడినంత శబ్దంతో అరిచాడు. చీరకట్టు కుంటున్న అమ్మలు కుచ్చెళ్లు సవరించు కుంటూ సుదర్శనం అంత గట్టిగా పిలిచేసరికి అత్తగారికేమయిందోననే అనుకుంది. పెరట్లో ఉన్న వసంతకీ ఎందుకో భయంవేసింది. ఒకే ఒక్క పరుగుతో వచ్చినట్లు గదిలోనికి వచ్చింది. అద్దం ముందు నిలబడి తల దువ్వుకుంటు న్న శివా ఆ పిలుపుకు ఉలిక్కి పడి వచ్చాడు. ఒకేసారి అందరూ ఆ గదిలోకి చేరేసరికి ఇంకా నిద్రలేవని నారాయణమ్మ "ఏమయిందిరా? అంతలా అరిచావ్?" అంది. సుదర్శనానికి నోటమాట రాలేదు. మళ్ళీ రెట్టించింది అమ్మ లు.

"చాలా ఘోరం జరిగిపోయిందమ్మలూ! రమీజా... రమీజా హత్యచేయబడింది" అన్నా డు.

"ఆఁ!" అన్నారందరూ ఒక్కసారి. అమ్మలు కుప్పకూలిపోయింది. "అన్నయ్యా! అన్న య్యా! వదిన...!" అప్పటికే ఫెయింట్ అయి పోయిన అమ్మలుని వళ్లోకి తీసుకుంది వసంత. "అమ్మలూ!" అంటూ ఒక్క అరుపు అరిచి, "శివా! డాక్టరుగార్ని తీసుకురా! త్వరగా వెళ్లు" అన్నాడు. అతనికి కరచరణాలాడలేదు. నారాయణమ్మ ఒక్కసారి కిందకు గెంతినట్లు దిగి "వసంతా! గ్లాసుతో నీళ్లు తీసుకురా!" అంది. వసంత వెళ్ళి గ్లాసుతో నీళ్ళు తెచ్చింది. నారాయణమ్మ అమ్మలు ముఖం మీద నీళ్ళు చల్లింది. ముఖాన్ని నీటితో తుడిచింది. నోట్లో నీళ్ళుపోసింది. సుదర్శనం కాలుగాలిన పిల్లిలా తిరుగుతున్నాడు అటూ ఇటూ. ఆ రెండు నిమిషాలలో మూడుసార్లు వీధిలోనికి వెళ్ళి వచ్చాడు. అసలు రమీజాని హత్యచే సిందెవరు? ఆమె భర్తా? లేక ఇంకెవరయి ఉంటారు! అన్న ప్రశ్న ఉదయించి దాన్ని మరిపింప చేస్తూ, భగవంతుడా! ఏమిటీ దారుణం? అమ్మలుకేం ప్రమాదం లేదుకదా! తల్లికిప్పుడిప్పుడే నయం అయింది అను కుంటున్నంతలో భార్యకేం ప్రమాదం సంభవి స్తుందో? ఇప్పుడిప్పుడే తేరుకుంటోన్న తల్లి ఈ షాక్‌కి మళ్ళీ ఏమవుతుందోననే రకరకాల ప్రశ్న లు వేధిస్తోంటే మళ్లీ వీధిలోనికి పరుగెత్తాడు. డాక్టరుగారి కారు వస్తోంది. కారు ఇంటి గు మ్మం ముందాగింది. కారులోంచి డాక్టరుగారు, వెనుక కాంపౌండరూ, శివా ఒకరి తరువాత ఒకరు దిగారు. వస్తూనే డాక్టరు అమ్మలు పల్సు చూశారు. స్టెత్ పెట్టి టెస్టు చేశాడు. వెంటనే ఇంజక్షన్ చేశాడు. "షాక్ తింది. కాసేపు రెస్టు తీసుకోనీండి" అన్నాడు. "అసలేం జరి గింది?" అడిగారు డాక్టరు.

సుదర్శనం జవాబిచ్చాడు. "వాళ్ళిద్దరూ చాలా ప్రాణ స్నేహితులండీ. ఒకర్ని విడిచి ఒకరు ఉండలేరు. ఈమధ్యనే రమ్మని అర్జంటుగా కబురంపింది. అయితే ఈ ప్రక్క ఊళ్ళో కలరా, అదీ తన ఏరియా కాబట్టి వారం రోజులూ రెస్ట్‌లెస్ అయిపోయింది. మా ఇంట్లో కూడా మా అమ్మకి అనారోగ్యం, ఇంటినిండా కదలడానికి వీల్లేకుండా చుట్టాలు. చుట్టా లుంటుండగా వెళ్ళటానికి ఇష్టం లేక ఇవాళ పెందరాళే పనులన్నీ ముగించుకొని బయలు

దేరబోతోంది. బస్సు ద్వారా కబురొచ్చింది. ఆ ఉత్తరం చదవగానే నేనే షాకయాను. మరి తను షాక్ తినటంలో ఆశ్చర్యం ఏముంది?. డాక్టరుగారూ! ఆమె ఇప్పుడు రెస్టు తీసుకోడానికి కుదరదు. వెళ్ళక తప్పదు. వాళ్ళవాళ్ళందరికీ ఇన్‌ఫర్మేషన్ ఇవ్వాలి. తనకి తెలివొస్తే మనం ఎంతాపినా ఆగదు'' అన్నాడు సుదర్శనం.

''ఆమెకేం ఫరవాలేదు. ఎటొచ్చీ బాగా షాక్ తింది. ప్రస్తుతానికి తేరుకొని వెళ్ళొచ్చు. కానీ మళ్ళీ అక్కడా ఇలాగే తనేమయినా అయితే మెంటల్‌గా దెబ్బతినే అవకాశముంది'' అన్నాడు.

''మరెలా?''

''మీరే ఆలోచించండి. లేకపోతే మీరూ ఫాలో అవండామెతో. జాగ్రత్తగా మీరామెను చూసుకోండి. ఇదిగో ఈ టాబ్లెట్లు కొనండి. ఉదయం, సాయంకాలం, రాత్రి వరుసగా మూడు పూటలా వేయండి. ఏదైనా కనీసం ఓ రెండు గంటలు రెస్టు అవసరం?'' అన్నారు. మరో పదినిమిషాలకు అమ్మలుకి తెలివొచ్చింది. అటూ, ఇటూ అయోమయంగా చూసింది. 'ఏమయింది? నాకేమయంది' అని ''ఏమండీ! ఎంత ఘోరం జరిగిపోయిందండి. నన్ను రమ్మని మరీ మరీ రాసిందండి. ఆ వెధవ పెళ్లి చేసుకుని సంవత్సరం కూడా కాలేదండీ! ఇంతలోనే ఎంత దారుణం జరిగిపోయిందండీ! వెర్రినాగన్న! మనసు విప్పి తన కష్టాలు కూడా కడసారిగా నాతో చెప్పలేకపోయిందండీ! నిన్న నేను వెళ్లుంటే ఇంత దారుణం జరిగి ఉండేది కాదండీ... ఎంత పని జరిగి... పోయిందండీ! ఎంత... పని... జరిగిపోయిందండీ!'' అని గుండెలు బాదుకుని రోదించసాగింది. సుదర్శనం స్థాణువులా ఉండిపోయాడు. భార్య అంతగా దుఃఖించటం ఎప్పుడూ చూడలేదు. సుఖానికిగానీ, దుఃఖానికిగానీ అంత వేగిరం తలవొగ్గని మనిషి. ఏదొచ్చినా తొణకని స్వభావం ఆమెది. అలాటిది అమ్మలు ఇంతలా అయిపోతుంటే అతనికి. భయం వేసింది. వార్త వినేసరికే ఇలా అయిపోయింది. ఇక ఆ మృతశరీరాన్ని చూసి ఇంకెంత పిచ్చిదయిపోతుందో తల్చుకుంటే సుదర్శనానికి శరీరం వొణికింది. గుండెలదిరిపోయాయి. ఇప్పుడు విశ్రాంతి ఎంతయినా అవసరం. కానీ ఆమెనాపలేడు తను! ఈ పరిస్థితిలో విశ్రాంతి తీసుకోమనటం భావ్యం కాదు. అలాగని చూస్తూ చూస్తూ అమ్మల్ని పంపటం సమంజసంగా అనిపించలేదు. కానీ వింటుందా? వినదే? ఇప్పుడెలా? ఏం చేయాలీ? అనుకున్నాడు.

''అమ్మలూ! నువ్వు అసలే నీరసంగా ఉన్నావ్. ఈ పరిస్థితుల్లో నీకు ప్రయాణం భావ్యం కాదు, నేనెళ్తా'' అన్నాడు.

''ఏమండీ! దయచేసి నన్నాపకండి ఇప్పటికే నేను చేచేతులా తనని దూరం చేసుకున్నాను. అసలేం జరిగిందో తెలుసుకోవాలి. ఇప్పుడు కూడా వెళ్ళకుండా ఉండలేను. నాకేం ఫరవాలేదు. ఒకవేళ ఏమయినా నేనుండలేను... పదండి, ఏదోలాగా మనం అక్కడకు తక్షణం చేరుకోవాలి'' అని లేచి కూర్చుంది. అత్తగారు, డాక్టరుగారుకానీ ఎంత వారించినా వినలేదు. సుదర్శనం ఆమెతో ఫాలో అయాడు. బస్సుస్టాండుకెళ్లారు. అప్పుడే స్టాండులో కలవరం. ఏనోట విన్నా ఇదే మాట. చుట్టు పక్కల పనిచేస్తోన్న ఏఎన్ఎంలు అందరూ బస్సు కోసం నిరీక్షిస్తున్నారు. అమ్మలును చూడగానే వాళ్ళు గబగబా దగ్గరకు వచ్చేశారు. అమ్మలు బావురుమంది. ''ఊరుకోండి అమ్మలుగారూ! మేం ఇప్పుడే అనుకుంటున్నాం, మీరీ వార్త తట్టుకోలేరేమోనని. కానీ ఎంత దారుణం జరిగిపోయిందండి. పెళ్ళయి ఇంకా సంవత్సరం కూడా కాలేదు. ముచ్చటయిన పిల్ల. ఎప్పుడూ చేపల్లాటి కళ్లతో ఆమె చూపులను చూస్తుంటే ఆమెనే చూడాలనిపించేది. నవ్వుతూ, నవ్విస్తూ ఉండేది. ఈ మనిషికసలు బాధపడటం తెలీదేమోననుకునే వాళ్ళం. మీ ఇద్దరూ కలిసి వెళ్తుంటే మేవనుకునే వాళ్ళం, మీరు చాలా గంభీరంగా ఉంటారు. ఆవిడెప్పుడూ త్రుళ్ళుతూ త్రుళ్ళిస్తూ ఉండేది. వీళ్ళిద్దరికీ ఎలా స్నేహం కుదిరిందా? అని. అసలేమయిందని మీ ఉద్దేశం?'' అని తోటి ఏఎన్ఎమ్స్ అన్నప్పుడు వారికేం జవాబు చెప్పలేక పోయింది. చెప్పటానికి ఆమెకు మాటలు రాలేదు ''నేనేం చెప్పగలను? నా బుర్రేం పనిచేయటం లేదు. నా ఆలోచనమేరకేం అందలేదు. వారంలో రెండు కబుర్లు, చేసింది రమ్మని. కానీ ఈ





కలరా వెళ్ళనిచ్చిందికాదు. ఇంక ఇవాళే బయలుదేరుతున్నాను. ఈ కబురు వచ్చింది. నిన్ననే బయలుదేరవలసింది. ఈమధ్య విశ్రాంతి లేకపోవటం వలన అలసటవల్ల బద్ధకించేశాను. నిన్ననే వెళ్లుంటే నా రమీజా నాకు దక్కేది'' అంది.

''ఇవాళ ప్రొద్దున్నే అనుకున్నామండీ, ఆమె పరిస్థితి అక్కడ బాగులేకపోతే సెలవుపెట్టి ఇక్కడకు తీసుకొచ్చేసెయ్యమని'' అన్నాడు సుదర్శనం ఆ మాటల్లో వాళ్ళకి క్లూ దొరికింది.

''అసలేమయింది అన్నయ్యగారూ?'' అన్నారు ఆసక్తిగా.

''ఆ దౌర్భాగ్యుడికింతకు ముందే పెళ్ళయిందట. ఆ విషయం తెలిసిన దగ్గర్నుంచీ ఆమె అతన్ని దరికి రానివ్వటంలేదట. కోర్టు ద్వారా డైవోర్సుకు కూడా నిర్ణయం తీసుకుందట. ఇవికాక ఇంకా ఏవో ప్రాబ్లమ్స్ ఉన్నాయట. అందుకే వీలయినంత తొందర్లో రమ్మని కబురంపింది. వెళ్లేలోపుగానే ఇంత దారుణం జరిగిపోయింది. ఆ వార్త విని ఈవిడ పడిపోయింది. డాక్టరుని తీసుకొస్తే ఈ పరిస్థితుల్లో ఈమె వెళ్ళకపోవటం మంచిదన్నారు. కానీ వెళ్ళక తప్పదు. ఈవిణ్ణి ఆపడం కూడా కష్టమే. అంతేకాదు ఈవిడ ఇక్కడుంటే ఏమయిపోతుందో అక్కడకెళ్తేనే మంచిదనిపించింది'' అని వాళ్ళకి చెపుతున్నంతలో బస్సు వచ్చింది. అందరూ ఎక్కారు. బస్సులోనూ అదే వార్త! తెల్లారేసరికి ఎలా తెలిసిపోయిందోకాని చుట్టుపక్కల పిహెచ్‌సీల్లో ఏఎన్ఎంలు కూడా రమీజా హత్య విని తల్లడిల్లిపోయారు. ఇది నిజమేనా? అంటే అసలేం జరిగింది? ఎవరు హత్యచేశారు? అనే ప్రశ్నలు కొల్లలు. అమ్మలు వీటికి జవాబు చెప్పే స్థితిలో లేదు. ఆమె మనసునిండా రమీజా! రమీజా! రమీజా!

అర్థగంటలో చేరుకున్నారు. అప్పుడే ఊరు అట్టుడికిపోతోంది. అసలే పల్లెవాతావరణం. ఏనోట విన్నా ఇదేమాట. 'చాలామంచిపిల్ల. పెళ్లి చేసుకుని ఎన్నాళ్లో కాలేదు. ఏవో ఆలుమగల గొడవలు. ఈమధ్య అతగాడు రావటం కూడా లేదట' అని ఒకరంటే 'రాత్రి ఇక్కడే ఉన్నాడట. బార్‌లోకి కూడా వెళ్ళాడట. బార్‌వాళ్లూ అంటున్నారు. యు.డి.సి, ఆమె భర్తా ఏవో కబుర్లాడుకున్నారట కూడా. రాత్రి ఆసుపత్రిలో డెలివరీ కేసుకు కూడా అటెండయిందట' అని ఒకరు. 'అంతే కాదు అర్ధరాత్రి సమయంలో మొగుడూ పెళ్లాలు ఏవో గొడవపడ్డారట. ఆ తరువాత సద్దుమణిగితే, మామూలుగానే గొడవలు సర్దుకుపోయి, పడుకున్నారని అనుకున్నారంతా!' అన్నాడు ఇంకొకడు.

''ఇంతకీ ఎవరు చూశారు? ఆమె హత్య చేయబడిందని?''

''తెల్లార్లేచాక ప్రక్కావిడ ఏదో పనిమీద వాళ్ళింటికి వెళ్లిందట. తలుపు దగ్గరకేసి ఉంటే తోసింది. ఇంకేముంది? ముక్కంట రక్తంకారీ, బుర్ర పక్కకి వాల్చేసి ఉంది. ఒంటి మీద బట్ట కూడా లేదు. ఇంటినిండా పగిలిన చేతిగాజులు. ఆవిడ అదిరిపోయింది. వాళ్లాయనకి చెప్పింది. జనం పోగయారు. హాస్పిటలుకి కబురు చేస్తే డాక్టరు వెంటనే రాలేదు. పోలీసు స్టేషన్‌కి ఫోన్ చేసి ఎస్.ఐ.గారితో వచ్చిచూశారు. పట్నం నుండి సి.ఐ తరువాత వచ్చారు''

దారిలో జనం అనుకుంటున్న మాటలు వింటూ, తడబడుతూ, ముందుకు నడుస్తోన్న అమ్మలుకి రమీజా హత్యవెనుక కథ కొంతవరకూ అర్థం అయింది. పరుగులాటి నడకతో రమీజా ఇంటికి చేరుకుంది. అక్కడ కొన్ని గజాల దూరంలో వర్తులాకారంలో పోలీసులు. ఎవర్నీ ముందు కెళ్ళనివ్వటం లేదు. శవాన్ని గడపలో ఉంచారు. ఒంటిమీద బట్టకప్పారు. ముఖం మీద మాత్రం తెరిచి ఉంచారు.

''రమీ! ఎంత దారుణం జరిగిపోయింది రమీ! ఒక్కరోజు నేను ముందు బయలుదేరి ఉంటే నీకింత ఘోరం జరిగిపోయేదికాదు కదా!'' విలపించడం మొదలెట్టింది అమ్మలు.

అమ్మలు లోనికి చొచ్చుకుపోతుంటే పోలీసులు ఆటకాయించారు. డాక్టరు ఆమెను వదలమని చెప్పాడు. ఎస్.ఐ. పోలీసులకు చెప్పాడు. సుదర్శనం ఆమెను అనుసరించాడు. మృతదేహాన్ని తాకనివ్వలేదు.

అందరూ రమీజా గురించి ఆలోచిస్తున్నారు.

ఎస్.ఐ. డాక్టరును అడుగుతున్నారు. ఆమె దాంపత్యజీవితంలో గొడవలేమన్నా ఉన్నాయా?'' అని. దానికి డాక్టరు ''మొన్నటివరకూ




అంటే కొద్దిమాసాలవరకూ ఆమెకు పెళ్ళయిందని ఎవరికీ తెలీదు. ఈమధ్యనే విశాఖపట్నం నుండి ఆమె భర్త తరువువాళ్లు హాస్పిటలుకు వచ్చారు. ఈమె భర్తకు ఇంతకుముందే పెళ్ళయింది. అతని పేరు కమాలుద్దీన్. బస్సు కండక్టరు. ఈమె చాలా మంచి పిల్ల. మరి ఎలాగ అతని వల్లోపడిందో అర్థంకాదు. వారం రోజులుగా ఆమెలో అసలు కాంతిలేదు. ఏదో వేదనతో కొట్టుమిట్టాడేది. రాత్రి డెలివరీ కేస్‌కు అటెండయింది. ఆమె పరధ్యానంగా ఉంటే కారణం అడిగాను. వెక్కివెక్కి ఏడ్చేసింది. కారణం చెప్పలేదు. సరే... ఒంట్లో బాగులేక పోతే రెస్టు తీసుకోమని నేనే అటెండర్నిచ్చి పంపాను'' అన్నాడు.

ఎస్సై అటెండర్ని కబురుపెట్టాడు. అటెండరు నమస్కారం చేస్తూ వచ్చాడు. ''ఏవయ్యా! నువ్వీమెను ఇంటికి దిగబెట్టావుకదా, అప్పుడింట్లో ఎవరున్నారు?'' అడిగాడు. అటెండరు తెల్లబోయాడు. తెల్లబోయి,

''నేను ఆమెను దిగబెట్టలేదుసార్! డెలివరీ అయాక డాక్టరుగారు రూంలో ఉన్నారు. ఆమెను పిలవమన్నారు. పిల్చి నన్ను ఫ్లాస్కుతో కాఫీ తెమ్మన్నారు. నేను కాఫీ తెచ్చేలోపల ఏమయిందో ఆవిడ పరుగుపరుగున వెళ్ళిపోతోంది. నేను గేటు దగ్గర కలిశాను. అక్కడికీ అడిగాను కాఫీ తాగరా? అని ఆమె జవాబు చెప్పలేదు'' అన్నాడు.

డాక్టరు కంగారు పడిపోయాడు.

''నువ్వెళ్ళలేదా? నేను వెళ్ళమని చెప్పాను కదా?'' అన్నాడు తడబడుతూ.

''నేనక్కడ లేనుకదండీ! అమ్మగారు ఎల్లిపోతున్నారండీ. అని నేను చెప్పినవుడు 'పోతే పోనీ' అని కూడా మీరన్నారు'' అన్నాడు వాడు.

ఎస్సయి గొప్ప స్త్రిక్టయిన మనిషి. అతనికి వెంటనే డాక్టరు మీద అనుమానం వచ్చింది. నోట్ చేసుకున్నాడు. అటెండరు చెప్పిన దానికీ, డాక్టరు చెప్పినదానికీ తేడా ఉండటం గురించీ వెంటనే సిఐకు వైర్‌లెస్ ఇచ్చాడు.

''ఇక్కడ ఆమెకు సన్నిహితులెవరయినా ఉన్నారా?'' అడిగాడు ఎస్సై. అందరూ అమ్మలుని చూపెట్టారు. పోలీసులతో ఎవర్నీ శవం దగ్గరికి, గదిలోనికికానీ వెళ్లనీకుండా చూడమని, 'మీరోసారి రండి' అని ఆమెను తనతో కొస్త దూరంగా తీసుకెళ్ళాడు.

''మీ పేరేంటమ్మా?'' అడిగారు ఎస్సై. జవాబు చెప్పింది అమ్మలు. అతనామెనోసారి తేరిపారచూచి ''చూడండమ్మా! నేను మిమ్మల్ని కొన్ని ప్రశ్నలడుగుతాను. మీరు ధైర్యంగా జవాబులు చెప్పాలి'' అన్నాడు. అమ్మలు తలూపింది. ''సరే... అంతకంటే ముందుగా ఆమె వివరాలు కావాలి'' అన్నాడు.

''ఆమె తల్లిదండ్రులెవ్వరను తెలుసా?'' అడిగాడు.

''ఆమె ఒక అభాగిని. ఒక అనాథ. పుట్టినపుడే తల్లిదండ్రులకు దూరమైంది. ఆమె తల్లి రాజుల కుటుంబానికి చెందినది. తండ్రి ఒక ముస్లిం. అయితే అతనెవరో, అతనెక్కడున్నాడన్నది ఎవరికీ తెలియదు. ఆమెను పెంచి పెద్ద చేసిన తల్లిదండ్రులు ముస్లిం దంపతులు'' అన్నది.

''వాళ్ళ అడ్రస్ ఉందా?''

చెప్పిందామె. నోట్ చేసుకున్నాడతను. రైటర్ని పిలిచి ఆ అడ్రసుకు ఫోన్ చేసి వాళ్ళని రప్పించే ఏర్పాటు చేయమన్నాడు. అతను వచ్చి వివరాలు నోట్ చేసుకొని వెళ్లాడు. అతనెళ్లాక ఆమె అంది, ''ఇప్పుడు వారికంటే ఆమెకు ముఖ్యమయిన, కావలసిన వ్యక్తులున్నారు. చాలా రోజుల తరువాత ఆమె తల్లి సంబంధీకుల చిరునామా తెలుసుకోగలిగింది. వాళ్ళు కలకత్తాలో ఉన్నారు. కానీ వాళ్ళ చిరునామా తెలీదు నాకు. కానీ ఈ విషయం వాళ్ళకు తెలీటం ఎంతయినా ముఖ్యం'' అంది.

'మరెలా?' అతనన్నాడు. అనేసి, ''పోనీ ఆమె గదిలో వెతుకుతే వాళ్ళ అడ్రస్ దొరుకుతుందేమో?'' అన్నాడు.

''ఎగ్జాక్ట్లీ, ఆమె డైరీలో ఉంటుంది'' అంది.

''ఆమె డైరీ రాస్తుందా?'' అనడిగాడు

''సహజంగా మాకందరికీ రాసుకోడం అలవాటు లేకపోయినా, మా టూర్లు, మేం బుక్ చేసుకున్న ఆపరేషన్‌కు సంబంధించిన వ్యక్తుల పేర్లూ నోట్ చేసుకుంటాం. అయితే రమీజాకి మాత్రం చిన్నప్పట్నించీ డైరీ రాసే అలవాటుంది'' అంది.

ఎస్సయి ఎగిరిగంతేశాడు.

"అచ్ఛా... అలా అయితే హంతకుణ్ణి సులువుగా పట్టుకోవచ్చు. అంతేగాక ఈ హత్యవెనుక దాగి ఉన్న కథ తెలుసుకోడానికి అవకాశం ఉంది. ముందుగా వెళ్ళి ఆమె డైరీలు సీజ్ చెయ్యాలి" అన్నాడు. "సరే... మరికొన్ని విషయాలు మిమ్మల్నడగాలి. ఈమధ్య ఆమెనెప్పుడయినా మీరు కలిశారా? ఆమె దేనికయినా బాధపడటం మీకు తెలుసా?" అన్నాడు.

"నేను కలిసి కొన్నాళ్ళయింది. అప్పుడు కలిసినపుడు భర్తకీ, ఆమెకూ మధ్య గొడవలు జరగటం గురించి చెప్పింది. అంతకంటే మరో విషయానికి ఎక్కువ..." అని ఆగిపోయింది.

"ఆఁ... మరో విషయానికి చెప్పమ్మా.. నీకేం భయంలేదు. నిన్నిక్కడకి పిలవటానికి మరోకారణం ఉంది. డాక్టరు అటెండర్నిచ్చి ఆమెను ఇంటికి సాగనంపినట్లు చెప్పాడు. అటెండరు చెప్పిన వెర్షన్ ఇంకోలా ఉంది. అందునుంచి ఈ హత్యలో ప్రత్యక్షంగానో, పరోక్షంగానో డాక్టరు పాత్ర ఉందేమోనన్న అనుమానం కూడా ఉంది. ఈ డాక్టరి కేరెక్టరుకూడా మంచిది కాదన్న వార్తలు వినవస్తున్నాయి" అన్నాడు.

అమ్మలుకు చెమటెక్కింది. నుదిటికి పట్టిన చెమటని రుమాలుతో తుడుచుకుంది. దుఃఖం పొంగుకుని వచ్చింది. నోటిలో పైట అడ్డం పెట్టుకుంది. సమాధానం చెప్పలేకపోయింది. "చూడమ్మా! నువ్వేం సంశయించకు. ఒక ఆడదాని జీవితం మనయిపోడానికి కారకులయిన ఎవర్నీ వదిలిపెట్టేదిలేదు. అతడెంతటివాడయినా" అన్నాడు.

అమ్మలుకు ధైర్యం వచ్చింది. కోపం హెచ్చింది.

"మీలాటి ఎస్సయిలుంటే ఆడాళ్ళు ఈ దేశంలో ఇంత అన్యాయంగా బలైపోయి ఉండేవారుకారేమో! రమీజా కమాలుద్దీన్ వల్ల మోనపోయిన దానికంటే డాక్టరువల్లనే ఎక్కువ కష్టపడింది. నష్టపడింది. తన భర్త మోసం చేశాడన్న విషయం తెలిసినపుడు ఆమె ఒకటే అంది, ఉద్యోగానికి రిజయిన్ చేసి కలకత్తా వెళ్ళిపోదామనుకుంది. కానీ ఆమె భర్తవల్ల, అర్ధరాత్రి డెలివరీ కేసుకు అటెండుకాలేకపోయింది. పుట్టెడు జబ్బులతో ఉన్న ఆమె చనిపోతే, మెటర్నటీ అసిస్టెంట్ నిర్లక్ష్యం వల్లనే పేషెంట్ చచ్చిపోయిందన్న తప్పుడు ప్రకటన పేపరుకిస్తానని బెదిరించి, వంటిమీద తెలివిలేని స్థితిలో ఉన్న ఆమెను పాడుచేశాడు డాక్టరు. అందుకే రమీజా ఎంతో ఏడ్చింది" అన్నది.

"ఆమెకు తెలివిలేదని ఎలా చెప్పగలుగుతున్నారు?" ఎస్సయి అడిగిన ప్రశ్నకు ముందు రోజు కమాలుద్దీన్ చేసి వెధవపనిని అమ్మలు ఎస్సయికి వివరించింది.

'స్టుపిడ్!' అని ఎస్సయి పళ్లుకొరికి "ఆమె భర్త వైజాగ్‌లో ఎక్కడుంటున్నదీ తెలుసా?" అడిగాడు.

"ఆ అడ్రసులన్నీ ఆమె డైరీలో నోట్ చేసుకుంటుంది" అంది.

"థ్యాంక్యూ... మీరు వెళ్ళండి. ఇక్కడ జరిగిన విషయాలేవీ బయటపెట్టకమ్మా" అన్నాడు.

ఆమె నమస్కారం చేసి కదిలింది. గుండె బరువు కొంత తగ్గినట్లు అయింది. ఆమె రాగానే డాక్టరు ఆత్రుతగా పిలిచాడు. "ఏం? ఎందుకు పిలిచినట్టు ఏం అడిగారు" అని అడిగాడు.

ఆమె కుటుంబ సభ్యుల వివరాలు, ఆమెకూ నాకూ గల పరిచయం, కమాలుద్దీన్ ఎలా పరిచయమైనదీ అడిగారు, అంతే అంది. డాక్టరు ఊపిరిపీల్చుకున్నాడు తేలిగ్గా. ఆ తరువాత ఎస్సయి వచ్చి రమీజా గది తలుపులు తెరిచి లోనికి వెళ్ళాడు. తనతో ఎవర్నీ లోనికి రానివ్వలేదు. పెట్టెలు, సూట్‌కేసులూ వెతికాడు. బీరువా తాళాలు తెరిచి చూస్తే దానిలో ఎవో కొన్ని ఉత్తరాలు, మూడు డైరీలు కనిపించాయి. ఆ సంవత్సరపు డైరీని తీసి అక్కడికక్కడే తిరగేశాడు. అతనికి ఆసక్తికరమైన విషయాలు కనిపించాయి. తన హేండ్‌బాగ్‌లో డైరీలను దాచేశాడు. కలకత్తా వాళ్ళ అడ్రస్ కూడ దొరికింది. వెంటనే కలకత్తాలో వాళ్ళ కుటుంబానికి మెసేజ్ పంపాడు.

మరో గంటకి సి.ఐ., డి.వై.ఎస్.పి. వచ్చారు. అయితే ఆ గ్రూప్ అందరూ ఒక లాటివారే. ఆ ఎస్సయి, సి.ఐ., డి.వై.ఎస్.పి. ఎవరికీ లొంగని వ్యక్తులని ప్రతీతి. అందుకే వాళ్ళనింత చివ




రకు విసిరేశారని అంటారు. 'ఎక్కడున్నా మా పనిని మేం మానమని వాళ్ళు ఈ ప్రాంతాలకొచ్చిన తరువాత వాళ్ళ ప్రతాపాన్ని చూపెట్టారు. దొంగసారా తయారీల మీద దాడిచేశారు. ఎంతోమందిని అరెస్టు చేశారు. అధికార పార్టీ ఎమ్మెల్యేని అరెస్టు చేశారు. పేకాటలన్నీ రూపుమాపారు. జేబుదొంగలు లేకుండా చేశారు. ఎన్నాళ్ళనుండో పెండింగ్‌లో ఉండి దొరక్కుండా తప్పించుకుంటున్న నేరస్థులను, హంతకులను పట్టుకున్నారు. ఈ రకంగా ఆ త్రయం పేరు మారుమ్రోగిపోయిందక్కడ.

ముగ్గురూ రహస్యంగా చర్చించుకున్నారు. శవాన్ని పోస్టుమార్టంకి పంపారు. సాయంకాలానికల్లా రమీజా పెంపుడు తల్లిదండ్రులు వచ్చారు. ఏ కన్నతల్లీ కూడా అంత ఘోషించదేమో! అంతలా రోదించింది. "ఈ సంబంధం వద్దని సెవికిల్లుకట్టుకొని సెప్పాం. వద్దమ్మా, ఈడి మేనమావ వల్లనే నీయమ్మ బతుకు పాడయిందీ అని ఆళ్ళ నాన్న సెప్పారు. రమీజాని పరాయిబిడ్డలాగా ఎప్పుడూ సూళ్లేదు. ఇంకా మా పిల్లల్నయినా ఎప్పుడో సీవాట్లేసిన రోజులున్నాయికానీ రమీజాని పన్నెత్తి ఒక మాట అని ఉండలేదు. అయితే మాకు తెలకంట రాస్యంగా పెల్లి సేసుకోవల్సి వచ్చిందని సెమించమన్నపుడు నాకెంతో కోపంవొచ్చింది. ఎందుకంటే ఆడుసెండాలపువెదవని, దరిద్రపు ఎదవని మాకు తెలుసుకాబట్టి. ఎంత గోరం జరిగిపోనాదే! నీ బతుకల ఆ ఎదవిలా బుగ్గోత్తాడని ఊయించనేదే?" అని పెంపుడు తల్లి తలబాదుకుంటూ, పిచ్చిదానిలా అయింది.

ఆమె వెనుక ఆమె భర్తా, పిల్లలూ శోకమూర్తులై శిలా ప్రతిమల్లా నిల్చున్నారు. వాళ్ళముఖాల్లో రక్తపుచుక్కయినా లేదు. ఏడ్చిఏడ్చిన వాళ్ళకళ్లలో కన్నీరు ఇంకిపోయినట్లుంది. నీరు ఎండిన వేసవి నూతుల్లా అయిపోయాయి వాళ్ళకళ్ళు. డాక్టరు పోస్టుమార్టం రిపోర్టు ఇచ్చాడు. రమీజాకు గొంతు దగ్గర, ముక్కు మీద, పొట్టమీద బలమైన దెబ్బలున్నాయి. గొంతు దగ్గర నాళాలు పూర్తిగా చిట్లి ఉన్నాయి. ఆమె ఊపిరందక చనిపోయినట్లు రిపోర్టులో తేలింది.

ఉదయంనించి సాయంకాలం వరకూ అక్కడున్న వాళ్లేకాదు. పల్లెటూరు కావటం చేత ఎవరూ వంట కూడా చేసుకోలేదు. ఊరుశోకంలో మునిగితేలింది. శవదహనం జరిగితే కాని పల్లెల్లో తిళ్లు తినరు, ముఖ్యంగా ఆవీధిలో ఉన్నవాళ్లు.

అయితే-

పోస్టుమార్టం జరిగినా కలకత్తానుండి రమీజా బంధువుల రాకకోసం నిరీక్షించటం చేత ఆసుపత్రిలోనే శవం కంపుకొట్టకుండ జాగ్రత్తగా ఉంచారు. సుదర్శనం అప్పుడన్నాడు అమ్మలుతో, "అమ్మలూ! బాబు ఏడుస్తాడో ఏమో! రోజల్లా ఇద్దరంలేము. అమ్మ ఏం కంగారు పడుతుందో? నాకు భయంగా ఉంది" అని. అప్పుడు గుర్తువచ్చింది అమ్మలుకి ఇల్లూ పిల్లాడు! మొదట కంగారుపడింది, "ఏం చేద్దాం? ఇప్పుడెలా? వెళ్లేందుకు బస్సు కూడా ఉందో లేదో" అన్నాడు.

"ఇప్పుడు బస్సున్నా ఎలా వెళ్తాం? కలకత్తా నుండి వాళ్లొస్తారేమో?" అంది. పోనీలెండి, వసంత బాబునాడిస్తుంది. ఎటొచ్చీ మీ అమ్మగారేం కంగారుపడతారోననే నా భయం! పోనీ ఒక పని చేస్తారా? మీరేదో కన్వీనియన్స్ చూసుకొని వెళ్లండి. నేను రేపు ఇక్కడి తంతు ముగిసాక వస్తాను. మీ అమ్మగారికి చెప్పండి, కంగారుపడొద్దని". అని "గొంతుకెండిపోతోంది" అంది.

సుదర్శనం వెళ్ళి కూల్‌డ్రింక్ తెచ్చి ఇచ్చాడు. ఈలోగా వసంతకు కాబోయే మామగారొచ్చి "మీరేం చేస్తున్నారు? ఈ రాత్రికి ఉండిపోతున్నారా?" అడిగాడు.

"అదే ఆలోచిస్తున్నాం, ఇంటి దగ్గర అమ్మేం కంగారుపడుతుందోనని. మీరేం చేస్తారింతకీ? బండితెచ్చారా?" అనడిగాడు.

"నేనెళ్లాలి... బండితెచ్చాను.. ఫ్రెండింటిలో పెట్టాను" అన్నాడు.

"నాకు లిఫ్టివ్వగలరా?"

"ఆఁ... రండయితే.. నేను తోడులేరనే ఆలోచిస్తున్నా. మరి ఆవిడెక్కడుంటారు" అని అడిగాడు. ఇంతలో ఆ ఊర్లో ఎఎన్ఎంగా పని చేస్తోన్న ఒకామె వచ్చి "మా ఇంట్లో ఉంటుంది లెండి... ఫర్వాలేదు" అంది.

"సరేఅయితే... అమ్మలూ... మేం వెళ్తాం. ఇప్పటికే బాగా రాత్రయింది" అనేసి "వాళ్లా

చ్చినా రేపటికిగానీ రాలేరు. కలకత్తానుండి రావటానికి చాలా టైం పడుతుంది'' అన్నాడు.

''లేదులెండి... వాళ్లింట్లోనే ఉంటే ఫోనందు కోగానే ప్లెయిన్‌లో విశాఖవచ్చేసి, అక్కణ్ణుంచి టాక్సీలో వచ్చేస్తారు. నా ఉద్దేశ్యంలో మూడు, నాలుగ్గంటలకి వాళ్లు రావాలి'' అంది. ఆమె గొంతు పూర్తిగా బొంగురుపోయింది. ఆడుతున్న మాట సరిగా రావటంలేదు. నోరునొప్పి పుడుతోంది మాట్లాడుతుంటే. అతనువెళ్లి బండి తీసుకొచ్చాడు. 'సుదర్శనం రెండు పక్కలా కాళ్లువేసి కూర్చున్నాడు. వస్తా జాగ్రత్త'' అన్నాడు. బండి జోరుగా ముందుకుపోయింది.

ఆ రాత్రి పోలీసులు నిద్రపోలేదు. ఆ రోజు ఆసుపత్రి ఒక యాత్రా స్థలంలా ఉంది. తెల్లవార్లూ ఎవరూ నిద్రపోలేదు. ఏ జీపు వచ్చినా, ఏ కారు వచ్చినా అమ్మలు అటే చూసేది వాళ్లొస్తారేమోనని. సరిగ్గా నాలుగ్గంటలకి మూడు టాక్సీల్లో వచ్చారు. సుమారు పన్నెండు మంది. అందులో ఇంకా ఈ దారుణాలు చూడ్డానికే బతికి ఉన్నామన్నట్లు పండుటాకుల్లాటి ముదివగ్గులని అటూ ఇటూ పట్టుకుని దింపుతుంటే 'రామరామ! ఈళ్ళకెన్ని పాట్లొచ్చినాయి' అనని పల్లెటూరు నోరులేదు!

''ఎక్కడ? మా రమీజా ఎక్కడ? ఇంత మంది ఉండీ మా పిల్లను కాపాడలేకపోయారా?'' అని ముసలావిడ పడిన బాధను వర్ణించటానికి మాటలు దొరకవు.

తెల్లారిన తరువాత వాళ్ల చేతులమీదుగా అంత్యక్రియలు జరిగిపోయాయి. ''వద్దమ్మా! నువ్వు వెళ్లొద్దు. నీ కెందుకా ఉద్యోగం అని ఎంత చెప్పాం విన్లేదు. ఇలాంటి చావుకోసమే వచ్చేసిందిక్కడికి. ఉన్న కొద్దిరోజులూ మా కళ్లలో వెలుగుపూలు పూయించింది. మా బతుకుల్లో కొత్త కాంతులు నింపింది. మళ్లీ వెళ్లిపోయింది. మాకు మరి వెన్నెలలేదు. మా బ్రతుకంతా అమావాస్య రాత్రులే!'' అన్నాడు అందులో ఒక నడివయస్కుడు.

వచ్చినవాళ్లు వెళ్లిపోయారు.

అంతా అయిపోయింది. రమీజా కలలో మనిషయింది.

★ ★ ★

రమీజా హత్య జరిగిన తరువాత అమ్మలు కొన్నాళ్లవరకు మనిషి కాలేకపోయింది. టైఫాయిడ్ జ్వరం వచ్చిన మనిషిలా అయిపోయింది. ఒక పదిరోజులవరకూ డ్యూటీకి వెళ్లలేకపోయింది. ఎవరైనా అర్జంటుగా వస్తే వెళ్లక తప్పదన్న కేసయితే ఇలా వెళ్లి మళ్లీ అలా వచ్చేసేది. సుదర్శనానికి అమ్మలు పరిస్థితి చూస్తే భయం వేసింది. అమ్మల్ని మళ్లీ మామూలు మనిషి చేయటం ఎలాగో అతనికి తెలియలేదు. మనిషిలో హుషారులేదు. తిండి మీద ధ్యాసలేదు. అంతకుముందు ఎంత పనిలో ఉన్నా, ఎంత ఎండలో వచ్చినా పిల్లాడితో కొంతసేపు గడిపితే కానీ తక్కిన పనుల్లోకి వెళ్లేదికాదు. ఇప్పుడు పిల్లాడు పాకుతున్నాడు. చిన్న చిన్న పలుకులు పలుకుతున్నాడు. ఒళ్లు కూడా చేశాడు. అయినా వాణ్ణి కూడా పట్టించుకోవడంలేదు. ఎప్పుడైనా వాడొచ్చి మీదపడితే పరధ్యాన్యంగా ఎత్తుకుంటుంది. వదిలేస్తుంది. నిద్రపట్టినట్టే పడుకుంటుంది. నిద్రలో ఉలిక్కిపడి లేచిపోతుంది. ఒకరోజు అయితే ఏదో ఆలోచిస్తోన్న అమ్మలును చూసి సుదర్శనం, ''అమ్మలూ! ఎంతకాలం అలా బాధపడతావ్? నిన్ను బాధపడొద్దనిగానీ, బాధపడటం తప్పు అనటంగానీ నా ఉద్దేశంకాదు. కానీ పోయినవాళ్లతో పోలేం! గతాన్ని జ్ఞాపకం చేసుకోవటం మానవజీవితంలో ఎంత గొప్ప విషయమో, కొన్ని విషయాలు మరచిపోవటం కూడా అంత గొప్పవరమే. ఈ మరుపే లేకపోతే మానవజీవితమే దుఃఖమయం' అని ఈ మధ్యనే నేనేదో పుస్తకంలో చదివాను. ఆ మాటలు నిజంగా ఎంతో చక్కగా వ్రాసాడా రచయిత. అందునుంచి జరిగిన విషయాలన్నీ బుర్రలో పెట్టుకుంటే వర్తమానం దుర్భరం. భవిష్యత్తు భయంకరం కాకతప్పదు. అయిపోయింది. ఒక పీడకల జరిగిపోయింది. దాన్ని చెరిపేసుకోవాలి. తలచుకుంటే నాకే గుండెలు పిండేసినట్లయిపోతుంది. అందుకే ఆ విషయాలన్నీ మరచిపోడానికి ప్రయత్నించు. ఖాళీగా ఉండటానికి ప్రయత్నించు. గతంలోలాగా నీ పనిలో ఎక్కువ గడుపు. లేదా పుస్తకాలు చదువుకో. టేప్‌రికార్డరు పెట్టుకో. మంచి పాటలు వింటే మనసుకి ఆనందం కలుగుతుంది. టీ.వీ. చూ




డు. లేదా ఎక్కడికయినా టూర్ పెట్టుకుందాం కొన్నాళ్లు. దానివల్ల మనసుకు హాయినిస్తుంది. అంతేగానీ అలాగా విచారిస్తూ కూర్చుంటే మరింత ఆరోగ్యం పాడవుతుంది. నా మాటవిను. లే'' అన్నాడు. ఆ మాటలువిన్న అమ్మలు ఆకాశం పెళ్లున విరిగిపడినట్లుగా కూలిపోయింది సుదర్శనం ఒళ్లో. సుదర్శనం అవాక్కయిపోయాడు. తరువాత తేరుకుని ''లే. లేచి ముఖం కడుక్కునిరా. అలా సినిమాకు వెళ్లొద్దాం'' అన్నాడు. తనకి మనసులో ఇష్టంలేదు. తనకు తెలుసు. తను సినిమా కూడా చూడలేదని. కూర్చున్నా పడుకున్నా రమీజాయే కళ్లకు కట్టినట్లు కనిపిస్తోంది. ఒక్కొక్కసారి చిలిపిగా పలకరిస్తూ ''ఏంటే? ఇంకా ఏడుస్తున్నావా? ఆ బాధలు భరించి, అలాగా జీవించేకంటే ఇప్పుడెంత హాయిగా ఉందో తెలుసా? ఏమ్మా! ఇప్పుడింత బాధపడ్తున్నావు. ఒక్కసారి- గంట తీరుబాటు చేసుకొని వస్తే నా బ్రతుకుతీరే మారిపోయిఉండేదిగా! అయినా భగవంతుడు ముందే రాస్తాడట. వీళ్ల ఆయుష్షు ఇన్నాళ్లేనని! మనం పిచ్చిగా అనుకుంటాం, అయ్యో! వాడు చంపేశాడని! అది 'ఆత్మహత్య' చేసుకుందని.

అయినా-

చంపడానికి వాడెవడు? ఆత్మహత్య చేసుకోడానికి దానికెక్కడ అధికారం ఉంది? ఆడేదీ, ఆడించేదీ అంతా ఆ భగవంతుడే! రోగికి సరియైన మందివ్వని కారణంగానే వాడు చనిపోయాడని బాధ పడుతుంటాం. అదొత్తి భ్రమ. వాడి తలరాత అలాగుంది. ఏం? ఎంతమంది ఆస్పత్రిలో మందులెక్కించినా, అహరహం పేషెంట్ దగ్గర కూర్చుని ట్రీట్‌మెంటు ఇస్తున్నా చనిపోవటంలేదు. వాళ్లెందుకు బతకటంలేదు మరి. అంతే. వాళ్లు చేరవలసిన గమ్యం చేరుకున్నారు. అక్కడితో వాళ్ల జీవితానికి తెర పడిపోయింది. దానికెందుకంతలా బాధ పడతావ్. లే... నిన్ను కనిపెట్టుకున్న భర్తా, నువ్వు అల్లారుముద్దుగా పెంచుతోన్న నీ కొడుకూ వీళ్లంతా నీకున్నారు. నువ్వేడుస్తూ కూర్చుంటే ఎలా? లే. హుషారుగా ఉండు' అన్నట్లు, తన కళ్లముందు కదలాడినట్లు అయి పిచ్చిదానిలా అయిపోతోంది అమ్మలు. అంత మరిచిపోలేకపోతున్న విషయాన్ని మరచిపోయినట్లు ఎలా నటించగలదు. అందుకే వద్దంది. కానీ సుదర్శనం వినిపించుకోలేదు. నారాయణమ్మ కూడా దెబ్బలాడింది. అలా కూర్చున్నకొద్దీ విచారం పెరుగుతుందే కానీ తరగదు. అలా గుడికెళ్లండి. వెంకట్రమణమూర్తికి కొబ్బరి కాయ కొట్టండి తరువాత ఓ సినిమాకెళ్లిరండి' అని అనటంతో అత్తగారి మాటకెదురు చెప్పలేకపోయింది.



రమీజా హత్య జరిగిన తరువాత పోలీసులు చాలాసార్లు హాస్పిటల్‌కి వచ్చి విడివిడిగా ఎంక్వయిరీ చేశారు. రమీజా డైరీలో రాసుకున్న విషయాలు బట్టి ఆమె మానసికంగా కృంగిపోడానికి కారకుడు డాక్టరేనని పోలీసధికార్లు నిర్ధారణ చేసుకున్నారు. ఆ రకంగా డాక్టరుమీద ఏక్షన్ కూడా తీసుకోడానికి సన్నాహాలు చేశారు. ఈ విషయం మొత్తం హాస్పిటల్ సిబ్బందిలో కొందరికి అమితోత్సాహాన్ని కలిగించింది. కొంతమంది మాత్రం ఏది ఎలాపోతే తమకేం? అన్నట్లు ఉండిపోయారు. ఈ మధ్యకాలంలో డి.ఎమ్.ఒ రెండుసార్లు రావటం, ఏవేవో విషయాలు సేకరించటం జరిగింది.

ఇంత జరుగుతున్నా డాక్టరులో మాత్రం రవంత ఆందోళనగానీ, భయంకానీ కనిపించలేదు. అతడి దృష్టంతా అమ్మలుమీద ఉంది. అసలు తనమీద ఈవిధంగా బేడ్ ప్రోపగాండాకు కారణం అమ్మలేనన్నది అతని అనుమానం. అందుకే- అమ్మలుకు కబురుచేశాడు. అమ్మలు వెళ్లింది. రూంలో అతనే ఉన్నాడు. యు.డి.సిగానీ, హెచ్వీగానీ, స్టాఫ్‌లో ఇంకెవరుగానీ లేరు. రమీజా పోయిన తరువాత ఆసుపత్రికి వెళ్లడం అదే మొదటిసారి. అందునుంచి అమ్మలు మనసు తీరని దుఃఖంతో నలిగిపో

తేంది. అతని ముందు నిలుచుంది దోషిలా. అతనెప్పటికీ కూర్చోమనలేదు. ఏదో కాగితాలు చూసుకుంటున్నట్లు నటించాడు. అందుకని అమ్మలే "పిలిపించారట" అంది. అప్పటికీ అతను పలకలేదు. ఆ తరువాత తలెత్తి "ఓహెూ! మీరా? ఎవరో అనుకున్నాను. రండి మేడం. కూర్చోండి" అన్నాడు. ఆ స్వరంలో వ్యంగ్యం, హేళన కొట్టొచ్చినట్లు కనిపించాయి అమ్మలుకి. ఆమె కూర్చుంది.

"మీరింకా మీ మిత్రురాలి హత్యా దుఃఖంనుండి తేరుకోలేదనుకుంటా" అన్నాడు. ఆమె జవాబు చెప్పలేదు. "పోయినవాళ్లతో మనం కూడా పోలేంకదా! అయినా మీరు అంతగా బాధపడటంలో అర్థంలేదు. వాళ్ల బంధువులే అంతగా పట్టించుకున్నట్లు లేరు. సాధారణంగా వాళ్లు సంపన్నులు గనుక దీని వెనుకాల ఏదో గూడుపుఠాణీ ఉందనీ, ఈ హత్యకు కారకులను వదిలిపెట్టకూడదని వాళ్లనుకొని, పోలీసు రిపోర్టులివ్వటం అదీ జరగాలి. కానీ అదేం జరగలేదు. వాళ్లు మామూలుగానే వెళ్లిపోయారు" అన్నాడు. అమ్మలుకి అతని ప్రవర్తనమీద అసహ్యంవేసింది. కోపం, దుఃఖం రెండూ కలగలిపి వచ్చాయి. కానీ అతనాఫీసరు. కోపాన్ని ప్రదర్శించి ఆమె ఏం చేయగలదు? అందుకే ఊరుకోవాలనుకుంది. కానీ ఊరుకోలేకపోయింది. "కానీ వాళ్లు చేతకాక ఊరుకోలేదు. రమీజా, మీద అభిమానం లేకగానీ, మరో కారణంగా కానీ వెళ్లిపోలేదు. వాళ్లుంటున్నది చాలా దూరంలో. కేసు పెడితే ప్రతిసారీ తిరగటం చాలా కష్టం. మొదట్లో బాధలో, ఆవేశంలో కేసు పెట్టినా, తరువాత తిరగటం కష్టం. వాళ్లందరూ గెజిటెడ్ ఆఫీసర్లు. ఆఖరివాడు- అంటే రమీజా మేనమామ కొడుకు మాత్రం దీని అంతుతేలేదాక' వదలకూడదనే అన్నాడు. కానీ వాళ్లతన్ని చల్లార్చేశారు. ముసలాయన ఒక మాటన్నాడు. 'మనం కేసు పెట్టినా, హంతకులు దొరికినా, దీనివల్ల చాలామంది వ్యక్తులు బయటపడినా మనకేమిటి ప్రయోజనం? డబ్బు గురించి మనం ఆలోచించటంలేదు. కానీ పోయిన మన పాప మనకు తిరిగొస్తుందా? తిరిగిరాదు. తీరా మనం నానాతంటాలుపడి, కోర్టుల చుట్టూ తిరిగినా, హంతకుణ్ణిగానీ, ఆమెనీ విధంగా క్షోభకు గురిచేసిన వ్యక్తుల మీదగానీ సరియైన చర్యలు తీసుకుంటారని గ్యారంటీ ఏమిటి? ఈ లోకంలో డబ్బు, పలుకుబడి ఉంటే నడిరోడ్డులో అందరూ చూస్తుండగా హత్య చేసినా, కోర్టులు అతన్ని ఏమీ చేయలేవు. ఒక తప్పుడు సాక్ష్యంతో కొట్టిపారేయవచ్చు" అన్నాడు. ఆ ముసలాయన అనుభవంముందు అతని కొడుకులూ, మనవలూ తలవాల్చేశారు. అంతేగానీ వాళ్లు బాధపడలేదని కాదు. దైవం అంటూ ఉంటే తప్పుచేసిన ప్రతీవ్యక్తీ ఇవాళ కాకపోయినా, ఏనాడయినా శిక్షను అనుభవించి తీరతాడు. ఇది తప్పదు" అన్నది. ఆమె మాట్లాడుతున్నది తన పైఅధికారితోనన్న విషయం మరచి...

"ఇంతకీ రమీజా హత్య ఎందుకు జరిగి ఉంటుందో మీరూహించారా?" అన్నాడు.

"నేను ఊహించలేదు"

"పోనీ ఎవరై ఉంటుందీ ఊహించగలరా?"

"ఇంకెవరు? ఆమె భర్త. ఆ కిరాతకుడే అయివుండాలి" అంది.

"మరి అలాటప్పుడు నా ప్రస్తావన ఎందుకొచ్చింది పోలీసాఫీసరు దగ్గర?"

అతనలాగా అడిగేసరికి ఆమె గొంతులో తడారిపోయింది. మాట పెగల్లేదు. శరీరం వణికింది. మళ్లీ తేరుకుని "అక్కడ మీ ప్రస్తావన వచ్చిందో, లేదో నాకేం తెలుసు?" అంది.

"మిమ్మల్ని ఎస్సై తన రూంకి పిల్చుకుని ఏమడిగాడసలు?"

"ఆ విషయాలన్నీ ఆరోజే చెప్పానుగదా!"

"మీరు చెప్పిన విషయాలు పూర్తిగా చెప్పలేదేమోనని నా అనుమానం!"

అసలు మీకా అనుమానం ఎందుకొచ్చింది?"

"అక్కడున్న హెడ్‌కానిస్టేబులు మీరు రమీజా ఆమె భర్తచే మోసగింపబడిందానికంటే, నా వల్లనే ఎక్కువ చిత్తక్షోభ అనుభవించినట్లు చెప్పటం నాతో చెప్పటంవలన" అన్నాడు.

"అబద్ధం! ఆరోజు మేం మాట్లాడుతున్నప్పుడు అక్కడెవరూ లేరు. ఇదంతా కట్టుకథ. మీరు నన్ను అనుమానిస్తున్నారు" అంది రుద్ధ కంఠంతో.




# సచిత్ర విచిత్రం

## భారీకాయుడి భోజన సన్నాహం



పాపం! బిల్‌మర్ఫీ అనే ఈ బొద్దు మనిషికి శరీరం బరువు ఓ సమస్య అయితే అంతకన్నా పెద్ద సమస్య తిండి మానడానికీ, తగ్గించడానికీ వీల్లేదని డాక్టర్లు చెప్పడం. 37 సంవత్సరాల వయసుకే 300 కిలోలున్న ఈయనగారికి ఓ వింత జబ్బువుంది. పొరపాటున తను ఎప్పుడూ తినేతిండి మోతాదును ఏమాత్రం తగ్గించినా ప్రాణానికే ప్రమాదం. ఈ సమస్యకి ఆపరేషన్ ఒక్కటే పరిష్కారమన్నారు వైద్యులు. అయితే దానికయ్యే ఖర్చు లక్షల్లో వుండటంతో ఇటు బతికినంత కాలం తిండికి ఖర్చుపెట్టాలా లేక అటు అర్జంటుగా ఆపరేషన్‌కే ఖర్చుపెట్టాలా అని ఆయా ఖర్చులు బేరీజు వేస్తూ ప్రస్తుతానికి తిండి పని పడుతున్నాడాయన.

## ప్రకృతి ఇచ్చిన బహుమానం

**అం**దమైన ప్రకృతి పరిసరాలను తన కెమేరాలో బంధించడం అలవాటు క్వీన్స్‌లాండ్‌కి చెందిన ఎలిజబెత్ నూన్‌కి. ఆవిడోసారి శలవు దినాల్లో న్యూజిలాండ్ వెళ్లింది. అక్కడ అందమైన 'రిమార్కబుల్ పర్వతాల నానుకుని ఓ పెద్ద సరస్సువుంది. ఆ సరస్సు మీద ఓ పెద్ద సముద్రపు పక్షి ఎగురుతుండగా అక్కడి విపరీతమైన చలికి కాసేపు గాల్లోనే బిగుసుకుపోవడం గమనించి ఆ దృశ్యాన్ని సెకనులో వెయ్యోవంతు వేగంతో తన కెమేరాలో బంధించింది నూన్. ఆ ఫొటో తర్వాత తనకు 'ఎక్సలెంట్ ఫొటోగ్రాఫ్'గా 50 పౌండ్ల బహుమతి అందించబోతోందని అప్పుడు తెలియదు ఆవిడకి.



"నిజమా?" అన్నాడు సిగిరెట్టుతీసి వెలిగిస్తూ.

"ముమ్మాటికీ నిజం"

"పోనీ, మీరు నామీదే దుష్ప్రచారం చెయ్యలేదంటారు. ఒక్క అయిదు నిమిషాలు మీరు లోపలికెళ్లండి" అన్నాడు. అక్కడెవరూ లేరు. తనొక్కతే ఉంది. ఆమెకు భయంవేసింది. "వెళ్లండి. మీకేం భయంలేదు" అన్నాడు. ఆమె లోనికి వెళ్లింది. డాక్టరు ఫోన్ చేశాడు పోలీస్టేషన్‌కి.

"ఎవరూ? ఆ... నమస్తే. నేనూ డాక్టరు కృష్ణారావు మాట్లాడుతుంట. హెడ్‌కానిస్టేబులు గారున్నారా? ఉంటే ఓసారి ఆయనికివ్వండి ఫోన్" అన్నాడు. "ఆఁ... నమస్కారం! మీతో పనుంది. అర్జంటుగా ఓసారి రాగలరా?" అన్నాడు. "ఇప్పుడే వెళ్దురుగాని" అని డాక్టరు ఫోన్ దించేశాడు. మరికొద్ది నిమిషాలు గడిచింది. స్కూటరాగిన చప్పుడయింది. అమ్మలు గుండె సాధారణవేగంకంటే ఎక్కువగా కొట్టుకుంటోంది.

"ఏంటి సార్? ఎందుకు పిలిచారు?"

"రేపు పార్టీ ఉంది వస్తారా?"

"ఉత్త పార్టీ. అయితే ఎందుకు సార్?"

"మీకేం కావాలి?"

"మందు పార్టీ"

"అది మనకు మామూలేగా!"

"అప్పుడే నేను చెప్పటం పూర్తికాలేదు సార్!"

"చెప్పండయితే?"

"ఫస్టుక్లాసయిన చికెన్. దేశవాళీ కోళ్లు బ్రహ్మాండమైనవి తెస్తున్నాడు మా పీ.సీ."

"ఇదిగో... మీ ఇష్టం. మీరే ఏర్పాటు చేయండి. ఇంకా ఏం ఏర్పాటు చేయమంటారు?"

"గొంతెమ్మ కోరికలను కోరకపోతే..."

"చెప్పండీ?"

"...మంచి గుంట..." డాక్టరు పకపకా నవ్వేశాడు. నవ్వేసి "అవి ఏర్పాటు చేయాల్సినది మీరూ! మాకెలా లభ్యమవుతుంది?" అన్నాడు.

"అదికాదు సార్... విజనారంలో కొత్తగా రాజమండ్రినుండో కుటుంబం వచ్చింది. పెద్ద పెద్ద ఆఫీసర్లు వచ్చినపుడు బుక్‌చేస్తారు వాళ్లని. డబ్బులెక్కువవుతాయి. ఇసిత్రం ఏమిటంటే వాళ్లు ఫ్యామిలీ సరుకు. వాళ్లు వృత్తికళాకారులు కారు" అని జోక్ చేశాడు.

డాక్టరు విరగబడి నవ్వాడు.

"సరే... మీ ఇష్టం. తెప్పించండి. ఎంతయినా ఫరవాలేదు" అన్నాడు. అనేసి, "ఆఁ... చెప్పటం మరిచాను. ఆ ఏ.ఎన్.ఎమ్. వచ్చిందీ మధ్య. నేనడిగాను"

"కొంపదీసి నా పేరు బయటకు పెట్టలేదు గదా?" అని, "పెట్టినా భయంలేదనుకోండి" అన్నాడు "ఆఁ... అదేటంటది?" అన్నాడు.

"మీరనవసరంగా అనుమానిస్తున్నారు. మీ పేరే ప్రస్తావనకు రాలేదన్నాది"

"లంజ. అలాగనకపోతే ఏటంటది? రంకుతనం చేసిన లంజలు కూడా ఒప్పుకోరుకదా! మేం పత్రిత్తలం అంటారు. నీను డైరెట్‌గా నా సెవుల్తో విన్నాను. ఆ పక్కగదిలో నేనున్నానని ఎవ్సైక్కూడా తెలీదు. నాముందు సెప్పమనండి. అది సెప్పిన డైలాగుల్తో వొప్పుచెప్పెస్తాను" అన్నాడు. "అయిపోయింది. ఒగ్గీయండా వినయం. నీనొస్తాను. అయితే ఇవాళ ఇజినారం ఎల్లమంటారేటి?" అన్నాడు.

"మరి డబ్బులివ్వొద్దా?"

"మీ దగ్గరెటుపోద్ది?" అని "వస్తా సార్..." అని లేచాడు. అమ్మలు రక్తం సెగలు కక్కుతోంది. "సంసారం లేని వెధవ" పళ్లు పటపటా కొరికింది. అతనెళ్లిన తరువాత "మీరు రావచ్చు" అన్నాడు డాక్టరు. ఆమె వచ్చికూర్చుంది. కూర్చున్న తరువాత అన్నాడు. "ఇప్పుడేం అంటారు?" అని.

"అతను మీ దగ్గరేదో స్వలాభంతో అలా అనొచ్చుకదా. సంస్కారంలేని మనిషి కాబట్టే అతడింత నీచంగా మాట్లాడాడు. కానీ..." అని అనబోతుంటే "నీలాటివాళ్లకి సంస్కారం గురించి తెలుసా? తెలిస్తే ఒక ఆఫీసరు గురించి అంత తక్కువగా ఇంకొకళ్ల దగ్గర మాట్లాడి ఉండవు" అన్నాడు. ఆమె జవాబు చెప్పలేదు. మాట్లాడలేదు. "నేనతనిమీద ఎస్సయికి రిపోర్టు చేస్తాను" అంది ఆవేశంగా. అతను విరగబడి నవ్వాడు. నవ్వి "రేపు పార్టీ దేనికో తెలుసా? ఎస్సయికి 'పాతర్లపల్లి' అని సముద్రం దగ్గ




రుంది. అక్కడకి బదిలీ చేయించాం. నేను తల్చుకుంటే నిన్నూ నీ భర్తనీ వారానికోసారి అయినా కలుసుకోడానికి వీలులేనంత దూరాని కి బదిలీ చేయించగలను. కానీ చేయించట్లే దు. నా పథకం వేరే ఉంది. ఇంతవరకూ నన్ను మానసికంగా ఎవరూ దెబ్బతీయలేకపోయా రు. నువ్వు తీసావ్. అయినా విజయం సాధించ లేకపోయావ్. ఇంకో విషయం కూడా నీకు చెబుతున్నాను. రమీజా డైరీలో నేను ఆమెను అనుభవించినట్టు రాసుకుంది. ఎప్పుడయితే ఆమె చనిపోయిననాడు హడావుడిగా గదిలోకి వెళ్లిన ప్పుడే ప్రమాదం పసిగట్టేశాను. నీకు నిజం చెవుతున్నాను. నిన్ను మరింత బాధ పెట్టడం నా లక్ష్యంగా పెట్టుకున్నాను. రమీజాని నేను అనుభవించాను. ఆవేళ ఆడింది కూడా నాట కమే. ఆరోజు డెలివరీ కేసే రాలేదు. మరి పేషెంట్ చనిపోయినట్లు నేను ప్రెస్ రిపోర్టిస్తా ననటం హాస్యాస్పదం. అంతేకాదు. రమీజా ఆ మర్నాటినుండి మూడురోజులు సెలవు తీసు కుంది. వారంరోజులు నేను కేంపులో ఉన్నాను. అందునుంచి ఆ కేసు కొట్టివేయబడింది. చివ రకు తేలిందేమిటో తెలుసా? రమీజాకు మతి చాంచల్యం అని కూడా తేల్చబడింది. నేను తల్చుకుంటే కమాలుద్దీన్‌ని కూడా ప్రమా దంనుండి తప్పించగలను. కానీ వాడెలాగ పోతే నాకేం? నా కనవసరం!'' అన్నాడు.

''అబద్ధం... ఆరోజు పేషెంట్ రావటం, చనిపోవటం పచ్చినిజం. అయితే అది మెట ర్నిటీ అసిస్టెంట్ నిర్లక్ష్యంవల్ల అని మీరు ఆమెని ట్రాప్ చేశారు. మీరు రికార్డులు మార్చేసి ఉంటారు'' అంది.

డాక్టరు వికృతంగా నవ్వాడు.

''తెలివి తక్కువదానా! రికార్డులు మార్చవ లసినంత అవసరం నాకేమొచ్చింది? అసలా కేసునే నోట్ చెయ్యలేదు. కారణం అది క్రానిక్ అయివచ్చింది. ఊళ్లో నేటివ్ డాక్టరు ట్రీట్ మెంటువల్ల ఫెయిలయి, అవసానదశలో నా దగ్గరకొచ్చింది. సమయంకోసం ఎదురుచూ సిన నేను రమీజాని ఇరికించాను. నేను మరు నాడు కేంపుపెట్టుకున్నాను. రమీజా కూడా వారంరోజులు సెలవు కావాలంది. ఇచ్చేశాను. ఒకవేళ ఆ డెలివరీ కేసు నోట్ చేసినా, మేం సెలవులో లేకపోయినా, తప్పించుకోగలిగే వలుకుబడి నాకుంది. మరో విషయం చెవుతు న్నాను. నేను నాగుపాములాటివాణ్ణి. నువ్వు నన్ను ఇరికించాలనుకున్నావ్. నీ మీద ప్రతీ కారం తీర్చుకుంటాను. రమీజాకు పట్టిన దు ర్గతే నీకూ పట్టినట్లు చేస్తాను. అంతవరకూ నిద్రపోను'' అని ప్రతిజ్ఞ చేశాడు.

అన్నట్లే,

అతని తొలిప్రయత్నంగా 'మెటర్నిటీ అసిస్టెంట్ వేకెన్సీ ఖాళీగా ఉండటం, వర్క్ లోడ్ ఎక్కువగా ఉండటం పెద్ద ప్రోబ్లంగా ఉందని విలేకర్లకు చెప్పి పేపరు ప్రకటన ఇప్పించాడు. ఆ ప్రకటన పేపర్లో వచ్చిన వారంరోజుల్లోనే అమ్మలుని పి.హెచ్.సికి బది లీచేస్తూ ఆర్డర్లు వచ్చాయి. ఇది కాకతాళీ యంగానే జరిగిందని చెప్పాలి. ఎందుకంటే అంతకుక్రితమే రావివలసనుండి ఎక్కడక యినా బదిలీ చేయాల్సిందిగా డి.ఎం.ఓ.కి ఆమె ముఖస్థంగా చెప్పటంవలన, ఎఫిషియ న్సీ హేండ్ అయినందువలనా, డాక్టరు ప్ర మేయం లేకుండానే ఆమె బదిలీ చేయబ డింది. ఇది డాక్టరు తన ఘనతగా చెప్పుకున్నా డు.

అయితే-

అమ్మలు తెలివితక్కువదేంకాదు. అందుకే ఆర్డరందుకోగానే డి.ఎం.ఓ.ని ఆఫీసులోగాక, ఇంటికెళ్లి పర్సనల్‌గా కలిసి అన్ని విషయాలు వివరించింది. డి.ఎం.ఓ అంతా విన్నాడు. ''పూల్. ఇంత డర్టీరోగన్నమాట'' అనేసి, తీక్ష ణంగా ఆలోచించి ''నువ్వు జాయినవమ్మా. నీకే ప్రమాదం లేకుండా చేస్తాను'' అన్నాడు. తరువాత డి.ఎమ్.ఓ.అండ్‌హెచ్.ఓతో సంప్ర దించాడు.

సరిగ్గా-

ఆ సమయంలోనే 'డాక్టర్లు ప్రయివేటు ప్రాక్టీ సు పెట్టుకోకూడదన్న ఆంక్షను ప్రభుత్వం పె ట్టిన కారణంగా కొందరు కోర్టుకెళ్లారు. ఎడ్జాఫ్‌ది రిటైర్మెంటులో ఉన్నవాళ్లు వాలంటరీ రిటై ర్మెంటు తీసుకున్నారు. డి.ఎం.ఓ.కి మంచి అవకాశం దొరికింది. డాక్టరు కృష్ణారావుని ప్ర మోషన్‌మీద బదిలీ చేశారు. అంతేగాకుండా పి.హెచ్.సి.లో డాక్టరుకి అనుచరులయిన సిబ్బంది మొత్తాన్ని చాలా దూరప్రాంతాలకు బదిలీ చేశారు. ఇది మాత్రం అమ్మలు విజ యమే!

అయితే ఆ విషయం ఎక్కడా ఆమె నోరు జారలేదు.

★ ★ ★

బాబుకి మూడు సంవత్సరాలొచ్చిన తరువాత అమ్మలుకి పాప పుట్టింది. "పాపకి రమీజా పేరు పెడితే ఎలా ఉంటుంది?" అని అడిగింది భర్తని. సుదర్శనం ఎప్పుడూ అమ్మలు మాట కాదనడు. "సరే నీ ఇష్టం" అనేసి "అమ్మని కూడా ఓసారి సంప్రదించు" అన్నాడు. అమ్మలు అత్తగారితో కూడా ఈ విషయం కదిపింది. అత్తగారు మౌనంగా ఉండిపోయింది. తరువాత అంది. "చూడమ్మా! రమీజా పేరు మనం పెట్టుకోవాల్సిందిగాదు. అయితే దానికి నా అభ్యంతరం లేదు. ఆమె అర్ధాయుష్కురాలు. అలాటి పేరు నా మనవరాలికి పెట్టడం నాకేమాత్రం ఇష్టంలేదు. అది కాకుండా ఇంకే పేరు పెట్టుకున్నా నాకభ్యంతరంలేదు" అంది.

అమ్మలు అత్తగారి మాటలు అపార్థం చేసుకోలేదు. ఆవిడన్నపుడు తనకూ నిజమే అనిపించింది. అలాగని ఆలోచనని పూర్తిగా విరమించుకోనూలేదు. "ఏం చేద్దాం" భర్తని అడిగింది. "చూడు! అమ్మ మనను కష్టపెట్టకుండా ఏం పేరు పెట్టినా నీ ఇష్టం" అన్నాడు.

అమ్మలు బాగా ఆలోచించింది. ఆమెకో పేరు గుర్తుకొచ్చింది. "ఏమండీ? రమ్య అని పెడితే కొంతవరకూ పేరు కలుస్తుంది. 'రమీ' అని అప్పుడప్పుడూ ముద్దుగా పిల్చుకోనూవచ్చు" అంది.

దానికి సుదర్శనం ఇష్టపడ్డాడు. అత్తగారూ అంగీకరించింది.

రమ్యకి సరిగ్గా సంవత్సరం గడిచింది. తొలి పుట్టినరోజు వైభవంగా జరపాలనుకుంది. ఆడంబరాలకూ, ఆర్భాటాలకూ అతీతమయింది అమ్మలు తత్వం. అలాటిది అమ్మలు వైభవంగా జరపాలనుకుంటే కాదనలేకపోయాడు. సరేనన్నాడు సుదర్శనం. ఊళ్లో తెలిసిన వాళ్లందర్నీ పిలిచింది. స్టీలు ప్లేట్లుకొని వచ్చిన ముత్తైదువులందరికీ పంచిపెట్టింది. రమ్య తెల్లగా, బొద్దుగా ఉంది. చక్కని కళ్లు. గుండ్రని ముఖం, అందులో ఆరోజు తొడిగిన బట్టల్లో ఆ పిల్లను చూసిన అందరికీ ముద్దొచ్చింది. ఇంటినిండా పేరంటాళ్లు కూర్చున్నారు. ఏవేవో కబుర్లు ఆడుకుంటున్నారు. అప్పుడు అయిదుగంటలయింది. ఆస్పత్రినిండో బాయ్ వచ్చాడు. "అమ్మలుగార్ని డాక్టరుగారు రమ్మంటున్నారు" చెప్పాడు. అమ్మలు వచ్చి "డాక్టరుగార్ని సెలవడిగానుకదా! ఇంటినిండా అందరూ వచ్చికూర్చున్నారు. ఇప్పుడెలా? పోనీ గంటపోయాక వస్తానని చెప్పు" అంది.

"అది కాదమ్మా! డి.ఎమ్. అండ్ డి.హెచ్.ఓ గారొచ్చారు. స్టాఫేరీ అనడిగారు. స్టాఫ్ నర్సమ్మా సెలవుపెట్టారు. ఏ.ఎన్.ఎమ్.గారు లేరు. ఎవరూ లేకుండా భజన చేస్తున్నారా?' అని 'కూక' లేస్తన్నరు" అని జవాబిచ్చాడు.

అమ్మలు గుండె ఝల్లుమంది.

ఈ డి.ఎమ్. అండ్ హెచ్.ఓ ఎవరో కాదు.

'రమీజాని పాడుచేసిన దుర్మార్గుడు. అతన్ని డి.ఎమ్. అండ్ హెచ్.ఓగా ప్రమోట్ చేస్తూ ఇక్కడే వేస్తున్నట్టు ఈమధ్యనే తెలిసింది. ఎందుకొచ్చాడింత సడన్‌గా! వీడితో తలనొప్పే మళ్లీ' అనుకుంది. అనుకుని "సరే. వస్తున్నా పద" ఇంట్లోకెళ్లి పర్సు పట్టుకుని "సారీ! పై ఆఫీసరొచ్చారట. అర్జంటుగా కబురొచ్చింది నేవెళ్లాలి. ఏమనుకోకండి. మిమ్మల్ని పిలిచి కూడా ఎక్కువసేపు మాట్లాడలేకపోతున్నాను. మన్నించండి" అంది.

"దాందేముందమ్మా! తలమ్మకున్న తరువాత తప్పుతుందా మరి? వెళ్లమ్మా. వస్తాం. మాకూ పనుంది" అని వాళ్లూ లేచారు. ఎంతో సంబరంగా జరపాలనుకున్న పుట్టినరోజు ఇలా జరగటం అమ్మలుకెంతో బాధ కలిగింది. ఆసుపత్రికెళ్లగానే "రండి! వేగిరం రండి. స్టాఫ్ ఎవ్వరూ లేరివాళ. పాప పుట్టినరోజు సెలవుకాదంటే మరేం ఫీలవుతారోనని ఇచ్చాను. సరిగ్గా సమయానికే వచ్చేశారు డి.ఎమ్అండ్‌హెచ్వో గారు"అన్నారు డాక్టరు. రూంలోనికెళ్లింది. డాక్టరుగారి కుర్చీలో కూర్చున్నాడు ఆఫీసరు. జిల్లా అధికారి కావటంవలన ఇంతకుముందుకంటే స్టైయిలుగా ఉన్నాడు. మనిషి మరికొంచెం యవ్వనం వచ్చి, చిన్నవాడిలా కనిపిస్తున్నాడు. నమస్కారం పెట్టింది.

"నీ పేరు?" అడిగాడు తెలీనట్లు. జవాబు చెప్పింది. "ఓ ఈ పేరెప్పుడో విన్నట్లుందే. ఓ




అయాంసారీ, నువ్వు నా దగ్గర పనిచేసినట్లు న్నావుకదూ?'' అన్నాడు మరిచినట్లు నటిస్తూ. అవునని తలూపింది.

''ఆస్పత్రిలో అందరూ ఒకేసారి సెలవుపెట్టి పిక్నిక్ వెళ్లారా?'' అన్నాడు.

''లేద్సార్. వాళ్లపాప పుట్టినరోజివాళ. సాధారణంగా ఆమె అనవసరంగా సెలవు పెట్టదు'' అన్నారు డాక్టరు. అతను డాక్టర్ని పరిశీలనగా చూశాడు. అలాగెందుకు చూస్తున్నాడో అర్థంకా లేదు.

''స్టాఫ్‌ని బాగా సపోర్టు చేస్తున్నారే!'' అన్నాడు.

డాక్టరేమో చెప్పబోయాడు. ''మీరాగండి'' అని ''చూడమ్మా. ఇది ఎమర్జన్సీ సర్వీస్. మనం సేవకి అంకితమయిపోవాలి. సుఖాలకి దాసులం కారాదు'' అన్నాడు. 'వెధవ దెయ్యాలు వేదాలు వల్లిస్తున్నట్లుంది నువ్వు మాట్లాడుతుంటే' అనుకుంది. ఆమె మాట్లాడలేదు. ''ఈనెల పదిహేనోతారీకున వైద్య ఆరోగ్యశాఖ మాత్యుల వారొస్తున్నారు. మీరింత సోమరితనంతో ఉంటే ఎలా కుదురుతుంది?'' అని పెద్ద సిన్సియర్‌లాగా అక్కడున్న వాళ్లని చీవాట్లేశాడు.

ఆరోజు రాత్రి-

పదిగంటలవుతోంది. రమ్య ఒంటిమీద చెయ్యివేసి చూస్తే ఒళ్లు కాలిపోతోంది. ''అమ్మలూ! అమ్మలూ! ఏం చేస్తున్నావు?'' ఆందోళన పడుతూ పిలిచాడు సుదర్శనం. అమ్మలొచ్చింది. ''పాప వొళ్లు కాలిపోతోంది చూశావా?'' అన్నాడు. అమ్మలు రమ్య వంటిమీద చెయ్యి వేసి చూసింది. భయంవేసింది. వెంటనే థర్మామీటరు పెట్టిచూసింది. నూటమూడుడిగ్రీల జ్వరం ఉంది. ''దానికి బాగా దిష్టి తగిలేసిందే. ఇలా తీసుకురా దిష్టిమంత్రం వేస్తాను'' అంది అత్తగారు. మూసిన కళ్లు తెరవలేకపోతోంది. భుజంమీద వేసుకుని తీసుకెళ్లింది. మంత్రించింది. అత్తగారి పని అత్తగారు చేసింది. అమ్మలు లేచి పెరస్ట్మాల్ సిరప్ తీసి పట్టింది. యాంటిబయోటిక్ డోసు ఇచ్చింది. పడుకోబెట్టింది. అలా పక్కనే పిల్లనంటి పెట్టుకుని పడుకుంది. సరిగ్గా పదకొండు దాటుతోంది. తలుపు చప్పుడు. తీసింది ''డెలివరీకేసొచ్చింది'' చెప్పాడు నైట్‌వాచ్ మెన్.

ఒక పక్క పాపకి జ్వరం. వెళ్ళాలనిలేదు. మరోపక్క పైఅధికారి కూడా ఉన్నాడు. అదీగాక డెలివరీ కేసు. ఏంచేయాలో తోచలేదు. ''ఆసుపత్రిలో డాక్టరుగారున్నారా?'' అడిగింది. ''ఇప్పుడే ఇంటికెళ్లారు, ఆఫీసరుగారు మాత్రం ఏదో నదూకుంటున్నారు'' అన్నాడు. ''ఇంకెవరూ లేరా?'' అడిగింది. ''సీ.సీ.గారూ, డ్రైవరూ ఇప్పుడే పడుకోనానికెల్లిపోయారు'' అన్నాడు.

అమ్మలుకు భయంవేసింది. వెళ్లక తప్పదు. వెళ్తే ఏం ప్రమాదం ఎదురవుతుందో, అయినా ఇప్పుడాఫీసరయ్యాడు. అప్పుడంటే మామూలు పి.హెచ్.సి డాక్టరు. ఇంకా పోని యవ్వనపురోజులు! మనసులో ధైర్యం తెచ్చుకుని పాపని చూసుకోమని భర్తకి చెప్పివెళ్లింది. పి.హెచ్.సి. దగ్గర చెట్లు నిద్రపోతున్న కాపలాదారుల్లా ఉన్నాయి. మినుకు మినుకుమనుకుంటూ లైట్లూ. వెళ్లింది. పేషెంట్ పరిస్థితి చూసింది. ఇంజక్షన్ చేసింది. రాత్రికి డెలివరీ వచ్చేటట్టులేదు. కళ్లు బరువుగా ఉన్నాయి. రెప్పలు వాలిపోతున్నాయి. మరోసారి పేషెంట్ పరిస్థితి చూసింది. నొప్పులు వస్తున్నాయి. డెలివరీ వస్తే వచ్చినూవచ్చు. అటూ, ఇటూ తిరిగింది. ఆఫీసరుగదిలో అప్పటివరకూ వెలిగిన లైటు ఆరింది. 'అమ్మయ్య' అనుకున్నాడు నైట్‌వాచర్. బెంచీమీద కునుకుతీస్తున్నాడు. 'దొరగారు పడుకున్నారా?' అడుగుదామనుకుంది. అంతలోనే లైటు వెలిగింది. గతుక్కుమంది. అతను బయటకొచ్చాడు. ఆమె వెనక్కి తగ్గింది. ''ఎవరక్కడ?'' అన్నాడు. ఆమె భయంగా జవాబు చెప్పింది. ''ఏం చేస్తున్నావ్?'' అడిగాడు. ''డెలివరీ కేసుంది. అందుకే వచ్చాను'' అంది. ''ఓ అలాగా!'' అన్నాడు. అతను డాబా మెట్లెక్కుతూ ''ఇదిగో, పిల్లా! అక్కడ ఫ్రిజ్‌లో సీసాల్లో నీళ్లుంటాయి. డాబామీదకి పట్రా'' అన్నాడు. ఆమెలో పిరికితనం చోటుచేసుకుంది. నైట్‌వాచ్‌మెన్‌ని లేపింది. ''దొరగారు నీళ్లు పట్రమ్మన్నారు. ఫ్రిజ్‌లో ఉన్నాయట. తీసుకెళ్లు. అనేసి డాబామీద ఏం చేస్తున్నారు?'' అడిగింది. ''కిందగాలి తగల్దని డాబామీద మంచం వెయ్యమన్నారు. టేబిలుఫాన్ కూడా పెట్టాను'' అన్నాడు.

"సరే. నీళ్లియ్యి. వెళ్లు" అంది. వాడు ఫ్రిజ్‌లో నీళ్లు తీసుకుని వెళ్లాడు. "మంచినీళ్లు తీసుకెళ్లమందా? తనకి చెప్తే! కళ్లు నెత్తికెక్కాయా? నువ్వెళ్లు దాన్ని రమ్మను" కేకవేశాడు. వాడొచ్చి ఆ మాటలు అమ్మలుకి చెప్పాడు.

అమ్మలుకి తెలిసిపోయింది. 'వీడు కక్ష తీర్చుకుంటున్నాడు. ఈ డెలివరీ కేసు కూడా నా పాలిట శనిలా దాపురించింది' అనుకుంది. భయం వేసింది. ఇవాళ వీడికి తగిన అవకాశం కూడా దొరికింది. దీన్నించెలా బయటపడాలా?' అన్నది అమ్మలును వేధిస్తోన్న ప్రశ్న.

చీకటి దట్టంగా ఉంది. భయంకరంగా ఉంది. కళ్లు కనిపించనివ్వని కామంలా ఉంది. మసిపుప్పొడిని ఆకాశం రాల్చుతున్నట్లుంది. వచ్చినట్లు సంకేతంగా దగ్గింది. "ఏం? నిన్ను తెమ్మంటే వాడిచేత పంపావ్?" అన్నాడు. డాబామీద చల్లని గాలేస్తోంది. నైట్ క్వీన్ పరిమళం ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి. ఆమె జడలో సన్నజాజులు మత్తుకలిగిస్తున్నాయి భయంకరంగా. జడలో పూలచెండును తీసి కిందకి విసిరింది. ఆమెకు సన్నజాజులంటే ఎంత ఇష్టమో? ఒకప్పుడిష్టమైన వస్తువులే ఒక్కొక్కప్పుడు అయిష్టమవుతాయి. శివుని కంఠంలో ఉంటే పాము ఆరాధ్యమవుతుంది. అదే బయట భయంకరమవుతుంది. ప్రేమికులకు వెన్నెల ఎంత ఇష్టమో ఒక్కొక్కప్పుడు అంత బాధను కలిగిస్తుంది. ఒక్కోసారి తీపి ఎంత ఇష్టమైనా ఒక్కోసారి ప్రాణసంకటమవుతుంది. ఇప్పుడామె పరిస్థితి అలానే వుంది. డాబామీద, చల్లనిగాలి. ఆరుబయటి స్థలం. సన్నజాజులు, నైట్‌క్వీన్ పరిమళాలు ఇవే ఇంకొకప్పుడయితే ఆదమరిచి నిద్రించేది. అవే ఈరోజు భయపెడ్తున్నాయి. బాధపెడ్తున్నాయి.

"ఇలా కూర్చో" కుర్చీ చూపించాడు.

ఆమె కూర్చోలేదు. చెప్పండి ఎందుకు పిలిచారో?" అంది.

"చెప్పాలా? సరే. విను. రమీజా హత్య తరువాత నేను ప్రతిజ్ఞ చేశాను. గుర్తుందా? అయితే నేనిన్ను మరిచిపోయి ఉండేవాణ్ణి. కానీ నువ్వు నామీద డి.ఎం.ఓ.తో రిపోర్టు చేసినట్టు, అదీ ఇంటికెళ్లి పర్సనల్‌గా! నాకు తెల్సింది. ఎలా తెలిసిందని ఆశ్చర్యపోతున్నావా? నువ్వెళ్తావని నాకు తెల్సు. నేను ముందుగా ఊహించాను. ఊహించబట్టి వార్తని సేకరించగలిగాను. నువ్వు నా పంతాన్ని అధికం చేశావ్. నన్ను రెచ్చగొట్టావు. ఇప్పుడు నా చేతిలో చిక్కావ్. ఇవాళ నిన్ను విడిచిపెట్టను. అయితే నీకు మరో అవకాశం ఇస్తున్నాను. నీ అంతట నువ్వుగా లొంగిపో. పంతమే ప్రేమగా మారుతుంది. లేదా నిన్నేంచేయాలో అదే చేస్తాను" అని కంపించిన గొంతుతో అన్నాడు.

"నన్ను మన్నించండి. మీకు చేతులెత్తి మొక్కుతున్నాను. మీతో సవాల్ చేయలేదెప్పుడూ. నా ఆత్మరక్షణకోసం నేను ప్రయత్నించాను. మీతో పంతాలకు, పట్టింపులకూ పోయే తత్వంకాదు నాది. నావల్ల జరిగిన పొరపాటుకు నేను క్షమాపణ కోరుకుంటున్నాను" అని కంపించిన గొంతుతో అంది.

అతను వికటాట్టహాసం చేశాడు. "పడగెత్తిన పాము నమస్కారానికి లొంగదు. క్షమాపణకు కరిగిపోదు. అవకాశం దొరికినపుడు వినియోగించుకోకుండా వదిలిపెట్టే వెర్రివాణ్ణి కాదు. ఈ జిల్లాకి అధికారిగా రాగానే నువ్వే గుర్తొచ్చావు. కానీ అవకాశం ఇంత త్వరగా వస్తుందని ఊహించలేదు. అని ముందుకు వస్తున్నాడు. చిన్నపిల్లాడి మీదకు పరిగెత్తుకు వస్తున్న ఎనుపోతులా.

ఆమెకు జ్వరంతో ఉన్నపాప గుర్తొచ్చింది. పాపలో రమీజా కనిపించింది. ఆవేశం పొంగిపొర్లింది. దుఃఖం దూసుకువచ్చింది. అతను ముందుకు... మీద కొచ్చేస్తున్నాడు. దగ్గరకొచ్చేస్తున్నాడు. ఆమెలో నిస్సత్తువ ఆవరించుకుపోయింది. అతనిచేయి మీదపడింది. "నన్ను వదలండి. ప్లీజ్" అంది. "అరవకు. నా సంగతి నీకు తెలీదు. కాదంటే నిన్నేదోలా దెబ్బకొడతాను. నీ ఉద్యోగంకు ఎసరుపెడతాను" అన్నాడు. "ఫరవాలేదు. నా ఉద్యోగం పోయినా ఫరవాలేదు. నేనే రిజయిన్ చేస్తాను. రాసిమ్మంటే ఇప్పుడే రిజిగ్నేషన్ రాసిస్తాను" అని గట్టిగా అరిచింది.

"నీ ఉద్యోగం రిజిగ్నేషన్ కాదు నేను కోరేది. నిన్ను... నిన్ను... నిన్ను నేను కోరుకునేది కూడా ప్రేమతో కాదు. పంతంతో. ప్రతీకారంతో. నిన్ను





వదలను. నువ్వు జీవితాంతం కుళ్ళి కుళ్ళి ఏడవాలి'' అని ఆమె చేతిని బలవంతంగా లాగాడు. ఆమె అతని బాహువుల్లో పడింది. ఒక్క తోపు తోసింది. సరిగ్గా అప్పుడే కరెంటు పోయింది. చుట్టూ కళ్ళు పొడుచుకున్నంత చీకటి. ఏం కనిపించలేదు. అక్కడ కాలికి దుడ్డుకర్రలాటిది తగిలింది. ''వదలండి. వద లండి'' మీద పడుతోన్న అతణ్ణి మళ్ళీ విది లించింది. కాలికి తగిలిన దుడ్డుకర్ర తీసి అతన్ని బాదింది. మొదటి దెబ్బ టేబులుకి తగిలింది. అతను తప్పించుకోవటంచేత తరు వాత దెబ్బకు 'అమ్మా!' అని అతను బాధతో మూల్గాడు. ఆమె కర్ర పడేసింది. చీకట్లో తన్నుకుంటూ డాబామెట్లు దిగింది. కింద నైట్ వాచర్ని లేపింది. వాడు లేవలేదు. గుర్రు పెట్టి నిద్రపోతున్నాడు. అతను డాబామీదనుంచి దిగి మళ్ళీ బలవంతం చేస్తాడేమోనని హడలి పోయింది. మళ్ళీ అంతలోనే అతను 'అమ్మా!' అని మూలిగిన విషయం స్ఫురణకొచ్చింది. ''కొంపతీసి అతనేమయినా అయితే?'' భయంవేసింది. ఎందుకయినా మంచిదని డాక్టరుకు ఫోన్ చేయాలనుకుంది. ఈలోగా కరెంట్ వచ్చింది. రూంలోనికెళ్ళి గడియ పె ట్టుకుంది. డాక్టర్ ఇంటికి ఫోన్‌చేసింది. అర్జంటుగా రమ్మంది. డాక్టరు వస్తున్నట్లు చె ప్పాడు. అయిదు నిమిషాల్లో డాక్టరు వచ్చాడు. అద్దాల కిటికీల్లోంచి డాక్టరు రాకను చూసి తలుపుతీసింది.

''ఏమయింది మేడం? పేషెంట్ స్థితి ఎలా గుంది?''

''నేను ఫోన్ చేసింది పేషెంటు గురించి కాదు డాక్టర్!'' అని పరిస్థితిని వివరించింది. డాక్టర్‌కేం చేయాలో తెలీలేదు. డాబామీదికి వెళ్ళాడు. వెనుకాలే అమ్మలు అనుసరించింది. డి.ఎం. అండ్ హెచ్.ఓ. నేలపై పడివున్నాడు రక్తపుమడుగులో. ఆత్రుతగా అతనిదగ్గరకెళ్ళా డు. డాక్టర్ నిశ్చేష్టుడయ్యాడు. ''మేడం! ఈయన చనిపోయారు'' అన్నాడు.

''ఆఁ!'' గుండె ఆగిపోయినంత పన యింది.

హాస్పిటలు వాతావరణం భీభత్సంగా ఉంది. డి.ఎస్పీ, కలెక్టరు, డి.ఎమ్.ఓ. అంద రూ కారులలో వచ్చేశారు. పరిస్థితిని సమీక్షిస్తు న్నారందరూ. అమ్మలు తల వొంచుకుని నిల్చుంది. ఆమెను అందరూ రకరకాలుగా ప్రశ్నిస్తున్నారు. కొన్నిటికి జవాబు చెప్తోంది. కొన్నింటికి జవాబు చెప్పలేకపోతోంది. పి.హె చ్.సి. డాక్టర్‌ని అడిగి వివరాలు సేకరించారు. డి.ఎం. అండ్ హెచ్.ఓ.గా వచ్చిన కృష్ణారావు ఒకప్పుడు ఆ ఊళ్ళో డాక్టరుగా పనిచేసినవాడ వటంవల్ల అతని కేరెక్టరు మంచిదిగాదని, స్త్రీలోలుడని ప్రజల్లోంచి ముందుకొచ్చిన కొంద రు చెప్తున్నారు. అమ్మలు చాలా మంచిదని ఆమె జీవితంలో పనిలోగానీ, గుణంలోగానీ మచ్చలేని మనిషని ప్రజలు చెప్తున్నారు.

విలేకర్లు అమ్మలును చుట్టుముట్టారు. ''అ మ్మలుగారూ! ఈయన మీపై అధికారికదా? ఆయనను హత్య చేయడానికి దారితీసిన పరి స్థితులేమిటి?'' అన్నారో విలేకరి.

''డా. కృష్ణారావుగారిని చంపాలని నేననుకో లేదు. అతన్ని తప్పించుకోడానికి నేను చేసిన ప్రయత్నాలన్నీ విఫలమయినాయి. ఆత్మరక్ష ణకోసం నేను కర్రతో రెండే దెబ్బలు కొట్టాను. ఒకటి అక్కడ దేనికో తగిలింది. రెండోదిమా త్రం అతనికి తగిలింది. అతని మూలుగు వినిపించింది. అతను పడిపోయాడు. చీకటి కాబట్టి నేను తప్పించుకోగలిగాను''

''అంటే మీరు కొట్టిన దెబ్బని తట్టుకొని లేచి అతను మిమ్మల్ని వెంబడించా రంటారా?''

''లేదు... అతను నేలకొరిగినట్టు నాకను మానం''

''కర్రతో మీరు కొట్టానంటున్నారు. డాక్టరుగా రు వచ్చిన తరువాత వెళ్ళి చూస్తే రక్తపు మడుగులో ఉన్నారు. అతని వీపుమీద కత్తిపో ట్లు కనిపిస్తున్నాయి. కత్తితో పొడిచి చంపినట్లు రుజువు అవుతోంది. మీరు ఆత్మరక్షణకోసం కర్ర వాడారన్నది అబద్ధం అని తెలుస్తోంది''

''కాదు. నేనబద్ధం ఆడటంలేదు. నిజం చెప్తున్నాను''

''మరి కత్తిపోట్లు కనిపిస్తున్నాయి. ఈ హత్య ఎవరు చేసిఉంటారని మీ ఉద్దేశం?''

''ఏమో. నాకు తెలీదు''

''సరే... మీరొప్పుకున్నా ఒప్పుకోకపోయినా,

అంటే కత్తితో పొడిచినట్లు హత్యకి మీరే కారకులని అందరూ భావిస్తున్నారు. దీనిపై మీ అభిప్రాయం?''

''కర్రతో కొట్టడంవలన మాత్రమే ఆయన ప్రాణాలు పోతే దానికి కారకురాలిని నేనే. ఆత్మరక్షణకోసం కొట్టానుకానీ హత్య చేయాలని మాత్రం కాదు'' అంది.

''సరే... నిజానిజాలు తరువాత ఎంక్వయిరీలో తేల్తాయి. త్వరలో మీ చేతికి సంకెళ్ళు పడతాయి. అరెస్టు చేస్తారు. మీ మనసులో ఇప్పుడెలాంటి భావం ఉందో చెప్తారా?''

''సంకెళ్ళు ఇవాళ పడటంలో బాధపడ్డానికేముంది? ఈ ఉద్యోగంలో చేరిననాడే సంకెళ్ళు పడ్డాయి. నాకేకాదు. ఏ.ఎన్.ఎమ్.గా చేరిన ప్రతి మహిళా ఈ ఉద్యోగంలో చేరినప్పుడే సంకెళ్ళలో ఇరుక్కున్నట్లే. బంధింపబడినట్లే అర్థం. అడుగడుగునా అగ్నిపరీక్షలను అధిగమించాలి. ఎన్నో మింగబోతున్న తిమింగలాల నోళ్లనుంచి బయటపడాలి'' అంది.

''సాధారణంగా ఈ ఉద్యోగంలో చేరిన ఆడవాళ్ళమీదనో చిన్నచూపు ఉంది. దీంతో మీరేకీ భవిస్తారా?'' ఇంకో విలేకరి అడిగాడు.

''ఆడది గడప దాటితే చిన్నచూపు చూసే సమాజం మనది. అందులో ఈ ఉద్యోగం చేసిన స్త్రీ ఒకదగ్గర కూర్చొని పని చేసుకోడానికి కుదరదు. తెల్లారి లేస్తే బస్సులెక్కాలి. పొలం గట్లమ్మట నడిచి వెళ్ళాలి. దూరం వెళ్ళాల్సివస్తే మేల్ వర్కర్స్ సైకిళ్ళమీద, వెహికుల్సుమీదనో కూర్చొని వెళ్ళాల్సిన అవసరం వస్తుంటుంది. దాన్ని వాళ్ళు ఆసరాగా తీసుకొని, హద్దులుమీరి ప్రవర్తించవచ్చు. ఊళ్ళో గ్రామపెద్దలు, కుర్రకారు ఒకరేమిటి? ఎంతో మంది ఎన్నోరకాలుగా వెకిలిగా ప్రవర్తించినా, ఉద్యోగంకోసం, ఆ జీతంరాళ్ళకోసం శివుడు హాలాహలం మింగినట్లు కష్టమయినా భరించక తప్పదు'' అంది.

''సరే... హత్యచేయబడిన ఈ ఆఫీసరుగారి వల్ల మీరెప్పుడయినా చిక్కుల్లో పడ్డారా?'' అడిగాడో విలేకరి. ఆమె జవాబు చెప్పలేకపోయింది. ఒకటేమిటి? ఎన్నో చెప్పాలి? ఎన్ని చెప్పగలదు? ఆమె మనసులో అగ్నిపర్వతం బద్దలవుతోంది.

''సరే... మీరు నిర్దోషని మీ నమ్మకం. రేపు కోర్టులో మీరు నిర్దోషి అని చెప్పుకోడానికి సాక్ష్యాలేమయినా ఉన్నాయా? మీరు నిర్దోషిగా విడుదల కాగలరన్న నమ్మకం మీకుందా?'' అనడిగాడో విలేకరి.

''నేను నిర్దోషినని చెప్పుకోడానికి నాకున్న సాక్ష్యం ఒక్కటే. మీరు నమ్మినా, నమ్మకపోయినా కోర్టు విశ్వసించినా, విశ్వసించకపోయినా నేను కర్రతో మాత్రమే కొట్టాను. కత్తిని ఉపయోగించలేదు. నేను చంపాలని ముందుగా అనుకోలేదుకూడా. ఆత్మరక్షణకోసమే నేనీ ప్రయత్నం చేశాను కాబట్టి, న్యాయంమీదా, దైవంమీదా నమ్మకం ఉన్నదాన్ని కాబట్టి నేను నిర్దోషినని, విడుదల కాగలనని నా నమ్మకం!'' అని చెప్పింది.

తరువాత ఆమెనుంచి పోలీసాఫీసర్లు రిపోర్టులు తయారుచేసి సంతకాలు చేయించుకున్నారు. ఆమెను అరెస్టు చేయడానికి సిద్ధమవుతున్నారు.

''అమ్మా! నేనూ నీతో వచ్చేస్తాను'' అని మూడేళ్ళ కుర్రాడు ఆమెమీదికి వచ్చి పడినప్పుడు ఆమె గుండేకాదు, అక్కడున్న ప్రజలందరి గుండెలూ పిండయ్యాయి. సంవత్సరం తిరగని పాప తండ్రి చేతిలోనుండి ఆకలితో ఏడుస్తోంటే అందరి కళ్ళు అశ్రుపూరితాలయ్యాయి. అక్కడున్న కలెక్టరు, డి.ఎమ్.ఓ.లకుసైతం కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

అప్పుడు-

అందరి మనసులు శోకవ్యాకులమైనపుడు, మరికొద్ది నిమిషాల్లో ఆమెని అరెస్ట్ చేయబోతున్న సమయంలో,

''అరెస్టు చేయాల్సింది ఆమెను కాదు. నన్ను. ఆ సంకెళ్ళు నా చేతికి తగిలించండి'' అన్నాడో వ్యక్తి. అతనికి సుమారు ముప్పయ్యయిదేళ్ళు దాటి ఉంటాయి. కళ్ళల్లో కర్కశత్వం, పిండితే పాలు కారినట్లుండే తెల్లటి గెడ్డం. అతని కళ్ళల్లో ఎర్రజీరలు ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయి. పొడుగ్గా ఉన్నాడు.

అంతవరకూ అమ్మలుమీద జాలితో ఉన్న హృదయాల్లో ఆనందం వెల్లివిరిసింది. కళ్ళల్లో ఆశ్చర్యం, ఆనందం కాంతికిరణాల్లా వ్యాపించాయి.




"ఎవరు నువ్వు?" ఎస్.పి. అడిగారు.

"ఆమె చెప్పింది నిజమే. ఆమె కర్రతో బాదటం నిజం. కానీ అతనప్పుడు చావలేదు. మేడమెట్లు దిగబోతోన్న అతన్ని కత్తితో పొడిచి చంపింది నేనే. నన్నెవరూ ఏమీ ప్రశ్నలు వేయకండి. నేను చెప్పినవి రాసుకోండి. హంతకురాలు ఆమె ఎంతమాత్రం కాదు. ఆమె నాకేం కాదు. నేను ఈతని పర్మనెంట్ డ్రైవర్ని కాను. ఇతని డ్రైవరు, నేనూ కొన్నాళ్ళు లారీలు తోలాం. అతనికి గవర్నమెంట్లో ఉద్యోగం వచ్చింది. అతను లీవు పెట్టినప్పుడు నేనే వస్తుంటాను. ఇతనికే కాదు, ఇంతకుముందా ఫీసర్లకూ అతను సెలవు పెట్టినప్పుడు నేను జీపు డ్రయివరుగా వెళ్ళాను. ఇతను ఇటీవలే వచ్చాడు. వచ్చినప్పటినుండేకాదు, ఇతని జిల్లాలోనూ, జిల్లా హెడ్క్వార్టర్సులోనూ చాలా సంవత్సరాలు పనిచేశాను. ఇతని సంగతి నాకు బాగా తెల్సు. ఆసుపత్రిలో పనిచేసిన ఎందరో అమాయకపు ఉద్యోగినుల బ్రతుకుల్లో ఇతను నిప్పులుపోశాడు. రమీజాని పాడుచేసి, ఆమె బ్రతుకుల్లో నిప్పులు పోసిందితనైతే, తాగిన మైకంలో దారుణంగా ఆమెను హత్యచేసిన కిరాతకుడు కమాలుద్దీన్ నాకు బావమరిది. నాపేరు సలీం. కాని నన్నందరూ వీరేష్ అంటారు. అతన్ని చంపటానికి ఉపయోగించిన కత్తి ఆ డాబామీదనుంచి కిందకు విసిరేశాను. ఈవిడ డాబామీదకు వెళ్తున్నప్పుడు అలికిడికి నేను లేచాను. అప్పుడే బీడీ కాల్చుకుని పడుకోబోతున్నాను. కరెంటు పోయింది. ఈమె కేకలు వినిపించాయి. ఎన్నాళ్ళుగానో అతన్ని చంపాలని ఎదురుచూసిన నాకు అవకాశం దొరికింది. చేజిక్కిన అవకాశాన్ని జారవిడుచుకోదల్చుకోలేదు. అందుకే పొడిచి చంపాను. ముందుగా నేను తప్పించుకోవాలనుకున్నాను. కానీ ఆ అమాయకురాలు ఇంకా సత్యాన్ని నమ్ముకుని బ్రతుకుతోంది. నీతిగా బ్రతుకుతోంది. న్యాయంమీద నమ్మకంతో బతుకుతోంది. అంతకంటే పాలుతాగే పసిపాప, ఎడబాటును సహించలేని మూడేళ్ళ ఆ బాలుణ్ణీ చూసిన తరువాత నాకు నిజం చెప్పాలనిపించింది. ఆమెను రక్షించాలనిపించింది. అలాగే చేశాను" అన్నాడతను.

మరో ప్రశ్నకు అవకాశం ఇవ్వకుండా గడగడా విషయాన్ని వివరించిన అతని రూపురేఖలూ, తీరూ అందర్నీ ఆశ్చర్యంలో ముంచాయి. డాబాకి దిగువన వెతికి పోలీసులు చురకత్తిని తీసుకొచ్చారు. అది రక్తపు మరకలతో ఎండి ఉంది.

అతణ్ణి అరెస్టు చేశారు. అమ్మలును విడిచిపెట్టారు.



**ఆ** తరువాత వారంరోజులకు - 'డి.ఎం. అండ్ హెచ్.ఓ.ని చంపి తప్పుని ఒప్పుకుని పోలీసులకు లొంగిపోయిన సలీం అలియాస్ వీరేష్ పోలీస్ స్టేషన్నుంచి తప్పించుకొని పారిపోయాడు. ఇతనికోసం పోలీసులు తీవ్రంగా గాలిస్తున్నారు. ఇతని ఆచూకీ తెలిపినవారికి తగిన పారితోషికం ఇవ్వనున్నట్లు ఎస్.పి. ప్రకటించారు' - అని పేపర్లో అతని ఫొటోని కూడా ప్రకటించారు. ఆ ఫొటోని పరిశీలనగా చూసిన అమ్మలుకి అతన్నెక్కడో చూసినట్లే అనిపించింది. చాలాసేపటికి కానీ గుర్తురాలేదు. 'ఏజన్సీ ప్రాంతంలో పనిచేస్తోన్న రోజుల్లో - గిరిజన ప్రాంతంలో కొండలలోనికి వెళ్ళినప్పుడు ఎదురయింది అదే చూపు... అదే కర్కశత్వం!



**నన్ను ప్రోత్సహించి నాచే ఈ నవల వ్రాయించిన ప్రియమిత్రుడు శ్రీ జల్లుబాబ్జీకి ప్రేమతో అంకితం.**

**-రచయిత**





# 'స్పర్శ'పై సమీక్షలు

నవంబర్ 'చతుర' మీకందించిన వి. నాగరత్న నవల 'స్పర్శ'పై మాకందిన సమీక్షలలో ఉత్తమంగా వున్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాం.

## అమలిన శృంగారం...!

*(ప్రథమ బహుమతి రు. 100/- పొందిన సమీక్ష)*

నవంబరు 92 చతుర నవల "స్పర్శ" చదివిన తర్వాత - స్మిత పాత్ర గుర్చి ఆలోచిస్తుంటే- చాలాకాలంక్రితం సైన్సుటుడేలోనో, రీడర్స్ డైజస్టులోనో చదివిన ఓ విషయం గుర్తొచ్చింది.

"మానవ మెదడు నిర్మాణంలోనే స్త్రీ పురుషులకు తేడా వుంటుంది. ఏదైనా ఒక నిర్ణయం తీసుకునేందుకు మెదడులో మగాళ్ళకైతే ఒక సెల్, ఆడాళ్ళకైతే రెండు సెల్స్ వుంటాయి. అందుకనే మగాళ్ళు ఏదైనా నిర్ణయం తీసుకునేటప్పుడు చాలా సులభంగా తీసుకోగలరు. అదే సమయంలో మగాళ్ళు తాము తీసుకున్న నిర్ణయాన్ని కూడా చాలా సులభంగా మార్చుకోగలరు. కానీ ఆడవాళ్ళు అలా కాదు ఓ నిర్ణయం తీసుకునేందుకు మెదడులోని రెండు సెల్స్ సతమతమయ్యి నిర్ణయం తీసుకుంటాయి. అందుకనే తాము తీసుకున్న నిర్ణయాన్ని దాదాపుగా స్త్రీలు మార్చుకోరనే చెప్పాలి" అని రాశారు ఓ సందర్భంలో.

స్మిత హుస్సేన్‌ని ప్రేమించడం, అతడితో శారీరక కలయికకోసం కలలో కూడా ఊహించకపోయినా ఇలలో మాత్రం అతడినోరోజు చూడక పోతేనే తల్లడిల్లిపోవడం చూస్తుంటే అది ఆమె నిజమైన ప్రేమకు,అమలిన శృంగారానికి లక్షణాలుగా కన్పిస్తాయి.

స్మిత విద్యార్థిదశలో-

"నేను మిమ్మల్ని మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాను. మీరు లేకపోతే నేను బ్రతకలేను" అని స్వచ్ఛమైన ప్రేమతో రమేష్‌వెంటపడ్డా-

ఆమె టీచర్ దశలో-

"స్మితగారూ! మీకు అభ్యంతరం లేకపోతే నేను పెళ్ళిచేసుకుంటాను" అని సదవగాహనతో నందగోపాల్ అడిగినా-

డాక్టరుగారు వెకిలిచేష్టల్తో వెంటబడ్డా-

హుస్సేన్‌ని ప్రేమిస్తున్న ఆమె మనస్సు వారందరినీ తిరస్కరించింది.

'నేను ఫిజికల్ టచ్‌ని కోరుకోవడంలేదు. కేవలం అమలిన శృంగారాన్ని మాత్రమే కోరుకుంటున్నాను' అన్న స్మిత, హుస్సేన్ పెట్టిన గడువులోపల తన అంగీకారాన్ని తెలుపకపోవడంవల్ల అతను మనసు మార్చుకొని వేరెవరినో చేసుకోవడంతో- 'నేను అతడి ఆలోచనల్ని మర్చిపోయేంతవరకూ వేరొకర్ని చేసుకోలేను' అని ఎంతో ఖచ్చితంగా చెప్పిన స్మిత అతడి ఆలోచనలు ఆమె మదిలో వుండగానే ప్రాణ్‌ని చేసుకోవడం నవలకు సరైన ముగింపుకాదేమో?

భార్యాభర్తలు ఒకరినొకరు అర్థంచేసుకుంటే ఏ కులం ఏ మతంవారైనా సంతోషంగా కాపురం చేయగలరన్నది నిజం! కానీ 'స్పర్శ' నవల్లో ఒకానొక సందర్భంలో-

"ముస్లిమ్‌ని ప్రేమిస్తున్నావా?" అని రమ్య ఆశ్చర్యంగా అయిష్టంగా అడగడం- మాత్రం బాగోలేదు.

ఎందుకంటే రచయితలు సమాజంలోని అసమానతల్ని ఎత్తిచూపుతూ పరిష్కార మార్గం చూపించాలే తప్ప అసమానతల్ని ప్రోత్సహించకూడదు.

చివరగా-

గణేష్ ప్రేమకథ చెప్పడంతో అది తలచుకొని ఫ్లాష్‌బ్యాక్‌లోకి వెళ్ళిన స్మిత ఫ్లాష్‌బ్యాక్ పూర్తికాకుండానే నవల ముగించేయడం ఎందుకో నవల అసంపూర్ణంగా వున్నట్లనిపించింది.

ఏది ఏమైనా ఆద్యంతమూ ఆసక్తితో చదివించగల వి. నాగరత్నగారి శైలి అద్భుతమనే చెప్పాలి.

-పల్లేటి నిర్మల,
సూళ్లూరుపేట.

## చక్కని సందేశం

**(ద్వితీయ బహుమతి రు.75/- పొందిన సమీక్ష)**

"స్పర్శ" చదువుతున్నంతసేపూ మనసులో పలి పొరలను ఎవరో స్పృశిస్తున్నట్లే అన్పించింది. ప్రేమ ఉదాత్తమైనది. ప్రేమను ఆధారంగా తీసుకొని అమలిన భావసంపదలోని ఔన్నత్యాన్ని వ్యక్తీకరించినతీరు చూస్తే ఆనందం కలిగింది. ఏ యుగంలోనైనా "ప్రేమకు" ఉన్న శక్తి, విలువ అపారం.

అయితే ఈ కాలంలో యువతీ యువకుల ప్రేమను నిర్వచించడం కష్టం. ముద్దులు, బిగి కౌగిలింతలు, శృంగార చేష్టలే ప్రేమగా భావిస్తున్నారు. అలాంటిది స్మిత కేవలం తన ప్రేమికుడిని కళ్ళారా దూరం నుండి చూడటంవల్లనే ఉత్తేజాన్ని మానసిక ఆనందాన్ని పొందిందంటే అది ఉత్తమ వ్యక్తిత్వానికి నిదర్శనం. అతనిని చూడటానికి ఆమె మనసుపడే ఆరాటం, చూసి ఆమె పొందే అలౌకికానందం మొదలైనవన్నీ ఆమె యందు ఒక గౌరవాన్ని మనకు కలిగించాయే తప్ప ఏవగింపు కలగలేదు. ఆ పాత్రను ఆ విధంగా రచయిత్రి తీర్చిదిద్దారు.

హుస్సేన్ స్మితను వివాహం చేసుకుంటానని అర్థించినప్పటికీ, ఆమె అనవసరమైన భయాలతో అతనికి దూరమవడం ఏ మాత్రం బాగుండలేదు. కేవలం ముస్లిమైనంత మాత్రాన తను ప్రేమించి పెళ్ళాడిన భార్యను తన ఆచారంకోసం బాధిస్తాడని భావించడం తప్పు. ఆ విషయం అతడితో ధైర్యంగా మాట్లాడి తన అనుమానం తీర్చుకుంటే బావుండేది. అయితే ప్రేమించుకున్న ప్రతీవాళ్ళూ పెళ్ళి చేసుకుని తీరాలా? అంటే చెప్పలేము కానీ ప్రేమికులలో పిరికితనం ఉండరాదు. ప్రేమ పిరికితనాన్ని క్షమించదు. అలా కాకుండా తల్లి తండ్రుల యందుండే ప్రేమతోనో, గౌరవంతోనో స్మిత అతడిని దూరంచేసుకుందంటే సమంజసంగా ఉండేది.

ప్రేమ అన్నది ప్రతీ మనిషి జీవితంలో ఏదో ఒక దశలో తప్పని అనుభవం. అనుకోని పరిస్థితులలో ప్రేమించినవారిని పెళ్ళిచేసుకోలేక పోవచ్చును. అంతమాత్రాన జీవితాన్ని నిరుపయోగం చేసుకోకూడదనే చక్కని సందేశాన్ని నవల అందించింది. తమ జీవితంలో ఎదురైన పరాజయాన్ని తెల్పి, మరొక సహృదయుడెవరైనా జీవిత భాగస్వామిగా ఇష్టంతో అంగీకరించినపుడు, అతడిని చేపట్టి, మిగిలిన జీవితాన్ని పంచుకోవడం ఉచితమైన పని. స్మిత సంస్కారంతో తన గతాన్ని ప్రాణ్‌కి చెప్పడం, ఆమె వ్యక్తిత్వాన్ని తెలియచేస్తోంది. అలాగే ప్రాణ్ ప్రతిపాదనని అంగీకరించి, అతడిని చేపట్టి తల్లిలేని పిల్లకి తల్లిగా అడుగుపెట్టడం అభినందించదగ్గ విషయం. ఏ స్త్రీ అయినా తను ప్రేమించిన వాడిదగ్గరకన్నా తనను ప్రేమించినవాడి దగ్గర తప్పక సుఖపడుతుంది. ఇది జగమెరిగిన సత్యం.

-టి. సూర్యనారాయణమూర్తి,
పెదబొండపల్లి.

## సుతిమెత్తని స్పర్శ

**(తృతీయ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)**

'స్పర్శ' నవల పేరుకి తగినట్లు హృదయాలను సుతిమెత్తగా స్పర్శించి, పూలమీది గాలిలా కళాపరిమళాలు వెదజల్లి, రసాత్మకతను చిందించింది. చాలా కాలానికి 'పసిడి రెక్కలు విసిరి కాలం పారిపోయిన జాడలేవీ...' అని మనసుకు రెక్కలొచ్చి, ఎక్కడకో ఎగిరిన అనుభూతి... స్మిత జ్ఞాపికా పరిమళాల్లో, మనమూ తేలిన స్థితి.




రచయిత్రి ప్రేమతీవ్రతను, స్పర్శను స్థాయీభావనతో ప్రదర్శించడంలో కృతకృత్యులైనారు. తీసుకున్న వస్తువులోని సౌకుమార్యం కథనంలోనూ కనబడటమే దీని ప్రత్యేకత.

చిత్రలేఖనం ప్రధానంగాను, కవిత్వం ఆంగికంగానూ స్మిత, హరనాథ్ పాత్రలు రచనకు కళాత్మకతనిచ్చాయి. "కళాకారుడెప్పుడూ కలలు కంటుంటాడు" అనిపించి, స్మితకి కలలే మిగిల్చారేమోననిపించింది. కళాకారుల స్పష్టాస్పష్టత స్మిత ప్రవర్తనలోనూ కనిపించింది. ఆమెది అలౌకికప్రేమ. ప్రేమించడంకన్న ప్రేమించాననన్న భావనని ప్రేమించింది స్మిత. కాని, ఆమెలోని ద్వైదీభావన మరీ ఎక్కువగా ద్యోతకమైంది. ఎంత కళాకారిణి ఐనా కేవలం అమలిన శృంగారంపట్ల ఆరాధనతో శారీరకవాంఛ తుచ్ఛం అనుకోవడం, మళ్ళీ తనే "తల్లిదండ్రులే దగ్గరుండి పెళ్ళి జరిపించే అవకాశం ఉంది" అనుకోవడం ఆమెలోని అపరిపక్వతకు నిదర్శనం. పెద్దలు చేస్తే హుస్సేన్‌తో పెళ్ళికి ఏ సిద్ధాంతమూ అభ్యంతరపెట్టదా? 30 ఏళ్ళ ప్రిన్సిపాలుగా ఆమె తీసుకున్న స్థిరనిర్ణయం ఆమె గతమంతా పరిణతిచెందని వయో చేష్టగా కనబడి, ఆమె పాత్ర చిత్రణ దెబ్బతింది.

హుస్సేన్ కళాకారుడు కాడు. అందువల్లే అతడు వాస్తవికంగా జీవించాడు. అతని ఆలోచనలు, కోరికలు, ప్రవర్తన- అన్నీ కూడా లౌకికంగా ఉన్నాయేగాని మోసం, కృత్రిమత్వం లేవతనిలో. అతణ్ని చెడ్డవాడిని చేయకపోవడంలోనే రచయిత్రి మెళుకువ ప్రదర్శించారు. కల-వాస్తవం కలవవనే హుస్సేన్-స్మితలను దూరంచేశారు. రెండు భిన్నదృక్పథాల చిత్రీకరణలో రచయిత్రి ప్రయోగించిన టెక్నిక్ బాగుంది.

అయితే కొన్నిచోట్ల రచయిత్రి అభిప్రాయాల్లోనూ ద్వైదీతత్వం ప్రస్ఫుటమైంది. ముస్లింతో ప్రేమ నచ్చలేదని వివిధ పాత్రలచేత అనేకసార్లు చెప్పించి మరీ వాళ్ళని కలవకుండా చేశారు. అలాగే ఆర్టిస్టు ఇంకో ఆర్టిస్టుని చేసుకునేరూలేం లేదంటూనే స్మిత వివాహం ఒక ఆర్టిస్టుతోనే జరిపించారు. మొత్తంమీద మానసస్పర్శ కళాకారులకు మాత్రమే అనుభవైకవేద్యమని చెప్పకనే చెప్పి, పాక్షికత చూపారు రచయిత్రి. అయితే వ్యక్తిగా పరిణతి చెందాక ప్రేమ ప్రభావం కాస్త తగ్గుతుందని, మధుర స్మృతులు మనిషిని ముందుకు నడిపించేవే గాని గమనం నిలిపేసేవికావని ఇచ్చిన సందేశం బాగుంది. సాయంవేళల్లో చల్లని ప్రకృతిలో మురిపెంగా మనసు లోపలికి చూచుకోవడమెలాగో నేర్పింది నవల.

**శ్రీమతి లక్ష్మీవిజయ్**

సి.మల్లవరం

# మనసున్న స్పర్శ

*(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

సృష్టిలో ఒక పుష్పం వికసించినట్లు, మేఘం వర్షించినట్లు ఒక హృదయం స్పందిస్తుంది, ప్రేమిస్తుంది, ప్రేమను కోరుకుంటుంది. ప్రేమలేని జీవితం తావి, రూపంలేని పుష్పం అనొచ్చు. టీనేజ్‌లో కలిగే స్పందనలు బలంగాను, గాఢంగాను ఉంటాయి. వాటి ప్రభావంనుంచి తప్పించుకోవటం చాలామంది తరంకాదు. అయితే టీనేజ్‌లో ఉండే మొండిపట్టుదల కొన్నిసార్లు రకరకాల పరిణామాలకు దారితీస్తుంది. జీవితం ఎంతో అనుభవాన్ని నేర్పుతుంది.

స్మిత టీనేజ్‌లో ప్రేమలోపడి, దాన్నుండి స్పందన పొంది మంచి ఆర్టిస్ట్‌గా మారింది. హుస్సేన్‌పట్ల ఆకర్షణ ఆమెతో జీవితాంతం కాపురం చేసింది కనుక అది గాఢమైన స్పందనే. తల్లి భయంవలన హుస్సేన్‌కి దూరమైనా తన జీవితాన్ని తనే తీర్చిదిద్దుకోగల్గింది. చివరకు ప్రేమను పొందుతూ ప్రేమించటం కూడా నేర్చుకుంది. నవల్లోని వ్యక్తులందరూ మంచివాళ్ళే కావటం విశేషం. నవల్లోని కొన్ని వాక్యాలు చాలాకాలం గుర్తుండేలా రాసిన రచయిత్రి అభినందనీయురాలు. "ఎప్పుడో పూసిన పువ్వు అందమైందీ, పరిమళభరితమైందీ కావచ్చు. కానీ అది వాడిపోయాక కూడా దాన్నే తల్చుకునేకంటే, మీ చుట్టూ వున్న లక్షల, కోట్ల పువ్వుల గురించి ఎందుకు పట్టించుకోరు?"లాంటి వాక్యాలు బాగున్నాయి.

ఆహ్లాదకరంగా సాగిన ఈ నవల స్మిత

లాంటి వారికి మంచి ఉపకారం చేస్తుంది. మనసున్నవాళ్ళకి "స్పర్శ" సహజమే. అయితే ఆ స్పర్శవల్ల సంతోషం పొందాలే తప్ప శోకించే పరిస్థితి రాకుండా చూసుకోవాలి అనే విషయాన్ని హృద్యంగా చెప్పిన రచయిత్రికి అభినందనలు.

-యం. పాండురంగ,
హైదరాబాద్

## తుదివిజయం

*(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

ప్రతి వ్యక్తిలోనూ సహజంగా టాలెంట్ వుంటుంది. అయితే అది వెలికివచ్చే వయసులో యువతీయువకులు ఎన్నో ఒడిదుడుకులకు లోనవుతారు. అలాంటివే ప్రేమ-పెళ్లి అనే బంధాలు. ఇవి మనిషి మనసుని, ఆలోచనలని ప్రభావితం చేస్తాయి. వాటి ట్రాన్స్‌లో చిక్కుకున్నవాళ్ళు బయటపడడానికి, వాస్తవాన్ని గ్రహించడానికి చాలాకాలం పడుతుంది. జీవితంలో అమూల్యమయిన యవ్వనకాలం గడిచిపోయాక ఏమీ సాధించలేకపోయామే అని చింతిస్తే ఫలితం ఏముంటుంది. ప్రేమ మైకంలో చిక్కుకుని కూడా బయటపడి, జీవితంలో ఎంతో సాధించిన 'స్మిత' కథగా 'స్పర్శ' ఎంతో బాగుంది.

"మనసున్న వాళ్ళకు స్పర్శ సహజమే" అని చెబుతూ "అయితే ఆ స్పర్శవల్ల సంతోషం పొందాలే తప్ప శోకించే పరిస్థితులు రాకూడదు" అని ఒక చక్కటి సందేశం అందించిందీ నవల.

సహజత్వానికి దగ్గరగా, మధ్యతరగతి జీవనవిధాన నేపథ్యంలో ఎటువంటి సస్పెన్సులు, నాటకీయతలు, ఒడిదుడుకులు లేకుండా మందగమనంతో సాగిందీ రచన ఆద్యంతమూను. ఈరోజూ రేపూ వచ్చే ప్రేమ సబ్జెక్టుగల నవలలతోనూ, సినిమాలతోనూ పోల్చిచూస్తే అసలు స్మిత, హుస్సేనులు నిజంగా ప్రేమించుకున్నారా అని సందేహం వస్తుంది. అయితే ప్రేమ అనే సబ్జెక్టును ఎంతో సహజంగా లలితంగా కూడా చెప్పి పాఠకులను మెప్పించవచ్చు అని నిరూపించారు రచయిత్రి.

-కాళహస్తి నాగేశ్వరరావు
కోరాపుట్

## 'లవ్ ఎట్ ఫస్ట్‌సైట్'

*(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

ప్రేమకు కుల, మత ప్రసక్తి లేదు. ఆస్తి, అంతస్థుల ఆలోచన రాదు. 'లవ్ ఈజ్ బ్లైండ్' అన్నారు. మనసును స్పృశించి, కదిలించి, చెరగని ముద్రవేసేదే నిజమైన ప్రేమ. ఎన్నివిధాల ప్రయత్నించినా ఆ చెరగని ముద్ర తుడిచివేయడం సాధ్యపడదు. అదే జరిగింది స్మిత జీవితంలో.

స్మితలాంటి 'డ్రీమ్‌గర్ల్స్', గణేష్, రమేష్ లాంటి 'డ్రీమ్‌బాయిస్' ఈనాడు కోకొల్లలు. అయితే సాధారణంగా కాలేజి అనుభవాలను, అనుభూతులను మరచి, ప్రేమలకు గుడ్‌బై చెప్పి హాయిగా వివాహం చేసుకొని కొత్తజీవితాన్ని ప్రారంభిస్తారు. వారి ప్రేమ కేవలం భౌతిక ఆకర్షణ మాత్రమే. కానీ స్మిత ప్రేమ ఒక ఆరాధన, మనసున్న మనుషుల్ని కదిలించే పవిత్ర ప్రేమ. శారీరక 'స్పర్శ' కోరనిదది.

'జబ్ దిల్ హీ టూట్‌గయా, అబ్ జీకే క్యా కరేంగే' అనే ఫ్రస్ట్రేషన్‌తో స్మిత జీవితం ఏంకానున్నదో అని కంగారుపడి, ఆతురతగా చదివే పాఠకులకు ముగింపు చాలా ఊరట కల్గించింది. ప్రేమ పెళ్ళి రూపందాల్చక, హుస్సేన్ స్మిత ఊహల్ని కూల్చేయటంతో, డిప్రెషన్‌కి గురైకూడా నిబ్బరంగా ఉండగల్గింది. తన కాన్‌సన్‌ట్రేషన్ అంతా ఉన్నత భావాలవైపు, పెయింటింగ్స్‌వైపు, స్కూల్ స్థాపనవైపు మళ్లించిన తీరు బాగుంది.

'స్పర్శ' కథను నేటి వ్యాపార నవలా ప్రవాహంలో కొట్టుకుపోకుండా, ఒక విశిష్టధోరణిలో నడపడం, రచయితలకు కనువిప్పు కావాలి.

-భుజంగం
నిజామాబాద్

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 229428. Office address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad Tel. Hyderabad: 223422, 229444, Madras 470434, Vijayawada 476685, Visakhapatnam 52211, Tirupati 5291, Anantapur 22977

CHATURA Telugu Monthly Hyderabad 500 482 Regd. No. H/HD/402